# భాస్కర రామాయణము విమర్శాత్మక పరిశీలనము



డా॥ ఆర్. శ్రీహరి
రీడర్, తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాద్.

1988

ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి
పిహెచ్. డి. పట్టం పొందిన
అధ్యయనగ్రంథం

BHĀSKARA RĀMĀYANAMU – VIMARSĀTMAKA PARISEELANAMU
By **Dr. R. SRI HARI,** Reader in Telugu,
Osmania University, Hyderabad.



సెప్టెంబర్ 1988
ప్రతులు : 1000



**వెల : రూ. 45/-**



ప్రతులకు :

1) **ఆర్. అనంతలక్ష్మి**
16-2-836/F/2, మాధవనగర్
సైదాబాద్, హైదరాబాద్-500 659.

2) **ఆంధ్రసారస్వతపరిషత్తు**
తిలక్‌రోడ్, హైదరాబాదు.

This book is published with the financial assistance of Telugu University, Hyderabad.
&
Tirumala Tirupati Devasthanams under their Scheme Aid to publish religious books.

ముద్రణ :
**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్**
3-5-850, హైదర్‌గూడ
హైదరాబాదు - 500 029.

ఈ కృతి

తిరుమలలో నెలకొని ఉన్న

శ్రీ వేంకటేశ్వరస్వామివారి

దివ్యపాదారవిందాలకు

పూజాసుమంగా

భక్తితో సమర్పితం

ఓం శ్రీ సాయిరామ్

**Prof. B. Rama Raju**
Emeritus Professor
Osmania University
Hyderabad.

"యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే
తావద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి"

భారతీయత అంటే రామాయణ భారత భాగవతాలు. ఈ మూడింటిలో రామాయణం సమస్త జీవకోటి ఇహపర జీవితాలను పునీతంచేసే మహానది. అది వాల్మీకిగిరి సంభూత, రామసాగర గామిని. అందులోనుండి వివిధ భాషా కవులు తమ చేతనైనంత సంగ్రహించి తమ యిచ్చవచ్చినట్లు వాడుకున్నారు. తెలుగు జాతి అదృష్టంవలన సీతారాములు కొంతకాలం తెలుగు పొలంలో విహరించినారు. ఆనాటినుండి ఆ దివ్య దంపతుల గాథలను తెలుగు ఆటవికులు, జానపదులు, శిష్టులు తీరుతీరులుగా మలచుకొని పాడుకుంటున్నారు. తెలుగు జానపదులు సృష్టించుకున్న రామాయణ వాఙ్మయం ఇంతా అంతా కాదు. శిష్టులు కూడ అంతే. తెలుగు వాఙ్మయంలో ఇతరేతరమైన ఇతివృత్తం ఆధారంగా వెలువడిన సాహిత్యం కంటే రామాయణేతివృత్తంతో వెలువడిన సాహిత్యమే యెక్కువ. పోయినవిపోగా మనకు దక్కిన తెలుగు రామాయణాలలో భాస్కర, రంగనాథ రామాయణాలే ప్రాచీనకృతులు. అదేమి చిత్రమో కాని మన భారత భాగవతాల వలె భాస్కర రామాయణం కూడ సమష్టి రచన. అందుమూలంగా కొన్ని సమస్యలు, వివాదాలు. ఆ సమస్యలను వివాదాలను తేల్చటంతోపాటు ఆ యా కవుల అనువాద విధానము, వారి కవితావిశేషాలు, పాఠభేదాలు, అవాల్మీకాంశాలు, అనుకరణలు, ఛందో విశేషాలు, భాషా విశేషాలు సాకల్యంగా సవిమర్శకంగా డా. రవ్వా శ్రీహరిగారు ఈ గ్రంథంలో పరిశీలించినారు. ఇది శ్రీహరిగారు తమ పిహెచ్.డి. ఉపాధికోసం చేసిన కృషి. ఆ కృషి నా పర్యవేక్షణలో సాగింది. ఇన్నాళ్ళకు ఇది వెలుగులోనికి వస్తున్నందుకు నాకు పరమ సంతోషంగా ఉంది.

రవ్వా శ్రీహరిగారు సంస్కృతాంధ్రములందు మంచి పండితులు. పరిశోధకులు. గురుకుల క్లిష్టులు. ఇతఃపూర్వమే వారు అనేకకృతులు ప్రకటించిన లబ్ధప్రతిష్ఠులు. ఈ భాస్కరరామాయణ విమర్శాత్మకపరిశీలన గ్రంథం కూడ ఆంధ్రపాఠకలోకం మన్నన అందుకొంటుందని ఆశిస్తున్నాను.

పరాత్పరుడు శ్రీహరిగారికి ఇతోధికయశఃప్రాభవాలు ప్రసాదించవలెనని కోరుతూ నా శుభాకాంక్షలు, మంగళాశాసనములు అందిస్తున్నాను.

1-8-117/2 చీకటిపల్లి
హైదరాబాదు

**బి. రామరాజు**

# కృతజ్ఞతలు

నా అభిరుచిని గమనించి 'భాస్కరరామాయణము-విమర్శాత్మక పరిశీలనము' - అన్న విషయాన్ని నాకు పరిశోధనాంశంగా సూచించడమే కాక పర్యవేక్షకులుగా ఉండి మార్గదర్శనం చేసిన నిత్య సాహిత్య వ్రతులు, గురువర్యులు అచార్య బిరుదురాజు రామరాజుగారు.

పరిశోధనలో అలసత్వం చూపకపోయినా జరుగుతున్న ఆలస్యాన్ని ఎడనెడా గుర్తుకుతెస్తూ ప్రోత్సహించిన సహృదయులు, సుప్రసిద్ధకవులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారు.

పరిశోధన చేస్తున్న సమయంలో నాపై ఎంతో ఆదరాన్ని చూపుతూ నాకు విలువైన సలహాలను ఇచ్చి నన్ను వెన్నుతట్టి ముందుకు నడిపించిన ఆచార్యులు ఆచార్య నాయని కృష్ణకుమారి, ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం, ఆచార్య ఎమ్. కులశేఖరరావు, ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారలు.

తమ వద్దనున్న భాస్కర రామాయణ తాళపత్ర ప్రతులను సంప్రదించుకొనే అవకాశం కలిగించి నాకు ఎంతగానో తోడ్పడినవారు ఆం.ప్ర. ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం, మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం, కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీ, అడయార్ లైబ్రరీ అధికారులు.

తాళపత్ర ప్రతులకు సంబంధించిన అనేక మౌలిక విషయాలను తెలిపి నాకు సాయపడిన సహృదయతామూర్తులు, మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఆంధ్ర పండితులు శ్రీ తీర్థం శ్రీధరమూర్తిగారు, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో తెలుగు పండితులు శ్రీ విశ్వనాథంగారు.

పరిశోధన సందర్భంలో నా అభిప్రాయాలను ఎంతో ఓపికతో విని తమ అమూల్యమైన సలహాలను అందించి ఎంతగానో ప్రోత్సహించినవారు ఆచార్య దేవళ్ళ చిన్నికృష్ణయ్య (మదరాసు ప్రెసిడెన్సీ కళాశాల) గారు

రవ్వా శ్రీహరిగారు సంస్కృతాంధ్రములందు మంచి పండితులు. పరిశోధకులు. గురుకుల క్లిష్టులు. ఇతఃపూర్వమే వారు అనేకకృతులు ప్రకటించిన లబ్ధప్రతిష్ఠులు. ఈ భాస్కరరామాయణ విమర్శాత్మకపరిశీలన గ్రంథం కూడ ఆంధ్రపాఠకలోకం మన్నన అందుకొంటుందని ఆశిస్తున్నాను.

పరాత్పరుడు శ్రీహరిగారికి ఇతోధికయశఃప్రాభవాలు ప్రసాదించవలెనని కోరుతూ నా శుభాకాంక్షలు, మంగళాశాసనములు అందిస్తున్నాను.

1-8-117/2 చీకటిపల్లి
హైదరాబాదు

**బి. రామరాజు**

# కృతజ్ఞతలు

నా అభిరుచిని గమనించి 'భాస్కరరామాయణము-విమర్శాత్మక పరిశీలనము' - అన్న విషయాన్ని నాకు పరిశోధనాంశంగా సూచించడమే కాక పర్యవేక్షకులుగా ఉండి మార్గదర్శనం చేసిన నిత్య సాహిత్య వ్రతులు, గురువర్యులు ఆచార్య బిరుదురాజు రామరాజుగారు.

పరిశోధనలో అలసత్వం చూపకపోయినా జరుగుతున్న ఆలస్యాన్ని ఎడనెడా గుర్తుకుతెస్తూ ప్రోత్సహించిన సహృదయులు, సుప్రసిద్ధకవులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారు.

పరిశోధన చేస్తున్న సమయంలో నాపై ఎంతో ఆదరాన్ని చూపుతూ నాకు విలువైన సలహాలను ఇచ్చి నన్ను వెన్నుతట్టి ముందుకు నడిపించిన ఆచార్యులు ఆచార్య నాయని కృష్ణకుమారి, ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం, ఆచార్య ఎమ్. కులశేఖరరావు, ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారలు.

తమ వద్దనున్న భాస్కర రామాయణ తాళపత్ర ప్రతులను సంప్రదించుకొనే అవకాశం కలిగించి నాకు ఎంతగానో తోడ్పడినవారు ఆం.ప్ర. ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం, మదరాసు ప్రాచ్య ఖిలిత పుస్తక భాండాగారం, కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీ, అడయార్ లైబ్రరీ అధికారులు.

తాళపత్ర ప్రతులకు సంబంధించిన అనేక మౌలిక విషయాలను తెలిపి నాకు సాయపడిన సహృదయతామూర్తులు, మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఆంధ్ర పండితులు శ్రీ తీర్థం శ్రీధరమూర్తిగారు, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో తెలుగు పండితులు శ్రీ విశ్వనాథంగారు.

పరిశోధన సందర్భంలో నా అభిప్రాయాలను ఎంతో ఓపికతో విని తమ అమూల్యమైన సలహాలను అందించి ఎంతగానో ప్రోత్సహించినవారు ఆచార్య దేవళ్ళ చిన్నికృష్ణయ్య (మదరాసు ప్రెసిడెన్సీ కళాశాల) గారు

రవ్వా శ్రీహరిగారు సంస్కృతాంధ్రములందు మంచి పండితులు. పరిశోధకులు. గురుకుల క్లిష్టులు. ఇతఃపూర్వమే వారు అనేకకృతులు ప్రకటించిన లబ్ధప్రతిష్ఠులు. ఈ భాస్కరరామాయణ విమర్శాత్మకపరిశీలన గ్రంథం కూడ ఆంధ్రపాఠకలోకం మన్నన అందుకొంటుందని ఆశిస్తున్నాను.

పరాత్పరుడు శ్రీహరిగారికి ఇతోధికయశఃప్రాభవాలు ప్రసాదించవలెనని కోరుతూ నా శుభాకాంక్షలు, మంగళాశాసనములు అందిస్తున్నాను.

1-8-117/2 చీకటిపల్లి
హైదరాబాదు

**బి. రామరాజు**

# కృతజ్ఞతలు

నా అభిరుచిని గమనించి 'భాస్కరరామాయణము-విమర్శాత్మక పరిశీలనము' - అన్న విషయాన్ని నాకు పరిశోధనాంశంగా సూచించడమే కాక పర్యవేక్షకులుగా ఉండి మార్గదర్శనం చేసిన నిత్య సాహిత్య వ్రతులు, గురువర్యులు ఆచార్య బిరుదురాజు రామరాజుగారు.

పరిశోధనలో అలసత్వం చూపకపోయినా జరుగుతున్న ఆలస్యాన్ని ఎడనెడా గుర్తుకుతెస్తూ ప్రోత్సహించిన సహృదయులు, సుప్రసిద్ధకవులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారు.

పరిశోధన చేస్తున్న సమయంలో నాపై ఎంతో ఆదరాన్ని చూపుతూ నాకు విలువైన సలహాలను ఇచ్చి నన్ను వెన్నుతట్టి ముందుకు నడిపించిన ఆచార్యులు ఆచార్య నాయని కృష్ణకుమారి, ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం, ఆచార్య ఎమ్. కులశేఖరరావు, ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారలు.

తమ వద్దనున్న భాస్కర రామాయణ తాళపత్ర ప్రతులను సంప్రదించుకొనే అవకాశం కలిగించి నాకు ఎంతగానో తోడ్పడినవారు ఆం.ప్ర. ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం, మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం, కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీ, అడయార్ లైబ్రరీ అధికారులు.

తాళపత్ర ప్రతులకు సంబంధించిన అనేక మౌలిక విషయాలను తెలిపి నాకు సాయపడిన సహృదయతామూర్తులు, మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఆంధ్ర పండితులు శ్రీ తీర్థం శ్రీధరమూర్తిగారు, తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో తెలుగు పండితులు శ్రీ విశ్వనాథంగారు.

పరిశోధన సందర్భంలో నా అభిప్రాయాలను ఎంతో ఓపికతో విని తమ అమూల్యమైన సలహాలను అందించి ఎంతగానో ప్రోత్సహించినవారు ఆచార్య దేవళ్ళ చిన్నికృష్ణయ్య (మదరాసు ప్రెసిడెన్సీ కళాశాల) గారు

| | |
|---|---|
| పశ్చి. శా. ప్ర. | పశ్చిమోత్తరశాఖీయప్రతి |
| పూ. భా. | పూర్వభాగం |
| ప్రౌ. వ్యా. | ప్రౌఢ వ్యాకరణం |
| బా. కాం. | బాలకాండం |
| బా. వ్యా. | బాలవ్యాకరణం |
| బి. రా. రా. ప్రతి | బి. రామరాజు ప్రతి |
| భా. రా. | భాస్కరరామాయణం |
| మద. ప్ర. | మదరాసు ప్రభుత్వ ప్రాచ్యపుస్తక భాండాగార ప్రతి |
| ము. ప్ర. | ముద్రితప్రతి |
| యు. కాం. | యుద్ధకాండం |
| రం. రా. | రంగనాథరామాయణం |
| వా. రా. | వాల్మీకిరామాయణం |
| వృ. శ. | వృషాధిపశతకం |
| శ. ర. | శబ్దరత్నాకరం |
| సిం. ద్వా. | సింహాసనద్వాత్రింశిక |
| సుం. కాం. | సుందరకాండం |
| సు. మ. రం. | సుకవిమనోరంజనం |
| సో. రా. | సోమదేవరాజీయం |
| A P G O M L | A. P. Govt. Oriental Manuscripts Library |
| S M L | Saraswati Mahal Library, Tanjore. |

# విషయసూచిక

# ప్రవేశిక

రామాయణమహాభారతములు రెండును భారతీయసంస్కృతికి మూల కందములైన యితిహాసగ్రంథములు. ఇవి సమస్తభారతీయభాషలకు చెందిన ప్రాచీనాధునికకవిపండితులకెందఱకో రచనావిషయమున స్ఫూర్తినిచ్చిన-ఇచ్చుచున్న గ్రంథరాజములు. మహాభారతము పంచమవేదముగను, రామాయణము వేదతుల్యముగను భావింపబడుచున్నవి. సుప్రసిద్ధపండితులు డా॥ సునీతికుమార్ ఛటర్జీగారు వీని ప్రాశస్త్యమునుగూర్చి యీ క్రింది చిన్న వాక్యములో నెంత గంభీరముగ తెలిపియున్నారో చూడుడు.

"These Works are India."[1]

సంస్కృత వాఙ్మయమున వాల్మీకి ఆదికవి. తద్రచితమగు రామాయణము ఆది కావ్యము. ఇందవతారపురుషుడగు శ్రీరామచంద్రుని మహత్త్వము వర్ణింపబడుటయు, మహత్తమమగు కవితా శిల్పమున కిది యాకరమగుటయు దీని మహత్త్వమునకు కారణములు. పాశ్చాత్య విద్వాంసులును రామాయణ మహత్త్వమును బహు విధములుగ ప్రశంసించి యున్నారు. వింటర్నిట్జ్ పండితుడు తన సంస్కృతసాహిత్యచరిత్రలో

"It is a true popular epic like the Mahabharata and has become the wealth of the whole nation. Scarcely has any other poem in the range of whole life influenced the poetry and the life of the people for centuries. It has been kept alive for more than twenty centuries and continues to live. People of all grades and clases high and low, princes and peasents, merchants and artisans, princesses and shepheredesses- all are familiar with the characters and the story of the great epic."[2] అని వ్రాసియున్నాడు.

ఏ. ఏ. మాక్డొనల్ కూడా రామాయణ ప్రాశస్త్యము నీ రీతిగా నుగ్గడించినాడు

"Probably no work of world literature secular in its origin has never produced so profound an influence on the life and thought of the people as Ramayana."[3]

వాల్మీకి రామాయణ ప్రభావము భారతీయ భాషలన్నింటిపైనను గాఢముగా ప్రసరించినదనుటలో సందేహము లేదు. కాని తెలుగు సాహిత్యముపై రామాయణ ముద్ర యతివేలము. ఇతిహాస పురాణ రూప విపులకావ్యము, ప్రబంధము, లఘుకావ్యము, ద్విపదకావ్యము, చిత్రకావ్యము, శుద్ధాంధ్రకావ్యము, అనేకార్థకావ్యము, ఖండకావ్యము, శతకము, దండకము, ఉదాహరణము, యక్షగానము, నాటకము, గేయము, వచనకావ్యము, వ్యాసము, విమర్శనము మున్నగు వివిధాంధ్ర సాహిత్య ప్రక్రియలలో రామకథావస్తువు వర్ణితమై వ్యాప్తి గాంచినది. ఇతర దేశభాషలలో వెలసిన తులసీరామాయణము, కంబరామాయణము మున్నగు వానికిని, అధ్యాత్మాది వాల్మీకేతర సంస్కృత రామాయణములకును తెలుగులో అనువాదములు సంతరింపబడినవి. ఆయా సాహిత్య ప్రక్రియలలో రచితములైన రామకథా గ్రంథములనుగూర్చి వ్రాయబూనినచో పెద్ద గ్రంథమగును. శ్రీ రావూరి దొరసామిశర్మగారును, శ్రీమతి పండా శమంతకమణి గారును తెలుగులో వెలసిన రామకథా సాహిత్యమునుగూర్చి విపులముగ చర్చించియున్నారు.[4] ఇట తెలుగులో వివిధప్రక్రియలలో రచితములైన కొన్ని ప్రసిద్ధ గ్రంథములు మాత్రము పేర్కొనబడుచున్నవి.

| ప్రక్రియ : | గ్రంథములు : |
|---|---|
| పద్యరామాయణములు | భాస్కరరామాయణము |
| | మొల్లరామాయణము |
| | రఘునాథరామాయణము |
| | గోపీనాథరామాయణము |
| | ఆంధ్రవాల్మీకి రామాయణము |

| | |
|---|---|
| | ఆంధ్ర శ్రీమద్రామాయణము |
| | శ్రీకృష్ణరామాయణము |
| | రామాయణకల్పవృక్షము |
| | నిర్వచనోత్తరరామాయణము |
| | ఉత్తరరామాయణము మొ॥ |
| ద్విపదరామాయణములు | రంగనాథ రామాయణము |
| | కట్టా వరదరాజరామాయణము మొ॥ |
| ప్రబంధములు | రామాభ్యుదయము మొ॥ |
| అనేకార్థ కావ్యములు | రాఘవపాండవీయము మొ॥ |
| అచ్చ తెనుగు కావ్యములు | అచ్చతెలుగు రామాయణము మొ॥ |
| చిత్ర కావ్యములు | నిరోష్ఠ్యరామాయణము మొ॥ |
| ఉదాహరణములు | సీతా కల్యాణము |
| | లక్ష్మణవిజయము మొ॥ |
| రామమహిమాత్మకములు | సీతారామాంజనేయసంవాదము |
| శతకములు | రఘువీరశతకము |
| | దాశరథిశతకము మొ॥ |
| యక్షగానములు | సుగ్రీవవిజయము మొ॥ |
| వచనకావ్యములు | కుశలవోపాఖ్యానము మొ॥ |
| నాటకములు | ఉత్తరరామ చరిత్రాద్యనువాదములు |
| | పాదుకాపట్టాభిషేకము మొ॥ |
| గేయములు | శారద రామాయణము |
| | ధర్మపురి రామాయణము |
| | సంక్షేప రామాయణము మొ॥ |
| విమర్శనములు | రామాయణ విశేషములు |
| | షోడశిరామాయణరహస్యములు |
| | రామాయణచరిత్ర |
| | భాస్కర, రంగనాథ రామాయణముల |
| | పీఠికలు మొ॥ |

ఏ. ఏ. మాక్డొనల్ కూడా రామాయణ ప్రాశస్త్యము నీ రీతిగా నుగ్గడించినాడు

"Probably no work of world literature secular in its origin has never produced so profound an influence on the life and thought of the people as Ramayana."[3]

వాల్మీకి రామాయణ ప్రభావము భారతీయ భాషలన్నింటిపైనను గాఢముగా ప్రసరించినదనుటలో సందేహము లేదు. కాని తెలుగు సాహిత్యముపై రామాయణ ముద్ర యతివేలము. ఇతిహాస పురాణ రూప విపులకావ్యము, ప్రబంధము, లఘుకావ్యము, ద్విపదకావ్యము, చిత్రకావ్యము, శుద్ధాంధ్రకావ్యము, అనేకార్థకావ్యము, ఖండకావ్యము, శతకము, దండకము, ఉదాహరణము, యక్షగానము, నాటకము, గేయము, వచనకావ్యము, వ్యాసము, విమర్శనము మున్నగు వివిధాంధ్ర సాహిత్య ప్రక్రియలలో రామకథావస్తువు వర్ణితమై వ్యాప్తి గాంచినది. ఇతర దేశభాషలలో వెలసిన తులసీరామాయణము, కంబరామాయణము మున్నగు వానికిని, అధ్యాత్మాది వాల్మీకేతర సంస్కృత రామాయణములకును తెలుగులో అనువాదములు సంతరింపబడినవి. ఆయా సాహిత్య ప్రక్రియలలో రచితములైన రామకథా గ్రంథములనుగూర్చి వ్రాయబూనినచో పెద్ద గ్రంథమగును. శ్రీ రావూరి దొరసామిశర్మగారును, శ్రీమతి పండా శమంతకమణి గారును తెలుగులో వెలసిన రామకథా సాహిత్యమునుగూర్చి విపులముగ చర్చించి యున్నారు.[4] ఇట తెలుగులో వివిధప్రక్రియలలో రచితములైన కొన్ని ప్రసిద్ధ గ్రంథములు మాత్రము పేర్కొనబడుచున్నవి.

| ప్రక్రియ : | గ్రంథములు : |
|---|---|
| పద్యరామాయణములు | భాస్కరరామాయణము |
| | మొల్లరామాయణము |
| | రఘునాథరామాయణము |
| | గోపీనాథరామాయణము |
| | ఆంధ్రవాల్మీకి రామాయణము |

| | |
|---|---|
| | ఆంధ్ర శ్రీమద్రామాయణము<br>శ్రీకృష్ణరామాయణము<br>రామాయణకల్పవృక్షము<br>నిర్వచనోత్తరరామాయణము<br>ఉత్తరరామాయణము మొ॥ |
| ద్విపదరామాయణములు | రంగనాథ రామాయణము<br>కట్టా వరదరాజరామాయణము మొ॥ |
| ప్రబంధములు | రామాభ్యుదయము మొ॥ |
| అనేకార్థ కావ్యములు | రాఘవపాండవీయము మొ॥ |
| అచ్చ తెనుగు కావ్యములు | అచ్చతెలుగు రామాయణము మొ॥ |
| చిత్ర కావ్యములు | నిరోష్ఠ్యరామాయణము మొ॥ |
| ఉదాహరణములు | సీతా కల్యాణము<br>లక్ష్మణవిజయము మొ॥ |
| రామమహిమాత్మకములు | సీతారామాంజనేయసంవాదము |
| శతకములు | రఘువీరశతకము<br>దాశరథిశతకము మొ॥ |
| యక్షగానములు | సుగ్రీవవిజయము మొ॥ |
| వచనకావ్యములు | కుశలవోపాఖ్యానము మొ॥ |
| నాటకములు | ఉత్తరరామ చరిత్రాద్యనువాదములు<br>పాదుకాపట్టాభిషేకము మొ॥ |
| గేయములు | శారద రామాయణము<br>ధర్మపురి రామాయణము<br>సంక్షేప రామాయణము మొ॥ |
| విమర్శనములు | రామాయణ విశేషములు<br>షోడశిరామాయణరహస్యములు<br>రామాయణచరిత్ర<br>భాస్కర, రంగనాథ రామాయణముల<br>పీఠికలు మొ॥ |

తెలుగులో నిన్ని విభిన్న ప్రక్రియలలో రామకథ నిబద్ధమై వ్యాప్తినొందిన దనగా తెలుగునాట రామకథకుగల ప్రాశస్త్యము, ప్రామర్యము విదితము కాగలవు మఱి యే యితర భాషయందును రామకథ ఇంతగా వ్యాప్తినొందలేదనుట యథార్థము.

తెలుగున వెలసిన చంపూరామాయణములలో ప్రాచీనమై యుపలబ్ధమగు నది భాస్కరరామాయణమే. ఇది వా.రా.నకు స్వతంత్రానుసరణమే కాని యథా తథానువాదము కాదు. దీనిని తొలుత తిక్కనతాతగారగు మంత్రిభాస్కరుడు రచించినట్లుగను, అది యే కారణముచేతనో యుత్సన్నముకాగా హుళక్కి భాస్కరుడు మున్నగుకవులచే పూరింపబడినదనియు కొందఱు విమర్శకుల యభిప్రాయము. అంతేకాక ప్రస్తుతము భా.రా.నను న్న యరణ్యకాండము మంత్రి భాస్కరకృతమనియు, తక్కిన కాండములు లోపించెననియు, కొంతకాలముపిదప హుళక్కి భాస్కరుడు బాల, కిష్కింధా, సుందరకాండములు మల్లికార్జునభట్టుచేతను, అయోధ్యాకాండము రుద్రదేవునిచేతను, యు.కాం. పూర్వభాగము తానే వ్రాసి ఉత్తరభాగమయ్యలార్యునిచేతను వ్రాయించి భా.రా.ను పూర్తిగావించెననియు నందురు. మొత్తముపై భా.రా.న పలువురి రచనము కలియుటచే గ్రంథము సొంతముగ నొక్కరీతిగ లేదు. భారత భాగవతములును నైకకృతములేయైనను ఆ కవులరచనము చక్కగా అతికిపోయినది. కాని యిందట్లు కాదు. కావుననే దేశమున భారతభాగవతములకు వచ్చిన కీర్తి భా.రా.నకు రాలేదు.

ముద్రిత భా.రా.నందలి బాలాయోధ్యారణ్యకాండములు తా.ప్ర.లతో మిక్కిలి భేదించుచున్నవి. ము.ప్ర.లో లేని పెక్కుపద్యములు తా.ప్ర.లయందును, పెక్కు తా.ప్ర.లలో కానరాని యధికపద్యములు కొన్ని ము.ప్ర.యందును గన్పట్టుట గమనింపదగిన విషయము. ఈవిధముగ భా.రా.నకు సంబంధించిన విషయములు కొంత చీకాకును కలిగించునవిగనే యున్నవి. పైన పేర్కొన్న విషయములనేకాక భా.రా.నకు సంబంధించిన విషయములనన్నింటిని సవిమర్శముగ పరిశీలించుటయే యీ సిద్ధాంతవ్యాసలక్ష్యము.

సూచికలు :-

1. Languages and Literatures of Modern India (Culcutta, Bengal Publishers Pvt. Ltd.) 1963 Introduction, Page XV.

2. A History of Indian Literature; Vol. I; Part II. page 418.

3. History of Sanskrit Literature.

4. i) తెలుగుసాహిత్యము-రామకథ; శ్రీ రావూరి దొరసామిశర్మ.

ii) తెలుగుసాహిత్యములో రామకథ; శ్రీమతి పండా శమంతకమణి.

# భా. రా. కర్తృత్వ పరామర్శ

తెలుగులో చంపూకావ్యరూపమున వెలసిన రామాయణములలో భా. రా. మొట్టమొదటిది. తెనుగు భారత భాగవతములవలె నిదియు నేకకర్తృకము కాదు. బాల, కిష్కింధా, సుందరకాండములను మల్లికార్జునభట్టును, అయోధ్యాకాండమును కుమారరుద్రదేవుడును, అరణ్య - యుద్ధకాండ పూర్వభాగములను హుళక్కి భాస్కరుడును, యుద్ధకాండ శేషమును అయ్యలార్యుడును రచించినారు. ఇట్లది బహుకర్తృకమయ్యును భాస్కరునిపేరనే ప్రసిద్ధమైనది. దీనికి కారణము భాస్కరుని యాధ్వర్యవమున దీని రచన కొనసాగుటయే.

భా.రా. నందలి యరణ్యకాండము యుద్ధకాండ పూర్వభాగ కర్తయగు హుళక్కి భాస్కరుని రచనము కాదనియు, అది తిక్కన తాతయైన మంత్రి భాస్కరుని రచనమనియు పండితలోకమున నొక వాదమున్నది. పలువురు పండితు లీ విషయమున ననేక వాదోపవాదములు గావించియున్నారు. మొట్టమొదట నీ మంత్రిభాస్కరవాదమును లేవదీసినవారు బహుజనపల్లి సీతారామాచార్యుల వారు. వీరు తమ శబ్దరత్నాకర పీఠికలో వివిధ కవులను గూర్చి వివరించు సందర్భమున భాస్కరుని గూర్చి "అరణ్యకాండమిందెవ్వరిచేతను వ్రాయబడినది కాదు. అది తిక్కనసోమయాజి తాతయగు మంత్రిభాస్కర మహాకవిచే వ్రాయ బడినది" అని తెలిపియున్నారు.[1] తరువాత నీ వాదమును వీరేశలింగంపంతులు గారు, చాగంటి శేషయ్యగారు, నేలటూరి వేంకటరమణయ్యగారు సమర్థించినారు.[2] వీరేశలింగంపంతులుగారు కవుల చరిత్ర ప్రథమ ముద్రణములో మంత్రిభాస్కర వాదమును సమర్థించినను ద్వితీయ ముద్రణమున మాత్రము హుళక్కి భాస్కర వాదమునే అంగీకరించినారు. భా.రా. నందలి యరణ్యకాండము మంత్రిభాస్కరుని రచనమనుటకు మంత్రిభాస్కరపక్షీయులు చూపు కారణము లీ క్రింది విధముగ నున్నవి.

1. అయ్యలార్యుడు యు.కాం. చివర చెప్పిన "అమర హుళక్కి భాస్కర మహాకవి చెప్పగ నున్న యుద్ధకాండము తరువాయి జెప్పె ప్రకటప్రతిభాఘను

డప్పలార్య సత్తమసుతు డయ్యలార్యు"డను పద్యమున[3] హుళక్కి భాస్కరుడు యు.కాం.ను రచించినట్లుగ మాత్రమేకాని యాతడరణ్యకాండమునుకూడ రచించి నట్లు చెప్పబడకుండుట.

2. అరణ్యకాండాశ్వాసాంతములందు గల గద్యములలో భాస్కరునకు "సకలసుకవి జన వినుతయశస్కర'' యను విశేషణమును, బాల-కిష్కింధా-సుందరకాండములందు దీనికి భిన్నముగ అష్టభాషాకవిమిత్ర, కులపవిత్ర యను విశేషణములను వాడుట

3. భాస్కరునకు సకలసుకవిజనవినుతుడను విశేషణముండుట.

4. అరణ్యకాండము తక్కిన కాండములవలె కాక యాశ్వాసములుగా విభజింపబడియుండుట.

5 అరణ్యకాండ కవిత్వమునకును, తక్కిన కాండముల కవిత్వమునకును భేదముండుట.

6. కాండాద్యంతపద్య విషయములలో తక్కిన కాండములకును, అరణ్య కాండమునకును భేదములుండుట.

7. తిక్కన సోమయాజి నిర్వచనోత్తరరామాయణమున

"సారకవితాభిరాము గుంటూరి విభుని
మంత్రిభాస్కరు మత్పితామహునిఁదలచి
యైన మన్ననమెయి లోకమాదరించు
వేఱ నా కృతి గుణములు వేయునేల[4]" - అను పద్యమున తన తాతయగు మంత్రిభాస్కరుని సారకవితాభిరాముడని ప్రశంసించుట.

పై నుదాహరింపబడిన కారణములాధారముగ భా. రా. నందలి యరణ్య కాండము హుళక్కి భాస్కరుని రచనము కాదనియు, అది మంత్రి భాస్కరుని రచనమేయనియు తత్పక్షీయుల వాదన. ఈ హేతువులను కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి

గారు తమ భాస్కరోదంతమున విపులముగ చర్చించి భా. రా. న మంత్రి భాస్కరునకు స్థానము లేదని సప్రమాణముగ నిరూపించియున్నారు వారు పై హేతువుల నన్నింటిని హేత్వాభాసములుగ నిరూపించిన విధమును పరిశీలింతము.

1. అయ్యలార్యుడు, 'అమర హుళక్కి భాస్కర మహాకవి' యను పద్యమున హుళక్కి భాస్కరుడు చెప్పగా మిగిలిన యుద్ధకాండ శేషమును తాను రచించినట్లుగ చెప్పుటచే హుళక్కి భాస్కరుడు ఒక్క యుద్ధకాండ పూర్వ భాగమునే వ్రాసినాడని భావించుటకు వీలు లేదు. ఈ పద్యమున హుళక్కి భాస్కరుడు యుద్ధకాండమును మాత్రమే వ్రాసినట్లుగ చెప్పలేదు. హుళక్కి భాస్కరుడు యు.కాం.ను మాత్రమే వ్రాయుటవలన అయ్యలార్యుడిట్లు చెప్పి నాడనుటకాధారములు లేవు. హుళక్కి భాస్కరుడు వ్రాయగా మిగిలిన యు. కాం. పూర్వభాగమును మాత్రమే తాను రచించుటచే అయ్యలార్యుడు పై పద్యమున నొక్క యుద్ధ కాండమును మాత్రము పేర్కొనినాడు. అంతమాత్రమున హుళక్కి భాస్కరుడు అర.కాం.ను వ్రాయలేదనుట యుక్తము కాజాలదు. మఱియు బాల, కిష్కింధా, సుందరకాండములందలి గద్యములందును, యు. కాం. గద్యము నందును గల భాస్కర సత్కవిపుత్ర, భాస్కర సత్కవిమిత్ర యను విశేషణము లలో భాస్కర శబ్దముచే హుళక్కి భాస్కరునే గ్రహించుటచే అర. కాం. నందును నాతనినే గ్రహించుట. యుక్తము కావున 'అమర హుళక్కి' యను పద్యమాధార ముగ అర.కాం. మంత్రిభాస్కరరచిత మనుట యుక్తము కాదు.

2. అరణ్యకాండ గద్యమునకును, బాల - కిష్కింధా - సుందరకాండల గద్యములకును భేదముండుటచే అరణ్యకాండ రచయితయగు భాస్కరుడు యుద్ధ కాండ రచయితయగు భాస్కరుని కంటె భిన్నుడని తలచుట యుక్తము కాదు. అరణ్యకాండముననేకాక తక్కిన చోట్లను భాస్కరుని గద్యమున్న పక్షముననే యా రెండింటిలోని భేదము నాధారముగ గొని యీ యిరువురు భాస్కరులు భిన్నులని వాదించుటకు వలనుపడును కాని అర.కాం.న తప్ప మఱెక్కడను భాస్కరుని గద్యము కానరాదు. అంతేకాక మల్లికార్జునభట్టు గద్యమున గల అష్ట భాషాకవిమిత్ర, కుల పవిత్ర యను విశేషణములును; అరణ్యకాండ గద్య మున గల 'సకల సుకవిజన వినుతయశస్కర' యను విశేషణములును భాస్క రునివే యైనప్పుడు కదా గద్యముల భేదమువలన నిరువురు భాస్కరులు వేఱనుట

కవకాశముండును? మల్లికార్జునుని గద్యములందలి అష్టభాషాకవిమిత్ర, కులపవిత్ర యను విశేషణములు మల్లికార్జునభట్టునకే కాని భాస్కరునకు చెందునవి కావు. మల్లికార్జునుని గద్య రచన క్రమమే యిందులకు ప్రమాణము. ''బుధారాధన విధేయ, తిక్కన నామధేయ''; "శ్రీ మదుభయకవిమిత్ర, కొమ్మనామాత్య పుత్ర"; "బుధారాధన విరాజి తిక్కన సోమయాజి" అని యీ రీతిగా కవులు అంత్యానుప్రాసమును గద్యమున వాడుట తఱచుగా నుండుటచే మల్లికార్జునుని గద్యమునను పై విశేషణము లాతనికే యన్వయింపవలసియుండును. 'ఉభయ కవిమిత్ర కొమ్మనామాత్య పుత్ర' యను తిక్కన గద్యమున ఉభయకవిమిత్ర యనునది తిక్కన కన్వయించునే కాని కొమ్మనామాత్యునకు కాదు కదా! కావున గద్యముల భేదమునుబట్టి యిరువురు భాస్కరులు వేఱనియు, అందరణ్య కాండ భాస్కరుడు మంత్రిభాస్కరుడనియు చెప్పుటకు వీలు లేదు.

3. అర.కాం. గద్యమున భాస్కరునకు 'సకల సుకవి జనవినుత'డను విశేషణముండుటచే నీ భాస్కరుడు మంత్రిభాస్కరుడే కాని హుళక్కి భాస్కరుడు కాడని తలచుట సమంజసము కాదు. ఎట్లన మంత్రి భాస్కరుని స్తుతించు పద్యము లనేకములుండుటచే నీతడు యశస్కరుడనుటకు వీలున్నను హుళక్కి భాస్కరుడు యశస్సులేని వాడనుటకు మాత్రము వీలు లేదుకదా! అంతేకాక 'సరిబేసైరిపుడేల' మున్నగు పద్యములందు స్తుతింపబడిన రాయని భాస్కరుని కీర్తి దాతృత్వము వలన గలిగినదే కాని కవితా విషయమున కలిగినది కాదు. ఒక కవి తనను గూర్చి 'సకలసుకవిజనవినుత'డని చెప్పుకొనినచో నది కవితా విషయకమగు యశము కావలసియుండునే కాని దాతృత్వ విషయకమగుటకు వీలు లేదు. కావున నీతడు కవిత్వమున ప్రసిద్ధుడని చెప్పుటకు ఈ పద్యముపయుక్తము కాజాలదు. మంత్రి భాస్కరుడు మిక్కిలి ఖ్యాతి గలవాడని తెలుపుటకాతనికి రాయని భాస్కరునితో నభేదమును గల్పించుటయు సంగతము కాదు. మంత్రి భాస్కరుడు రాయన భాస్కరుడు కాడనుటకు ఈ క్రింది హేతువులు సమర్థకములుగా నున్నవి.

(అ) మంత్రి భాస్కరుని యింటిపేరు కొట్టరువువారు లేక గుంటూరివారు. రాయన భాస్కరునింటిపేరు రాయనవారు.

(ఆ) మంత్రి భాస్కరుని నివాసము గుంటూరు. రాయని భాస్కరుని నివాసము వినుకొండ.

(ఇ) మంత్రి భాస్కరుని కుమారుడు కొమ్మన. మనుమడు తిక్కన. రాయన భాస్కరుని పుత్రుడు కొండన. పౌత్రుడు రామలింగన్న.

(ఈ) మంత్రి భాస్కరుడు గుంటూరి విభుడు. కవి. రాయన భాస్కరుడు వినుకొండ రాజ్యమున మంత్రి మఱియు గొప్పదాత. ముప్పది యిద్దఱు మంత్రులు పేర్కొనబడిన ఈ క్రింది పద్యమున రాయన భాస్కరుని దాతృత్వ ప్రశంస కాననగును.

"కవులిచ్చి భూపతి గాచి పట్టగ నిల్పె
ప్రజలకై రాయన భాస్కరుండు
వరదాతయై మణీవలయముల్కవికిచ్చె
దండి భాస్కరసూతి కొండమంత్రి
భాస్కరువలె గీర్తిఁబడసెఁదత్పౌత్రుఁడౌ
ఘన రామలింగ భాస్కరుఁడొకండు"

తిక్కన తన తండ్రిని, తాతను వర్ణించుచు పైరీతిగ వారిని దాతలుగ పేర్కొనలేదు.

(ఉ) మంత్రి భాస్కరుడు తిక్కన సోమయాజికి తాతయగుటచే నాతడు 11 వ శతాబ్ది చివరి భాగమునను, 12 వ శతాబ్ది ప్రారంభమునను ఉండిన వాడని చెప్పవచ్చును. రాయన భాస్కరుడు అనవేమ భూపాలుని కాలము వాడు. వేమభూపాలుడు క్రి. శ. 1340 నుండి 1366 వఱకు రాజ్యము చేసినట్లుగ తెలియుచున్నది. ఈతడు కృష్ణదేవరాయల కాలము వాడనియు కొందరి మతము. ఎట్లైనను ఈతడు మంత్రి భాస్కరునకు మిక్కిలి తరువాతి వాడనుట మాత్రము స్పష్టము.

ఈ విధముగ నీ యిరువురు భాస్కరులకు గల భేదము నిశ్చితమగు టచే రాయన, మంత్రిభాస్కరు లొక్కరే యనుట పొసగదు. అంతేకాక సకల

సుకవిజన వినుతుడు మంత్రి భాస్కరుడే యగుచో నాతని కాలము నుండి పదు నైదవ శతాబ్దివరకు గల కవులెవ్వరును ఈతనిని తమ కావ్యములందు పూర్వ కవి స్తుతులలో స్మరింపకుండుటకు కారణము కానరాదు. హుళక్కి భాస్కరుడు సకలసుకవి జనవినుతుడనుటకు పెక్కు నిదర్శనములున్నవి. ఇతడు తిక్కనకు తరువాత 13 వ శతాబ్ది చివరి భాగమునను, 14 వ శతాబ్ది తొలి భాగమునను ఉన్నవాడు. అప్పటి నుండియు కవి స్తుతులలో హుళక్కి భాస్కరుని పేరు కన్పట్టుచునే యున్నది. కపస్తుతులలో కొన్నింట హుళక్కి భాస్కరుడుగను, పెక్కింట భాస్కరుడుగను స్తుతింపబడిన కవి యొక్కడే. ఆతడు హుళక్కి భాస్కరుడేకాని మంత్రి భాస్కరుడు కాజాలడు. సోమదేవరాజీయము ప్రతాప రుద్రుని యాస్థానమున గల కవీశ్వరులను పేర్కొనుచు హుళక్కి భాస్కరుడు మొదలగు ప్రబంధ కవీశ్వరులిన్నూఱుగురును"[5] అని తెలుపుటచేతను, ఇతర కవుల పేర్లను పేర్కొనక హుళక్కి భాస్కరాదులనుటచే నీతడు కవిగా మిక్కిలి ప్రసిద్ధుడై యుండునని తెలియుచున్నది. ఇందుకు లోకమున ప్రసిద్ధమైయున్న జనశ్రుతియు ప్రమాణముగ చెప్పవచ్చును. ఆ జనశ్రుతి యిది.

మొదట భాస్కరుని యింటిపేరు మంగళంపల్లివారట. రాజాస్థానమున నొకనాడు రాజు బంగరుపళ్లెమున అమూల్యాభరణయుతమగు కప్పురపు వీడియము నిడి రసవంతముగ కవిత చెప్పిన యుత్తమ కవికి ఆ వీడియము నిచ్చెదనని ప్రకటింపగా భాస్కరుడందరికంటె నుత్తమమైన కవిత చెప్పి యా తాంబూలము నందు కొనెనట. అందువలన భాస్కరునకు, తత్సంతతి వారికిని 'హుళక్కి'యను గృహనామమేర్పడినదట. కన్నడమున 'హళక్కి'యనగా తాంబూలమని యర్థము. హళక్కి శబ్దము వ్యవహారమున హుళక్కిగా మాఱియుండును [6]

కావున సకల సుకవిజనవినుతుడు మంత్రి భాస్కరుడనుటకన్న హుళక్కి భాస్కరుడనుటయే యుక్తము.

4. యుద్ధకాండ పూర్వభాగము ఆశ్వాసములుగ విభజింపబడక అరణ్య కాండము మాత్రమే అట్లు విభజింపబడుటయు మంత్రి భాస్కరవాదమును సమర్థింపజాలదు. భాస్కరుడు అరణ్యకాండము నాశ్వాసములుగ విభజించినమాట వాస్తవమే కాని యాతడు యు.కాం.ను పూర్తిగ రచించియుండినచో దానినెన్ని

(ఆ) మంత్రి భాస్కరుని నివాసము గుంటూరు. రాయని భాస్కరుని నివాసము వినుకొండ.

(ఇ) మంత్రి భాస్కరుని కుమారుడు కొమ్మన. మనుమడు తిక్కన. రాయన భాస్కరుని పుత్రుడు కొండన. పౌత్రుడు రామలింగన్న.

(ఈ) మంత్రి భాస్కరుడు గుంటూరి విభుడు. కవి. రాయన భాస్కరుడు వినుకొండ రాజ్యమున మంత్రి మఱియు గొప్పదాత. ముప్పది యిద్దఱు మంత్రులు పేర్కొనబడిన ఈ క్రింది పద్యమున రాయన భాస్కరుని దాతృత్వ ప్రశంస కాననగును.

"కవులిచ్చి భూపతి గాచి పట్టగ నిల్పె
ప్రజలకై రాయన భాస్కరుండు
వరదాతయై మణివలయముల్కవికిచ్చె
దండి భాస్కరసూతి కొండమంత్రి
భాస్కరువలె గీర్తిఁబడసెఁదత్పౌత్రుఁడౌ
ఘన రామలింగ భాస్కరుఁడొకండు"

తిక్కన తన తండ్రిని, తాతను వర్ణించుచు పైరీతిగ వారిని దాతలుగ పేర్కొనలేదు.

(ఉ) మంత్రి భాస్కరుడు తిక్కన సోమయాజికి తాతయగుటచే నాతడు 11 వ శతాబ్ది చివరి భాగమునను, 12 వ శతాబ్ది ప్రారంభమునను ఉండిన వాడని చెప్పవచ్చును. రాయన భాస్కరుడు అనవేమ భూపాలుని కాలము వాడు. వేమభూపాలుడు క్రి. శ. 1340 నుండి 1366 వఱకు రాజ్యము చేసినట్లుగ తెలియుచున్నది. ఈతడు కృష్ణదేవరాయల కాలము వాడనియు కొందరి మతము. ఎట్లైనను ఈతడు మంత్రి భాస్కరునకు మిక్కిలి తరువాతి వాడనుట మాత్రము స్పష్టము.

ఈ విధముగ నీ యిరువురు భాస్కరులకు గల భేదము నిశ్చితమగు టచే రాయన, మంత్రిభాస్కరు లొక్కరే యనుట పొసగదు. అంతేకాక సకల

సుకవిజన వినుతుడు మంత్రి భాస్కరుడే యగుచో నాతని కాలము నుండి పదునైదవ శతాబ్దివరకు గల కవులెవ్వరును ఈతనిని తమ కావ్యములందు పూర్వకవి స్తుతులలో స్మరింపకుండుటకు కారణము కానరాదు. హుళక్కి భాస్కరుడు సకలసుకవి జనవినుతుడనుటకు పెక్కు నిదర్శనములున్నవి. ఇతడు తిక్కనకు తరువాత 13 వ శతాబ్ది చివరి భాగముననుు, 14 వ శతాబ్ది తొలి భాగముననుు ఉన్నవాడు. అప్పటి నుండియు కవి స్తుతులలో హుళక్కి భాస్కరుని పేరు కన్పట్టుచునే యున్నది. కవిస్తుతులలో కొన్నింట హుళక్కి భాస్కరుడుగను, పెక్కింట భాస్కరుడుగను స్తుతింపబడిన కవి యొక్కడే. ఆతడు హుళక్కి భాస్కరుడేకాని మంత్రి భాస్కరుడు కాజాలడు. సోమదేవరాజీయము ప్రతాపరుద్రుని యాస్థానమున గల కవీశ్వరులను పేర్కొనుచు హుళక్కి భాస్కరుడు మొదలగు ప్రబంధ కవీశ్వరులిన్నూఱుగురును"[5] అని తెలుపుటచేతను, ఇతర కవుల పేర్లను పేర్కొనక హుళక్కి భాస్కరాదులనుటచే నీతడు కవిగా మిక్కిలి ప్రసిద్ధుడై యుండునని తెలియుచున్నది. ఇందుకు లోకమున ప్రసిద్ధమైయున్న జనశ్రుతియు ప్రమాణముగ చెప్పవచ్చును. ఆ జనశ్రుతి యిది.

మొదట భాస్కరుని యింటిపేరు మంగళంపల్లివారట. రాజాస్థానమున నొకనాడు రాజు బంగరుపళ్లెమున అమూల్యాభరణయుతమగు కప్పురపు వీడియము నిడి రసవంతముగ కవిత చెప్పిన యుత్తమ కవికి ఆ వీడియము నిచ్చెదనని ప్రకటింపగా భాస్కరుడందరికంటె నుత్తమమైన కవిత చెప్పి యా తాంబూలము నందు కొనెనట. అందువలన భాస్కరునకు, తత్సంతతి వారికిని 'హుళక్కి'యను గృహనామమేర్పడినదట. కన్నడమున 'హళక్కి'యనగా తాంబూలమని యర్థము. హళక్కి శబ్దము వ్యవహారమున హుళక్కిగా మాఱియుండును [6]

కావున సకల సుకవిజనవినుతుడు మంత్రి భాస్కరుడనుటకన్న హుళక్కి భాస్కరుడనుటయే యుక్తము.

4. యుద్ధకాండ పూర్వభాగము ఆశ్వాసములుగ విభజింపబడక అరణ్యకాండము మాత్రమే అట్లు విభజింపబడుటయు మంత్రి భాస్కరవాదమును సమర్థింపజాలదు. భాస్కరుడు అరణ్యకాండము నాశ్వాసములుగ విభజించినమాట వాస్తవమే కాని యాతడు యు.కాం.ను పూర్తిగ రచించియుండినచో దానినెన్ని

యాశ్వాసములుగ విభజించి యుండెడివాడో? కొంతవఱకే రచించుటచే పలశక్రి-భాస్కరుడే యుద్ధకాండమును ఆశ్వాసములుగ విభజించుటకవకాశము కలుగలేదు. భాస్కరుడు యు.కాం.ను పూర్తిగ రచించి దానినాశ్వాసములుగ విభజింపని పక్షముననే అర.కాం.ను వలె యు.కాం.ను కూడ ఆశ్వాసములుగ నేల విభజింప లేదను ప్రశ్న ఉదయించుటకవకాశ ముండును. కావున అరణ్యకాండము నందు ఆశ్వాసవిభజనముండుటచే అది మంత్రిభాస్కరుని రచనమనుటకు వీలులేదు.

కొన్ని తా.ప్ర.లలో యు.కాం. గద్యమున 'యుద్ధకాండ శేషంబునందు షష్ఠాశ్వాసము సమాప్తము' అని యుండుటచే చాగంటి శేషయ్యగారు యు. కాం. కూడ తొలుత ఆశ్వాసములుగ విభక్తమైయుండునని యూహించినారు. కాని పై గద్యమున షష్ఠాశ్వాసమను పదము షష్ఠకాండమను నభిప్రాయమున ప్రయుక్తమై యుండును. యుద్ధకాండము రామాయణమున ఆఱవ కాండము కదా !

5. అరణ్యకాండ కవిత్వమునకును, యుద్ధకాండ పూర్వభాగ కవిత్వమున కును భేదముండుటచే నిరువురు భాస్కరులు వేఱనుటయు యుక్తముగ తోచదు. బహుజనపల్లివారు తమ శ.ర. పీఠికలోను, వీరేశలింగంపంతులుగారు కవుల చరిత్రలోను ఈ శైలీభేదమును గూర్చి పేర్కొనియున్నారు. పంతులుగారు శైలీ భేదమునకుదాహరణములుగ రెండు కాండములనుండి యీ క్రింది పద్యముల నుదాహరణముగ చూపియున్నారు.

**అర. కాం.**

ఓరి నిశాచరాధమ! మదోద్ధతిఁదాపసవిప్రకారముల్
వారక చేసి తా ఫలమవశ్యము బొందకపోవునే యమా
గారగతుండవై కుడువఁగాలము నీకిదె చేరె నింక నా
ఘోరశరంబులన్ జముని కోర్కులు దీఱగ నిన్నుఁద్రుంచెదన్ (I-238)

ఈ కొఱగాని కార్య మిటులెవ్వఁడొకో యనుకూలశత్రుఁడై
నీకుఁ బ్రియంబుగాఁబలికె నీవును నిత్తెఱఁగాచరింపఁగా
రాక తలంచి చూడ నిది రాక్షసవంశవినాశకాలమో
కాకిటుగాను దీకొనునె కాదనకీదృశమెవ్వఁడేనియున్ (II-14)

యు. కాం. (పూర్వభాగము) :

చనదు మహద్విరోధమని చక్కటి చెప్పిన నింత తప్పునం
గనలితి నీతిశూన్యులకుఁ గార్యములేటికి దోచు నిష్ఠు వే
యును బని లేదు నీవలన నొప్పని నా వచనంబు లెల్ల నీ
వని మొన రాముచేఁబడినయప్పుడెఱింగెదు కాకపోయినన్ (154)

కామ క్రోధ మదాతిరేకమున నేకగ్రాహివై యుండు ని
న్నే మార్గంబునఁ దెల్పవచ్చు నధికుండెగ్గేల సైచుంబర
స్త్రీ మాయం గొనివచ్చుటే తగవు నీచేఁ గాక సామంత మి
త్రామాత్యాదులు నేడు శాత్రవులచే నా చచ్చి రూపింపఁగన్ (887)

పైన చూపిన యరణ్య కాండ పద్యములు రెండును ప్రక్షిప్త పద్యములే కాని యరణ్యకాండకర్తవి కావు. పెక్కు తా.ప్ర.లలో నివి కానరావు. నేటి ముద్రిత భా.రా. ప్రతులలో నరణ్యకాండమున ప్రక్షిప్త పద్యములెన్నియో చేరి తత్కాండ స్వరూప మిది యని తెలియరాకున్నది. కావున నందలి ప్రక్షిప్త పద్యముల శైలి యాధారముగ కర్తృత్వమును నిర్ణయించుట సమంజసము కాదు. అంతేకాక ఒకే కవి రచించిన పద్యముల శైలిలోను ఇట్టి స్వల్ప భేదముండుట యనివార్యము. రెండు కాండముల యందును శైలీ విషయమున సామ్యములే పెక్కులు కలవు. అవి ముందు చూపబడును.

6. కాండాద్యంత పద్యములందలి భేదమునుబట్టి యరణ్యకాండకవి యుద్ధ కాండ పూర్వభాగకవికంటె భిన్నుడనుటయు సరికాదు. ఎట్లన అరణ్యకాండాంత పద్యములకును, తదితర కాండాంత పద్యములకును భేదముండుట యథార్థమే కాని యా భేదము, అరణ్యకాండ కవి యే భాస్కరుడైనను కలుగునట్టిదే. కావున నీ సందర్భమున అరణ్య, యుద్ధ కాండములను మాత్రమే పరిశీలింపవలసి యుండును. హుళక్కి భాస్కరుడు యుద్ధ కాండను పూర్తిగ వ్రాయక పోవుటచే అందున్న కాండాంత పద్యములు అయ్యలార్యునివే కాని భాస్కరునివి కానేరవు. ఇక భాస్కరునివిగా మనకు లభించు కాండాంత పద్యము లొక్క యరణ్యకాండ ములోనివి మాత్రమే. కనుక కాండాంత పద్యములందు గల భేదముచే అర.కాం.

కర్తయగు భాస్కరుడును, యు కాం. పూర్వ భాగ కర్తయగు భాస్కరుడును ఒక్కరే యనుటకు వీలు లేదు.

ఇక అరణ్య, యుద్ధకాండముల యారంభ పద్యములకేమైన భేదమున్నదో పరిశీలింతము ఈ రెండును సాహిణి మారని సంబోధనము గలవియై ఒక్కరీతి గనే యున్నవి. చూడుడు

**అర. కాం.**

శ్రీహిత నయవిలసిత వా
ణీహిత మృదువచన ధారుణీహిత గుణ సం
దోహ త్రివిక్రమ విక్రమ
సాహస నవసాహసాంక సాహిణిమారా ! (1 ఆశ్వాసము)

**యు. కాం.**

శ్రీకర కరుణారుచి రవి
లోకన లీలా వికాసలోల విపశ్చి
ల్లోక వివేకకలా శి
క్షాకుశలా ! మేరుధీర ! సాహిణిమారా !

7. తిక్కన నిర్వచనోత్తర రామాయణమున 'సారకవితాభిరాము గుంటూరివిభుని' అను పద్యమున తన తాతగారిని సారకవితాభిరామునిగ స్తుతించినంతమాత్రమున నాతడొక మహాకవి యనియు, నాతడొక మహాకావ్యమును తప్పక రచించియుండుననియు, అది భా.రా. నందలి అరణ్యకాండమే యనియు చెప్పుటకు తగిన యాధారములు కానరావు. తన తాతయగు మంత్రి భాస్కరుడు మహాకవియై ఆదికావ్యమగు రామాయణమునే యాంధ్రీకరించియుండినచో తిక్కన తన నిర్వ.రా.న నా విషయమును స్పష్టముగ చెప్పకయుండునా? భాస్కరుడు కవిత్వమునందు సమర్థుడైన కావచ్చును. అంతమాత్రముచే నాతడు రామాయణమును రచించినాడని నిర్ణయింపజాలము. తాతగారియందలి గౌరవముచే తిక్కన యాతనినిగూర్చి కొంత యతిశయముగ చెప్పియుండును. తమ తాతలు గ్రంథములనేమి వ్రాయకున్నను ఈ విధముగ వారిని మహాకవులుగ కీర్తించిన

పూర్వకవులు లేకపోలేదు. అనంతామాత్యుడు తన ముత్తాతయగు బయ్యన గొప్ప కవి యనియు, కవిత్వము చెప్పి తిక్కన సోమయాజిని మెప్పించెననియు భోజ రాజీయమున స్తుతించియున్నను[7] అతని గ్రంథములేవియు తెలియవచ్చుటలేదు కదా! గ్రంథములు లభింపకమానె కాని యాతనిని స్తుతించిన కవులును కనవ్పట్టరు. తిక్కన తన తాతను సారకవితాభిరాముడని ప్రశంసించుటవలన మంత్రిభాస్కరుడు రామాయణమును రచించెనని నిర్ణయించుట యుక్తము కాదు.

తాతయగు మంత్రిభాస్కరుడు పూర్వరామాయణమును వ్రాసియుండుట వలననే తిక్కన నిర్వ.రా ను వ్రాసెననుటను పరిశీలింతము. తిక్కన తాను నిర్వ.రా.ను రచించుటకు గల కారణమును ఈ క్రిందివిధముగ తెలిపియున్నాడు.

"ఎత్తఱినైనను ధీరో
దాత్తనృపోత్తముఁడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్యమగుట
నుత్తరరామాయణోక్తి యుక్తుడనైతిన్[8]"

ధీరోదాత్తుడగు రాముని సచ్చరిత్రము ఎల్లప్పుడు సంభావ్యమే యగుటను ఉత్తరరామాయణరచనమునకు కారణముగ తెలిపియున్నాడు. భాస్కరుడు పూర్వరామాయణమును వ్రాసియుండుటచేతనే తాను నిర్వ.రా.ను వ్రాసియున్నచో ఆ విషయమును స్పష్టముగ చెప్పియుండెడివాడే కదా!

నిర్వ.రా.న గల యాశ్వాసాంతపద్యములు భా.రా.నందలి అరణ్యకాండా శ్వాసాద్యంత పద్యములను పోలియున్నవి. దీనినిబట్టి యీ పద్యములవిషయమున తిక్కన తన తాతగారిననుసరించినాడని యొక ప్రతీతి యున్నది. ఈ రెండు గ్రంథములందలి యాశ్వాసాద్యంతపద్యములు ఒక్కరీతిగ నున్నంతమాత్రమున భా.రా.నందలి యరణ్యకాండము మంత్రిభాస్కరరచితమనుటకు వీలు లేదు. ఈ పద్యముల విషయమున హుళక్కి భాస్కరుడే తిక్కనననుసరించియుండ వచ్చును. అంతేకాక తిక్కన మంత్రి భాస్కరుని యరణ్యకాండము నొక్క యాశ్వాసాద్యంత పద్యముల విషయమున మాత్రమే యనుకరించెననుటయు సంభావ్యము కాదు. ఈ యనుకరణము తన రచనమందంతటను కనిపించవల

యను గదా! అరణ్యకాండము చంపూరూపమున రచింపబడగా ఉత్తర రామాయణము నిర్వచనముగ వ్రాయబడినది. పూర్వము తన తాతచే రామాయణము రచింపబడియుండగా తాను మిగిలిన భాగమును పూర్తిచేయ ప్రయత్నించియున్నచో తిక్కన తన తాతవలె నీ శేష గ్రంథమును - గద్య పద్యాత్మకముగనే రచించి యుండెడివాడు. కావున తిక్కన నిర్వ.రా. రచననుబట్టి మంత్రి భాస్కరుడు రామాయణమును రచించెనని భావించుట సమంజసము కాదు.

ఇక కృతిపతికిని, కృతికర్తకును గల సంబంధమును పరిశీలించినను భా.రా. కర్త మంత్రి భాస్కరుడు కాడనియే తేలుచున్నది. మంత్రి భాస్కరుడు 12వ శతాబ్దికిని, సాహిణిమారయ 14వ శతాబ్దికిని చెందినవారు. వీరిరువురి నడుమ సుమారు రెండు వందల సంవత్సరముల వ్యవధానమున్నది. రెండు శతాబ్దుల తరువాత నున్న సాహిణిమారనకు మంత్రి భాస్కరుడు రామాయణమును రచించి యంకితము గావించుట పొసగదు. హుళక్కి భాస్కరుడు మాత్రము సాహిణిమారని కాలమువాడే కాక ఆతని కాశ్రితుడైనట్లుగను అప్పకవీయమున నుదాహరింపబడిన ఈ క్రింది హుళక్కి భాస్కరుని పద్యమునుబట్టి తెలియుచున్నది.

అప్పులిడునతఁడు ఘనుఁడా
యప్పడొసగి మఱలఁగొందునాతడు రాజా
చెప్పగవలె సాహిణి మా
రప్పను దానమున ఘనుఁడు రాజునటంచున్.[8]

ప్రతాపరుద్రుని సభలో "హుళక్కి భాస్కరుడు మొదలుగాగల ప్రబంధ కవీశ్వరులిన్నూఱుగురును........................అశ్వంబులకధికారియైన సాహిణి మారసయు" నున్నట్లుగ సోమదేవరాజీయమున చెప్పబడినది. దీనినిబట్టి హుళక్కి భాస్కరుడును, సాహిణి మారనయు సమకాలికులని తెలియుచున్నది.

రామాయణ కవులగు భాస్కరాదుల సంబంధమునుబట్టియు రామాయణ కర్తృత్వము మంత్రి భాస్కరునకుగాక హుళక్కి భాస్కరునికే సిద్ధించుచున్నది. బాల, కిష్కింధా, సుందర కాండములను భాస్కరుని పుత్రుడగు మల్లికార్జునుడును, అయోధ్యాకాండమును భాస్కరుని శిష్యుడగు కుమార రుద్రదేవుడును, యుద్ధ

కాండోత్తర భాగమును భాస్కరుని మిత్రుడగు అయ్యలార్యుడును రచించినారు. అయ్యలార్యుడు హుళక్కి భాస్కరుని కాలమువాడు గాదనియు, భాస్కరునకు తరువాతి కాలము వాడనియు విమర్శకులు కొందరభిప్రాయపడినను మల్లికార్జున కుమారరుద్రదేవులతో భాస్కరునకు గల సంబంధమునకు మాత్రమెట్టి భంగము లేదు. ఈ విధముగ భాస్కరుడు పుత్రచ్ఛాత్రులతో కలిసి రామాయణమును రచించినట్లు తెలియుచుండగా మంత్రి భాస్కరునకు సంబంధము గూర్చుట యుక్తము గాదు.

కృత్యాదియందుగల పూర్వకవిస్తుతులును కవికాల నిర్ణయమునకు మిక్కిలి సహాయపడునట్టివే. భాస్కరుని స్తుతించిన కవులను, వారి స్తుతి పద్యములను పరిశీలించినచో భా.రా.న మంత్రిభాస్కరునకేమైన స్థానము లభించునో తెలిసి కొనుట కవకాశమున్నది. భాస్కరుని స్తుతించిన వివిధ కవుల పద్యములు దిగువ పేర్కొనబడుచున్నవి.

వినుకొండ వల్లభరాయడు

నన్నయభట్ట తిక్కకవి నాయకులన్న, హుళక్కిభాస్కరుం
డన్నను.... (క్రీడాభిరామము)

అనంతామాత్యుడు

నన్నయభట్టుఁ దిక్కకవినాయకు భాస్కరు రంగనాథుఁ బే
రెన్నికగన్నయట్టి యమరేశ్వరు.... (భోజరాజీయము)

కూచిరాజు ఎఱ్ఱన

వినుతి యొనర్తు నాంధ్రసుకవీంద్రుల నన్నయభట్టుఁ దిక్కయ
జ్వను నమరేశ్వరున్ వెదలువాడ మహాత్ముని మారనార్యు నా
చనసుతు సోము భాస్కరుని జక్కయనున్. (సకలనీతికథానిధానము)

వెన్నెలకంటి సూరన

మున్నిటి కాళిదాసకవిముఖ్యులకుం బ్రణమిల్లి వారిలో
నెన్నికగాఁ బ్రబంధపరమేశ్వరుఁ దిక్కన సోమయాజినిన్
నన్నయభట్టు భాస్కరుని నాచనసోముని.... (విష్ణుపురాణము)

**అయ్యలరాజు రామభద్రుడు**

శబ్దశాసన సుకవికంజలి యొనర్చి
యుభయకవిమిత్రునకు హస్తయుగళి మోడ్చి
శంభుదాసుని సోము భాస్కరుఁ దలంచి (రామాభ్యుదయము)

**భానుకవి**

రామకథాసుధారసికులైన
భాస్కరుని, రంగనాథునిఁ బ్రస్తుతించి (పంచతంత్రి 1-11)

**రామరాజభూషణుడు**

మహి మున్ వాగనుశాసనుండు సృజియింపంగుండలీంద్రుండు ద
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు బ్రోవన్ మహా
మహులై సోముడు భాస్కరుండు వెలయింపన్... (వసుచరిత్ర 1-10)

సోము ప్రసాదంబు సోమయాజుల నియ
మంబు భాస్కరుని సన్మార్గఘటన
(కావ్యాలంకారసంగ్రహము)

**కొఱవి గోపరాజు**

అనఘు హుళక్కి భాస్కరమహామతిఁ
బిల్లలమఱ్ఱి వీరరాజును ఘను నాగరాజు....
(సింహాసనద్వాత్రింశిక 1-12)

**ఏర్చూరి సింగన**

వెలయఁదిక్కనసోమయాజుల భజించి
యెఱ్ఱనామాత్యు భాస్కరు నిచ్చ నునిచి" (భాగవతము 6-11)

**ఎడపాటి ఎఱ్ఱన**

వినుతులొనర్తు నాంధ్రసుకవిప్రభు నన్నయభట్టుఁదిక్కయ
జ్వన్తు శివదేవు భాస్కరుని జక్కన.... .......
(శృంగారమల్లణచరిత్ర)

ప్రౌఢకవి మల్లన

నన్నయభట్టుఁదిక్కకవి నాచనసోముని భీమనార్యుఁ జే
రెన్నికఁజిమ్మపూడి యమరేశ్వరు భాస్కరు శంభుదాసునిన్

(రుక్మాంగదచరిత్ర)

పింగళి సూరన

అలఘుని శబ్దశాసనపదాంకితుఁదిక్కనసోమయాజి ని
శ్చలమతి శంభుదాసు బుధసన్నుతు నాచనసోమనార్యుఁజె
న్నలరిన చిమ్మపూడి యమరాధిపు భాస్కరు రంగనాథు....

(కళాపూర్ణోదయము)

ఈదులపల్లి భవానీశకవి

ఎలమిన్నన్నయభట్టుఁదిక్కమఖి భీమేశాఖ్యునిన్సోము న
త్యలఘుప్రాభవుఁబెద్దనార్యు ఘనుఁబోతామాత్యు శ్రీనాథుఁ బిం
గళి సూరన్నను భాస్కరున్.................. (ధర్మఖండము 1-9)

కూచిమంచి తిమ్మకవి

నన్నపార్యుని శ్రీనాథు నాచిరాజు
సోము నమరేశుఁదిక్కన సోమయాజి
శంభుదాసుని భీము భాస్కరుని మఱియు
గణుతికెక్కిన సుకవిపుంగవులఁదలఁతు

(లక్షణసారసంగ్రహము 1-5)

పిండిప్రోలు లక్ష్మణకవి

సకలకవినుతయశస్క భాస్కరు
గీతగుణసమాజుఁబోతరాజు (లంకావిజయము)

కృష్ణకవి

సోము నన్నపఁదిక్కన సోమయాజి
భీము శ్రీనాథు భాస్కరుఁబెద్దనార్యు

.... .... .... .... .... ... ....  ....

ఆంధ్రకవితానిశాంతుల నభినుతింతు

(శకుంతలాపరిణయము 1-15)

**అంగర నృసింహకవి**

ఇద్ధగుణుం బ్రబంధపరమేశ్వరు నెఱ్ఱనప్రగ్గడన్ మనః
పద్ధతి నిల్పి సూక్తిరుచిభాస్కరుడైన హుళక్కి భాస్కరున్
బుద్ధి ఘటించి సంతతము పూని భజింతు.... .... .... ....

(రాజరాజాభిషేకము)

**పెనుమళ్ల సోమమంత్రి**

నన్నయభట్టుఁ గావ్యరచనాచణుఁ దిక్కనసోమయాజి వి
ద్వన్నుతు నెఱ్ఱప్రగ్గడను ధన్యుని నాచనసోముఁ గీర్తిసం
పన్ను హుళక్కి భాస్కరుని.... .... ....

(సీమంతినీకల్యాణము)

ముద్రితములగు పై గ్రంథములందేకాక అముద్రితములుగానున్న తాళపత్ర గ్రంథములందును భాస్కరుని స్తుతి కన్పట్టుచున్నది. ఆ స్తుతి పద్యములు దిగువ పేర్కొనబడుచున్నవి.

**అయ్యంకి బాలసరస్వతి; దుర్గారాయకవి**

భాస్కరు ననంతు శ్రీనాథభట్టు భీము
సోము నమరేంద్రుఁదలఁతు నుత్సుకత నాత్మ

(నాగరఖండము[10] 1, 2)

**తిరుమలరాజు సూరపరాజు**

శ్రీనాథార్యునిఁ బోతరాజకవిఁబేర్మిన్ సోమునిన్ భీమునిన్
ధీనిస్తంద్రు ననంతు భాస్కరు వచోధిన్ బెద్దయామాత్యునిన్

(ద్రౌపదీపరిణయము[11])

కంచర్ల శరభన్నకవి

........................................

సొంపుగా దిక్కన సోమయాజిని వేడి
భాస్కరు కవివరు భక్తిఁ గొలిచి.
(అధ్యాత్మ రామాయణము 12)

పూర్వకవిస్తుతులు గల పై పద్యములను పరిశీలించినచో భాస్కరుని స్తుతించిన కవులందఱును పదునైదవ శతాబ్దికిని, ఆ తరువాతి శతాబ్దులకును చెందినవారే యని తెలియుచున్నది. పదునైదవశతాబ్దికి పూర్వమందుండిన తిక్కన, కేతన, మారన, మంచనలలో నెవ్వరును పూర్వకవిస్తుతిలో భాస్కరుని స్మరింపలేదు. అట్లు స్తుతింపకుండుట మంత్రి భాస్కరుడు రామాయణ కర్త కాకుండుటవలననే యని చెప్పవచ్చును.

హుళక్కి యను నుపపదముతోపాటు భాస్కరుని స్తుతించినవారు వినుకొండ వల్లభరాయడు, కొఱవి గోపరాజు, అంగర నృసింహకవి, పెనుమళ్ళ సోమమంత్రి యను నలువురు కవులు. తక్కినవారందఱును నిరుపపదముగ కేవల భాస్కరుని స్తుతించినారు. ఈరీతిగ కవిస్తుతులలో భాస్కరుడని యైనను, లేదా హుళక్కి భాస్కరుడని యైనను కనుపించుచున్నదే కాని మంత్రిభాస్కరుడని కాని, భాస్కరమంత్రి యనికాని ఒక్క కవిస్తుతి పద్యమందైనను కన్పట్టుట లేదు. నిరుపపదముగ స్తుతింపబడిన భాస్కరుడును, హుళక్కి భాస్కరుడును ఒక్కరే యని భావించుట యుక్తము. కావున భా.రా. కర్తృత్వమున హుళక్కి భాస్కరునకే కాని మంత్రిభాస్కరునకు స్థానము హుళక్కియే యని చెప్పవచ్చును.

కేతన దశకుమార చరిత్రమున తనకు గురువును, తన కృతికి పతియును నగు తిక్కన సోమయాజి వంశమును వర్ణించుచు

"కీర్తివిభూషణుండయిన కేతనకున్ సతి నాచమాంబకున్
మూర్తిమదాగమంబులన మువ్వురు పుత్రులు పుట్టిరందు, లో
కార్తిహరుండు గుండనయు నార్యశిరోమణి భాస్కరుండు ని
ర్వ్యార్తిత పుణ్యుఁడిద్ధగుణరాశి మహేశ్వరుఁడుం గ్రమ బునన్.

ఇట్లుదయించిన పుత్త్రత్రయంబునందు

శాపానుగ్రహ శక్తి యుక్తుఁడమలాచారుండు సాహిత్య వి
ద్యాపారీణుఁడు ధర్మమార్గ పథికుండర్థార్థి లోకావన
వ్యాపారవ్రతుఁడంచుఁ జెప్ప సుజనవ్రాతంబు గౌరీపతి
శ్రీపాదప్రవణాంతరంగు విబుధశ్రేయస్కరున్ భాస్కరున్
(దశకుమారచరిత్ర 1, 30-32)

ఇత్యాదిగా మంత్రిభాస్కరుని గూర్చి తెలిపి యున్నాడు. ఇందు మంత్రి భాస్కరుడీ క్రింది యెనిమిది గుణములు కలిగిన వ్యక్తిగా వర్ణింపబడినాడు.

1. ఆర్యశిరోమణిత్వము. 2. శాపానుగ్రహ శక్తియుక్తత. 3. అమలాచారత. 4. సాహిత్య విద్యాపారీణత. 5. ధర్మమార్గపథికత. 6. అర్థార్థిలోకావనవ్యాపారవ్రతత. 7. గౌరీపతి శ్రీపాదప్రవణాంతరంగత. 8. విబుధశ్రేయస్కరత.

పై గుణములలో నే యొక్కటియు మంత్రిభాస్కరుడు కవి యను విషయమును తెలుపుటలేదు. ఈతడు గొప్ప కవియేయగుచో కేతన యా విషయమును వాచ్యముగ చెప్పియుండెడివాడే కదా! కాని తిక్కన చెప్పిన "సారకవితాభిరాము గుంటూరి విభుని" అన్న పద్యమున తన తాత సారకవితాభిరాముడనియు, ఆతని మహత్త్వమును తలచియైనను తనను లోకమాదరించుననియు చెప్పుట మంత్రి భాస్కరుడు కవి యను విషయమును సమర్థించు చున్నది కదా యని వాదింపవచ్చును. మంత్రి భాస్కరుని సారకవితాభిరామత యనగా సారకవితా రచనమందలి యభిరామత యని మాత్రమే చెప్పుటకు వీలులేదు. అది సారకవిత్వాస్వాదము నందలి యభిరామతయు కావచ్చును. కేతన, మంత్రి భాస్కరునకు వాడిన 'సాహిత్య విద్యాపారీణుడ'ను విశేషణమును ఈ విషయమునే సమర్థించు చున్నది.

కేతన ఆంధ్ర భాషా భూషణమున లక్ష్యములనవేకములను నన్నయ భారతమునుండియే కాని తిక్కన తాతగారి రామాయణము నుండి యొక్క పద్యమైనను లక్ష్యముగా చూపలేదు. తన దశకుమార చరిత్రకు కృతిభర్తయైన

తిక్కన తాతగారు రామాయణమునే రచించి యుండినచో నందలి ప్రయోగము లను కేతన ఆం. భా. భూ. న తప్పక చూపియుండును కదా!

పై హేతువులచే భా. రా. కర్తృత్వ విషయమున మంత్రి భాస్కరునకు స్థానము లేదనియే తేలుచున్నది.

భా. రా. నందలి యరణ్య కాండమును, యుద్ధకాండ పూర్వభాగమును హుళక్కి భాస్కరుడే రచించినాడని నిరూపించుటకు శిష్టా రామకృష్ణశాస్త్రిగారు తమ ఆంధ్రవాఙ్మయ చరిత్ర సర్వస్వమున ఈ రెండు కాండములనుండి భాషా విషయకములగు సామ్యముల నెన్నింటినో చూపియున్నారు. కర్తృత్వ నిర్ణయ మున భాషా ప్రయోగ విశేషముల సామ్యము నాధారముగా గ్రహించి చర్చించిన వారు శాస్త్రిగారొక్కరే. వారు చూపిన భాషాప్రయోగ సామ్యములను పరిశీ లింతము.

1. నన్నయ భారతమున ఉన్నవాడు, ఉన్నయది ఇత్యాదిగా తచ్ఛబ్ద సహిత రూపములే కనిపించుచున్నవి. ఉన్నాడు, ఉన్నది మున్నగు తచ్ఛబ్ద లోపముగల రూపములు తిక్కనకాలము నుండియే స్థిరపడినవని భాషా శాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఇట్టి యర్వాచీనప్రయోగములెన్నో భా.రా.లో అరణ్యకాండమున కనబడుచున్నవి.

| | |
|---|---|
| అధికసేనతో నున్నాడు | III-1-139 |
| (దాశరథులు వచ్చినారు) | III-1-264 |
| (నామ మణగకున్నాడు) | III-1-174 |
| (ఏటికి వచ్చినాడు) | III-1-272 |
| (వచ్చినాడరణ్యంబునకున్) | III-2-16 |
| అట్ల యున్నాడ నధికపాపాత్మ | III-2-75 |
| (వినని యట్లున్నారొకండైన) | III-2-109 |
| (నా యొద్దకు నేల వచ్చినాడవు) | III-2-248 |
| (లీలంజెందగ నున్నది) | III-2-307 |
| (ఆననంబులీరేను ధరించినాడు) | |

(ఆకసమున కేగినాడొ) III-2-317
(ఏ దిక్కున కరిగినాడొ) III-2-319
(ఎక్కడ నున్నది జానకి) III-2-346
(అలవడ నున్నాడు) III-2-407
(పాపి యిట్టున్నాడన్) III-2-430

2. నన్నయ తోడుకొని, తోడ్కొని యను రూపములను మాత్రమే వాడగా తిక్కన కాలము నుండి 'తోకొని' యను రూపము వాడుక లోనికి వచ్చినది. ఈ యర్వాచీనరూపము అరణ్యకాండమున పెక్కుచోట్ల గలదు.

జననాయక మిమ్ముందోకొని రమ్మని III-1-92
(నను నెక్కటి దోకొని పోవుచున్నవాడు) III-2-108
(సీతను దశాస్యుడు దోకొని) III-2-175
(ధాత్రీపుత్రి దోకొంచు నీవు) III-2-410

3. నన్నయ 'తెచ్చి కొనవలయు' మున్నగు సంపూర్ణ రూపములను ప్రయోగింపగా తిక్కనాదులు 'తెచ్చికోవలయు' మున్నగు లోప దీర్ఘ సహిత రూపములను ప్రయోగించినారు. భా.రా.న నీ యర్వాచీనరూపమే కనబడుచున్నది.

అజ్ఞానను దెచ్చికోవలయు III-1-254

4. 'పోవనా పోవవు' అనుటకు అర్వాచీన రూపమగు 'పోనా పోవవు' అనునదియే అర.కాం.న కనిపించుచున్నది.

పాయక పోనా పోవవు *III-2-245*

5. నన్నయభారతమున వ్యతిరేకమధ్యమక్రియలు వ్యతిరేక క్త్వార్థముపై 'ఉండుము' అను క్రియ చేర్చుటచే నేర్పడుచుండును. ఉదా :- ఏయకుండుము మొ॥ వీనికి ఏయకుము మున్నగు నన్నప్రయోగరహిత రూపము లర్వాచీనములు. వీనికి తిక్కన కాలమునుండియే ప్రయోగము కనిపించుచున్నది. భా.రా. న నీ రూపమరణ్యకాండములో ప్రయుక్తము.

నరవర తమ్ముండని చూడకు పీనిం బొలిగొనియెద (III-1-142)

6. నన్నయభారతమున నేమ్యాదుల యికారమునకు సంధి గానరాదు. తిక్కన కాలము నుండియే వీని యికారమునకు వైకల్పికసంధి కనబడుచున్నది. భా.రా.లో నరణ్యకాండమున నీ యర్వాచీన సంధి రూపములును కనిపించుచున్నవి.

కోపము రేఁగ నిదేల నన్ను దా గనుగొని III-1-150
(చెలువాఱు తెలుగులవి యేమని చెప్పగలము) III-1-181
(అవ్వల నేమయ్యెనో) III-2-236

7. నన్నయభారతమున సంయుక్తాక్షరమగు క్షకారమునకందలి కకారమునకు మాత్రమే యతి వేయుట కన్పట్టును. షకారసంబద్ధాక్షరమున కాతడెక్కడను యతి వేయలేదు. తిక్కన కాలము నుండియే షకారమునకును యతివేయుట ప్రారంభమైనది. భా.రా.లో నరణ్యకాండమున షకారమునకును యతివేయుట కాననగును.

(క్షితిసుత లీలనెత్తుకొని చెచ్చెర లంకకునేగె) III-2-406
(క్షోణిసుత యపుడాత్మను
క్షీణవ్రతనైతి శత్రుచే చెఱబడితిన్) III-2-167

పైన చూపబడిన యర్వాచీన ప్రయోగములన్నియు తిక్కన కాలము నుండియే కావ్యభాషలో కనబడుచున్నవి. కాని యంతకుముందు కానరావు. అర్వాచీనకవి ప్రాచీన రూపములతోపాటు అర్వాచీన రూపములను గూడ ప్రయోగించుట యుక్తముకాని ప్రాచీనకవి యర్వాచీనరూపములను బ్రయోగింపడు కదా! అర.కాం.న నిట్టి యర్వాచీనప్రయోగములనేకముండుటచే నీ కాండము మంత్రిభాస్కరుని రచనమనుటకు వీలు లేదు.

ఈ రీతిగ శ్రీ శాస్త్రిగారు భా.రా. నందలి అర.కాం. మంత్రి భాస్కరుని రచనముగాదని నిరూపించి యది హుళక్కి భాస్కరుని రచనమే యని నిరూపించుటకై అర.కాం నకును, యు.కాం పూర్వభాగమునకును గల పదప్రయోగసామ్యములను, వర్ణనసామ్యములను కొన్నిటిని చూపియున్నారు. విస్ఫులింగములు,

భ్రుకుటి, చాపకట్టువడ, వెట్టిసేయు మున్నగు ప్రయోగములు రెండు కాండము లందును సమముగ కనబడుచున్నవి. శాస్త్రిగారు చూపిన యా ప్రయోగములు దిగువ పొందుపఱుపబడినవి.

(అ) విస్ఫులింగములు

అర. కాం.

1. (కనదురువిస్ఫులింగములు గ్రక్కు మహాశనిఁబోలు శూలమున్) III-1-24
2. (కనదురు విస్ఫులింగములు గన్నుల రాలగ) III-1-129
3. (కవిసిరి విస్ఫులింగములు గ్రైదువులన్) III-1-193
4. (విస్ఫులింగతతులు వివిధముఖంబుల) III-1-222
5. (మహాశనిగతి విస్ఫులింగములు) III-1-240

యు. కాం. (పూ. భా)

1. చూడ్కులనొక్కట విస్ఫులింగముల్ VI-53
2. హోమాగ్నులపసవ్యధూమమడర, విస్ఫులింగమ్ములు వెలువడు VI-84
3. స్ఫుటవిస్ఫులింగముల్ VI-373
4. క్రైదువుల్ విస్ఫులింగములనుమియ VI-471
5. గదావిస్ఫులింగాగ్నిజ్వాలలు VI-510
6. నానావిధవిస్ఫులింగములు VI-520
7. కనుంగొనల విస్ఫులింగములు VI-869
8. విస్ఫులింగములు సల్లుమొనన్ VI-986

(ఆ) భ్రూకుటి-భ్రుకుటి

అర. కాం.

1. స్ఫురదుగ్ర భ్రూకుటి భీకరమగుచు I-157
2. (భగ్నభ్రుకుటిస్ఫురదురు ఫాలతలంబున) III-1-176
3. భువనభయంకర భ్రూకుటియగు ముఖశ్రేణి) III-1-262
4. (స్ఫుటకోపాటోప భుగ్నభ్రూకుటి) III-1-267

యు.కాం. (పూ.భా.)

1. భీకర భ్రుకుటి వీచులు VI-53
2. కుటిల గ్రంథిల భ్రూకుటీకుటిల VI-57
3. వికటభ్రూకుటి దుర్నిరీక్ష్యుడగుచున్ VI-147
4. రోషగ్రంథిల భ్రూకుటీ కుటిల VI-376
5. భుగ్నభ్రూకుటి భీకరుండగుచు VI-510
6. వికటవిశంకట భ్రుకుటి VI-710
7. అద్భుతభ్రుకుటి రేఖాభీల VI-807

(ఇ) నుగ్గునూచమై

అర.కాం.

(భూధరములు నుగ్గనూచముగ) III-2-335

2. భుజముల నుగ్గునూచమై VI-294

(ఈ) చాపకట్టువడు

అర.కాం.

ప్రపాతవేగమ్మునఁ జాపకట్టువడగా III-2-392

యు.కాం. (పూ.భా.)

అడవి చాపకట్టువడి VI-22

(ఉ) వెట్టిసేయు

అర.కాం.

(త్రిదశులు వెట్టిసేయు) III-2-13
సమస్తనిలింపుల వెట్టిగొన్న III-2-105

యు కాం. (పూ భా.)

నీ వెట్టికియ్యకొని VI-56; మువ్వెట్టియు గొన్న VI-200

భావసామ్యము

(అ) అర. కాం.

1. మ్రుచ్చిలి రఘునాయకు సతిఁ దెచ్చిన యట్లగునె III-2-140
2. (వంచనన్ ద్రుచ్చిలి ననుఁ దెచ్చుట) III-2-170

యు. కాం. (పూ.భా.)

1. వంచన సీతనేల గొనివచ్చితి VI-116
2. ఆ రఘునాథుదేవి వంచన గొనివచ్చి VI-157
3. వసుమతీసుతనట్లు వంచించి తెచ్చుట VI-207
4. వంచన నన్యకాంతఁ గొనివచ్చితి VI-303
5. వంచన రాముదేవిఁగొనివచ్చినయట్టులు గాదురోరి VI-484
6. ముచ్చిలి మహీసుతఁదేఁజనునే VI-621
7. వంచన నన్యకాంతఁగొనివచ్చిన తుచ్ఛుని VI-1038.

(ఆ) అర. కాం.

ఆకసంబు విటిగి పైఁబడ్డ III-2-68.

యు. కాం. (పూ.భా.)

మిన్ను పై విఱిగి పడినట్లు VI-387.

మిన్ను పై నొఱగినయట్టి చందము VI-727.

(ఇ) అర. కాం.

హస్తికి దోమకు గల వాసి III-2-100.

యు. కాం. (పూ భా.)

హరిబలమెట్లు హస్తిమశకాంతరమారసి చూడ రెంటికిన్ VI-63

(ఈ) అర. కాం.

1. మిడుతలు కార్చిచ్చుపైఁ జన్నకరణి III-1-172.
2. మశకములన్ హరించు పెనుమంటయుబోలె III-1-246

3. మిడుతలు కార్చిచ్చుపయింబడబోయినయట్లు చూపె III-2-19.
4. నిశాతాస్త్రమహాగ్నిలో మిడుతపై కాలందలంపెత్తెనే III-2-101.

యు. కాం. (పూ.భా.)

1. శలభంబులకైవడి మద్వరూథినీవనశిఖిపాలుగా రిపులు వత్తురు గాక VI-127.
2. మిడుతలు జిచ్చువాతఁబడి నీఱగుకైవడి VI-532.
3. అర్చులెసఁగ నింద్రజిచ్ఛలభంబు నేర్చు VI-207.

(ఉ) అర. కాం.

రాముడును వాడు దమ తండ్రి యలిగి పురము
వెడలఁద్రోచిన తపోవేషియై III-1-287.

యు. కాం. (పూ. భా.)

జనకుడు వెడలద్రోచిన వనమునకుంగడిమి విడిచి వచ్చినవాడు. VI-431

శబ్దాలంకార సామ్యము:

అర. కాం.

ప్రేటు జోటు నాటు నగపాటు కొండొరులోటుపడక III-2-137.

యు. కాం.

మగుడ దలపాటు ప్రేటును, నగపాటును, బోటునాటుపై యని
సెల్లన్ VI-485

వృత్త సామ్యము :

స్రగ్ధర, మహాస్రగ్ధర యను వృత్తములు రెండు కాండములందును వాడబడినవి.[13] మఱియు సాధారణముగ నితర భా. రా. కవులు వాడని లయవిభాతి వృత్తము అర. కాం. నందును; యు. కాం. పూర్వభాగము నందును మాత్రమే ప్రయోగింపబడినది.[14]

### సన్నివేశసామ్యము

సమాస సన్నివేశములు గల సందర్భములలో నీ రెండు కాండములందును భావనాశక్తియు, కల్పనాశక్తియు, శైలీవిన్యాసమును సమముగానున్నవి. వీనికి శాస్త్రిగారిచ్చిన యుదాహరణములు దిగువ పేర్కొనబడుచున్నవి.

**(అ) అర. కాం.** (పంపావర్ణనము)

'ప్రవిలాసాంచిత సద్గభీరవిమలాంభః పూరసంసేవ్యమా
నవిహంగోత్కర సమ్మదావహ మహానక్రశ్రితాభ్యంతరన్
సవిశేషోర్మితరంగ సంకుల జనశ్లాఘ్యప్రభావన్ సరః
ప్రవరంబుంగని రా నృపాత్మజులు పంపంబెంపు సొంపారగన్

(II-21-424)

**యు. కాం. (పూ. భా.)**

కనిరా రాజన్యులభ్రంకషబహులహరీఘట్టనోద్ధూత సేనం
బును గంభీరాతిఘోరాద్భుత రవబధిరీభూత రోదోంతరంబున్
ఘన నక్రగ్రాహ దర్వీకరమకర మహాకచ్ఛపానేకమీనం
బును జూడారంగరంగద్భువన పవసఘుగ్భ్యనభోంతర్ధి వార్ధిన్.

(VI-29)

పై పద్యములలో సంస్కృతపదబంధములును, నంత్యప్రాసములును సమానమైయున్నవి.

**(ఆ) అర. కాం.** (కబంధవర్ణనము)

సతతాసృక్పానశీలుం జటులకఠినదంష్ట్రాచయాభీలునాభీలు నానా
గత సత్త్వవ్రాత మాంసగ్రసన వివృతవక్త్రు ప్రచండ ప్రచారుం
దతఘోరస్కంధు భూతత్రసనకర బలోద్యత్స్మదాంఘ్రుందరత్నా
ద్ధతదంతి వ్యాఘ్రసింహాహరణ నిపుణబాహాతిబంధుంగబంధున్.

(III-2-387)

యు.కాం. (నృసింహస్వామి వర్ణనము)

దీర్ఘకరాళోగ్ర తీవ్రదంష్ట్రారుచుల్
దిగ్దంతిదంతదీధితులఁ గ్రమ్మ
వివృతఘోరాననవివరంబు రోదసీ
కుహరాంతరాళంబు కొలదిసూప
చండాట్టహాసంపుఁ జప్పుడు సాగర
మేదురధ్వానంబు మ్రింగికొనఁగ
నిప్పులు వడి రాలు నిష్ఠురాలోకన
మినమండలస్ఫూర్తి నినుమడింప

ఘనసటోద్ధూతవాతూలఘట్టనమునఁ
బర్వతావళి యూలఁ గంబమున వెడలి
రభసగతి గిట్టి పట్టి హిరణ్యకశిపు
మున్ను చీరిన నరసింహమూర్తిపీవ (VI-619)

(ఇ) అర. కాం. (రావణుని రౌద్రరూపవర్ణనము)

స్ఫుటకోపాటోపభుగ్న భ్రుకుటిదళకమున్ భూరిదృఙ్నిర్గతోల్కా-
చ్ఛటలున్ ఘర్మోదబిందుక్షరణకృతతనుక్షాళనంబుం బ్రవాహో
ద్భటబాహాచంద్రహాసప్రభలఁ గ్రకచవిస్ఫారదంష్ట్రా సముద్య
త్తటిదావిర్భూతి భూతత్రసనముగ సభాస్థానమెల్లంగలంగన్
(III-1-267)

యు. కాం. (పూ.భా.)

భుగ్నభ్రూకుటిభీకరుండగుచు నాస్ఫోటించి బాహార్గళా
లగ్నక్రూరతరోరు ఖడ్గరుచిజాలంబుల్ గదావిస్ఫులిం
గాగ్నిజ్వాలలు గన్నులీనికొన లంకాధీశుడుం గ్రోధని
ర్మగ్నుండై వడి పీని బట్టుడనగా రాత్రించరుల్ బల్విడిన్, (VI-510)

పై కాండద్వయపద్యములు భావమునందును, భాషయందును, వ్యక్తీకరణమునందును పరస్పరము సంవదించుచున్నవి.

(ఈ) అర. కాం. (ఖరుని సైన్యవర్ణనము)

అమరేంద్రుమీద దండై పేర్చి యేతెంచు
కొండలఁబోలు పేదండతతులు.
ప్రకటప్రభంజనుపై నెత్తివచ్చు కా
దంబినిబోలు రథవ్రజంబు
కుంభజుమీద మార్కొనవచ్చు నంభోధి
తరగలగమిబోలు తురగచయము
పంచాననముమీద బలువిడి నడచు వే
దండయూథముబోలు దైత్యభటులు (III-1-196)

యు. కాం. (పూ. భా.) కాళరాత్రివర్ణనము.

మురిసిన మణిమయముకుటపంక్తులు ప్రభా
లీఢదిగ్దీపమాలికలు గాఁగ
కూలిన దళితేభకుంభమౌక్తికతతు
లిచ్చిన పువ్వుదోయిళ్లు గాఁగ
పడి ప్రోవులై యున్న బహుగాత్రఖండముల్
రచితమహోపహారములు గాఁగ
కలయంగ మడుపులు గట్టిన గజఘోట
కావిరక్తములు మద్యములు గాఁగ (VI - 541)

పై పద్యములందలి భావనాశక్తి సమానముగ నున్నది.

(ఉ) అర. కాం. (జటాయూరావణుల పోరును వర్ణించుట)

కినుకం బక్షీంద్రుడు ఖగాకృతిఁ గదసి దశగ్రీవు నందంద వ్రేయన్
ఘనరౌద్రోద్రేకభంగింగదుము నదుము వేగంబుమై జేరఁ జీరున్
వెనువెంటం బాలు దాఁటున్ వెస వెడఁగుచియన్ వీచు దాచుం గలంచుం
దనుపంఘల్ సించు నొంచుం దలలు సడుచు దుర్దాంతదర్పంబెలర్పన్
(III-2-137)

యు. కాం. (సుగ్రీవరావణుల యుద్ధవర్ణనము)

బలువడి లాగులంబెనచి పట్టుచుఁబట్టిన నూడిపోవుచున్
మలయుచుఁదాకుచుందిరిగి మర్మములంటగ వ్రేయుచున్ మహీ
స్థలిఁబడఁదాచుచుంగడియ జానువులూదుచు ముష్టికూర్పరా
దుల వడి నొంచుచుంగడకతో నిటులొండొరు మీఱు వెండియున్ VI.480.

పై రెండు యుద్ధవర్ణనములును తేటతెనుగుపదములతో, చిన్నచిన్న వాక్యములతో వర్ణింపబడుటయేకాక పోరాడిన తీరులును నొక్కతీరుగ నున్నవి.

ఈ) అర. కాం. (సీతాశోకవర్ణన)

1. ఓహో నా మొఱ యెవ్వరున్ విననియట్లున్నారొకండైన మీ
బాహాదర్పమెలర్పఁదాకఁదగదే (III 2-109)

2. అన్నా! లక్ష్మణ! నిన్నుఁబుణ్యనిధి నేనజ్ఞాననై పల్కితిన్ (III, 2, 111)

3. హా యను నో నరేంద్ర యను (III, 2, 112)

యు. కాం. (పూ. భా.) రాముని శోకవర్ణనము

1. రక్కసుచేతఁబట్టువడి రాజనిభానన యేగునప్పుడే
దిక్కన నాసలేమి నలుదిక్కులు జూచుచు (VI-40)

2. ఏ జనకాత్మజన్ దశరథేశ్వరు కోడల రాముభార్య జుం
డో జనులార యడ్డపడరో సురలార సురారికంచు.... (VI-41)

పై రెండు సందర్భములందును ఉపయుక్తమైన భాష, భావము, వ్యక్తీకరణవిధానము సమముగా నున్నవి.

ఒక్కొక్కప్పుడు కవులు ఒక సందర్భమున వ్రాసిన పద్యమును తిరిగి మరొకసందర్భమున యథాతథముగ వాడుకొనుట కనబడుచున్నది. తిక్కన నిర్వ. రా. నందలి కొన్ని పద్యములను భారతభాగమున మరల వాడుకొన్నా డన్నది విదితమే కదా! అట్లే భా. రా. న అర.కాం. నందలి పద్యమొకటి

యు. కాం. పూర్వభాగమున పునరుక్తమగుట యీ రెండుకాండముల రచయిత లొక్కరే యను విషయమును సమర్థించుచున్నదని శాస్త్రిగారు పైన చూపిన హేతువులతోపాటు మరొక్క హేతువునుగూడ చూపినారు. పునరుక్తమగు నా పద్యము దిగువ పేర్కొనబడుచున్నది.

**అర. కాం:**

[పెఱుకుదునే ఫణీంద్రువిషభీకరదంష్ట్రలు నేలఁగ్రుంగఁజే
సఱతునె నింగి మ్రింగుదునె, చండదిశాగజదండ కాండము
ల్విఱుతునె, వారిధుల్ పుడిసిలింతునె, మందరమంగుటంబునం
జిఱుముదునే, జగంబులఁజేతికిఁదెత్తునె మత్తకాశినీ!] (III. 2-104)

**యు. కాం:**

పెఱుకుదుమే ఫణీంద్రువిషభీకరదంష్ట్రలునేలఁగ్రుంగఁజే
సఱతుమె, నింగి మ్రింగుదుమె, చండదిశాగజదండ కాండము
ల్విఱుతుమె, వారిధుల్ పుడిసిలింతుమె, మందరమంగుటంబునం
జిఱుముదుమే, జగంబులఁజేతికిఁదెత్తుమె రాక్షసేశ్వరా! (VI-60)

ఈరీతిగ శాస్త్రిగారనేకములగు నాంతరప్రమాణములను జూపి "ఈ యాంతరప్రమాణములు ప్రత్యేకముగా ఈ సమస్య పరిష్కారమునకు సమర్థమైనవి కాకపోయినను వెనుక చూపినపద్యమును, నివియు బాహ్యప్రమాణములను బల పఱచునవై యుండి రెండును గలిసి యీ సమస్యను నిష్కర్షగా పరిష్కరించుటకు మాత్రము సమర్థములైనవని చెప్పుటకెంతమాత్రము సంకోచింపనవసరము లేదు." అని తెలుపుచు అర. కాం. కర్తయు, యు. కాం. (పూ. భా.) కర్తయు హుళక్కి భాస్కరుడేకాని తిక్కనతాతయగు మంత్రిభాస్కరు కానేరడని నిరూపించినారు.

శాస్త్రిగారు చూపిన పై ప్రమాణములన్నియు సయుక్తికములుగనే యున్నవి. కాని వారిచ్చిన యుదాహరణములలో కొన్ని ప్రక్షిప్త భాగములకు చెందినవే. ఉదాహరణకు పైనుదాహృతమైన 'పెఱుకుదుమే ఫణీంద్రు విషభీకర దంష్ట్రలు' అను పద్యమును తీసికొనుడు. ఈ పద్యము యు. కాం. (పూ. భా.)న మాత్రమే కలదు. ఇంచుకభేదముతో అర. కాం. నను ఉన్నట్లుగ చెప్పబడిన యీ

పద్యమాకాండమున తా. ప్ర. లలో నెచ్చటను కానరాదు. అ.కాం. ను పెంపుజేసిన కవి యు. కాం. పూర్వభాగమునందలి పద్యమునే యించుక మార్పుచేసి అర.కాం.న ప్రక్షేపించియుండును. పై యుదాహరణములలో ప్రక్షిప్తములగు నుదాహృతులు కుండలీకరణములలో చూపబడినవి.

చాగంటి శేషయ్యగారు అర. కాం. నందలి పాఠభేదములనుగూర్చి చర్చించి యిందిరువురి కవిత్వము గలదనియు, నందొకరు క్లుప్తముగ రచింపగ తరువాత మఱొక్కకవిచే నది పెంచి వ్రాయబడినదనియు, క్లుప్తముగ రచించిన ప్రథమకవి మంత్రిభాస్కరుడనియు వివరించినారు. దీనిని వారీ క్రింది విధముగ సమర్థించి యున్నారు.

అర. కాం. గద్యమునగల భాస్కరుడు హుళక్కి భాస్కరుడనియు, నాతడే మొదటికవియనియు తలంచినయెడల నాకాండమును పెంచి వ్రాసినకవి యాతనికి తరువాతివాడై యుండవలెను. హుళక్కి భాస్కరునకు తరువాత నయ్యలార్యుడు దప్ప రామాయణరచయితలు గానరారు. ఆతడు హుళక్కి భాస్కరుడు రచింపగా మిగిలిన యు. కాం. తరువాతి భాగమును మాత్రమే చెప్పితినని చెప్పుకొనుటచే నాతనికరణ్యకాండ రచనముతో సంబంధము కానరాదు. కనుక హుళక్కి భాస్కరుడరణ్యకాండమును రచించిన మొదటికవి కాడని నిరూపింప వచ్చును. శేషయ్యగారీ సందర్భమున 'అరణ్యకాండ గద్యమున హుళక్కి భాస్కరునకే స్థానమీయదలచి యెవ్వరైననందులకు పట్టుపట్టి పోరాడినచో గద్యకై నేను వారితో గయ్యమునకు దిగను. కాని హుళక్కి భాస్కరుడుకాక మిగిలిన రెండవకవి యెవ్వరని వారిని ప్రశ్నింపకమానను' అని వ్రాసినారు [15] శేషయ్యగారు చెప్పిన రీతిగా హుళక్కి భాస్కరుని పిదప నయ్యలార్యుడుతప్ప భా. రా. రచయిత లెవ్వరు లేరనుట వాస్తవమేకాని అర. కాం.ను తన యధికపద్యములతో పెంపు గావించిన కవి, పూర్వపుకవి రచించిన యాశ్వాసాంత గద్యమును మార్చివేయక యట్లే యుంచినపుడాతడెవ్వరో తెలియుట సాధ్యముకాదు కదా! కనుక పెంపు జేసినకవి యెవ్వరో తెలియని కారణమున నాశ్వాసాంత గద్యమున పేర్కొనబడిన భాస్కరుడు హుళక్కి భాస్కరుడు కాడనుట యాలోచింపదగిన విషయము. అంతేకాక అర. కాం.న పెంపుగావింపబడిన పద్యములుగల ప్రతులును ఒకటి, రెండింటికంటె ఎక్కువగా లభించుటలేదు. ము. ప్ర. లో చేరని యధిక పద్యము

లెన్నియో యీ ప్రతులలో కనఁబడుచున్నవి. ఆ పద్యములనన్నింటిని వర్ణన ప్రియతచే ననంతరకవి చేర్చియుండవచ్చునని యూహింపనవకాశము గలదు.

అర. కాం. ప్రథమాశ్వాసాంత పద్యములును, తిక్కన నిర్వ. రా. నందలి యష్టమాశ్వాసాంత పద్యమును ఒక్క విధముగ నున్నవి. పదములయందును, భావమునందును రెండింటికి మిక్కిలి సామ్యము కనిపించుచున్నది. ఆ పద్యములను పరిశీలింపుడు.

భా. రా. (అర. కాం. 1 ఆ)

పుణ్యుండూర్జిత శౌర్యధైర్యమహిమస్ఫూర్తి స్ఫురద్వైభవా
గణ్యుండార్యజనానురంజితమహాకారుణ్యుఁడున్ శ్లాఘ్యసౌ
గుణ్యుండన్వయవార్ధిచంద్రుడు రిపుక్షోణీశ్వరస్థాపితా
రణ్యుండార్తశరణ్యుఁడుజ్జ్వలయశోరమ్యుండు సౌమ్యుండిలన్

వితరణఖని యుద్యద్వీర్యశౌర్యప్రభావో-
న్నతుఁడు భుజబలాత్యున్మాదవిద్విడ్ధరిత్రీ
పతిహరణసమిద్బ్భాభాగగమ్యుండు సంభా-
వితపరిణతచిత్తోర్వీసుతుండుర్విఁనెందున్

నిర్వ. రా. (8 ఆ.)

పుణ్యుఁడు భారతీవిభవపూతవికాసముఖారవిందలా
వణ్యుఁడు తీవ్రకోపదవవహ్నినిరర్గళదగ్ధశాత్రవా
రణ్యుఁడు మానినీహృదయరంజననైపుణరూఢ రూపతా
రుణ్యుఁడు భీతివిహ్వలవిరోధి శరణ్యవరేణ్యుఁడున్నతిన్

వితరణఖని యుద్యద్వీరశృంగారలక్ష్మీ
పతి రతివరలీలాభంగకృత్సంగతాంగుం
డతులితమతి విస్తారాప్తదేవేజ్యుఁడి జ్యా
ప్రతిదినపరితృప్తిప్రాప్తసప్తార్చి ధాత్రిన్"

పైవానిలో రెండవపద్యమందలి ప్రథమపాదము రెండింటియందును చాల వరకు తుల్యముగానున్నది. అంతేకాక అర. కాం. ద్వితీయాశ్వాసాంతపద్యము లందున్న 'సభయరిపుశరణ్యున్, ఆర్యజనానురంజిత మహాకారుణ్యుడు' అను పదములుత్తర రామాయణమున చకితనృప శరణ్యున్[16], ఆర్య జనతానుత మంత్రుడు[17] అని కొద్ది మార్పుతో ప్రయుక్తములైనవి. మరియు నిర్వ. రా. న వలెనే భా. రా. నను అర.కాం. ప్రథమాశ్వాసాంతప ద్యములు ప్రథమా విభక్తి లోను, ద్వితీయాశ్వాసాంతపద్యములు ద్వితీయావిభక్తిలోను కనిపించుచున్నవి. ఇట్టి సామ్యములు నిర్వ.రా.న కనబడుటకు కారణము తిక్కన తన తాతగారు రచించిన రామాయణముననుకరించుటయే యని భావించి శేషయ్యగారు భా. రా. నందలి అర.కాం. కర్తృత్వమును మంత్రిభాస్కరునకాపాదించినారు హుళక్కి భాస్కరుడు తిక్కనకు సుమారు ఏబది సంవత్సరములు తరువాతివాడు. కావున హుళక్కి భాస్కరుడుత్తరరామాయణమును చదివి యందలి యాశ్వాసాంతపద్య ముల పోలికగల పద్యములను భా రా.న రచించెనని చెప్పుటకును అవకాశము లేకపోలేదు కదా! కావున ఆశ్వాసాంతపద్యములందలి సామ్యము మంత్రిభాస్కరు నకు రామాయణ కర్తృత్వమును సాధింపజాలదు. శేషయ్యగారీ సందర్భమున "తిక్కనామాత్యుని హుళక్కి భాస్కరుడనుకరించెనని చెప్పుటకంటె తిక్కన తన తాతననుసరించినాడని చెప్పుటయే యుచిత"మని తమ యభిప్రాయమును వెల్లడించిరే కాని యా యౌచిత్యమును నిరూపింపరైరి.

పైన పేర్కొన్న వివిధ హేతువులచే భా. రా. న మంత్రిభాస్కరునకు స్థానము లేదనియే తెలియుచున్నది. ఐనను ఈ సందర్భమున నొక విషయము చెప్పవలసియున్నది. భా.రా. తాళపత్ర ప్రతులలో కాలక్రమమున ననేకములగు మార్పులు, చేర్పులు కలుగుటవలన దాని స్వరూపమిదమిత్థముగ తెలియ రాకున్నది. పరిష్కృతముద్రణమునగాని దాని యథార్థ స్వరూపము తెలియదు. ఆ భాగ్యము కలిగినప్పుడు భా రా. కర్తృత్వ విషయమునగల భ్రమలన్నియు పూర్తిగ తొలగిపోవునవకాశము కలదు. అంతవఱకు కర్తృత్వ విషయమున చెప్పు యుక్తులన్నియు కొంతవఱకు వాదపటిమను చూపగలవేకాని యథార్థస్థితిని పూర్తిగ నావిష్కరింపజాలవేమో యను సంశయము కలుగుచున్నది.

సూచికలు :

1. శ.ర. పీఠిక; పేజీ xiii.
2. ఆం.క.చ. (ప్రథమ ముద్రణము) ఆం.క.త. (2 సం.) ఆంధ్రపత్రిక ఉగాది సంచిక (1940-1941).
3. భా.రా. VI - 2698.
4. నిర్వ.రా. I - 12.
5. సో.రా. పేజీ 121.
6. మేడేపల్లివారి భా.రా. పీఠిక.
7. భోజరాజీయము.
8. నిర్వ. రా. I - 11.
9. అప్ప. క. III - 223.
10. R 294/మద. ప్ర.
11. R 303/మద. ప్ర.
12. R 313/మద. ప్ర.
13. స్రగ్ధర :- అరణ్య I - 32; II - 123, యుద్ధ. 548, 754, 884. మహాస్రగ్ధర :- అరణ్య I - 267; II - 27, 136, 387; యుద్ధ. 29, 494, 949.
14. అరణ్య I - 133; యుద్ధ. 477, 662.
15. ఆం.క.త. 2 సం. 118 పే.
16. నిర్వ. రా. II - 103.
17. నిర్వ. రా. III - 119.

----

# భా. రా. కవులు-కవితావిశేషములు

తెలుగులో వెలసిన భారత భాగవతములవలె భా.రా.ను ఒక్కరిచే పూర్తిగ రచింపబడలేదు. బాల, కిష్కింధా, సుందరకాండములను మల్లికార్జునభట్టును, అయోధ్యాకాండమును రుద్రదేవుడును, అరణ్య, యుద్ధకాండ పూర్వభాగములను భాస్కరుడును, యుద్ధకాండ - ఉత్తర భాగమును అయ్యలార్యుడును రచించినట్లుగ ఆశ్వాసాంత గద్యములవలన తెలియుచున్నది. అందరికంటె మల్లికార్జునభట్టే గ్రంథమున నెక్కువ భాగమును రచించుటచే నీ గ్రంథమాతని పేర ప్రసిద్ధ మగుట న్యాయ్యము. కాని భాస్కరుని పేర ప్రసిద్ధమైనది. భాస్కరుని యాధ్వర్యవమున నీ గ్రంథ రచన సాగుటయే దీనికి కారణమని చెప్పవచ్చును. ఈ గ్రంథమిట్లనేకులచే రచింపబడుటకు గల కారణమును దెలుపు నీ క్రింది కథ యొకటి లోకమున ప్రచారమున నున్నది.

భాస్కర కవికాశ్రయభూతుడైన రాజునొద్ద నీతని బంధువైన రంగనాథు డనునాతడు రాజాజ్ఞచే ద్విపదరామాయణమునొకదానిని రచింపనారంభింపగా నాతని యందలి మాత్సర్యముతో భాస్కరకవి యారాజుతో 'ఓ రాజా! నీ ఘనతకు ద్విపదకావ్యము తగినది కాదు. నేనొక పద్యరామాయణమును రచించి నీ కొసంగెద' నని చెప్పెనట. అంత నారాజు తాను పలికిన పలుకు తప్పిపోవుట యుక్తముగాదని యెంచి రంగనాథుని గ్రంథమునే స్వీకరింపదలచి 'ముందెవ్వరు పూర్తిజేసి తెత్తురో వారి కృతినే గ్రహింతునని' చెప్పి పంపెనట. అప్పటికి రం.రా. మూడు వంతులు పూర్తియగుటచే భాస్కరుడు రం.రా. పూర్తికాకముందే తన రామాయణమును పూర్తి గావించి రాజసన్నిధికి తీసికొనిపోవలయునని నిశ్చయించి మల్లికార్జునభట్టాదుల సాహాయ్యముతో గ్రంథమును త్వరగ పూర్తిగావించి రాజునొద్దకు తీసికొని పోయెనట. ఆ సమయమున రంగనాథుడును తన రామాయణమును తీసికొని రాజాస్థానమునకు రాగా రాజు రంగనాథునివైపు కుడిచేతిని, భాస్కరునివైపు ఎడమచేతిని చాచగా భాస్కరుడందులకు కోపించి 'పక్షపాతముగల నీవంటి రాజు నకిచ్చుటకంటె నా కృతిని గుబ్బపువానికిచ్చుట మేలు' అని పలికి రాజాస్థానము

నుండి వెడలిపోవుచుండగా రాజు అశ్వసేనాధ్యక్షుడగు నొక యుద్యోగి తన కా కావ్యము నిమ్మని ప్రార్థింపగా భాస్కరుడాకృతినాతనికంకితము గావించెను. కనుకనే 'సాహిణిమారా !' యని కృతియందు సంబోధించెనట.

భా.రా. రచన విషయమునగల యీ కథయందెంత సత్యము గలదో చెప్పలేము. ఈ గ్రంథములు రెండును ఏక కాలమున రచితములైనవనుట మాత్రము సంగతము కాదు. ఎట్లన రం.రా. నందలి భావములు, పదబంధములు, అలంకార ప్రయోగములు యథాతథముగ గ్రహింపబడిన భాగములు భా.రా.న ననేకములు కనిపించుచున్నవి. (ఈ విషయము భాస్కర రంగనాథరామాయణ ములు - తులనాత్మక పరిశీలనము' అను పరిచ్ఛేదమున వివరముగ చర్చింపబడి నది.) ఏక కాలమున నీ గ్రంథములు రచింపబడియున్నచో భా.రా.న గన్పట్టు నీ రం.రా. అనుకరణములకు స్థానముండుట పొసగదు కదా !

భాస్కరుడే యీ గ్రంథరచనమున ప్రధానుడైనచో నాతడిందలి ప్రథమ కాండమగు బా కాం.ను గ్రహింపక అర.కాం. నేల గ్రహించెనని శంక కలుగ వచ్చును. దీనికి వీరేశలింగం పంతులుగారొక చక్కని కల్పనము నూహించినారు. ఆ కల్పన మీక్రింది విధముగ నున్నది.

హుళక్కి భాస్కరుడు రామాయణమును శీఘ్రకాలములో నాంధ్రీకరించు టకై తన కుమారుడైన మల్లికార్జున భట్టును, కృతిపతి కుమారుడైన కుమార రుద్రదేవుని మాత్రమే సహాయులుగ గ్రహించి ఒక్కొక్కరు రెండేసి కాండముల వంతున ఆరు కాండములను వ్రాయుటకంచనా వేసికొని మొదటి మూడు కాండ ములను ముగ్గురును నిర్విఘ్నముగ రచించిన పిమ్మట మిగిలిన మూడు కాండము లను అదేక్రమమున గ్రహించి ఆరు కాండములను పూర్తిచేయవచ్చును కదా యని తలచియుండును. ఇందలి మూడవ కాండమగు అరణ్య కాండమును, ఆరవది యగు యుద్ధకాండమును శుభేతరములగుటచే వర్ధిష్ణువులగు మల్లికార్జున రుద్రదేవుల కీయక అనుభవజ్ఞుడును, వృద్ధుడును నగు తన వంతునకు గ్రహించి యుండును. మల్లికార్జునభట్టు బా.కాం.ను; రుద్రదేవుడు అయో.కాం.ను; భాస్కరుడు అర. కాం.ను సమకాలముననే ఆరంభించియుందురు. ఈ మూడు కాండముల రచనము నిర్విఘ్నముగనే సాగియుండును. అందువలన నాల్గవదియగు కిష్కింధ

కాండమును మల్లికార్జున భట్టునకును, ఐదవదియగు సుందర కాండమును రుద్ర దేవునకును పూర్వపువరుసనే యిచ్చి తాను యు.కాం.ను గ్రహించి రచన గావించి యుండవలెను. కాని రుద్రదేవుడు కారణాంతరములచే రామాయణ రచన నుండి విరమించుకొని యుండును. అందుచే మల్లికార్జునభట్టు కిం.కాం.ను వ్రాయ నారంభించినాడు. ఇంతలో భాస్కరుడు తన అర. కాం. ను ముగించుకొని కొడుకు చేయుచున్న కి.కాం. తరువాయి భాగము నందుకొని దానిని పూర్తి చేసి సుం.కాం. వ్రాయ నారంభించినాడు. తరువాత మల్లికార్జునుడు సుం.కాం. నందుకొని ముగించి యుండును. మఱల పిళక్కి భాస్కరుడు యు.కాం.ను వ్రాయుచుండగా నాతని మిత్రుడైన అయ్యలార్యుడు అతని యనుమతిమీదనే యు.కాం. ఉత్తర భాగమును గ్రహించి రామాయణమును పూర్తిచేసి యుండును.[1]

దీనినిబట్టి కి.కాం. చివరిభాగమునను, సుం.కాం. ఆరంభమునను భాస్కరుని రచన మున్నట్లుగ తెలియుచున్నది. కాని పై రీతిగ నూహించుటలో గల బాధకములను కొన్నింటిని శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు తెలియజేసినారు. అవి దిగువ ఉదాహరింపబడుచున్నవి.

1. పై యూహరీతిగ భాస్కరుడు కి.కాం. ఉత్తర భాగమును, సుం.కాం. పూర్వ భాగమును రచించు వఱకు మల్లికార్జున భట్టు ఊరక కూర్చొని ఎప్పుడు భాస్కరుడు తనకు వదలివేయునా యని కనిపెట్టుకొని యుండుట అసంభావ్యము.

2. సుం.కాం.ను ప్రారంభించి రచించుచున్న భాస్కరుడు దానిని పూర్తి చేయక మధ్యలో వదలి యు.కాం. నందుకొనుటలో కారణము లేకుండుట.

3. తొందరగా రామాయణ రచనమును పూర్తి చేయదలచుకొనిన భాస్కరుడు తాను కి. కాం. ఉత్తర భాగమును, సుం. కాం. పూర్వ భాగమును రచించు సమయమున మల్లికార్జున భట్టునకు కవితా రచన లేకుండ జేయుటలో కారణము లేకుండుట.

4. కి.కాం. ఉత్తరభాగమును భాస్కరుడే రచించినచో అందలి కాండాంత పద్యములు బాల, సుందర కాండాంత పద్యములవలె శివపరములుగా నుండుటలో ఔచిత్యము లేకుండుట.

౯. యు.కాం.న దక్క తక్కిన కాండములందన్నింట మొదటినుండి చివరి వరకు శైలిలో భేదము లేక ఏకరీతిగ నుండుట.

శ్రీ శాస్త్రిగారు చూపిన పై హేతువులు సయుక్తికములుగ నున్నవి. కావున బాల, కిష్కింధా, సుందర కాండములను మల్లికార్జున భట్టును, అయో.కాం ను రుద్రదేవుడును, అరణ్య, యుద్ధకాండ పూర్వభాగములను హుళక్కి భాస్కరుడును యుద్ధ కాండోత్తరభాగమును శాకల్య అయ్యలార్యుడును రచించి రనుటయే భావ్య ముగ నున్నది.

ఇక ఈ గ్రంథ రచయితలను గూర్చియు, వారి కవితా విశేషములను గూర్చియు తెలిసికొందము.

**మల్లికార్జునుడు :**

ఇతడు భా.రా.లోని బాల, కిష్కింధా, సుందరకాండములను రచించినట్లుగ ము.ప్ర. లోని కాండాంత గద్యములను బట్టి తెలియుచున్నది. ఇతనిని గూర్చిన విశేషములను తెలుపు ఆధారములీగద్యములు తప్ప ఇతరములు కానరావు. ఇతనిని నుతించిన కవులును లేరు. ఆశ్వాసాంత గద్యములవలన ఈతడష్టభాషా కవిమిత్రు డనియు, కుల పవిత్రుడనియు, భాస్కరసత్కవి పుత్రుడనియు తెలియుచున్నది. 'అష్టభాషా కవిమిత్ర కులపవిత్ర భాస్కర సత్కవిపుత్ర....' ఇత్యాది గద్యమున గల అష్టభాషాకవి మిత్రేత్యాది బిరుదములు భాస్కరసత్కవికిని అన్వయించు నవ కాశమున్నను ఇవి మల్లికార్జునకే అన్వయించునని చెప్ప వచ్చును. సాధారణముగ ఆశ్వాసాంత గద్యములందు కన్పట్టు కవుల శబ్దాలంకార ప్రవణత దీనికి సమర్థక మనవచ్చును. ఈతని తండ్రి అరణ్య, యుద్ధకాండ (పూర్వ భాగ)ములను రచించిన హుళక్కి భాస్కరుడే. కొన్ని తా. ప్ర.లలోని ఆశ్వాసాంత గద్యములలో 'హుళక్కి భాస్కరసత్కవి పుత్ర' యనియు పేర్కొనబడియున్నది.

మల్లికార్జునుడు భా.రా. నకు శ్రీకారము చుట్టినవాడేయైనను తొలిపద్యమున శ్రీకారమునుపయోగింపలేదు. ఒకటి, రెండు తా. ప్ర. లలో శ్రీకారాదిపద్యము లారంభమున కన్పట్టుచున్నను అవి పెక్కు తా.ప్ర. లలో కన్పడకపోవుటచే నవి ప్రక్షిప్తములని భావింపవచ్చును. అప్పకవియు భా. రా. తొలిపద్యమున

శ్రీ శబ్దము లేదనియే తెలిపినాడు కదా! వావిళ్ళవారు ప్రచురించిన భా. రా. న బా. కాం. లోని 23 వ పద్యముతరువాత సాహిణిమారుని సంబోధనముగల శ్రీకారాదియగుపద్యమొకటి చేర్చబడియున్నది. ఇది అర.కాం. ప్రథమాశ్వాసము ఆశ్వాసాదిపద్యమును పోలియున్నది. కాని యిది బా. కాం. న ఏప్రతియందును కానరాదు. కొన్ని ప్రాచీనముద్రితప్రతులలో 'శ్రీరఘురామచరిత్రము' అను శ్రీకారాదిపద్యము తొలిపద్యముగ కానవచ్చుచున్నది.[2] వావిళ్ళవారిప్రతి(1923)లో నిది మూడవపద్యముగ నున్నది.

సాధారణముగ తెలుగుకావ్యముల ప్రారంభమున గనపడు అవతారిక భా. రా. న కానరాదు. వివిధగ్రంథాలయములయందు భద్రపరుపబడి లభ్యము అగుచున్న భా. రా. తాళపత్రప్రతులలో నెందును అవతారిక గానవచ్చుట లేదు. భా. రా. రచనము భాస్కరుని ఆధ్వర్యవమున జరిగియుండుటచే నవతారిక వ్రాయు బాధ్యత మల్లికార్జునునిదికాక భాస్కరునిదే యగును. కాని రచనా ప్రారంభమున కృతిపతివరణము నిశ్చితము కాకుండుటచేతను, ఇందలి వివిధ భాగములు వివిధకవులచే వ్రాయబడుటచేతను, కృత్యవతారిక ఉండదగిన భా.కాం. ను రామాయణ రచయితలలో మూర్ధన్యుడును, అవతారిక వ్రాయదగిన వాడును అగు హుళక్కి భాస్కరుడుకాక మల్లికార్జునుడు వ్రాయవలసివచ్చుట చేతను బా.కాం. ప్రారంభమున అవతారిక కానరాదు. రామాయణరచనము పూర్తియైనపిమ్మట హుళక్కిభాస్కరుడవతారిక వ్రాయదలచియుండును. కాని పరిస్థితుల ప్రభావముచే నాతడవతారిక వ్రాయక కేవలము సాహిణిమారని పేర పద్యములను వ్రాసియుండును. ఆతడవతారికయే రచించియుండి, యది లభించినపక్షమున కర్తృత్వవిషయమునను, అంకితవిషయమునను గల కొన్ని సందేహములు తీరియుండెడివి.

మల్లికార్జునుడు రచించిన ఈ మూడు కాండములకును కృతిపతి యెవ్వరను విషయమున నేకాభిప్రాయము లేదు. కొందరీభాగము సాహిణిమారాంకితమనియు, మరికొందరీశ్వరాంకితమనియు వాదించుచున్నారు. ఈ కాండములందలి యాశ్వాసాద్యంతపద్యములీవిషయమున నేమైన సహాయపడునో పరిశీలింతము. బా. కాం. ప్రారంభమున సాహిణిమారని సంబోధనముగల పద్యము ము. ప్ర. యందేకాక తా. ప్ర. లలోను మృగ్యమే. ము.ప్ర. లో (వావిళ్ల 1923) బా.కాం. న సాహిణి

మారని సంబోధనముగల యీ క్రింది పద్యము 24 వ పద్యము తరువాత కనబడుచున్నది.

శ్రీ రామాకుచయుగళీ
హారిద్రోల్లసితవక్ష హరిచరణసరో
జారాధ్య బుద్ధ విభునుత
సారసహితతేజధీర! సాహిణిమారా!

ఈ పద్యమే కొద్దిభేదముతో అర.కాం. 2 ఆ. ప్రారంభమున ఈ క్రింది విధముగ నున్నది.

'శ్రీ రామాకుచయుగళీ
హారిద్రోల్ల సితవత్స హరిచరణ సరో
జారాధ్యుఁడు మారయధర
ణీరమణోత్తముఁడు సాహిణీతిలకమిలన్'

ముద్రాపకులో, పరిష్కర్తలో పై అర.కాం. పద్యమును కొంత మార్చి బా. కాం. న చేర్చియుందురని యూహింపవచ్చును. అంతేకాక ఈ పద్యము బా. కాం. ప్రారంభమున నుండవలసినది కాని 24 పద్యముల తరువాత నుండదగినది కాదు. కావున నిది ప్రక్షిప్తమే యనవచ్చును.

బా. కాం. చివర నీ క్రింది పద్యములు గలవు.

నతదివిజయక్షరాక్షస
శతమఖముఖదివిజమకుటసన్మణిగణరం
జితనఖకిరణ పదాంబుజ
శ్రిత భక్తక్లేశనాశ శివ! గిరిజేశా!

సకలసురశరణ్యా సర్వదేవాగ్రగణ్యా
ముకుటనిహితగంగా ముక్తితాత్పర్యచంగా
శకలితవినతాఘా సాధుసస్యౌఘమేఘా
ప్రకటితనమదింద్రా భక్తవారాశిచంద్రా!

ఈ రెండు పద్యములు శివసంబోధనపరములు. కనుక బా.కాం. ఈశ్వరునకే అంకితమీయబడిన దనియు, సాహిణిమారనకు దీనితో సంబంధము లేదనియు తెలియుచున్నది. ఇక కిష్కింధా, సుందరకాండముల యాద్యంతపద్యముల వలన ఆ కాండములెవరి కంకితములో తెలిసికొందము. ఈ రెండు కాండముల యాశ్వాసాద్యంత పద్యములు దిగువ చూపబడుచున్నవి.

**కిష్కింధాకాండము**

**ఆశ్వాసాది పద్యము.**

శ్రీ రమణీ ప్రియరమణీ
శ్రీరమ్యోరు కుచకుంభసేవా లోల
స్ఫారదృగాశయనేత్రాం
భోరుహపూజాప్రహృష్ట! పురుషవిశిష్టా! (IV-1)

**ఆశ్వాసాంత పద్యములు**

i) లాటీచందనచర్చ చోళమహిళాలావణ్యసామగ్రి క
ర్ణాటీగీతకళాసరస్వతి కళింగాంతఃపురీమల్లికా
వాటీ మంజరిగౌడవామనయనావక్షోజహారాలియై
పాటింపందగు నీదు కీర్తి రథినీపాలాగ్రణీ! సాహిణీ! (IV-831)

ii) సురనుతపదపద్మా ! శుద్ధవిజ్ఞానపద్మా !
హరిణకలితహస్తా! యాపగాసిక్తమస్తా!
హరిహయసురరమ్యా! యంచితధ్యానగమ్యా !
స్ఫురదురుగిరిచాపా! పుణ్యపీఠిస్వరూపా! (IV-832)

**సుందర కాండము**

ఆశ్వాసాదిపద్యము

'శ్రీరమణీహృదయేశ్వర
కారుణ్య సుధాంబురాశి కల్లోలభవ
శ్రీరంజితవరవైభవ
సారయశశ్శ్రీవిహార! సాహిణిమారా !

ఆశ్వాసాంతపద్యములు

సురతరుణీ కోమల తర
కరసరసిజ పీడ్యమాన కమనీయ భవ
చ్చరణసరోరుహ సేవా
కరణచణ ప్రమథనాథ! గౌరీనాథా!

సవనభుగభినంద్యా! సర్వలోకైకవంద్యా!
రవి శశిశిఖినేత్రా! రమ్యరామార్ధగాత్రా!
భువననివహనేత్రా! భుక్తిముక్తి ప్రదాతా!
ప్రవిమలగుణసంగా! భవ్యకోటీరగంగా!

కి. కాం. ప్రారంభమందలి 'శ్రీరమణీ' యను పద్యమున శివసంబోధనము గలదని చాగంటి శేషయ్యగారును,[8] విష్ణువో, విష్ణుభక్తుడగు నొక పురుషశ్రేష్ఠుడో సంబోధింపబడినాడని తం. తేవప్పెరుమాళ్ళయ్యగారును[1] అభిప్రాయపడినారు. మొత్తముపై ఇందు స్తుతింపబడినవారెవ్వరో విస్పష్టముగ తెలియుటలేదు. ఇక నీ కాండాంతమున గల పద్యములలో నొకటి సాహిణిమారని సంబోధన పరముగను, రెండవది శివసంబోధన పరముగను నున్నవి. వీనిలో సాహిణిమారని సంబోధించు "లాటీచందన చర్చ" యను పద్యము పెక్కు తా. ప్ర. లలో మృగ్యమగుటచే ప్రక్షిప్తమనవచ్చును. అంతేకాక మల్లికార్జునుడు కాండాంతమున శివునితోపాటు సాహిణిమారని కూడ సంబోధించినాడనుట యసంగతమగు విషయము. మల్లికార్జునభట్టుచే రచింపబడిన తక్కిన కాండాంత పద్యములలో నొక యనుగతి కనబడు చున్నది అదేమన వీనిలో తొలి పద్యము కందపద్యముగను, రెండవది మాలినీపద్యముగను నుండుట. కి. కాం. నను మల్లికార్జునుడి పద్ధతినే యనుసరించి యుండుననుట యుక్తము. కావున 'లాటీచందన' యను సాహిణిసంబోధనపరమగు పద్యము ప్రక్షిప్తమనియే భావింపవచ్చును. సుం. కాం. ప్రారంభమున సాహిణిమారని సంబోధనముగల పద్యమును, అంతమున శివసంబోధనము గల రెండు పద్యములును గలవు. మల్లికార్జునుడు రచించిన మూడు కాండముల తుదను శివసంబోధనము లుండుటచే ఆతడు శివునకే ఈ గ్రంథము సంకితము గావించి యుండును. బా. కాం. ప్రారంభమున సాహిణి మారని సంబోధనముగల పద్యమొక్కటియు లేకపోవుట చేతను, కి. కాం. ఆరంభము నందలిది సందిగ్ధముగ

నుండుటచేతను, సుందరకాండారంభమున మారనసంబోధనముగల పద్యము నిటీ వల నెవరో తక్కిన కాండములను చూచి చేర్చిరని తోచుచున్నది. ఈ విధముగ కాండాదిపద్యము లొకతీరుగను, కాండాంత పద్యము లొకతీరుగను ఉండుటచే కిష్కింధా సుందరకాండములను కొంత హుళక్కి భాస్కరుడును, కొంత మల్లికార్జున భట్టును రచించి యుండవచ్చునని వీరేశలింగంపంతులుగారు ఊహించి యున్నారు.[5] కాని ఒకే భాగమును తండ్రి యొకరికిని, కుమారుడు మఱొకరికిని కృతి యిచ్చుట సంభవమును, సంగతమును కాదు. కావున మల్లికార్జునుని పేరుతో నున్న బాల, కిష్కింధా, సుందరకాండములు మూడును పరమేశ్వరాంకితములే యని చెప్పవచ్చును.

**కవితావిశేషములు**

నన్నయాదుల భారతాంధ్రీకరణము వలెనే భాస్కరాదుల రామాయణాంధ్రీకరణమును కొన్నిచోట్ల మూలము నతిక్రమించినను ప్రధానముగ మూల కథననుసరించియే సంతరింపబడినది. భారత కవులది పురాణశైలి కాగా భాస్కరాదులది కావ్యశైలి యని చెప్పవచ్చును. అటనట తమ ఇచ్ఛానుసారముగ వర్ణనలు గావించి భా.రా. కర్తలు తరువాతి ప్రబంధయుగమున వెలసిన కావ్యములకు మార్గదర్శకులైరనుటలో నతిశయోక్తి లేదు.

భా.రా. కర్తలలో తక్కిన కవులకంటె అత్యధికభాగమును రచించినవాడు మల్లికార్జునభట్టు. ఈతడు మూడు కాండములలో దాదాపు 2190 పద్యగద్యము లను సంతరించినాడు. ఈతని కవిత్వము సంస్కృత పదభూయిష్ఠమై ప్రసాద మాధుర్యాది గుణములతో గూడి మిక్కిలి రసవత్తరముగ నుండును. వర్ణనములును ప్రబంధములలోవలె అతిదీర్ఘములుగ కాక లఘువులై ఎంతో సందర్భశుద్ధి కలవిగ కన్పట్టును ఈతని కవిత్వమున గల విశేషములను కొన్నింటిని పరిశీలింతము.

వర్ణనములు :- కవికర్మ కావ్యము. 'కవయతీతి కవిః' అను కవిశబ్ద వ్యుత్పత్తినిబట్టి కావ్యమంతయు వర్ణనమే యగుచున్నది. కాని వర్ణనము సాధారణముగ నీ యర్థమున గ్రహింపబడుటలేదు. నగరము, అర్ణవము, శైలము, ఋతువులు, సూర్యోదయము, చంద్రోదయము మున్నగువాని వర్ణనమే కావ్యమున

వర్ణన శబ్దవాచ్యముగ భావింపబడుచున్నది. కావ్యము అష్టాదశ వర్ణనలతో కూడి యుండవలయునని యాలంకారికుల నియమము. వీనిలో కొన్ని తక్కువగనున్నను దోషము లేదు. మల్లికార్జునుడు తాను రచించిన భాగమున నీ క్రింది వర్ణనముల నెంతో సముచితముగ సంతరించినాడు.

**బాలకాండము :**

| | |
|---|---|
| పురవర్ణనము | I, 30 - 43 |
| చంద్రోదయ వర్ణనము | I, 348 |
| సూర్యాస్తమయ వర్ణనము | I, 683 |

**కిష్కింధాకాండము :**

| | |
|---|---|
| వర్షర్తు వర్ణనము | IV, 383 - 385 |
| శరదృతు వర్ణనము | IV, 406, 411 - 415 |
| సముద్ర వర్ణనము | IV - 765 |
| యుద్ధ వర్ణనము | IV, 178 - 266 |

**సుందరకాండము :**

| | |
|---|---|
| సముద్ర వర్ణనము | V - 12 |
| మహేంద్రపర్వత వర్ణనము | V - 5 |
| సూర్యాస్తమయ వర్ణనము | V, 74; 135 - 187 |
| సూర్యోదయ వర్ణనము | V - 166 |
| చంద్రోదయ వర్ణనము | V - 170; V - 89 |

బా కాం. ప్రారంభమున అయోధ్యాపురము సుమారు 12 పద్యముల యందును, ఒక పెద్ద గద్యమునందును వర్ణింపబడినది. ఇందు అయోధ్య యందలి చాతుర్వర్ణ్యమును, మంత్రి సామంతులును, స్త్రీలును వర్ణింపబడినారు. మూలము నందయోధ్యా నగరవర్ణనమున్నను అందు పై విషయములు వర్ణింపబడలేదు. తరువాతి కవులకు ఈ పురవర్ణనము మార్గదర్శకమైనదనవచ్చును. మల్లికార్జునుడు కాదంబరి మున్నగు సంస్కృత కావ్యములను ఆపోశనము పట్టిన ప్రతిభాశాలి యగుటచే అందలి వర్ణన వైఖరుల నీ సందర్భమున నిబంధించినాడు. ఈ క్రింది గద్యభాగములలో నీ విషయము స్పష్టమగుచున్నది.

గానవిద్యలయంద మూర్ఛనలు, వల్మీకములయంద ద్విజిహ్వ సంచారంబు, లానందంబులయంద బాష్పోద్గమంబులు, ఛత్రచామరములయంద కనక దండంబులు, తరుణులయంద బంధంబులు, ననంగపీడలయంద యధరపానంబులు, నిద్రలయంద యజ్ఞానంబులు, కామినీఘనకుచంబులయంద కఠినత్వంబులు, నయనంబులయంద చాపలత్వంబులు, చూపులయంద పక్షపాతంబులు, బొమలయంద వక్రతలు.........గాని యెగ్గులొండెడ లేక

సదాశివుని దేహంబునుంబోలె దుర్గావరణభూషితంబులు, గగనతలంబునుంబోలె నినసుతబుధకవిరాజమిత్రపరివృతంబయి, భానుమండలంబునుంబోలె ప్రభాభాసురంబయి, యలకాపురంబునుంబోలె నిధానధనేశాశ్రితంబయి, లంకాపురంబునుంబోలె బుణ్యజనసేవితంబయి, మదనతూణీరంబునుంబోలె సుమాయుధభరితంబయి (I - 43)

రత్నాకరంబయ్యును భంగరహితంబయి, విబుధాప్సరఃసంతానహరిచందన నిలయంబయ్యును ధరణీతలవిలసితంబయి, యినకులీనపాలితంబయ్యును భీమవిజయ ధర్మరాజ సుయోధన యువరాజ విరాజితంబయి, పద్మాకరంబయ్యు విషపంకవర్జితంబయి వెలయునప్పట్టణంబునకు (I - 43)

పై మూడు గద్యభాగములలో క్రమముగ పరిసంఖ్య, శ్లిష్టోపమ, విరోధాభాసము అను నలంకారములు ప్రయుక్తములు. ఇట్టి యాలంకారిక రచనమునకు మూలము కాదంబరి యనుటలో సందేహము లేదు.

సూర్యోదయ, సూర్యాస్తమయ, చంద్రోదయ వర్ణనములలో మల్లికార్జునుడు అవలంబించిన రీతి విలక్షణమైనది. ప్రబంధ కవులవలె కథాగతికి విఘ్నము కలుగు రీతిగ నదే పనిగ వర్ణించినవాడుకాదు. వీని నాయా సందర్భములందలి కథావస్తువునకు సందర్భించునట్లు క్లుప్తముగ వర్ణించి యౌచిత్యమును పోషించినాడు. ఈ క్రింది పద్యమును గమనింపుడు.

నా కులజుఁడైన రాముఁడు
శ్రీ కంఠుని విల్లు విఱిచి సీతం బ్రీతిం

గై కొను రేపని చెప్పగ
నాకమునకు నరుగువిధమునన్ రవి గ్రుంకెన్ (I - 683)

శతానందుడు రామలక్ష్మణులకు విశ్వామిత్రుని మాహాత్మ్యమును తెలిపి కేవలతపోమూర్తియగు కౌశికుని సామర్థ్యములనేకములని విన్నపింపగా రామ లక్ష్మణులును, అచటి సభాసదులును సంభ్రమాశ్చర్యములతో విశ్వామిత్రుని ప్రశంసించి పూజింతురు అంత సూర్యాస్తమయమగును. ఈ సందర్భమున మూలమున 'కర్మకాలో మునిశ్రేష్ఠ లంబతే రవిమండలమ్' (I-55-36) అను నొక్క వాక్యమున సూర్యాస్తమయము వర్ణితమైనది. మల్లికార్జునుడు పై పద్యమున నీ విషయమును కథా వస్తువునకు సందర్భించు నట్లుగ వర్ణించినాడు. తన వంశీయుడగు రాముడు మరుసటి దినమున శివధనుర్భంగము గావించి సీతా పరిగ్రహమును గావింప బోవుటను తెలియజేయుటకు నాకమునకు పోవుచున్నాడా యనునట్లుగ సూర్యడస్తమించినాడట. మల్లికార్జునుడీరీతిగనే తక్కినచోట్ల సూర్యా స్తమయాదులను ప్రకృతకథా సందర్భితములు గావించుట ఔచిత్యపరిశోభితము. ఈ క్రింది పద్యమును పరిశీలింపుడు.

'నా కెంతయుఁ బ్రియశిష్యుం
డీ కపివరుఁ డితని పనికి నెడ గాకుండం
బోక యుచితమగు కరణి వి
భాకరుఁడపుడపరశిఖరిపై కరుగుటయున్' (V-74)

ఋతువులలో మల్లికార్జునుడు వర్ష శరదృతువులను మాత్రమే వర్ణించినాడు. శ్రీరాముడు వాలిని వధించి సుగ్రీవుని పట్టాభిషిక్తుని గావించి ఋశ్యమూక పర్వత మున నివసించుచుండును. అంత వర్షర్తు వేతెంచును. ఈ సందర్భమున మూల మున నీ ఋతువు దాదాపు 66 శ్లోకములలో వర్ణితమైనది.[6] మల్లికార్జునుడు దీనిని పదునాలుగు పద్యములలో సంక్షేపించినాడు.[7] వీనిలో పెక్కు పద్యములు మూల భావము ననువదించునవే యైనను ఈ క్రింది పద్యము మూలమున లేని శిల్పముతో విరాజిల్లుచు నాతని ప్రతిభను వ్యక్తము చేయుచున్నది.

"యమునద్గంగము కృష్ణభూమదిలమజ్జాక్షన్మనుష్యంబు నీ
లమహీధ్రన్నిఖిలాచలావళి, తమాలద్భూజ మిందీవర

తుక్కుముదశ్రేణి పికద్విహంగము తమస్తోమద్గ్రిహార్కప్రభా
సముదాయంబగుచుండె లోకమలఘుశ్యామాభ్రముల్ బర్వినన్ (V-384)

ఆకాశమంతట కారుమేఘములు దట్టముగ క్రమ్మి కొన్నవి. అంత గంగ యమునగను, భూమియంతయు నల్లరేగడిగను, నరులందరు నారాయణులుగను, పర్వతములు నల్లని కొండలుగను, చెట్లు చీకటిమ్రాకులుగను, తెల్లకలువలు నల్ల కలువలుగను, పక్షులన్నియు కోకిలలుగను, అర్కప్రభలు తమస్తోమముగను గన్పించినవట. నల్లని మేఘములు దట్టముగ వ్యాపించుటచే వస్తుజాల మంతయు నల్లగా మారిన దనుట యిందలి ప్రధానాంశము. ఈ పద్యమందలి భావములో నంతగా విశేషమేమియు లేదు. కాని యిందులో నొక శిల్పమున్నది. ఆ శిల్పమున వ్యాకరణ సౌందర్యము నిక్షిప్తమైయున్నద. నామములను ధాతువులుగజేసి వానిని మరల శతృప్రత్యయాంతములుగ మార్చి బహువ్రీహిసమాసముగ సంతరించుటయే ఈ పద్య మందలి శిల్పము. (యమునా ఇవ ఆచరతి యమునతి - యమునంతీ గంగా యస్య సః అని విగ్రహము. ఇట్లే తక్కినవానికిని విగ్రహము చెప్పవలెను) పై పద్యము నందలి పదములన్నింటిలో 'కృష్ణ భూమదిలము' అను సమాసము విశిష్టమైనది. దాని విగ్రహమును తెలిసికొందము. కృష్ణా చ సా భూమిశ్చ కృష్ణ భూమమ్ - ఇట కృష్ణ భూమిః అను ఇకారాంత రూప మేర్పడవలసి యున్నను "కృష్ణోదక్పాండు సంఖ్యా పూర్వాయా భూమే రజిష్యతే" అను వార్తికము (అష్టా. V-IV-75) చే 'అచ్' ప్రత్యయము రాగా 'కృష్ణభూమ'అను అకారాంతమేర్పడును. పిదప నది నామధాతువై దానిపై శతృప్రత్యయము రాగా స్త్రీ లింగమున 'కృష్ణభూమంతీ' అను రూపము సిద్ధించును. దీనికి ఇలా శబ్దముతో బహువ్రీహి సమాసము. (కృష్ణభూమంతీ ఇలా యస్య సః) పద్యముననే దే నొక్క సమాసము నీ రీతిగ నిబంధించుట యంత విశేషము కాదు. కాని పద్య మంతయు నట్లే సంతరించుటలో కవిప్రతిభ ద్యోతితమగుచున్నది.

వర్ణములందీరీతిగ నేదేనొక వైచిత్రిని చూపుట మల్లికార్జునుని రచనములో కన్పడు విశేషము. బా.కాం. న దశరథుని వర్ణించు నీ పద్యమును చూడుడు.

"జనలోకైకమహారథుండు ద్విజరక్షాదక్షుఁడాజింద్రిలో
చనుఁడుద్యచ్చతురంగసైన్యుఁడును భాస్వద్రూపపంచాస్త్రుఁడ

న్యనృపక్రౌంచషడాననుండు ఘనసప్తాశ్వాన్వయుండష్టమం
త్రి నవద్రవ్యనిధీశుఁడై దశరథాధీశుండు పెంపొందగన్ (I-44)

ఈ పద్యమున దశరథుడు మహారథుడనియు, బ్రాహ్మణ రక్షణ దక్షుడనియు, యుద్ధ రంగమున రుద్రుడనియు, చతురంగ సైన్య యుతుడనియు, రూపమున మన్మథుడనియు, శత్రు రాజులను చెండాడుటలో కార్తికేయుడనియు, సూర్యవంశ సంజాతుడనియు, అష్ట మంత్రి పరివృతుడనియు, నవద్రవ్యములకు నిధియనియు వర్ణింపబడినాడు. ఈ పద్య భావమున చెప్పుకోదగిన విశేషమేమియు లేకున్నను ఇందొక చమత్కారమున్నది. అదేమన దశరథునకు వాడిన విశేషణము లన్నింటిలో క్రమముగా నొకటినుండి పదివఱకు గల సంఖ్యలను దెలుపు పదములను వాడుట.

### అలంకారములు

మల్లికార్జునుడు వివిధ - అర్థాలంకారములను తన రచనమున వాడి యున్నను శబ్దాలంకారములపై తక్కిన భా. రా. కర్తలకంటె నెక్కువ మక్కువ చూపినాడు. ఆయా వ్యక్తులను లేదా వస్తువులను వర్ణించు సందర్భములందు ప్రచురముగ ప్రయుక్తములైన ఈ శబ్దాలంకారములు రసపోషకములై ఔచితీ శోభితములుగ నున్నవి. మల్లికార్జునుని రచనమగు బాల, కిష్కింధా, సుందర కాండములందలి కొన్ని శబ్దాలంకారములు దిగువ నుదాహరింపబడుచున్నవి.

అంత్యానుప్రాస :

తాటకావర్ణనము.
"పాటితదుష్టసత్త్వవనవాటక, నిర్ధబలావరుద్ధ శృం
గాటక, గ్రంథిల భ్రుకుటి గాఢలలాటకఁ గ్రూర తారకా
నాటక నాంత్రకాంచిపరిణద్ధశవప్రపతత్రిక్కిమిచ్చటా
కీటక, రక్తసిక్తపటు ఖేటకఁ దాటకఁగాంచిరయ్యెడన్" (I-261)

పై పద్యమున 'టక' యను పరుషాక్షరద్వయమేడు పర్యాయములావృత్తమై తాటక పారుష్యగుణమును చక్కగ వ్యజింపజేయుచున్నది. ఈ పద్యము పోతన కనుసరణీయమగుట విశేషము. ఈతని రచనమునందలి మఱికొన్ని యంత్యాను ప్రాసముగల పద్యములు.

బాలకాండము :

స్వామిహితశక్తిమంతులు I-35
పదములు చారుపద్మములు I-40
అంగనలేగుదెంచి ముదమారగ I-92
ధరణీశుంగన గాధిపుత్రుడు I-176
బాలుఁడశక్తుఁడీతఁడను I-187
అతులోత్సాహధురీణులై I-221
ఘను లా రాజన్యసూనుల్ I-357
అరుదేరంబొడగాంచిరాతత I-749

కిష్కింధాకాండము :

ఆగతహర్షభాగులు నిరంతర IV-592

సుందరకాండము :

రవిరోచిష్ణుఁడు భూసహిష్ణుఁడు V-288
కనియెంగీశేశఁడంతన్ V-513

వృత్త్యనుప్రాసము

'మణిఘృణి గణయుత రశనా
ఝణఝణిత గణితరణిత చరణాంచిత భూ
షణ ఘోషణ రణనవిచ
క్షణ కంకణ కింకిణీక ఝుంకృతులారన్' (I-91)

వారస్త్రీలు ఋశ్యశృంగుని మోహితుని గావించి తీసికొని పోవుటకు వచ్చిన విధము ఈ పద్యమున వర్ణింపబడినది. ఇందలి 'ణ' కారపునఃపునరావృత్తి యా వారస్త్రీల మనోహరకంకణనాదమును వ్యంజింపజేయుచు వారి యాగమనమునందలి సొగసును వ్యక్తముచేయుచున్నది. ఇట్టి వృత్త్యనుప్రాసము లెన్నియో మల్లికార్జునుని రచనమున ప్రయుక్తములు. వృత్త్యను ప్రాసముతో పదముల నేకధాటిగ నిబంధించినంతమాత్రమున శాబ్దికచమత్కృతి సార్థకము కాజాలదు. అది రసానుకూలముగ నున్నపుడే కావ్యశోభాకరమగును. 'రసవిష

యక వ్యాపారవర్తీ వర్ణరచనావృత్తిః, తదనుగతత్వేన ప్రకర్షేణ న్యసనాత్ వృత్త్యనుప్రాసః" అను వృత్త్యనుప్రాసశబ్దవ్యుత్పత్తియే యీ విషయమును సూచించుచున్నది. మల్లికార్జునుని రచనమున కన్పట్టు వృత్త్యనుప్రాసములన్నియు ఈ గుణముతో విరాజిల్లునట్టివే. వానిలో కొన్ని దిగువ పేర్కొనబడుచున్నవి.

1. అంత గడంక రాముఁడు సమగ్ర I-258
2. సురుచిర సరిదురు I-355
3. అక్షౌహిణి రథసేనాధ్యక్షుండక్షీణ I-566
4. చండభుజాదండోద్ధుర I-582
5. కడుబెగడు గుడిచె భువనములుడుగక I-677

రసపోషణము :- మల్లికార్జునుడు రసపోషణ విషయమున మిక్కిలి జాగరూకత వహించినాడనుటలో సందేహము లేదు. ఆయా సందర్భముల కనుగుణముగ వివిధరసములు వర్ణింపబడినవి ఋశ్యశృంగుని చరిత్రమున హాస్యరసముతోపాటు ముగ్ధశృంగారమును వర్ణించినతీరు ప్రశంసింపదగినది. మూలమున 33 శ్లోకములలో వర్ణింపబడిన యీ వృత్తాంతమనువాదమున 32 పద్యములలో వర్ణితమైనది. ఋశ్యశృంగుడు తన యాశ్రమమునకు వచ్చిన వారకాంతలను చూచినాడు. జన్మతః స్త్రీపురుషవిభేదమును సైతమెఱుగనివాడు కావున వారిని వింత తపస్వులుగ భావించి వారికాతిథ్యమిచ్చి పిమ్మట వారి యాతిథ్యమును తాను గ్రహించినాడు. ఇట్లు వారితో కొంత పరిచయమేర్పడిన పిదప ఆ వనితల వస్త్రాదులనుగూర్చి యామాయితతో ప్రశ్నించును. ఈ సందర్భమును మల్లికార్జునుడు వర్ణించిన తీరును గమనింపుడు.

వెలయగ వచ్చినారలిట వింత తపస్వులు మీరు మాననీ
యులు మిముఁబూజసేసి సుకృతోన్నతిఁబొందెదనంచు నిష్ఠతోఁ
దలకొని యర్ఘ్యపాద్యములు దర్భలు నాదట నిచ్చి యోలిమై
ఫలములు కందమూలములు భక్తినిడంగొని వారు నవ్వుచున్ (I-80)

అమృతరుచులారఁ బాకము
లమరించిన మోదకంబులాదిగ బహుభ

క్ష్యములోగినిచ్చిన నానం
దముతో నందుకొని నమలి తనిసినమదితోన్ (I-81)

ఈపగిదిఫలములెన్నఁడు
నేపొలములఁదరులఁగానమెందులవివి యీ
తీపులు నిట్టి విచిత్రపు
రూపులు నీ ఫలములింత రుచ్యములగునే (1-82)

అని పలుకుచు నమ్మగువలు వీనులు సొగియింపంబాడ నగ్గానంబు విని యెలమిని.

ఈ మధురస్వరవేదం
బేమెన్నఁడు వినము మీకు నే ముని సెప్పెన్
వేమఱు మీతోఁజదివెద
నో మునివరులార చెప్పఁ డొప్పుగ నాకున్ (1-84)

అని పలికి మఱియు నమ్ముని
తనముందట నిలిచియున్న తరుణుల వృత్త
స్తనములు హారంబులు చం
దనచర్చలుఁ బోలఁజూచి తగనిట్లనియెన్ (1-85)

నాకుఁబోలెఁ గావు మీకురంబున రెండు
వలుదగుజ్జుకొమ్మలలరుచున్న
వలఁతితులసిపూస లతిసితములు మేనఁ
దనర నలదినారు తావిభూతి (1-86)

ఈకట్టిన వల్కలములు
మీకెంతయు లెస్సలిఁత మృదువులు గలవే
యే కుజముల నారలొ యివి
మాకును నివి యొసఁగవలయు మానుగ మీరల్ (1-87)

పై పద్యములలో తొలి రెండుపద్యముల భావము కొంతవఱకు మూలమున నున్నను తక్కినపద్యములన్నియు మల్లికార్జునుని స్వోపజ్ఞములే. వారకాంతలు తనకిచ్చిన మోదకములను ఫలములుగను, వారి గానమును మధురస్వరవేదముగను, హారములను తులసిపూసలుగను, పట్టువస్త్రములను వల్కలములుగను, భావించిన యా మునితీరు నిజముగ హాస్యము కల్పించకమానదు. మూలమున లేని ఈ వివరణమంతయు అనువాదమున కల్పించుట రసపోషణమునకే యనుటలో సందేహము లేదు.

ఇట్లే సుం. కాం. న హనుమదాదులు మధువనమున ప్రవేశించి కావించిన వివిధమర్కటచేష్టలను మల్లికార్జునుడు స్వభావోక్త్యలంకారములతో హాస్యరసస్ఫోరకముగ వర్ణించినాడు. ఈ సందర్భమునందలి ఒక్కపద్యము మాత్రమిట నుదాహరింపబడుచున్నది.

ఒక్కని వీఁపుపైకుఱికి యొక్కరుడుండగ వాని మూపుపై
నొక్కరుడెక్క వానితలనొక్కరుడెక్కగ నోలి దొంతులై
దిక్కులనాడగా నొకడు తీవ్రత వారలఁగూలఁదన్నగా
నొక్కడు వాని మూపులు మహోన్నతినెక్కుచుఁజీరుచుండఁగన్ (V-541)

శృంగారము :

మేనకావిశ్వామిత్రుల ప్రేమఘట్టమున మల్లికార్జునునిచే శృంగారమెంతేని సముచితముగ పోషింపబడినది. శతానందుడు విశ్వామిత్రునియెదుట రామలక్ష్మణులకాతని వృత్తాంతమును తెలుపుచు ఆతడు మేనకతో సలిపిన శృంగారమును వాల్మీకి పదిశ్లోకములలో వర్ణింపగా మల్లికార్జునుడీఘట్టమును రెండు పద్యములలో క్లుప్తముగావించి రసపోషణమున ఔచిత్యమును సాధించినాడు. అంతేకాక మూలమున మేనక పుష్కరములందు స్నానము చేయుచుండగా విశ్వామిత్రుడు చూచి ముగ్ధుడైనట్లుగ వర్ణింపబడినది. కాని యనువాదమున అట్లు కాక విశ్వామిత్రుడు తపమాచరించుప్రదేశమున ఆమె తిరుగాడుచుండగా అతని కంటబడినట్లుగ మార్చబడినది.

విశ్వామిత్రుడు మోహాంధుడగుటకు కారణభూతమైన ఆమె సౌందర్యము మూలమున ఒక్క విశేషణముసమాత్రమే వర్ణింపబడగా అనువాదమున నామె రూపసౌందర్యమును మల్లికార్జునుడు పెక్కు విశేషణములచే వర్ణించి విశ్వామిత్రుడు మోహాంధుడగుటకు తగిన భూమికను కల్పించినాడు. ఆ పద్యమును పరిశీలింపుడు.

'కరికుంభ స్తన భారమున్నత తటిత్కల్ప ప్రియాకారమున్
హరినీలోపల వేణియుం బ్రథితదివ్యశ్రోణియుం బద్మ భా
స్వరరూపాస్య వికాసమున్ శరదుదంచచ్చంద్రికా హాసముం
బరగన్ మేనక వచ్చి యచ్చట చరింపంజూచి మోహాంధుడై (1-661)

ఇట్లే తారావిలాపఘట్టమున కరుణరసమును, వాలిసుగ్రీవుల యుద్ధ సందర్భమున వీరరసమును చక్కగా పోషింపబడినవని చెప్పవచ్చును. భా. రా. కర్తలలో హుళక్కి భాస్కరుని రచనము తరువాత మల్లికార్జునభట్టు కవిత్వమే శ్రేష్ఠమని విమర్శకుల యభిప్రాయము.

## రుద్రదేవుడు

ఈతడు భా. రా.న అయోధ్యాకాండమును రచించినట్లుగ ము. ప్ర.ల యందలి ఈ కింది యయోధ్యాకాండాంతగద్యమునుబట్టి తెలియుచున్నది.

"ఇది సకలకళావిశారద, శారదా ముఖముకురాయమాణ సారస్వత భట్టబాణ నిశ్శంక వీరమారయకుమార కుమారరుద్రదేవ ప్రణీతంబైన శ్రీరామాయణ మహాకావ్యంబునందయోధ్యాకాండంబు నేకాశ్వాసము."

పై గద్యమున అయో.కాం. కర్త కుమారరుద్రదేవుడని పేర్కొనబడినది. కాని యీతని పేరు కుమారరుద్రదేవుడా లేక రుద్రదేవుడా యను విషయమాలోచింపవలసియున్నది. సాహిత్య చరిత్రకారులందఱును ఈతనిని కుమారరుద్రదేవుడనియే వ్యవహరించినారు. లోకమునను ఇట్టి వాడుకయే కలదు. కాని తా. ప్ర. లలో "......వీరమారయకుమార రుద్రదేవ ప్రణీతంబైన.... ..." అనియే కలదు. కావున ఈతని పేరు రుద్రదేవుడని భావించుటయే ఉచితము. ఈతడు కుమారరుద్రదేవుడే యగుచో తా. ప్ర.ల యందలి గద్యములలో కుమార పద

మింకొకటి యధికముగా నుండవలెను కదా! మదరాసు, తిరుపతి, తంజావూరు మున్నగు స్థలములలో లభ్యములగు భా.రా. తాళపత్ర ప్రతులలో నెందును రెండవ కుమారపదము కానరాదు. గద్యమున కన్పట్టుచున్న కుమార పదము రుద్రదేవ శబ్దముతో కాక వీరమారయ శబ్దముతో నన్వయించుటచే ఈతని పేరు రుద్రదేవుడనియే తేలుచున్నది. కావున ఇకముందీతడు రుద్రదేవుడను పేరుతోనే పేర్కొనబడును. ఈతడు భాస్కరుని శిష్యుడని యొక ప్రతీతి యున్నది. కాని పెక్కు తా.ప్ర. లలో అయో. కాం. గద్యమున ఈ విషయము పేర్కొనబడక పోవుటచే దీనిని సత్యమని చెప్పజాలము.

బాలకాండాంత గద్యమువలెనే అయోధ్యాకాండాంత గద్యమును తా.ప్ర.లలో ఒక్కరీతిగా కాక వివిధరీతులలో కన్పట్టుచున్నది. ఆ గద్యభేదములన్నియు 'పాఠభేదముల'ను ప్రకరణమున చూపబడినవి. ప్రతుల లేఖకుల యనవధానము వలన కొన్ని గద్యములలో రుద్రదేవునితోపాటు మల్లికార్జునకును, మఱికొన్నింటిలో భాస్కరునకును అయో.కాం. కర్తృత్వమాపాదింపబడినది. అంతేకాక వీరి విశేషణములును గద్యలలో యథేచ్ఛముగ వ్యత్యస్తము గావింపబడినవనియు తెలియుచున్నది.

ము.ప్ర. లయందు కానవచ్చు 'నిశ్శంక వీరమారయకుమార' యను పదములోని 'శ్శంకవీర' యను నక్షరములు కొన్ని తా. ప్ర. లలో కానరాక 'సారస్వత భట్ట బాణని మారయకుమార' యను రీతిగా ఉన్నది. ఇందలి 'ని' యను దానికర్థము లేదు. లేఖకులు 'శ్శంకవీర' యను నక్షరములను పొరపాటున విడిచిపెట్టిరో లేక కొన్ని ప్రతులలో 'ని' యనునక్షరము పొరపాటున వ్రాసియున్నచో నది యర్థశూన్యమగునని 'శ్శంకవీర' యను నక్షరములను చేర్చియుందురో చెప్పజాలమని చాగంటి శేషయ్యగారభిప్రాయపడినారు.[10] 'నిశ్శంకవీర' యనునదే సరియైన పాఠమగుచో అది రుద్రదేవుని యింటిపేరా లేక బిరుదనామమా యను విషయమాలోచింపవలసి యున్నది. 'తెలంగాణా శాసనములు' మొదటి సంపుటిలోని కాకతీయ శాసనములలో ౩౫ వ నెంబరు శాసనమున 'నీ నిశ్శంకవీరశబ్దము' గానవచ్చుచున్నది. ఆ శాసన పంక్తులు దిగువ నుదాహరింపబడు చున్నవి.

'స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర అనుమకొండ పురవరాధీశ్వర చలమర్తిగండ మూరురాయ జగద్ధళనామాది సమస్త ప్రశస్తిసహిత...

శ్రీకాకతీయకుమార రుద్రదేవ మహారాజులు పృథివీరాజ్యంబు సేయుచుండగా దత్పాద పద్మోపజీవి రాయస్థాపనాచార్య నిశ్శంకవీరయశకా (యశస్క కాబోలు) జక్కన నాయంకుల కొడుకులు ఇంమడి మల్లికార్జున నాయకులు స్వస్తిశ్రీ శక వర్షంబులు 1213 అవు వికృతి సంవత్సర జ్యేష్ఠశుద్ధ ౨ మంగళవారమునాండు కుమారరుద్రదేవ మహారాజులకు బుణ్యముగా పానుముగంటిని ఛాయా సోమనాథ దేవరకు అంగరంగ భోగార్త(ర్థ)మై ఉదయాదిత్యసముద్రము వెనుకను ఇచ్చిన వృత్తి, నీరు, నేల...."

ఇందు కుమార రుద్రదేవునకు పుణ్యమునకుగాను నిశ్శంక జక్కన నాయకుల కుమారుడగు ఇమ్మడి మల్లికార్జున నాయకుడు ఛాయాసోమేశ్వరుని యంగ రంగ భోగార్థము కావించిన దాన విషయము చెప్పబడినది. ఈ శాసనమును బట్టి 'నిశ్శంకవీర' యనునది గృహనామముకాక బిరుదమే కావచ్చునని యూహింప వీలు కలుగు చున్నది. 'నిశ్శంకవీరయశస్క' యనుదానికి నిశ్శంక వీరుడను యశస్సుగలవాడని యర్థము చెప్పుట యుక్తము కదా! నిశ్శంక యనునది గృహ నామమైనచో అది జక్కనకు అవ్యవహిత పూర్వముగ ప్రయోగింప బడవలసి యుండును.

చాగంటి శేషయ్యగారు రుద్రదేవుని గద్యలోనున్న 'నిశ్శంకవీర' శబ్దము బిరుదము గాదనియు, నిశ్శంక యనునది గృహనామనియు, వీరశబ్దము రుద్ర దేవుని పితామహుని నామమును తెలుపుచున్నదనియు, కావున రుద్రదేవుడు నిశ్శంక వీరయ్యగారి కుమారుడైన మారయ్య కుమారుడనియు తలంచుట కవకాశమున్న దని ఆం. క. త. లో వ్రాసినారు.[11] కాని 'నిశ్శంక' గృహనామమై నిశ్శంక వీరయ రుద్రదేవునకు పితామహుడైనచో గద్యము 'నిశ్శంక వీరయమారయ కుమార' యను రీతిగ నుండవలయును కదా! లేక వీరయను వీరపదముతో చెప్పినపుడు మారయనుకూడ 'మార' యను శబ్దముతో 'నిశ్శంక వీరమార కుమార' యనురీతిగ చెప్పియుండును.

రుద్రదేవుడు తాను రచించిన అయో. కాం. భాగమును సాహిణి మారన కంకితముగావించినట్లుగ ఆ కాండాది పద్యమువలన తెలియుచున్నది. ఈ కవి సాహిణిమారని కుమారుడే యని కొందరును, కాదని మఱికొందరును అభిప్రాయ

పడుచున్నారు.[12] అయో. కాం. సాహిణిమారనకు కృతియీయబడుటయు, గద్యలో మార యని యుండుటయు ఈతడు సాహిణిమారని కుమారుడని తలంచుటకు కారణములై యుండును.

చిలుకూరి వీరభద్రరావుగారు తమ 'ఆంధ్రుల చరిత్ర'మను గ్రంథమున రుద్రదేవునకు గద్యమున వాడబడిన కళావిశారదేత్యాది విశేషణములవలన విద్యావంతుడుగ తెలియవచ్చు రుద్రదేవుడు తనకు కుమారుడే యైనచో సాహిణిమారడీ రామాయణమునంతయు నతనిచే వ్రాయించియుండును గదా యని తెలుపుచు నీ కవి సాహిణిమారని కుమారుడు కాడనియే సూచించినారు[13]. గద్యమందు మారయకు వాడబడిన నిశ్శంక వీర బిరుదము సాహిణిమారనకున్నట్లుగ కానరాదు. ఈ యిద్దరు మారనలొక్కరేయైనచో రుద్రదేవుడు కాండాది పద్యమున వాడిన సాహిణి శబ్దమును గద్యలోగూడ వాడియుండెడివాడు అప్పుడు గద్యము 'నిశ్శంక వీర సాహిణిమారయకుమార' యను రీతిగ ఉండవలసియుండును. రుద్రదేవుడు తన తండ్రికే యంకితమిచ్చిన పక్షమున ఆ విషయమును వాచ్యముగ కాండాద్యంత పద్యములలోనో, గద్యముననో చెప్పియుండును కదా! మఱియు ప్రభుత్వాధికారమందున్న సాహిణిమారయకుగల అధికార సూచక విశేషణములను కొన్నింటినైన గద్యములో వాడియుండెడివాడు. ఈ కారణములచే రుద్రదేవుడు సాహిణిమారని కుమారుడు కాడనియే తెలియుచున్నది.

కాని ఈతడు సాహిణిమారని కుమారుడే యని చాగంటి శేషయ్యగారి యభిప్రాయము. గద్యమందలి 'నిశ్శంకవీర' యను బిరుదు రుద్రదేవునిదనియు, సాహిణిమారయ తన ప్రభువగు రుద్రదేవుని పేరును తన కుమారునకు పెట్టెననియు, ఇట్లు ప్రభుభక్తి పరాయణులు తమ ప్రభువుల పేర్లను తమ సంతానమునకు పెట్టుకొనుట యాచారమనియు కావున రుద్రదేవుడు సాహిణిమారని పుత్రుడనుటలో అభ్యంతరము లేదనియు వారి వాదసారాంశము.

గుంటూరు మండలమందలి సత్తెనపల్లి తాలూకా కోటనెమలిపురిలోని మూలస్థానేశ్వరస్వామి యాలయమున నొకరాతిపలకపై ఒక శాసనమున్నది. ఈ శాసనకాలము శా.శ. 1233 విరోధికృత్ సంవత్సర పుష్య శు॥ ౧౩ గురువారము. దానకర్త మారయసాహిణి రుద్రదేవనింగారు. మారయసాహిణి

యన్నను, సాహిణిమారయ యన్నను నొక్కరే కావున నీ రుద్రదేవుడు సాహిణిమారని పుత్రుడని చెప్పవచ్చునని మఱొక ప్రమాణముతో శేషయ్యగారు తమ యభిప్రాయమును సమర్థించిరి.[14]

ఇది యిట్లుండగా సుప్రసిద్ధ విమర్శకులు, పండితులునైన అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు అయో. కాం. ను రచించిన రుద్రదేవుడు కాకతి చక్రవర్తియగు ద్వితీయప్రతాపరుద్రుడే యనియు, కృతిపతియగు సాహిణిమారయ ప్రతాపరుద్రుని జనకుడే యనియు నొక కొత్త వాదమును లేవదీసి యనేక హేతువులచే ఆ వాదమును స్థాపించుచు 'కుమారరుద్రదేవకవి'[15] యను గ్రంథమునే రచించిరి.

ఇక నీ రుద్రదేవుని కవితా విశేషములను తెలిసికొందము. ఈతడు తక్కిన భా. రా. కవుల కంటె మూలమును మిక్కిలి సంక్షిప్తము గావించినాడు. మూలమున అయో. కాం. న దాదాపు 4300 శ్లోకములుండగా అనువాదమున 468 (తా. ప్ర. లలో 327 మాత్రమే) పద్యములు మాత్రమే కలవు. కథను వేగముగ చెప్పుకొని పోవలయునను నుద్దేశమే యీ సంక్షేపమునకు కారణము. తక్కిన కాండములలో కనబడు కవితా శిల్పము అయో. కాం. న అంతగా కానరాదు. ఐనను అటనట కుమార రుద్రదేవుడు తన విశిష్టతను ప్రకటించుకొనక పోలేదు. ఈతని ఔచిత్య పోషణ దృష్టికి ఒక్క ఉదాహరణమును మాత్రము పరిశీలింతము.

కైక, మంథర దుర్బోధనలచే ప్రేరితయై రాముడరణ్యమునకు పోవువరకు 'కుడువను, కట్టను, ఏమియు బలుకను' అని ప్రతిన చేసి భూషణములు తీసివేసి కోపగృహమునకు పోవును. దశరథుడు కైక నిలయమునకు వెళ్ళి శయనాగారమున నామెను కానక అక్కడి దౌవారికులచే జరిగిన వృత్తాంతమును తెలిసికొనును. ఈ సందర్భమున మూలమున ఈ క్రింది శ్లోకము గలదు.

'స కామబలసంయుక్తో రత్యర్థీ మనుజాధిపః
అపశ్యన్ దయితాం భార్యాం పప్రచ్ఛ విషసాద చ'

(వా.రా. II-10, 7)

దశరథుడు కామాకృష్టుడై, రత్యర్థియై కైక గృహమునకు పోయినట్లుగ పై శ్లోకమున చెప్పబడినది. రుద్రదేవు డనువాదమున మూలమున గల కామబల సంయుక్తః, రత్యర్థీ యను విశేషణములను వదలినాడు. వృద్ధుడగు దశరథుని పై రీతిగ వర్ణించుట యుక్తముకాదని రుద్రదేవుడు భావించియుండును.

మల్లికార్జునునివలె రుద్రదేవునకును శబ్దాలంకారప్రయోగమున మక్కువ యున్నట్లు ఈ క్రింది పద్యమువలన తెలియుచున్నది.

**ప్రభాతవర్ణనము**

'అళికులమల్లనల్ల నవహల్లక మొల్లక కేసరోల్లస
ద్దళదరవిందమందిరవితానము జేర నగాధ దీర్ఘికా
జలజ నవీన గంధములఁ జల్లుచుఁ జల్లని గాడ్పులిమ్ములం
బొలయ గృహప్రదీపములఁ బోడిమి దూలఁ బ్రభాత మొప్పినన్' (II-87)

**చిత్రకూటవర్ణనము**

అటఁజని కాంచిరంత వసుధాధిపు లా రతిలోలకిన్నరీ
ఘటితగుహాకుటీకనకక్రమకవాటము సన్మణిప్రభా
హాటదురుశృంగజూటము సమావృతమాల్యవతీతరంగిణీ
తటతరువాటమున్ బహుళతాపసకూటముఁ జిత్రకూటమున్ (II-287)

రుద్రదేవుడు దీర్ఘ వర్ణనములు పరిత్యజించి అతిక్లుప్తముగ రచన కావించి నను కొన్ని చోట్ల వర్ణ్యాంశములను మూలముకంటె విపులముగనే వర్ణించినాడు. శ్రీరాము డరణ్యమునకు పోవుచు వల్కలములను ధరించిన ఘట్టము మూలమున నీ క్రింది ఒక్క శ్లోకమున వర్ణితమైనది.

"స చీరే పురుషవ్యాఘ్రః కైకేయ్యాః ప్రతిగృహ్య తే
సూక్ష్మవస్త్రమవక్షిప్య మునివస్త్రాణ్యవస్త హ" (II-37-7)

పై యనుష్టుప్ఛ్లోకమున వర్ణితమైన విషయమును రుద్రదేవు డీ క్రింది సీస పద్యమున నెంత విపులముగ వర్ణించినాడో చూడుడు.

"కస్తూరికాపుష్పగంధ బంధురవేణి
బంధమూడిచి జటాభారమూని
కోమలచారుదుకూలంబు లెడలించి
కర్కశవల్కలాంశుకము గట్టి
పరిలిప్తచందనపంకంబు పోఁజేసి
నిర్మల భసితంబు నిండనలది
మహనీయబహురత్నమండనంబులు వుచ్చి
లీలమై నక్షమాలికలు దాల్చి

రాజ జూటునోజ రమణీయతేజోవి
రాజమానమూర్తి రాజకీర్తి
రఘుకులాబ్ధి జనితరత్నంబు రాజన్య
చక్రవర్తి రామచంద్రుఁడొప్పె" (II-205)

శ్రీరాముడు తానంతకుముందు కట్టుకొన్న సూక్ష్మ వస్త్రములను పరిత్యజించి ముని వస్త్రములను ధరించినట్లుగ మాత్రమే మూలమున చెప్పబడినది. కాని అనువాదమున రుద్రదేవుడు వల్కలధారణముతోబాటు భసితాది ధారణమును గూడ వర్ణించుచు అడవికి పోవుచున్న శ్రీరాముని సంపూర్ణమూర్తి మత్త్వమును సాక్షాత్కరింపజేసినాడు.

రుద్రదేవుని శైలి మల్లికార్జునుని శైలివలె లలితములగు సంస్కృత పదములతో కూడి యుండును. ఐనను ఈతని కవితలో నట నట దీర్ఘసమాస రచనయు, అట నట అలతి యలతి దేశ్యపదములతో గూడిన రచనయు కనబడు చుండును. ఈ రెంటికి క్రమముగా ఉదాహరణ పద్యములు చూపబడుచున్నవి.

దళదంభోజపరాగరాగవిలసత్కల్లోలకేళీనట
త్కలహంసవ్రజచక్రసారసబకక్రౌంచ భ్రమద్భృంగ సం
కులనానారవశిక్షణద్బహుపరఃకూలానుకూలక్రియా
లలితాలోలసమీరకంపితలతాలాస్యంబు లీక్షించుచున్ (II-289)

నడువంజాలక యడుగులు
తడఁబడఁ బొగులుచును నోరుదడుపుచు నకటా
కడు దూలెననుచు విభుఁడెద
నెడ నీడల నిలిచి నిలిచి యిభనిభగమనన్ (II-278)

హుళక్కి భాస్కరుడు

భా. రా. రచనా క్రమమును బట్టి చూచినచో నీతడు మూడవవాడైనను కవితా శిల్పమున మాత్రము ప్రథముఁడని చెప్పవచ్చును. ఈతడు భా. రా. న అర. కాం. ను, యు. కాం. న 1139 పద్యములను వ్రాసినాడు. అర. కాం. హుళక్కి భాస్కరుని రచనము గాదనియు, నది మంత్రిభాస్కరుని రచనమనియు కొందరి యభిప్రాయము. కాని అర. కాం. గూడ నీతని రచనమే యని 'భా. రా. కర్తృత్వపరామర్శ' యను ప్రకరణమున నిరూపింపబడినది. కొన్ని తా.ప్ర. లలో 'హుళక్కి' యని కాక హళిక్కి. హళిక్కి యను రూపములు కానవచ్చుచున్నవి. హళక్కి లేక హళిక్కి యనునదితనికి బిరుదమై యుండవచ్చును. మేదేపల్లి వేంకటరమణాచార్యులు గారు తమ భా. రా. పీఠికలో నీతని యింటి పేరు మంగళ పల్లి వారని సూచించి ఆతని వంశీయుల వ్యవహారములో నున్న ఐతిహ్యమును పేర్కొని 'హళక్కి'యనునది బిరుదునామమే యని తెలిపియున్నారు. ఆ ఐతిహ్యమీ విధముగ నున్నది. మంగళపల్లి భాస్కర మహాకవి పోషకుడైన రాజు ఒకనాడు రత్నఖచితమైన బంగారుపళ్ళెరమున అమూల్యాభరణాదియుతమగు కర్పూర వీటికనిడి కవులందఱిలోను మిక్కిలి రసవంతముగ కవిత చెప్పగల కవీశ్వరునకు ఆ అమూల్యమైన తాంబూలము నొసగెదనని ప్రతిజ్ఞ చేసెనట. అప్పుడీ భాస్కరుడు రాజాస్థానమందలి కవులనందఱను తన రసవత్కవితచే జయించి యా తాంబూలమును గెల్చుకొనెనట. అప్పటినుండి భాస్కరునకును, ఆతని సంతతివారికిని 'హళక్కి' యను నుపపదమును కలిగినదట. కన్నడమున 'హళక్కి' యనగా తాంబూలమని యర్థము. ఇట్లు తెలుగువారు బిరుదములందును, గౌరవవాచకములగు నుపపదములందును కర్ణాటక, ద్రావిడ, సంస్కృత పదములను వాడుచుండుట యాచారమే. దీనిని బట్టి ఈతడు గొప్ప కీర్తిగలవాడని తెలియుచున్నది.

ఈతడు భా.రా.న బా.కాం. నుండి కాక మూడవకాండమగు అరణ్యకాండము నుండియే తన రచనము ప్రారంభించినాడు. గ్రంథ రచనాకాలమునకీతడు

వృద్ధుడుగానుండియో లేక దీనిని త్వరగా పూర్తిచేయవలయునను నభినివేశముచేతనో తొలి కాండములను మల్లికార్జునరుద్రదేవుల కప్పగించి తాను అర. కాం. నారంభించియుండును. ఈతని యు.కాం. రచనము సాంతము సాగక మధ్యలోనే ఆగిపోయినది. గ్రంథరచన పూర్తియగువఱకాతడు జీవించియుండలేదని భావింప నవకాశము కల్గుచున్నది. తన యాధ్వర్యవమున భా.రా. రచనము సాగినను దీనికి భాస్కరుడవతారిక రచింపక వదలివేయుటయు పైవిషయమును సమర్థించుచున్నది.

భాస్కరుడు తాను రచించిన అర.కాం. ను, యు.కాం. పూర్వభాగమును సాహిణిమారనకే అంకితముగావించినట్లుగ ఈ క్రింది కాండాది పద్యములవలన తెలియుచున్నది.

**అర. కాం.**

శ్రీహితనయవిలసితవా
ణీహితమృదువచన ధారుణీహితగుణ సం
దోహ త్రివిక్రమక్రమ
సాహస నగధైర్యసార! సాహిణిమారా! (1. ఆ.)

శ్రీరామాకుచయుగళీ
హారిద్రోల్లసితవక్షహరిచరణసరో
జారాధ్యుఁడు మారయధర
ణీరమణోత్తముఁడు సాహిణీతిలకమిలన్ (2. ఆ.)

**యు. కాం.**

శ్రీకరకరుణారుచిరవి
లోకనలీలావికాసలోలవిపశ్చి
ల్లోకవివేకకలా శి
క్షాకుశలా! మేరుధీర! సాహిణిమారా!

కొన్ని ప్రతులలో అర. కాం. ప్రథమాశ్వాసాదిపద్యము వేరుగ నున్నది. ఇందును సాహిణిమారుని సంబోధనమే కలదు. ఆ పద్యమీక్రిందివిధముగ నున్నది.

శ్రీరమ్యస్మితవదనప
యోరుహశుండాలగండయుగళితవిగళ
ద్ధారాళదానధారా
సారాప్లుతభువనహార! సాహిణిమారా![16]

ఈ పద్యముగల తా. ప్ర. లలో కనబడు విశేషమేమనగా ము.ప్ర. లలో అయో. కాం. చివరనున్న అత్ర్యనసూయల వృత్తాంతము వీనిలో అర. కాం. ప్రారంభమున కనబడుచున్నది. కాకతీయరాజుల చరిత్రమును తెలుపు సోమదేవ రాజీయమున "శాకల్యమల్లికార్జునభట్టు మొదలైన బ్రహ్మవిద్వాంసులు బంగరు పల్లకీలెక్కివచ్చువారు నూటయేబండ్రును, హుళక్కి భాస్కరుడు మొదలుగాగల సత్కవీశ్వరులిన్నూటయేబండ్రును, గుండభొట్లు, ప్రతాపభొట్లు మొదలగు వేద వేదాంగపారగులైన పురోహితులిన్నూటయిరువండ్రును, అశ్వంబులకధికారియైన సాహిణిమారనయు" అని చెప్పబడియుండుటచే ద్వితీయప్రతాపరుద్రుని యాస్థానమున హుళక్కి భాస్కరుడుండెననియు, అతడు సత్కవీశ్వరుడనియు, ప్రతాపరుద్రుని సమకాలమువాడనియు, ఆ ప్రతాపరుద్రుని కాలముననే సాహిణి మారయ యను అశ్వసేనాధిపతి యొకడుండెననియు తెలియుచున్నది. కావున హుళక్కి భాస్కరుడు తనకాశ్రయభూతుడగు ప్రతాపరుద్రుని అశ్వసేనాధిపతియగు సాహిణిమారయకంకితముగావించెననుట యుక్తముగనే యున్నది. కాని చాగంటి శేషయ్యగారు సాహిణి మారయను సంబోధించు యుద్ధకాండాది పద్యమును విలేఖకుల ప్రక్షేపముగ భావించి భాస్కరుడాకాండమును సాహిణిమారయకంకితము చేయలేదని అభిప్రాయపడిరి. ఒకే గ్రంథమునందలి వేర్వేరు భాగములను రచించిన తండ్రికుమారులలో నొకరు ప్రభువునకును, ఒకరు దేవునకును కృతి యిచ్చి వారు భిన్నాభిప్రాయులైరని సంశయాస్పదమగు నొక పద్యమునాధారము చేసికొని భావించుటకంటె ఆ పద్యమును త్యజించి భాస్కరుడు తన భాగమును సాహిణిమారనకంకితము చేయలేదనుటయే సమంజసమని తమ పై యభిప్రాయమును సమర్థించుకొనిరి. యుద్ధకాండాదిపద్యము ప్రక్షేపమని భావించుటకు పైన చూపిన హేతువు యుక్తముగ కన్పించుచున్నను ఆయా గ్రంథాలయములయందు ప్రస్తుతము లభ్యమగుచున్న భా.రా. తాళపత్ర ప్రతులయందన్నింటను సాహిణి మారని సంబోధనముగల పద్యమే కనబడుచుండుటచే అది ప్రక్షేపమని భావింప

వీలు లేదు. అది ప్రక్షేపమే యైనచో కొన్ని ప్రతులందైనను దీనికి భిన్నమగు పద్యము కానరావలయును కదా! అట్టి పద్యము తా.ప్ర.లలో కానరానందున దీనిని ప్రక్షేపమనుటయు, తత్కారణముగ భాస్కరుడు సాహిణిమారన కంకితము కావింపలేదనుటయు ఆలోచింపదగిన విషయములు.

ఇక తండ్రి కొడుకులలో ఒకరు సాహిణి మారనకును, మరొకరు పరమేశ్వరునకును అంకితమిచ్చుటచే వారు భిన్నాభిప్రాయులై యుండిరనుటను పరిశీలింతము. తండ్రియగు భాస్కరుడు సాహిణిమారయకు అంకితముచేయగా కుమారుడు మరొకప్రభువునకు అంకితము చేసిన పక్షముననే తండ్రికొడుకులు భిన్నాభిప్రాయులై యుండిరని తలచుటకవకాశమున్నది. కాని కుమారుడు భగవంతున కంకితము చేసినప్పుడిట్టి భేదాభిప్రాయమునకు తావుండదు కదా ! హుళక్కి భాస్కరుడు శైవుడగుటచే నాతని కుమారుడగు మల్లికార్జునుడు తన భాగమును శివునకంకితముచేయుటను భాస్కరుడాక్షేపించియుండడని యూహింపవచ్చును.

సాహిణిమారన ప్రేరణమువలననే భాస్కరాదులు రామాయణ రచనకు పూనుకొనినను కృతి పూర్తియగువఱకాతడు జీవించి యుండలేదని భావించిన పక్షమున ఆతని మరణానంతరము మల్లికార్జునుడు శివునకును, కుమారరుద్రదేవుడు సాహిణిమారనకును అంకితముచేసియుందురు. భాస్కరకవి గ్రంథరచన పూర్తియగువరకు జీవించియుండలేదనుట కాతని అసంపూర్ణ యు.కాం. రచనము సాక్ష్యమిచ్చుచున్నది. తమ గ్రంథరచనమున కాధ్వర్యవము వహించిన భాస్కరకవీశ్వరుడు లేకపోవుటచే మల్లికార్జునుడు, కుమార రుద్రదేవుడు క్రమముగా ఈశ్వరునకును, సాహిణిమారనకును అంకితమిచ్చియుందురు. ఆతరువాత లేఖకుల పొరపాట్లవలన కాండలన్నింట ఆరంభమున సాహిణిమారయను సంబోధించు పద్యములు చేరియుండవచ్చును. ఏమైనను దేశమునందలి భా. రా. తాళపత్రగ్రంథములనన్నింటిని పరిశీలించి వాటిలో ప్రక్షేపములేవియో, యథార్థగ్రంథభాగము లేవియో తేలినప్పుడుకాని ఈ గ్రంథమెవ్వరికంకితము గావింపబడినదను విషయము నిస్సంశయముగ తేలదు. అంతేకాక అప్పుడు భా.రా.నకు సంబంధించిన అనేక నూతన విషయములును తెలియవచ్చుటకవకాశమున్నది. కావున నీ గ్రంథమునకు పరిష్కృతముద్రణము రావలసిన యావశ్యకమెంతేనియు కలదు.

అది రానంతవఱకును అంకితవిషయమునను, కర్తృత్వవిషయమునకు కావించు సిద్ధాంతములు కొంతవఱకూహలే యగుటకవకాశమున్నది. కావున నీ విషయము నింతటితో వదలి హుళక్కి భాస్కరుని కవితావిశేషములను పరిశీలింతము.

రామాయణ కవులందరిలోను హుళక్కి భాస్కరుడు ప్రౌఢకవి యని విమర్శకుల యభిప్రాయము. ఈతని కవితలో పాత్రపోషణము, నాటకీయత, రసపోషణము మున్నగు కవితాగుణములు పరాకాష్ఠనందినవనుటలో అతిశయోక్తి లేదు. వర్ణనములందును ఆయన చూపిన ప్రతిభ ప్రశంసనీయము. ఆయా కవితా గుణములను భాస్కరుడు పోషించిన విధమును పరిశీలింతము.

**పాత్రచిత్రణము :** - సీతారాములు, లక్ష్మణుడును అగస్త్యాశ్రమము నుండి పంచవటికి పోవుచుండగా మార్గమధ్యమున వారికి జటాయువు కనబడును. ఈ సందర్భమున మూలముననిట్లు కలదు.

అథ పంచవటీం గచ్ఛన్నంతరా రఘునందనః
ఆససాద మహాకాయం గృధ్రం భీమపరాక్రమమ్

(వా. రా. III-14-1)

ఇందు జటాయుర్వర్ణనము మహాకాయమ్, భీమపరాక్రమమ్ అను రెండు విశేషణములలో మాత్రమే కలదు కాని యనువాదమున జటాయువు వర్ణింపబడిన తీరును పరిశీలింపుడు.

బలితంపు ఱెక్కలు గలిగిన మైనాక
కుధరంబు మీఱిన గొప్పమేను
గండభేరుండాదిఖగములఁ గబళించి
వ్రక్కలు గావించు వలుదముక్కు
ఉదయార్కబింబంబు నురుదీప్తిఁగప్పెడు
ఖరదృష్టిఁబెంపారు కన్నుఁగవయు
వజ్రాయుధంబు క్రొవ్వాడిమి మెచ్చని
ఖరనఖంబులనొప్పు చరణయుగముఁ

దనదు స త్త్వంబు దెలుపంగఁ దనరునట్టి
యమ్మహాఖగము నృపాలునంతఁజూచి
యేను మీ తండ్రిసఖుఁడ రాజేంద్రచంద్ర
యరుణపుత్రుండ నన్ను జటాయువండ్రు

(భా.రా III, 1-101-102)

మూలమందలి 'భీమపరాక్రమమ్' అను నొక్కపదమును భాస్కరుడుఁ సీసపద్యమున నింతగా వ్యాఖ్యానించినాడు. ఇందు జటాయుః పరాక్రమ ప్రదర్శనమునకు సాధనములగు నాతని మేను, ముక్కు, కన్నుగవ, చరణయుగము- వీనిని వర్ణించుటచే నాతని రూపము మన యెదుట సాక్షాత్కరించినట్లుగ నున్నది. అంతేకాక తరువాత నాతడు రావణునితో పోరాడు సందర్భమున చూపిన వీరత్వమునకు ఈ వర్ణనమెంతో పోషకముగ నున్నది.

జటాయువు తనను దశరథసఖునిగ తెలుపుకొనగా రామలక్ష్మణులాతని నెయ్యమును, వినయమును మఱియు భక్తిని మిక్కిలి ప్రశంసింతురు. అంత జటాయువు రామునితో ఇట్లు పలుకును.

వితతగిరీంద్రశృంగముల వేడుకఁజూడగఁగోరినప్పుడ
ద్భుతముగ మిమ్ము మోచికొనిపోయెద జానకి కాపువెట్టినన్
సతతము గాచియుండెద వెసంజని చేసెద నెంతదవ్వునం
దతిశయమైనయట్టి పనియైనను బొచ్చెముగాదు రాఘవా!

(భా.రా. III-1-104)

'జానకి కాపువెట్టినన్ సతతము గాచియుండెద'ననియు, ఎంత యతిశయమైన పనినైనను జేసెదననియు జటాయువు ప్రతిన చేయుటలో నెంతో యౌచిత్యమున్నది. రావణుడు సీతాదేవి నపహరించు సందర్భమున తానేకదా కాపుగానుండవలసి వచ్చినది! ఆ కాపులోనే తాను ప్రాణత్యాగము కూడ చేయవలసి వచ్చినది! భావికథార్థము ధ్వనితమగునట్లుగ జటాయువుచే ప్రతినచేయించి భాస్కరుడు జటాయువు పాత్రకెంతో వైశిష్ట్యమును కూర్చినాడు.

ఇట్లే శ్రీరాముని పాత్రను చిత్రించుటయందును భాస్కరుడు చూపిన నేర్పు విశిష్టమైనది. శ్రీరాముడు శరణాగత రక్షకుడు. ఈ విషయమున నాతనికి సాటి యెవ్వరును లేరు. రాక్షసుడును, తన శత్రువునకు సోదరుడును నగు విభీషణున కాశ్రయమిచ్చి యాతనికి లంకాధిపత్యమిప్పించుటలో నీ విషయము తెలియుచున్నది. విభీషణుడు శ్రీరాముని ఆశ్రయమును కోరి యాతనిని శరణుజొచ్చినపుడు లక్ష్మణుడు విరోధులతో సహవాసము వద్దని రామునకు విన్నవింపగా శ్రీరాముడు శరణాగత రక్షణ మహత్త్వమును తెలుపుటయేకాక శరణాగతుడైన రావణునైనను రక్షింతునని పలికి యాతనికభయమిచ్చుటయే కాక సముద్రోదకములు తెచ్చి లంకా రాజ్యమునకు విభీషణునభిషిక్తుని చేయుమని నియోగించును. ఈ సందర్భమున భా. రా. న గల ఈ క్రింది పద్యమును చూడుడు.

అనఘచరిత్ర మీకు శరణాగతరక్ష కులవ్రతంబు మీ
సునిశితబాణజాలముల చోఁకునకోర్వక వచ్చి తా దశా
ననుఁడభయంబు వేడికొనినందగవెట్లగు నన్న నవ్విభుం
డినసుతుఁజూచి "యట్లయిన నిచ్చెద వానికయోధ్య" నావుడున్ (VI-191)

"మీరు శరణాగత రక్షణమే కులవ్రతముగా గలవారు. మీ బాణధాటిని భరింపలేక రావణుడే మిమ్ము శరణువేడిన మీరేమి చేయుదురని" సుగ్రీవుడు శ్రీరాముని ప్రశ్నింపగా నాతడు 'ఇచ్చెద వానికయోధ్య'నని నిస్సంశయముగ సమాధానము చెప్పెను. సుగ్రీవ దాశరథుల యీ సంభాషణము వాల్మీకమున కానరాదు. అమూలకమగు నీ సన్నివేశమును కల్పించి హుళక్కి భాస్కరుడు శ్రీరాముని పాత్రమునకెంతో యుదాత్తతను కల్పించినాడు.

**నాటకీయత :**

రావణ సుగ్రీవులు యుద్ధము చేయుచు పరస్పరమధిక్షేపించుకొను ఘట్టమున గల యీ క్రింది పద్యమున నెంత నాటకీయత గలదో గమనింపుడు.

"వంచన రాముదేవిఁగొనివచ్చినయట్టులు గాదురోరి న
క్తంచర! నన్ను నాహవముఖంబున డాయుటలన్న నయ్యరే
క్రించ సహోదరున్ గరము గీడ్పడి మానవుచేతఁబొంచి యే
యించుట గాదులే నను జయించుట నీకు" నటంచు నవ్వినన్ (VI-485)

**వర్ణనలు :**

ఆలంకారికులు పేర్కొన్న అష్టాదశవర్ణనలలో నీ క్రింది వర్ణనములు భాస్కరుని రచనమున కనబడుచున్నవి.

(ఋశ్యమూక) పర్వతవర్ణనము **III.** 2-436.
(జటాయూరావణుల) యుద్ధవర్ణనము **III,** 2,119-148.
(లంకా) పురవర్ణనము **VI.** 459.
సముద్రవర్ణనము **VI,** 29; **VI,** 1105.
సూర్యోదయవర్ణనము **VI,** 277.
చంద్రోదయవర్ణనము **VI,** 33-38; **VI,** 274.
దౌత్యవర్ణనము **VI,** 501-515.
ప్రయాణవర్ణనము **VI,** 20-28.

**యుద్ధ వర్ణనములు :**

i) సుగ్రీవరావణుల మల్లయుద్ధము **VI,** 473-488.
ii) వానరరాక్షసుల మొదటి యుద్ధము **VI,** 522-540.
iii) ఇంద్రజిత్తు మాయాయుద్ధము **VI,** 545-565.
iv) ధూమ్రాక్షుని యుద్ధము **VI,** 637-650.
v) అకంపనుని యుద్ధము **VI,** 651-664.
vi) మహాకాయుని యుద్ధము **VI,** 665-722.
vil) ప్రహస్తుని యుద్ధము **VI,** 742-759.
viii) రావణవానరవీరుల యుద్ధము **VI,** 792-820.
ix) రావణహనూమంతుల యుద్ధము **VI,** 821-834.
x) రావణలక్ష్మణుల యుద్ధము **VI,** 835-845.
xi) రామరావణుల ప్రథమయుద్ధము **VI,** 846-854.
xii) కుంభకర్ణుని యుద్ధము **VI.** 911-964.
xiii) దేవాంతక నరాంతక మహాపార్శ్వాదుల యుద్ధము **VI,** 975-1020.
xiv) ఇంద్రజిత్తు రెండవయుద్ధము **VI,** 1069-1081.

పైవానిలో యుద్ధవర్ణనములు కొంత విపులముగనున్నను తక్కిన వర్ణనములు మిక్కిలి క్లుప్తములై ఎంతో ఔచిత్యశోభితములై యున్నవి. సేతునిర్మాణ సందర్భమునను. యుద్ధ సందర్భములందును కావింపబడిన సూర్యచంద్రోదయ వర్ణనములు మల్లికార్జునుని వర్ణనములవలె ఉత్ప్రేక్షాదులచే ప్రకృత కథా సంబద్ధములు కావించుటచేతను, సంక్షిప్తములుగ నుండుటచేతను ఎంతో సందర్భశుద్ధములుగ నున్నవి. ఈ క్రింది రెండు పద్యములను పరిశీలింపుడు.

చంద్రోదయము :

కంటికిఁ గూర్కు లేక దశకంఠునిచేఁబడు లోకమింక ని
ష్కంటకమయ్యె నా నుదధిఁగట్టగఁ దానటఁబంచె రాముఁడి
ట్లొంటక కాదు బెగ్గిలకుడో యని వేల్పులు సాటనెత్తు జే
గంట తెఱంగునంబొలిచెఁ గైరవబంధుఁడు బంధురద్యుతిన్ (VI-274)

సూర్యోదయము :

తమ్ములలోన నీవునొక తమ్ముడవంచు విరోధితమ్మునిం
దమ్ముని నిద్రనందనునిఁ దమ్మునిఁ జూచిన చూపు జూచెఁగ్రొ
త్తమ్ముల తమ్ములైన కనుదమ్ముల నవ్విభుమేలు సూచుచుం
దమ్ములఁ జూతునన్కరణిఁ దమ్ములవిందుదయాద్రిఁదోచినన్ (VI-277)

పై రెండు పద్యములందును భాస్కరుడుత్ప్రేక్షాలంకారముచే సూర్యోదయ చంద్రోదయములను ప్రకృతకథా సంబద్ధములుగ వర్ణించినాడు. ఇట్లే సూర్యాస్తమయము, తమోవ్యాప్తి మున్నగు వానిని వర్ణించునపుడును వానిని కథకన్వయించుట కన్పట్టును. ఈ క్రింది పద్యములను గమనించినచో నీ విషయము విదితమగును.

సూర్యాస్తమయము :

i) జానకి వియోగసాగరమగ్నుఁడై
రామచంద్రుఁడుండఁగా మనోజ్ఞ
భంగి నింకఁదగునె పద్మినీ భోగమ
న్నట్లు గ్రుంకె నర్కుఁడపరజలధి. (VI, 33)

ii) నా నగము పెటికి కట్టకు
వానరులంభోధిలోన వైవకయుండం
గా నుండెదఁ గాపను గతి
భానుండస్తాచలంబుపైకేగుటయున్ (vi-256)

iii) ఇరుదెసలవారు నితరే
తరజయకాంక్షలఁబెనంగఁ దన బింబము ప
ల్లెదరువులుగ విరియు నిక నని
యరుగుకరణిఁ దరణి గ్రుంకె నా సమయమునన్. (VI-529)

పద్యమున వ్యంగ్య పర్యవసాయియగు నొక పదమున్నంత మాత్రముననే కావ్యమునకెంతయో శోభ కలుగుచున్నది. ఇక పద్యమున పదములన్నియు వ్యంగ్యార్థస్ఫూర్తిని కలిగించిన పక్షమున ఆ పద్య శోభనుగూర్చి చెప్పవలయునా! భాస్కరుడు రసాది వ్యంజనము గావించు అనేక పదములను ఒకే పద్యమున నిబంధించి రచించుటలో దక్షుడనుట నాతని యీ క్రింది పద్యము వ్యక్తము చేయుచున్నది.

ఎఱిఁగి యెఱింగి మున్నతఁడె యెగ్గొనరింపడె దానికై కదా
చెఱఁగొని వచ్చితిన్ బిదప సీత వృథాకథలింకనేల ? పెం
పఱ బ్రదుకింత తీయనె ! ఖరాదుల చావున కేమి చింత ! నీ
మఱదలి బన్న మేపగిది మానిని ! యీగుదు ! సంధి చేసినన్ (VI-786)

మండోదరి నీతి వాక్యములకు రావణు డిచ్చిన ప్రత్యుత్తర మీ పద్యము. ఈ పద్యమున గల పదములన్నియు విశిష్టార్థ వ్యంజకములే. వేదాల తిరువేంగళా చార్యులుగారు ఈ పద్యమందలి పదముల వ్యంగ్యార్థములను దాదాపు ఎనిమిది పేజీ లలో తమ ఆంధ్రధ్వన్యాలోకమున చాలా వివరముగా వివరించియున్నారు.[17]

వసుచరిత్రకారుడన్నట్లుగ భాస్కరుడు భాస్కరుడై బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమును దీపింపజెసెననుట స్వభావోక్తి మాత్రమే.

అయ్యలార్యుడు :

హుళక్కి భాస్కరుడేకారణము చేతనో యు.కాం.ను పూర్తిగా కాక కొంత భాగమునే రచించెను. వానరులు లంకను కాల్చు ఘట్టమునగల "ఇంక బలీముఖుల్ బలసిరెక్కడి రావణుడు" (VI-1139) అను పద్యము హుళక్కి భాస్కరుని చివరిపద్యము. తా.ప్ర. లలో ఈ పద్యము తరువాత నీవిషయము లేఖకులచే సూచింపబడినది. తా.ప్ర.లయందలి లేఖకుల వాక్యము లీక్రిందివిధముగ నున్నవి.

1. "ఇందనుకా భాస్కరుని కవిత్వము - ఇటమీద వేద ( పెద కావచ్చు ) వేదగిరి నాయకుని గారు అయ్యలభట్ల గారి చేత చెప్పించిన యు. కాం. శేషము".[18]

2. "ఇందాకా భాస్కరుని కవిత్వము - ఇటమీద వేదగిరి నాయనిం గారు అయ్యలుభట్లగారిచేత చెప్పించిన యు.కాం. శేషము".[19]

3. "ఇంతనుండి వేదగిరి నాయనింగారు శాకల్యమల్లు భొట్లగారి మనుమడు అయ్యలభట్లచేత చెప్పించిన కవిత్వము".[20]

4. "ఇందాకాను భాస్కరదేవుని గారి కవిత్వము - ఈ మీద వేదగిరి నాయని గారు శాకల్యమల్లు భట్లగారి మనుమడు అయ్యలభట్ల గారి చేత చెప్పించిన యు.కాం. శేషము".[21]

5. "ఇక్కడ నుంచి అయ్యలభట్ల కవిత్వము".[22]

పై వాక్యములు భాస్కరుని రచనమున చివరి పద్యమును తెలుపుటయేకాక యు.కాం. శేషము నయ్యలార్యుడు రచించెనను విషయమును గూడ తెలియజేయు చున్నవి. యు.కాం. శేషము నయ్యలార్యుడు రచించెననుటకు ఈ క్రింది కాండాంత పద్యగద్యములును సాక్ష్యములుగ నున్నవి.

అమర హుళక్కి భాస్కరమహాకవి చెప్పగనున్న యుద్ధకాం
డముతరువాయి చెప్పెఁబ్రకటప్రతిభా (షణు) ఘనుఁడప్పలార్య స
త్తమ సుతుఁడయ్యలార్యుడు గృతస్థితి నార్యులు మెచ్చునట్లుగా
హిమకరతారకారవి మహీవలయస్థిరలక్ష్మి చేకుఱన్ (భా.రా. VI,2698)

"ఇది శ్రీశాకల్యమల్లకవి వీరనరసింహావరజాప్పలార్య నందనోభయ భాషా కవితావిశారద శారదా చరణకమల పరిచరణ మానసాయ్యలార్య విరచితంబైన శ్రీరామాయణ మహాకావ్యంబునందు యుద్ధకాండ శేషంబు సర్వంబు నేకాశ్వాసము".

(యుద్ధకాండాంత గద్యము)

అయ్యలార్యునకు సంబంధించిన వివరములను తెలిసికొనుటకు పై గద్య పద్యములును, భాస్కరుని రచనాంతమున నున్న విలేఖకుల వాక్యములును మాత్రమే ఆధారములై యున్నవి. వీనినిబట్టి అయ్యలార్యుని తండ్రి అప్పలార్యుడనియు, పెదతండ్రి వీరనరసింహుడనియు, పితామహుడు మల్లకవి యనియు తెలియుచున్నది. వీరేశలింగంగారు మాత్రము అయ్యలార్యునకు శాకల్యమల్లు పెదతండ్రియనియే భావించినారు.[23] కాని పెక్కు తా.ప్ర. లలో భాస్కరుని రచనాంతమున కన్పట్టు విలేఖకుల వాక్యములలో అయ్యలార్యుడు శాకల్యమల్లు మనుమడనియే స్పష్టముగ చెప్పబడుటచే వీరేశలింగంగారు భావించినరీతిగ శాకల్యమల్లు అయ్యలార్యుని పెదతండ్రియని తలచుట యుక్తముకాదు. ఈతడు ఉభయభాషాకవితావిశారదుడని యాశ్వాసాంత గద్యవలనను, ప్రకటప్రతిభా ఘనుడని యుద్ధకాండాంతపద్యమువలనను, పెదవేదగిరి నాయనింగారి ప్రేరణచే నీతడు యు.కాం. శేషమును రచించెనని విలేఖకుల వచనమువలనను తెలియుచున్నది. ఈతడు హుళక్కి భాస్కరుని మిత్రుడని వీరేశలింగంగారు కవిజీవితములలో వ్రాసినారు.[24] కొన్ని తా.ప్ర.లలో యు.కాం. గద్యమున నీతడు హుళక్కి భాస్కరుని మిత్రుడుగ పేర్కొనబడుటయే వారిట్లు వ్రాయుటకు కారణము. కాని పెక్కు తా.ప్ర.లలో అయ్యలార్యుని యు.కాం. శేషరచన ప్రారంభమున నీతడు పెదవేదగిరి నాయనింగారి. ప్రేరణచే తానీరచనకు పూనినట్లుగ చెప్పబడియున్నది కదా ! ఈ పెదవేదగిరి నాయనింగారు రేచర్లగోత్రుడైన పద్మనాయక వంశజుడు. సర్వజ్ఞసింగ నాయకుడును, ఈతడును అన్నదమ్ముల బిడ్డలు. సర్వజ్ఞసింగమ నాయకుని కాలము క్రీ.శ. 1370 ప్రాంతమగుటచే పెదవేదగిరి నాయనింగారును ఆకాలమునకు చెందినవారే యగుదురు. ఆతని ప్రేరణముచే రామాయణ శేషమును పూరించిన అయ్యలార్యుడును క్రీ.శ. 1370 ప్రాంతమునకు చెందినవాడనుట యుక్తము. అయ్యలార్యుడు భాస్కరుని మిత్రుడేయైనచో మల్లికార్జునాదుల సాహాయ్యముతో రామాయణ రచనకు పూనుకొనిన భాస్కరుడు 'ప్రకటప్రతిభా

ఘనుడైన అయ్యలార్యునకు గూడ తొలుతనే రామాయణమున ఒక కాండమిచ్చి యుండును గదా! అట్లుకాక ఈతని రచనమొక ఘట్టము నడిమి భాగమునుండి ప్రారంభమగుచుండుటచేత అయ్యలార్యుడు హుళక్కి భాస్కరుని మిత్రుడై యతని కాలముననే రామాయణమును రచించినాడనుట యుక్తము కాదు. ఆతనికి మిత్రుడేయైనచో నా విషయమును పద్యముననో, గద్యముననో స్పష్టముగ చెప్పి యుండెడివాడు.

ఇక నీతని రచనావిధానమును పరిశీలింతము. నన్నయ వదలిన అరణ్య పర్వ శేషమును పూరించిన ఎఱ్ఱన నన్నయశైలి తోచువిధముగ నెట్లు రచన కావించెనో అయ్యలార్యుడును అదేరీతిగ భాస్కరుడు ప్రచురముగ వాడునట్టి సామెతలను, జాతీయములను వాడుచు యు కాం. శేషమును పూరించినాడు. కనుకనే అయ్యలార్యుని రచనము భాస్కరుని రచనముతో చక్కగా అతికిపోయినది. కనుక యుద్ధకాండమంతయు ఏకకవిరచితముగనే కనబడుచున్నది.

ఆరుద్రగారు అయ్యలార్యుని కవిత్వమును గురించి వ్రాయుచు నతడటనట అనౌచిత్యపురచనకు పాల్పడినట్లుగ తెలిపినారు. రావణాసురుని సంహరించినందులకు శివుడు రాముని మెచ్చుకొను ఈ క్రిందిపద్యమును గమనింపుడు.

సురలకు గుండెతల్లడము, శూరుల డెందములోని కొఱ్ఱు, ఖే
చరతతికంటిలో నలుసు, సాధ్యుల కొంగున నున్న చిచ్చు, భూ
సురులకు నెల్లనాడు మెడఁజుట్టినపాము, మునీంద్రకోటిపై
బొరిఁబడనున్న యా పిడుగుఁబొల్పఱఁజేసితివీవు. రాఘవా (VI-2429)

రావణుడు భూసురులకు మెడజుట్టిన పాముట. నిరతము మెడలో పామును ధరించు నాగభూషణుడు తన యాభరణమును ఈవిధముగ కించపఱచుకొనుట యీ పద్యమందలి అనౌచిత్యము.

పాత్రపోషణవిషయమున అయ్యలభట్టు శ్రద్ధ చూపలేదని తెలుపుచు ఈ క్రింది పద్యములనుదాహరణములుగ చూపినారు.

ఇంతి వినుము పురుషుఁడెట్టివాడయినను
బరుని యింటనున్న పడఁతి మగుడఁ
బ్రాకృతుఁడపోలెఁ జేకొననేర్చునే
యింతకంటె నింద యెద్ది గలదు? (VI-2353)

ఘనతరసౌందర్యము గల
నినుఁజూచి దశాననుండు నిశ్చలమతియై
మనసిజరాగమునొందక
మనమున ధైర్యంబు గలిగి మసలునె చెపుమా !

భరతలక్ష్మణ శత్రుఘ్నతరణి సూను
వాలినందన దానవవరులలోన
నీ మనంబునకెవ్వడో నెఱిఁబ్రియుండు
వానిఁజేకొనుమిప్పుడు వనిత! యనిన (VI-2353-2355)

అగ్నిపరీక్షాఘట్టమునకు ముందు రాముడు సీతమ్మతో పలికిన పలుకులివి. రామునిచే ఇంత కఠినముగ చెప్పించుటలో నాతని యుదాత్తతకు న్యూనత యేర్పడినది.

ఆరుద్రగారు చూపిన అనౌచిత్యము లొకటి రెండు అయ్యలార్యుని రచన మున నున్నను ఈతడు మంచి ప్రౌఢకవి యనుటలో సందేహము లేదు. ఈతని రచనమున మూలమునకు వన్నె పెట్టిన దృష్టాంతములు పెక్కులు కలవు. ఒకటి రెండుదాహరణములు మాత్రము చూపబడుచున్నవి.

లక్ష్మణునిచే ఇంద్రజిత్తు వధింపబడును. రావణుని మంత్రులీవిషయమును విని యాతనికి విన్నవించుట మూలమున నిట్లున్నది.

"తతః పౌలస్త్యసచివాః శ్రుత్వా చేంద్రజితో వధమ్
ఆచచక్షురభిజ్ఞాయ దశగ్రీవాయ సత్వరాః
యుద్ధే హతో మహారాజ లక్ష్మణేన తవానుజః
విభీషణసహాయేన మిషతాం నో మహాద్యుతిః" (వా.రా. VI-92,2-3)

కాని యనువాదమున నీ విషయము తెలియజేయబడినవిధము చూడుడు.

హతశేషులైన యా దితిజులు లంకకుఁ
జని దశాననుఁ గాంచి సభయులగుచు
దనుజకులేంద్ర నీ తనయుండు రణమునఁ
బ్లవగకోటులనెల్ల బారిసమరి
మన లంకఁ గాల్చిన మారుతాత్మజు నొంచి
యవ్విభీషణు మేన నధికశస్త్ర
చయములు గీలించి చటులబలుండైన
సౌమిత్రితోడుతఁ జాలఁ బ్రొద్దు

సమరలీల సల్పి చండప్రతాపుఁడై
ఘోరభంగిఁ బేర్చి కొంతవడికిఁ
బ్రథితలక్ష్మణాస్త్ర పావకజ్వాలల
శలభవృత్తిఁ దాల్చెఁ బొలుపు దక్కి (VI-1391)

మూలమందువలె ఇంద్రజిద్వధమకస్మాత్తుగ కాక ఇందు క్రమముగా తెలియ జేయబడినది. ఇట్లు క్రమముగా నీ దుర్వార్తను తెలుపుటలో ఔచిత్య మున్నది.

మూలమున రావణవధ ఘట్టమున నీ క్రింది శ్లోకము కలదు.

"ధృతిప్రవాళః ప్రసహాగ్ర్యపుష్ప
స్తపోబలః శౌర్య నిబద్ధ మూలః
రణే మహాన్ రాక్షసరాజవృక్షః
సమ్మర్దితో రాఘవమారుతేన" (వా.రా. VI-109-9)

దీని కయ్యలార్యుని యనువాదపద్యము చూడుడు.

"సారస్కంధము శౌర్యమూలము విరాజద్బాహుశాఖంబు దు
ర్వారోదారధృతిప్రవాళమతిదీప్యత్కోపపుష్పంబుఁ బా
పారంభైకఫలంబునై పరఁగు దైత్యాధీశవృక్షంబు దా
నీ రూపంబున రామహస్తి విఱిచెన్ హేలాసముల్లాసియై (VI-2212)

రాఘవమారుతముచే రాక్షసరాజ వృక్షము మర్దింపబడినదను రూపకాలంకారముచే మూలమున రావణవధము వర్ణింపబడగా అనువాదమున రాముని మారుతముతోఁగాక హస్తితో రూపించినాడు. ఈ రూపకమెంతో ఉచితముగ నున్నది. గాలి వృక్షమును కూల్చుట సహజము కాని యందెట్టి మనోభావము కానరాదు. హస్తి కావించు వృక్ష మర్దనములో కారణ మున్నది. అట్లే రాముడు రావణుని మర్దించుటలోను కారణమున్నది కదా !

ఇట్లాతడు పలు చోట్ల ఔచిత్యమును పోషించుచు రసవంతముగ రచన కావించినాడని చెప్పవచ్చును.

తక్కిన భా.రా. కవులకంటె నీతడు వర్ణనము నందెక్కువ మక్కువ గలవాడనుట స్పష్టము. మూలమునందలి 2466 శ్లోకములను (వా.రా. యుద్ధకాండ 76వ సర్గము నుండి చివరి వరకు) 1515 పద్య గద్యములలో ననువదించుట యీ విషయమును తెలుపుచున్నది. అవాల్మీకమగు కాలనేమి కథా ఘట్టమును గ్రహించి దానినొక సుందరఖండకావ్యముగ నిర్మించినాడు. ఈతని శైలీ వైవిధ్యమును, కవితాశిల్పమును తెలిసికొనుటకు భిన్న భిన్న ఘట్టములనుండి కొన్ని పద్యములుదాహరింపబడుచున్నవి.

i. ఇంద్రజిత్తు చావునకు రావణుడు విలపించుట

హా జగదేకవీర! హా కులసాగర పూర్ణచంద్రమా
హా జితలోకపాలగణ హా భుజగేంద్రదలసన్మహాభుజా
హా జనితప్రభావయుత హా సమరార్ణవకర్ణధార నీ
తేజము విక్రమంబు ఘనధీరతయుందెగటాఱె నక్కటా! (VI-1395)

ii. సంగ్రామరంగ వర్ణనము

"...... అవిచ్ఛిన్న రుధిర ప్రవాహంబు తరంగిణియు, శర కుంతఖడ్గంబులు మీనంబులును, కళేబరంబులు మకరంబులును, శిరస్త్రాణంబులు కమఠంబులును, చుమురులైన భూషణమణిసమూహంబులిసుకయు, వికీర్ణంబులు హంసలును, విలోలంబులగు కేశసముదాయంబులు శైవాలంబును, మేదోమాంసమస్తిష్క పటలంబు కర్దమంబునుంగా నిట్లపూర్వంబును మహాదూరంబును నగు సంగ్రామరంగంబున (VI-1438)

iii. అగ్నిదేవుడు సీత మహత్త్వమును రామునకు చెప్పుట.

''మందారభూజంబు మరగిన భృంగికిఁ
బిచుమందశాఖిపైఁ బ్రేమ గలదె
లలి మానసంబున మెలగెడు హంసికి
వెలయఁ బల్వలములపై వేడ్క గలదె
మలయద్రుమంబున మలయు భుజంగికి
బర్బూరతరువుపై వలపు గలదె
భాస్కరోదయమున భాసిల్లు పద్మిని
కిందుకరస్పృష్టి నెలమి గలదె

రాజితానేకసద్గుణారామ రామ
కర్మపాలనపరమ నీ ధర్మపత్ని
యైన సాధ్వికి సీతకు నన్యునందుఁ
గూర్మి యే చందమున సమకూడునయ్య (VI-2415)

iv. ఖడ్గరోముడు వానరావళిని చెండాడుట.

వెస ఖండించు నదల్చుఁ ద్రుంచుఁ జఱచున్ ద్రేయున్ వడిం జీరు నీ
రసతో నొంచుఁ బరాభవించుఁ గలచున్ రౌద్రంబుతోఁ దాఁకు వె
క్కసపాటొందగ వ్రచ్చుఁ జించుఁ బొడుచుం గారించు మాలించు రూ
పుసెడం జేయు నలంచుఁ గ్రుచ్చుఁ జిదుముం బోనీక కీశావలిన్ (VI-1981)

v. శ్రీరాముడు ప్రయోగించిన యాగ్నేయాస్త్రవర్ణనము.

ఊష్మ వ్యాహతి దగ్ధపత్రసురరాజోద్యానధాత్రీజమై
గ్రీష్మోదంశుసహస్రరశ్మిశిత భూరిజ్యోతిరుత్సిక్తమై
భీష్మక్రాంతిదురంతధూమపటలీస్ఫీతాంతదిక్చక్రమై
శుష్మ ప్రాభవమొప్పె నెంతయును రక్షోనాథదర్పఘ్నమై (VI-2048)

ఇట్లయ్యలార్యుని రచనమున చక్కని కవితాశిల్పముగల పద్యములెన్నియో కలవు. కొన్నిమాత్రమే ఇట ఉదాహరింపబడినవి. ఈతని కవిత్వము ప్రౌఢమై, ధారాశోభితమైనదనుటలో ఎట్టి సందేహము లేదు.

సూచికలు :

1. ఆంధ్రకవులచరిత్ర.
2. కరాలపాటివారి ప్రతి.
2. (a) ఆంధ్రవాఙ్మయ చరిత్రసర్వస్వము; పే. 592-593.
3. ఆం. క. త. 3 సం॥ 211 పు.
4. భా. రా. (ఆనందాశ్రమగ్రంథమాల) పీఠిక. పు. 14.
5. ఆంధ్రకవుల చరిత్ర.
6. వా. రా. V-28 వ సర్గ.
7. భా. రా. V, 383-396.
8. సాహిత్యదర్పణము. 10-4.
9. వా. రా. 1, 63, 4-13.
10. ఆం. క. త. 3 సం॥ పు. 213-214.
11. ఆం. క. త. 3 సం॥ 215 పు.
12. ఆంధ్రుల చరిత్రము. 5 భా. 546 పు.
13. **Ibid.**
14. ఆం. క. త. 3 సం॥ పు. 218-222;
15. సాహిత్యసంసత్, (జనగామ) ప్రచురణ. 1959.
16. **T** 9333; **T** 527; ఉ. వి. ప్రతులు; **R** 2140, **D** 141/మద.ప్ర. **R** 262, **R** 263/తిరు. ప్రతులు; **T** 19-12 **APGOML** ప్రతి. 140/8; 107/14; 115/14; 181/14; 187/14 కాకి. ప్రతులు.
17. ఆంధ్రధ్వన్యాలోకము. పు. 401—408.
18. **R** 1563/మద.ప్ర. (పు. 238**b**).
19. **R** 2274/మద (పు. 235 **b**); 110/14 కాకి. ప్ర. (పు. 98 **a**)
20. **R** 2178/మద. ప్ర. (పు. 97 **a**)
21. **R** 2257/మద. ప్ర. (పు. 105 **b**)
22. 109/14. కాకి. ప్ర. (పు. 136 **a**)
23. ఆంధ్రకవి జీవితములు.
24. సమగ్ర ఆంధ్రసాహిత్యం. 3 సం. పుటలు 39-41

# భాస్కర రామాయణము అనువాద విధానము

అనువాదసందర్భమున మన ప్రాచీనతెనుగుకవులు ప్రధానముగ మూడు పద్ధతులనవలంబించిరని చెప్పవచ్చును. వానిలో మొదటిది కథానువాదపద్ధతి. ఇందు అనువక్త మూలమునందలి కథను గ్రహించి యందలి సన్నివేశములను విడువక తన యిచ్చవచ్చినరీతిగ వర్ణనాదులను, రసపోషణమును భావించుచు రచన సాగించును. ఈ పద్ధతిలో మూలమునకును, అనువాదమునకును కథా విషయమున మాత్రమే సాన్నిహిత్యము కన్పట్టును. రసభావ వర్ణనాదులలో నిందు మూలకర్త ఆత్మీయతాముద్రకంటె అనువాదకుని ముద్రయే అధికముగానుండును. కనుక ఇది అనువాదగ్రంథమైనను స్వతంత్రగ్రంథముగనే భాసించును. రెండవది భావానువాద పద్ధతి. ఇందు భాషాంతరీకర్త మూలమందలి కథతోపాటు భావములను కూడ అనువాదమున అనుసరించును. మూలకర్త వెలువరించిన భావములను సుందరమైనశైలిలో స్పష్టముగ వ్యక్తముచేయుటయందే అనువాదకుని నైపుణ్యము గోచరించును. ఈ పద్ధతిలో కథాఘట్టములుకాక, భావములు లేక వానిని వెలువరించు వివిధశ్లోకాదులు ప్రమాణముగ స్వీకరింపబడును. ఈపద్ధతి యతిస్వతంత్రమును, అతివిధేయమును కాని మధ్యస్థ పద్ధతిగా భావింపవచ్చును. మూడవది పదానువాద పద్ధతి. ఇందు మూలమునందలి కథాభావములతోపాటు పదములుగూడ ప్రమాణములుగ గ్రహింపబడి అనువదింపబడును. ఈపద్ధతియందు అనువాదమునకు స్వతంత్రత ఉండదు. ఆంధ్రవాఙ్మయమున వెలసిన అనువాదములు ఈ మూడు పద్ధతులకును చెందియున్నవి. కవిత్రయమువారి పద్ధతి కథానువాదమునకును, శ్రీనాథాదులది భావానువాదమునకును, ఆధునికనాటకానువాదకులది పదానువాదమునకును ఉదాహరణములుగ చెప్పవచ్చును.[1]

భారతానువాదమువలె భా రా. అనువాదము కథానువాదపద్ధతికి చెందినదని చెప్పవచ్చును. అంతమాత్రమున దీనిలో ఇతరపద్ధతులు లేవని చెప్పవీలులేదు. కథానువాదపద్ధతి ప్రధానముగను, ఇతరపద్ధతులానుషంగికములుగను ఉన్నవని

భావము. భా. రా. కర్తలు మూలమునందలి కథనుమాత్రము గ్రహించి భావ వర్ణనాదులలో కొంతమార్పు గావించియు, అమూలకములగు కథలను కొన్నింటిని చేర్చియు అనువాదమును సాగించినారు. భాస్కరరామాయణము వాల్మీకి రామాయణమునకనువాదమే యైనను రచనావిధానమున స్వతంత్ర గ్రంథముగ భాసించుటయేకాక తరువాత వెలసిన ప్రబంధరచనకు మార్గదర్శకమైనదని చెప్పవచ్చును.

వా. రా. పద్యసంఖ్యతో పోల్చిచూచినప్పుడు భా. రా. మిక్కిలి సంగ్ర హింపబడినట్లుగ కన్పట్టును. మూలమందలి అతిదీర్ఘములగు వర్ణనములను, సంభాషణములను క్లుప్తముగ చెప్పుటయే దీనికి కారణము. వా. రా. నందలి ఆయాకాండములు అనువాదమున ఏరీతిగ సంగ్రహింపబడినవో క్రిందిపట్టికవలన సులభముగ తెలియనగును.

| వా. రా. శ్లోకములు | | భా. రా. పద్యములు |
|---|---|---|
| బా. కాం. | 2269 | 789 |
| అయో. కాం. | 4269 | 468 |
| అర. కాం. | 2468 | 730 |
| కి. కాం. | 2449 | 829 |
| సుం. కాం. | 2846 | 536 |
| యు. కాం. (లంకాదాహమువఱకు) | 3442 | 1168 |
| యు. కాం. (లంకాదాహముతరువాత) | 2466 | 1515 |
| మొత్తము శ్లోకములు : | 20209 | మొత్తము పద్యములు 6031 [2] |

తా. ప్ర. లలో అయో. కాం. న 250 పద్యములును, అర. కాం. న 376 పద్యములును మాత్రమే కన్పట్టుటచే మొత్తము భా. రా. పద్యముల సంఖ్య దాదాపు 5460 గా భావింపవచ్చును.

మూలమునందలి శ్లోకములలో అటనట కొన్ని పెద్ద వృత్తములున్నను ఎక్కు-వగా అనుష్టుప్పులే. తెలుగులో సీసము మున్నగు పెద్ద పద్యములలో నొక్కొక్క-దానియందు రెండు మూడనుష్టుప్పుల భావము సంగ్రహింపబడుటకు వీలున్నది. కావున మూలమందలి శ్లోకములయు, అనువాదమునందలి పద్యములయు సంఖ్య నాధారముగగైకొని మూలానువాదముల పరిమాణములో న్యూనతాధికతలను నిర్ణయింప వీలుకాదు. ఐనను అనుష్టుప్పులకు సమానము లనదగు కందములు, గీతములు భా.రా. న సుమారు 2400 కలవు. కనుక మూలమునందలి రెండేసి శ్లోకములకొక్కొక్క పద్యము వ్రాయబడినదని తలచినచో ఇది మూలమునకు సగము సంగ్రహింపబడినట్లు చెప్పవచ్చును. భా.రా. కర్తలు ఏయే ఘట్టము లనేయే రీతులుగ సంక్షేపించినారో సోదాహరణముగ పరిశీలింతము.

A) బాలకాండము :- i) విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు కుశనాభుని కన్యకల వృత్తాంతమును తెలుపుచు 'చూళి' యను మునివరుని యనుగ్రహముచే సోమద బ్రహ్మదత్తుని పుత్రునిగ పడసిన విషయమును వివరించును. బ్రహ్మదత్తుని జన్మవృత్తాంతము మూలమున ఎనిమిది శ్లోకములలో వర్ణితమైనది.[3] మల్లికార్జునుడు దీనిని రెండు పద్యములలో సంగ్రహించినాడు.[4] కుశనాభుఁడు తన కూతులను బ్రహ్మదత్తునకిచ్చి పెండ్లిచేయుట యిట వర్ణ్యాంశము. ఇందు బ్రహ్మదత్తుని జన్మమును గూర్చి విపులముగ వర్ణించుట అనావశ్యకమగుటయే ఈ సంగ్రహమునకు కారణము కావచ్చును. వావిళ్ళ భా.రా. ప్రతి (1923) లో ఈ సందర్భమున నాలుగు పద్యములు కన్పట్టుచున్నను వీనిలో నొక తేటగీతియు, 'అని పలికి' యను గద్యమును ప్రక్షిప్తములే.[5]

అయోధ్యాకాండము : ii) దశరథుడు పుత్రవియోగ దుఃఖముచే మరణించును. అంత వసిష్ఠుడు కేకయ రాజ్యమునను్న భరతుని అయోధ్యకు తోడ్కొనిరమ్మని జయంతుడు మున్నగుమంత్రులను నియోగించును. వారనేక నగరములను, నదీనదములను దాటి గిరివ్రజమును చేరుదురు. వా. రా. న నీప్రయాణము 11 శ్లోకములలో వర్ణితమైనది.[6] అనువాదమున 'వారును నయోధ్యవెడలి యేడవరాత్రి నక్కేయరాజు నగరంబు సొచ్చిరి[7] అను చిన్న వాక్యమున నీ విషయము సంగ్రహముగ చెప్పబడినది. ఇట్లే భరతుడు కేకయ నగరమునుండి అయోధ్యకు తిరిగివచ్చుట మూలమున 17 శ్లోకములలో చెప్ప

బడగా[8] అనువాదమున 'శత్రుఘ్నసహితుడై కదలి సప్తరాత్రంబులకు పురంబున కేతెంచి' అని ఒక్కవాక్యమున[9] సంగ్రహింపబడినది.

iii) భరతుడు గిరివ్రజమునుండి తిరిగివచ్చి అయోధ్యా నగరమును ప్రవేశించునపుడాతనికనేక దుర్నిమిత్తములు కన్పట్టును. మూలమున నీ దుర్నిమిత్తముల వర్ణనము 24 శ్లోకములలో కలదు.[10] అనువాదమున ఈవర్ణనమంతయు 'ఇదియేమి రాజమార్గంబులమంగళావృతంబులై యున్నవి. నగరేల శూన్యంబై యున్నది, సంతోషంబులేల నీతేఅవు'' అను గద్యభాగమున సంగ్రహముగ చెప్పబడినది.

iv) దశరథుని మరణవార్త విన్న భరతుడు కౌసల్యాదేవి యడుగులపై బడి దుఃఖించుచుండును. అంత కౌసల్య

'ఇదం తే రాజ్యకామస్య రాజ్యం ప్రాప్తమకంటకమ్
సంప్రాప్తం బత కైకేయ్యా శీఘ్రం క్రూరేణ కర్మణా'
(వా. రా. II, 75,)[11]

ఇత్యాదిగా భరతునితో కఠినముగ పలుకును. కౌసల్య కావించిన యీ భర్త్సనము మూలమున ఆఱు శ్లోకములలో నున్నది.[12] కాని యనువాదమున

'భరత! మీ తల్లి పతిబంచెవట్టి నీకు
రాజ్యపట్టంబునకు వేఁడి రామునడవి
కనిచెఁదద్వియోగమున గతాసుఁడయ్యె
నృపుఁడు నీవింక నెమ్మది నేల యేలు"[13] అనిసంగ్రహముగ చెప్పబడినది.

ఇట్లు కైకేయి పల్కగా భరతుడు మిక్కిలి బాధపడి రామునకు తాను ద్రోహియైయైనచో తనకు మహాపాపము చుట్టుకొనునని శపథము గావించును. మూలమున ఈ శపథము 'యస్యార్యోఽనుమతే మతః' అను మకుటముగల 38 శ్లోకములలో వర్ణితమైనది.[14] అనువాదమున ఈ శపథప్రకారమంతయు ఒక్క సీసపద్యమున సంగ్రహింపబడినది.[15]

v) భరతుడు చిత్రకూటమునకు బయలు దేరుట, గంగాతీరముచేరి యట విడియుట మూలమున ఇరువదియైదు శ్లోకములలో విస్తృతముగ వర్ణింపబడినది.[16] రుద్రదేవుడీ విషయమునంతను

''మాతలు మూవురున్ సకలమంత్రులు బార్థివులుంబురోహిత
వ్రాతము నవ్వసిష్ఠమునివర్యుడు దమ్ముడుఁదోడ రా గజా
శ్వాతతసర్వసైన్యయుతుఁడై పురి వెల్వడి యేగుదెంచి గం
గాతటినీ తటిన్ విడియగా భరతుండను వార్త మోసినన్'' (II, 370)

అనునొక్కపద్యమున సంగ్రహించినాడు.

vi) చిత్రకూటముననున్న శ్రీరాముని తిరిగి అయోధ్యకు రమ్మని ప్రార్థించుటకు భరతుడు ససైన్యముగ బయలుదేరును. మార్గమధ్యమున నాతడు భరద్వాజమహర్షిని దర్శించును. మహర్షి భరతునకు చక్కని యాతిథ్యము నొసగును. అందలి యాకర్షణములకాతని సైనికులందరును వివశులై ''నైవాయోధ్యాం గమిష్యామో న గమిష్యామ దండకాన్[17] అను స్థితికి వత్తురు. ఈ సందర్భమున మూలమున భరద్వాజుడొసగిన విందు విశేషములతి విస్తృతముగా దాదాపు 72 శ్లోకములలో వివరింపబడినవి.[18] అనువాదమున నీవిషయమంతయు 'మునినాథుఁ డతనిఁ గాంచి తగిన విందులుసేయ'[19]నను నొక్క వాక్యమున క్లుప్తముగ జెప్పబడినది.

vii) చిత్రకూటముననున్న రాముని యొద్దకు భరతుడు వెడలినప్పుడు రాముడాతనిని కుశలప్రశ్నము గావించుట మూలమున మిక్కిలి వివరముగా కలదు. దాదాపు 70 శ్లోకములలోగల ఈ కుశలప్రశ్నము[20] అనువాదమున ఎంత క్లుప్తముగనున్నదో చూడుడు.

'జనకజకు సుమిత్రానం
దనునకుఁబ్రణమిల్లి సముచితస్థితి దర్భా
సనముననుండగ రఘుపతి
యనుజన్ములఁజూచి సేమమా రాజునకున్'
అనిన............ (II, 386-387)

viii) శ్రీరాముని పాదుకలు గ్రహించి భరతుడయోధ్యకు తిరిగి వచ్చుటయు, నగరమున ప్రవేశించుటయు మూలమున 2 సర్గలలో వర్ణింపబడినది.[21] కుమారరుద్రదేవుడీ విషయము నంతయు ఒక చిన్న గద్యమున క్లుప్తముగ తెలిపినాడు.[22]

ix) భరతుడు నందిగ్రామమునకు పోవుట, అట శ్రీరాముని పాదుకల నభిషేకించుట, పాదుకాముఖమున రాజ్యకార్యముల నిర్వహించుట అను విషయములు మూలమున 27 శ్లోకములలో వర్ణింపబడినవి.[23] వీని నన్నింటిని రుద్రదేవుడొక చిన్న గద్యమునను, ఒక పద్యమునను సంగ్రహించి తెలిపినాడు.

సమస్తమంత్రి జనానుమతంబున

'అఖిలనృపాలలోకమరుదంద నిజాన్వయకీర్తిచంద్రికల్
నిఖిలము గప్పి యొప్ప నయనిర్భరతన్ భరతుండు పాదుకా
ముఖమున రాజ్యభారము సముజ్జ్వలభంగి వెలుంగ భూప్రజా
సుఖముఁలొనర్చుచుండె గుణసుందరుఁడగ్రజుశాసనంబునన్'[24]

**అరణ్యకాండము :**

x) శ్రీరాముడు సీతాలక్ష్మణులతో అగస్త్యాశ్రమము చేరుకొనును. అంత లక్ష్మణుడగస్త్యశిష్యునితో

"రాజా దశరథో నామ జ్యేష్ఠస్తస్య సుతో బలీ
రామః ప్రాప్తో మునిం ద్రష్టుం భార్యయా సహ సీతయా
లక్ష్మణో నామ తస్యాహం భ్రాతా త్వవరజో హితః
అనుకూలశ్చ భక్తశ్చ యది తే శ్రోత్రమాగతః
తే వయం వనమత్యుగ్రం ప్రవిష్టాః పితృశాసనాత్
ద్రష్టుమిచ్ఛామహే సర్వే భగవంతం నివేద్యతామ్"

(వా. రా. III, 12, 2-4)

అని విన్నవించుకొనును. అనువాదమున ఈ విన్నపము 'నిజాగమనాభిధానంబులు జెప్పి మునీంద్రునకు విజ్ఞాపనముచేయుము'[25] అనునొక్క వాక్యమున సంగ్రహముగ చెప్పబడినది.

**xi**) దండకారణ్యమున శ్రీరాముడు దర్శించిన తాపసాశ్రమముల వర్ణనము మూలమున తొమ్మిది శ్లోకములలో నుండగా[26] భాస్కరుడు దీనిని "కనియె మహా మునీశ్వరనికాయనివాస తపోవనంబులన్"[27] అను నొక పద్యపాదమున సంగ్రహించెను.

**xii**) శ్రీరాముడు శరభంగుని ఆశ్రమమునకు పోగా అచ్చటి మునులందఱును రాముని చేరి తమకు రాక్షసుల వలన కలుగు బాధలను తెలుపుకొని వారి నుండి తమ్ము రక్షింపుమని ప్రార్థింతురు. శ్రీరాముడు వారి కభయ దానము గావించును. మూలమున నీ విషయము 26 శ్లోకములలో కలదు.[28] అనువాదమున నిది ఒక్క సీస పద్యమున సంగ్రహముగ చెప్పబడినది.[29]

రాముని దర్శించిన వివిధ ఋషులు మూలమున నిట్లు పేర్కొనబడినారు.

"....  ............ . మునిసంఘాః సమాగతాః
అభ్యగచ్ఛంత కాకుత్స్థం రామం జ్వలితతేజసమ్
వైఖానసా వాలఖిల్యాః సంప్రక్షాలా మరీచిపాః
అశ్మకుట్టాశ్చ బహవః పత్రాహారాశ్చ తాపసాః
దంతోలూఖలినశ్చైవ తథైవోన్మజ్జకాః పరే
గాత్రశయ్యా అశయ్యాశ్చ తథైవానవకాశికాః
మునయః సలిలాహారా వాయుభక్షాస్తథా పరే
ఆకాశనిలయాశ్చైవ తథా స్థండిలశాయినః
తథోర్ధ్వవాసినో దంతా స్తథార్ద్రపటవాససః
సజపాశ్చ తపోనిష్ఠా స్తథా పంచతపోన్వితాః
సర్వే బ్రాహ్మ్యా శ్రియా యుక్తా దృఢయోగసమాహితాః
శరభంగాశ్రమే రామమభిజగ్ముశ్చ తాపసాః"[30]

పై శ్లోకములందు చెప్పబడిన వివిధ మునులు అనువాదమున కానరారు. "అక్కాన గలిగిన యఖిలతపస్వులు" (**III**, 1, 51) అను పద్యమున 'నఖిల తపస్వుల'ను పదమున వారి నందఱిని భాస్కరుడు క్లుప్తముగ తెలిపినాడు. ఆ యా మునుల వివరములను చెప్పుట యనావశ్యకమగుటయే ఈసంక్షేపమునకు కారణము.

xiii) దండకారణ్యమందలి మునుల యభ్యర్థనముననుసరించి శ్రీరాముడు దైత్యుల పీచమడగించి ప్రియము కలిగింతునని వారికభయ మొసంగును. అంత సీత, రాక్షసులతో అకారణ వైరము తగదనియు, హింస ధర్మము కాదనియు, క్షత్రియ ధర్మమాయరణ్యమున కూడదనియు, ఆయుధములను విడిచి వేయుమనియు శ్రీరాముని ప్రార్థించును. రాముడు, తాను మునులకిచ్చిన ప్రతిజ్ఞను దాటజాలననియు, రాక్షసవధ మవశ్యము కావింతుననియు తన నిర్ణయమును తెలుపును. రాముడు సీతకు తన నిర్ణయము నీరీతిగ తెలుపుట వా రా.న ఇరువది శ్లోకములలో నుండగా అనువాదమున

శిష్టహితంబు దుష్టజన శిక్షయు జేయని రాజు రాజె యు
త్కృష్ట తపస్వికోట్లను వధించు నిశాటులఁ జంపకుండినం
గష్టత రాదె నాకు గుణగణ్యవు ధర్మపథంబు నీకు న
స్పష్టమె యిట్టులేల యనఁ బంకరుహాయతచారులోచనా (III, 1, 58)

అను నొక్క పద్యమున సంగ్రహముగ చెప్పబడినది.

**xiv)** లక్ష్మణుడు తన ముక్కు చెవులు కోయగా శూర్పణఖ యేడ్చుచు ఆ యవమానమును తెలుప ఖరునొద్దకు పోవును. ఆమె యాదుఃస్థితికి కారకులెవ్వరని ఖరుడు ప్రశ్నింపగా రామలక్ష్మణులవలననే తనకిట్టి ముప్పు కలిగినదని తెలుపుచు రామలక్ష్మణుల సౌందర్యమును, బలపరాక్రమములను క్రింది విధముగ వివరించును.

"తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ
పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ
ఫలమూలాశనౌ దాంతౌ తాపసౌ బ్రహ్మచారిణౌ
గంధర్వరాజప్రతిమౌ పార్థివవ్యంజనాన్వితౌ
దేవౌ వా దానవావేతౌ న తర్కయితుముత్సహే"

(వా.రా. III, 19, 14-16)

పై శ్లోకములందు చెప్పబడిన రామలక్ష్మణుల గుణములను భాస్కరుడు "అమ్మనుజేంద్రుల పొలుపు, బలుపు. .చెప్పన" (III, 1, 159) అని సంగ్రహించెను.

xv) శ్రీరాముడును, ఖరుడును ద్వంద్వయుద్ధము కావించుచు పరస్పరము పరుషముగా నిందించుకొందురు. మూలమున శ్రీరాముడు ఖరుని నిందించుట 13 శ్లోకములలోను, ఖరుడు రాముని నిందించుట 9 శ్లోకములలోను వర్ణితమైనది.[31] అనువాదమున ఇద్దరును చెరియొకపద్యమున మాత్రమే నిందించుకొనినట్లు కలదు.[32]

xvi) రావణుడు సీతనపహరింపదలచి మారీచుని కడకు పోయి తనకు సాహాయ్యము చేయుమని ప్రార్థించును. అంత మారీచుడు రాముని మహత్త్వమును తెలిపి యాప్రయత్నము తగదని ప్రబోధించును. మారీచుడు గావించిన ఈ ప్రబోధము మూలమున నాలుగుసర్గములందు దాదాపు 103 శ్లోకములలో అతివిపులముగా నున్నది.[33] భాస్కరుడు దీనిని 16 పద్యములలో సంగ్రహించెను.[34] ఈ సందర్భమున ము. ప్ర. లో 16 పద్యములు కనబడుచున్నను తా. ప్ర. లలో ఐదు పద్యములు మాత్రమే కలవు.

xvii) పరివ్రాజకవేషమున వచ్చిన రావణునకు సీతాదేవి తన వనవాస కారణమును తెలుపుట మూలమున 18 శ్లోకములలో కలదు.[35] అనువాదమున భాస్కరుడు "....తమ వనవాస వృత్తాంతంబును గనకమృగంబుపిఱుంద రామలక్ష్మణులు సన్న తెఱంగు నెఱింగించి" (III, 2, 91) యను చిన్నగద్యమున సంగ్రహించెను.

xviii) పంపాసరస్సును దర్శించిన శ్రీరాముడు విరహవేదనచే సీతకై విలపించుట మూలమున దాదాపు 115 శ్లోకములలో వర్ణితమైనది.[36] భాస్కరుడు దీనినెనిమిది పద్యములలో క్లుప్తీకరించెను.[37] మూలముననిది కి.కాం. ప్రారంభమున నుండగా అనువాదమున అర. కాం. చివర చోటుచేసుకున్నది. అనువాదమందలి ఈ రాముని విరహవేదనావర్ణముగల పద్యములు పెక్కు తా. ప్ర లలో కానరావు.

**కిష్కింధాకాండము**

xix) మూలమున నొక విషయము రెండేసిమార్లు చెప్పబడినప్పుడు అందొకదానిని అనువాదమున అతి సంక్షిప్తముగ చెప్పుట కానవచ్చు చున్నది. సంపాతి తన పక్షదాహ కథను హనుమదాదులకు వివరించుట మూలమున రెండు చోట్ల కలదు.[38] 58వ సర్గమున నాలుగు శ్లోకములందును, 60వ సర్గమున 18

శ్లోకములందును సంపాతి కథ చెప్పబడినది. 58వ సర్గమున చెప్పబడిన విషయమును మల్లికార్జునుడు 'ఇన చండాంశులఁ బక్షముల్ గమలి యేనచ్చోటికింబోవ తేకునికిన్' (IV. 710) అని సంగ్రహించినాడు. ఇట్లిట సంగ్రహముగ చెప్పుటలో ఔచిత్యము కలదు.

xx) వాలి వధ కావించిన పిమ్మట శ్రీరాముడు ప్రస్రవణ పర్వతముపై కాలము గడుపుచుండును. అంత వర్షర్తువేతెంచును. ఈ సందర్భమున మూలమున దాదాపు 56 శ్లోకములలో వర్షర్తు వర్ణనము గలదు[39]. వీనిలో అనుష్టుప్పులే కాక పెద్ద వృత్తములును కలవు. అనువాదమున నిది 11 పద్యములలో సంగ్రహింపబడినది[40]. వీనిలో రెండు మత్తేభములు. తక్కినవి కందపద్యములు.

ఈ సందర్భముననే మూలమున 59 శ్లోకములలో అతి విస్తృతముగా నున్న శరదృతువర్ణనము[41] అనువాదమున ఆరు పద్యములలో సంగ్రహింపబడినది.[42]

### సుందరకాండము

xxi) హనుమంతుడు రావణుని అంతఃపురమున ప్రవేశించి యట నాతని పర్యంక ప్రదేశమున నృత్త గీత వాద్యాదులచే అలసి పోయిన స్త్రీలను చూచును. మూలమున వీరి వర్ణనము పదమూడు శ్లోకములలో నుండగా[43] మల్లికార్జునుడు దీనిని "కొందఱు కాంతలు నయనాభిరామంబులుగా విచిత్ర గతుల నాడియు, గర్ణామృతంబులుగా బాడియు, శ్రుతి సుఖంబులుగా వాయించియు నలసి విపంచి వీణాదులు మురజ మృదంగ పణవడిండిమాదులు గౌగలించుకొని పరవశలై యుండ" (v, 108) అని సంగ్రహించినాడు.

xxii) ఆశోకవనమున ప్రవేశించిన రావణుని చూడగానే సీతాదేవి చింతా, భయ, దుఃఖములతో పరవశ యగును. ఆమె యీ స్థితి మూలమున పెక్కు ఉపమానములతో నిరువది శ్లోకములలో వివరింపబడినది[44]. మల్లికార్జునుడు "ప్రవాత వేగంబునం గదలు కదళి చందంబున వడవడ వడంకుచుంజన్నులు చేతులం గప్పికొని పీడిన కచభరంబున వెన్నును, జఘనంబును మాటువడ; నూరుల నుదరంబడంచుకొని యశ్రువులురులనున్న నమ్మానినీ రత్నంబుఁజేరి (V, 176) యను గద్యమున ఈ విషయమును సంగ్రహముగ చెప్పినాడు.

xxiii) హనుమంతుడు, రాక్షసీ పరివృతయై దుఃఖించుచున్న సీతను గలిసి యామెను సమాశ్వాసపరచవలసిన విధమును విచారించుట మూలమున నలువది నాలుగు శ్లోకములలో అతి విస్తృతముగానున్నది.[45] అనువాదమున నిది యొక చిన్న గద్యమున సంక్షేపింపబడినది.[46]

xxiv) ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రముచే బంధించి రావణుని సభకు తీసుకొనిపోవును. రావణుడు క్రుద్ధుడై హనుమంతుని వధింపుడని రాక్షసుల నాజ్ఞాపించును. అంత విభీషణుడు దూత వధ కూడదని రావణునకు హితము ఉపదేశించును. మూలమున నిరువది శ్లోకములలోనున్న యీ హితబోధ[47] అనువాదమున రెండు పద్యములలో సంగ్రహింపబడినది [48]

xxv) హనుమంతుడు సీతను చూచి తిరిగివచ్చి కపివీరులతో తాను సముద్రమును దాటి లంకలో సీతను చూచిన విషయమునంతయు చెప్పును. మూలమున రెండు సర్గములలో[49] వర్ణింపబడిన యీ విషయమును మల్లికార్జునుడు ఒక్క సీసపద్యమున[50] క్లుప్తీకరించినాడు.

xxvi) సీత అభిజ్ఞానముగ నిచ్చిన శిరోరత్నమును హనుమంతుడు రామునకీయగా ఆతడు దానినక్కుననిడికొని మిక్కిలి విలపించును. అంత మారుతి సీతాసందేశమును తెలిపి శ్రీరామునోదార్చును. మూలమున ఈ సందేశము మిక్కిలి విపులముగా నున్నది.[51] అనువాదమున నీ విషయమంతయు

'అని పలికి జలధిఁ దాటిన
తన విక్రమమాది గాఁగఁదగు వృత్తాంతం
బును సీతావృత్తాంతము
విన సర్వముజెప్పె రామవిభుతో వెలయన్' (VI, 571)

అను ఒక్క కందపద్యమున కుదింపబడినది. హనుమంతుడు రామునకు సీతాసందేశమును తెలియజేయుట యింతకు పూర్వమే విపులముగా వర్ణింపబడి యుండుట[52] ఈ సంక్షేపమునకు కారణము.

యుద్ధకాండము :

xxvii) రాముని యుద్ధప్రయత్నమును తెలిసికొనిరండని శార్దూలాది రాక్షసులను చారులుగా పంపుచు రావణుడు వారితో ఇట్లు పలుకును.

"ఇతో గచ్ఛత రామస్య వ్యవసాయం పరీక్షితుమ్
మంత్రేష్వభ్యంతరాయేఽస్య ప్రీత్యా తేన సమాగతాః
కథం స్వపితి జాగర్తి కిమద్య చ కరిష్యతి
విజ్ఞాయ నిపుణం సర్వమాగంతవ్యమశేషతః
చారేణ విదితః శత్రుః పండితైర్వసుధాధిపైః
యుద్ధే స్వల్పేన యత్నేన సమాసాద్య నిరస్యతే"
(వా. రా. VI, 29, 19-21)

భాస్కరుడు దీనినంతను "రామవృత్తాంతంబరసిరమ్మని నియోగింప"
(VI, 371)

అని సంగ్రహించినాడు.

xxviii) శార్దూలుడు మున్నగు రాక్షసులు కపిసేనను చూచివచ్చి రావణునకు రాముని మహత్త్వమును, వానరనాయకుల శక్తిసామర్థ్యములను వివరింతురు. మూలమున ఇరువదియైదు శ్లోకములలో[53]నున్న యీ విషయము అనువాదమున మూడు పద్యములలో[54] సంగ్రహీతమైనది.

xxix) వానరవీరులవలన తనకు కలిగిన అవమానమును శార్దూలుడు రావణునకీ క్రిందివిధముగ తెలియజేయును.

ప్రవిష్టమాత్రే జ్ఞాతోఽహం బలే తస్మిన్ విచారితే
బలాద్గృహీతో రక్షోభి ర్బహుధాఽస్మి విచారితః
జానుభిర్ముష్టిభిర్దంతైస్తలైశ్చాఽభిహతో భృశమ్
పరిణీతోఽస్మి హరిభిర్బలమధ్యే అమర్షణైః
పరిణీయ చ సర్వత్ర నీతోఽహం రామసంసది
రుధిరాస్రవిదీనాంగో విహ్వలశ్చలితేంద్రియః

హరిభిర్వధ్యమానశ్చ యాచమానః కృతాంజలిః
రాఘవేణ పరిత్రాతో మామేతి చ యదృచ్ఛయా''

(వా. రా. VI, 30, 7-10)

దీనినంతయు భాస్కరుడు 'రావణునకుందమ పరిభవంబు మొదలుగా గల తెఱంగెఱింగించి' (VI, 374) యని సంగ్రహించెను.

xxx) రావణునొద్దకంగదుని దూతగా పంపుచు రాముడు పలికిన సందేశ విషయము మూలమున 11 శ్లోకములలో నుండగా[55] అనువాదమున రెండు పద్యములలో మాత్రమే కలదు.[56]

xxxi) నాగపాశబద్ధులై విసంజ్ఞులైయున్న రామలక్ష్మణులను చూచి వానరులు శోకించుట, ఇంద్రజిత్తు సంతోషించుట, విలపించుచున్న సుగ్రీవుని విభీషణుడోదార్చుట, ఇంద్రజిత్తు లంకకు పోయి రావణునకు రామలక్ష్మణుల వధమును తెలుపుట అను నీవిషయములు మూలమున ఏబది శ్లోకములలో వర్ణింపబడినవి.[57] భాస్కరుడీవిషయమునంతయు ఒక చిన్నగద్యమునను, ఒక మత్తేభమునను క్లుప్తీకరించినాడు.[58]

xxxii) మూలమున దాదాపు ఏబదియెనిమిది శ్లోకములలో వర్ణింపబడిన కుంభకర్ణుని యుద్ధప్రస్థానము[59] అనువాదమున రెండుగద్యపద్యములలో[60] అతి సంగ్రహముగ చెప్పబడినది.

B) మూలరామాయణము ననువదించునపుడు భా.రా.కర్తలు పూర్తిగా విడిచివేసిన భాగములనేకములు గలవు. ప్రధానకథతో అంతగా సంబంధము లేకపోవుటచేతనో, తామనుసరించిన రామాయణప్రతిలో అవి లేకుండుటచేతనో, అనువాదము సంక్షిప్తముగా నుండవలయునను కారణముచేతనో భా.రాకర్తలు వానిని విడిచియుందురు. అట్లు విడిచివేయబడిన విషయములను కొన్నింటిని ఉదాహరించెదను.

బాలకాండము :- i) వాల్మీకి మహాముని నారదుని చూచి "కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్" ఇత్యాదిగా ప్రశ్నించుటయు, దానికి సమాధానముగ నారదుడు సంక్షేపముగ రామాయణకథను చెప్పుటయు

వా.రా.న సుమారు నూరుశ్లోకములలో వర్ణింపబడియున్నది.61 మల్లికార్జునుడీ సంక్షిప్తరామకథను అనువదింపలేదు.

'రాముని శుభచరితము
లఘురామాయణముగ రచించి' ప్రాచేతసుకై
ప్రేమనెఱిగించి తగ నిజ-
ధామమునకు నారదుండుదారత(జనియెన్" (భా. రా. I, 2)

అను పద్యమున నారదుడు రాముని శుభచరితమును రామాయణముగ రచించి వాల్మీకికి ప్రేమతో తెలిపి వెడలినట్లుగమాత్రమే తెలుపబడినది. వావిళ్లవారు ప్రకటించిన భా. రా. ద్వితీయముద్రణము (1915) న గ్రంథారంభమునకు పూర్వ మొక సంగ్రహరామాయణము చేర్చబడియున్నది. కాని యిది తా. ప్ర. లలో నెక్కడను కానరాదు. వావిళ్లవారికై భా. రా. ను పరిష్కరించిన మేడేపల్లి వేంకట రమణాచార్యులుగారే యీ సంగ్రహరామాయణమును రచించి యిందు చేర్చి యుందురని ఊహింపవచ్చును.

ii) మూలమున బా. కాం. ప్రారంభమున రామాయణమునందలి ప్రధాన విషయముల అనుక్రమణిక ఒకటి కలదు. దీనిలో చెప్పబడిన గుహసమాగమము, పాదుకాభిషేకము, అగస్త్యదర్శనము, శబరీదర్శనము అనునంశములు అనువాద మందలి అనుక్రమణికలో కానరావు. ఈయంశములన్నియు భా.రా. న వర్ణితములై యున్నను విషయానుక్రమణికలో నవి లేకుండుటకుగల కారణము తెలియదు.

iii) దశరథుడు కావించిన పుత్రకామేష్టియందలి హవిర్భాగములను గైకొనవచ్చిన బ్రహ్మేంద్రాదిదేవతలు విష్ణుమూర్తితో రావణుని యాగడములను తెలిపి మర్త్యరూపమును గ్రహించి యాతనిని వధింపుమని ప్రార్థింతురు. విష్ణువట్లే చేసెదనని వారికభయమిచ్చును. ఈ విషయము బా.కాం. న 15 వ సర్గమున వర్ణితమైనది. 16 వ సర్గమున ఈ విషయమే పునరుక్తమైనది. ఇందు శ్రీరాముడు రావణుని వధించునుపాయమును తెలియజేయుడని దేవతలను ప్రశ్నించుటయు, మానవరూపమును ధరించి యాతనిని వధించుట యుక్తమని వారు సమాధానము చెప్పుటయు గలదు. పునరుక్తి యగునని కాబోలు మల్లికార్జునుడీవిషయమును అనువాదమున వదలి 15 వ సర్గమందలి విషయమును మాత్రమే పేర్కొనినాడు.

iv) విశ్వామిత్రుడు శ్రీరామచంద్రునకు కుమారస్వామి జననముగూర్చి తెలుపుచు ఆతనికి కార్తికేయుడు, స్కందుడు, షడాననుడు అను పేర్లు ఎట్లు వచ్చినవో వివరించుట వా.రా న కలదు.[63] అనువాదమున కార్తికేయ, షడానన నామముల అన్వర్థత వివరింపబడినను స్కందుడను పేరు ఎట్లు వచ్చెనో వివరింపబడలేదు. మూలమున.

"స్కంద ఇత్యబ్రువన్ దేవాః స్కన్నం గర్భపరిస్రవే"
(వా.రా. I, 37,27)

అను శ్లోకమున స్కందునకాపేరు వచ్చిన విధము చెప్పబడినది.

v) క్షీరసాగర మథనమున తొలుత హాలాహల విషము పుట్టుట, దేవతలు భయముతో శివుని శరణుజొచ్చుట, శివుడావిషమును అమృతమువలె త్రాగి వెడలిపోవుట, అంత కవ్వముగా నున్న మందరపర్వతము సముద్రమున మునిగి పాతాళమునకు పోవుట, దేవతల కోర్కెపై విష్ణుమూర్తి కూర్మరూపమున నా పర్వతమును పృష్ఠముపై ధరించుట అను నీ యంశములు మూలమున క్షీరసాగరమథన వర్ణన సందర్భమున చెప్పబడినవి.[64] భా.రా. న క్షీరసాగర కథ వర్ణితమైనను అందు పైన పేర్కొన్న వివరములు కానరావు.

vi) విశ్వామిత్రుడు జనకమహారాజునకు రామలక్ష్మణులను పరిచయము చేసి తాను వారితో సిద్ధాశ్రమమునకు వెడలి రాక్షసులను చంపుట, మార్గమధ్యమున విశాలా నగరమును దర్శించుట, గౌతమాశ్రమమున అహల్యను చూచుట, గౌతముని కలిసికొనుట మున్నగు విషయములను వివరించి శివధనుస్సును గూర్చి విని తామటకు వచ్చినట్లుగ తెలుపును. ఇది విని శతానందుడు విశ్వామిత్రుని ఈ క్రింది విధముగ ప్రశ్నించినట్లు మూలమున కలదు.

"అపి తే మునిశార్దూల మమ మాతా యశస్వినీ
దర్శితా రాజపుత్రాయ తపోదీర్ఘముపాగతా
అపి రామే మహాతేజా మమ మాతా యశస్వినీ
వన్యైరుపాహరత్పూజాం పూజార్హే సర్వదేహినామ్
అపి రామాయ కథితం యద్వృత్తం తత్పురాతనమ్

మమ మాతుర్మహాతేజో దేవేన దురనుష్ఠితమ్
అపి కౌశిక భద్రం తే గురుణా మమ సంగతా
మమ మాతా మునిశ్రేష్ఠ రామసందర్శనాదితః
అపి మే గురుణా రామః పూజితః కుశికధ్వజ
ఇహాగతో మహాతేజాః పూజాం ప్రాప్య మహాత్మనః
అపి శాంతేన మనసా గురుర్మే కుశికాత్మజ
ఇహాగతేన రామేణ పూజితేనాభివాదితః" (వా.రా.I, 51, 4-9)

మూలమునగల యీ శతానందుని ప్రశ్నలు అనువాదమున పరిహరింప బడినవి.

**vii)** వసిష్ఠుని యాజ్ఞచే కామధేనువు విశ్వామిత్రునకును, ఆయన సేనకును వివిధభక్ష్య పదార్థములను సమకూర్చును. వా.రా.న. ఆ పదార్థములలో మైరేయ మనునొక మద్య విశేషము కూడ చెప్పబడినది.

"ఇక్షూన్మధూంస్తథా లాజాన్ మైరేయాంశ్చ వరాసవాన్"
(I, 53, 2).

ఈ యాతిథ్యము మునిశ్రేష్ఠుడగు వసిష్ఠునిచే నీయబడినది. మహిమాన్విత యగు కామధేనువు సమకూర్చినట్టిది. అట్టి యాతిథ్యమున మైరేయముండుట ఉచితము కాదని కాచోలు మల్లికార్జునుడనువాదమున మైరేయమును త్యజించినాడు.

**viii)** శతానందుడు రామలక్ష్మణులకు విశ్వామిత్రుని బ్రహ్మర్షిపద ప్రాప్తిని వివరింపగా జనకుడు విని విశ్వామిత్రుని మహత్త్వమునీక్రింది విధముగ కీర్తించును.

'ధన్యోఽస్మ్యనుగృహీతోఽస్మి యస్య మే మునిపుంగవ
యజ్ఞం కాకుత్స్థసహితః ప్రాప్తవానసి కౌశిక
పావితోఽహం త్వయా బ్రహ్మన్ దర్శనేన మహామునే
గుణా బహువిధాః ప్రాప్తా స్తవ సందర్శనాన్మయా

విస్తరేణ చ వై బ్రహ్మన్ కీర్త్యమానం మహత్తపః
శ్రుతం మయా మహాతేజో రామేణ చ మహాత్మనా
సదస్యైః ప్రాప్య చ సదః శ్రుతాస్తే బహవో గుణాః
అప్రమేయం తపస్తుభ్యం అప్రమేయం చ తే బలమ్
అప్రమేయగుణాశ్చైవ నిత్యం తే కుశికాత్మజ" (వా.రా.I,65,29-33)

జనకుడు గావించిన ఈ విశ్వామిత్ర ప్రశంస అనువాదమున ఇంత వివరముగ కానరాదు. "అక్కడి సభాసదులు నాశ్చర్య సంతోషంబులందేలి విశ్వామిత్రుం బ్రశంసించి పూజించి"రని[64] మాత్రమే అనువాదమున గలదు.

ix) దశరథాదులు మిథిల నుండి అయోధ్యకు తిరిగి పోవు సమయమున పరశురాముడు వారి నెదిరించును. ఈ సందర్భమున నాతడు తన తండ్రికి విష్ణుధనుస్సు ప్రాప్తించిన విధమును తెలుపుటయేకాక తనతండ్రి ఆయుధములను వదలి తపము చేయుచుండగా నాతనిని కార్తవీర్యుడు చంపుటయు, ఆ వార్త విన్న తాను కోపముతో క్షత్రియులను హత మార్చుటయు, యజ్ఞము గావించి భూమి నంతను కాశ్యపునకు దానము చేసి మహేంద్ర పర్వతమునకు తపముకై వెళ్ళుటయు నను నీ వృత్తాంతములను శ్రీరామునకు తెలిపినట్లుగ వా.రా.న వర్ణింపబడినది.[65] జమదగ్నికి విష్ణుధనుస్సు ప్రాప్తించిన విధము భా.రా. న నున్నను కార్తవీర్యుడు జమదగ్నిని చంపుట మొదలగు విషయములు మాత్రము కానరావు.

x) పరశురాముడు వైష్ణవ ధనుస్సును ప్రయోగించి తన పరాక్రమమును ప్రకటించుకొనుమని గర్వముగ శ్రీరామునితో పలుకును. అంత శ్రీరాముడు ఆ ధనుస్సును సంధించి, కోపముతో నా భృగురామునితో ఇట్లు పలుకును.

'బ్రాహ్మణోఽసీతి పూజ్యో మే విశ్వామిత్రకృతేన చ
తస్మాచ్ఛక్తో న తే రామ మోక్తుం ప్రాణహరం శరమ్"
(వా. రా. I, 75, 6)

పరశురాముడు బ్రాహ్మణుడగుటయేగాక విశ్వామిత్రునకు బంధువు గూడ నగుటయు కారణముగా నాతనిపై శ్రీరాముడు శరమోక్షము గావింప లేదట. ఈ భావమనువాదమున కానరాదు.

x) దశరథుడు భరతశత్రుఘ్నులను వారి మేనమామయగు యుధాజిత్తుతో కేకయదేశమునకు పంపిన వృత్తాంతము వాల్మీకము బా.కాం. చివరి సర్గమున వర్ణింపబడినది. ఈవిషయమే మరల అయో.కాం. ప్రారంభమున క్లుప్తముగ ననూదితమైనది భా.రా.న నీవిషయము బా కాం చివరగాని, అయో. కాం. ప్రారంభమునగాని కానరాదు. ఈవిషయమును కొందరు బా.కాం చివరను, కొందరు అయో.కాం. ప్రారంభమునను చెప్పుటచేతను, భా.రా బాలాయోధ్యాకాండ కర్తలు భిన్నులగుటచేతను పరస్పరవ్యత్యయముచే నీవిషయమును చెప్పలేదని భావింపవచ్చును.

**అయోధ్యాకాండము :-** i) శ్రీరామునకు యౌవరాజ్యాభిషేకము చేయవలయునన్న తన వాంఛను మంత్రులతో నాలోచించినపిదప దశరథుడు వివిధదేశముల రాజులనాహ్వానించి వారికి తన కోరికను తెలుపును. అందులకు రాజులందరును సమ్మతించుటయేకాక మిక్కిలి సంతసింతురు. అంత రాజు వారి హృదయములను మరల పరీక్షింపగోరి వారినిట్లు ప్రశ్నించును.

"శ్రుత్వైతద్వచనం యన్మే రాఘవం పతిమిచ్ఛథ
రాజానః సంశయోఽయం మే తదిదం బ్రూత తత్త్వతః
కథం ను మయి ధర్మేణ పృథివీమనుశాసతి
భవంతో ద్రష్టుమిచ్ఛంతి యువరాజం మహాబలమ్

(వా.రా. II, 2, 24-25)

అంత నా రాజులు ఇక్ష్వాకురాజులందరిలోను శ్రీరాముడు గుణగరిష్ఠుడని పేర్కొనుచు నాతని గుణములను కీర్తింతురు. వా. రా. న నీ గుణకీర్తనము ఇరువది యేడు శ్లోకములలో కలదు.[66] కాని అనువాదమున దశరథుడు రాజమనముల పరీక్షింపదలచి వారిని ప్రశ్నించుటగాని, అందుకు సమాధానముగ వారు శ్రీరాముని గుణగణములను స్తుతించుటగాని కనబడదు.

ii) దశరథుడు శ్రీరామునకు పట్టాభిషేకమునుగూర్చి తెలిపి ఆతనికి రాజనీతి విషయములనుపదేశించును. వా.రా.న ఈ బోధ ఈ విధముగా కలదు.

"గుణవత్యపి తు స్నేహాత్పుత్ర వక్ష్యామి తే హితమ్
భూయో వినయమాస్థాయ భవ నిత్యం జితేంద్రియః
కామక్రోధసముత్థాని త్యజస్వ వ్యసనాని చ
పరోక్షయా వర్తమానో వృత్త్యా ప్రత్యక్షయా తథా
అమాత్యప్రభృతీః సర్వాః ప్రజాశ్చైవానురంజయ
కోష్ఠాగారాయుధాగారైః కృత్వా సన్నిచయాన్ బహూన్
ఇష్టానురక్తప్రకృతిర్యః పాలయతి మేదినీమ్
తస్య నందంతి మిత్రాణి లబ్ధ్వాఽమృతమివామరాః
తస్మాత్పుత్ర త్వమాత్మానం నియమ్యైవం సమాచర"

(వా.రా. II, 4, 42-46)

భా. రా. న పై శ్లోకముల భావము అనూదితము కాలేదు.

iii) మంథర తన దుర్బోధలచే కైకమనమును కలుషితముగావించును. దశరథుడిచ్చిన వరములను జ్ఞప్తికితెచ్చి వానినిప్పుడు కోరుకొమ్మని కైకేయిని ప్రేరేపించును. అంత కైకేయి మంథరను కొనియాడుచు దాని యవయవ సౌందర్యమును ప్రశంసించును. అంతేకాక భరతుడభిషిక్తుడైనపిదప దాని గూనునకు స్వర్ణలేపమును, ముఖమునకు స్వర్ణతిలకమును, వివిధాభరణములను చేయింతుననియు పలుకును.[67] వా.రా.నగల యీ యాభరణాదుల ప్రసక్తిని భా.రా.కర్త విడిచివేసినాడు. వావిళ్లవారి భా.రా.న ఈ విషయము కొంత యున్నను[68] ఆభాగము ప్రక్షిప్తభాగమగుటచే నది భా.రా. కర్తృకమనుటకు వీలులేదు.

iv) శ్రీరాముడు వనవాసమునకేగు సమయమున కౌసల్య తన కుమారుని క్షేమముకొరకు హోమము చేయించినట్లుగను, విశల్యకరణిని రక్షగా దక్షిణభుజమున కట్టినట్లుగను మూలమున చెప్పబడినది.

జ్వలనం సముపాదాయ బ్రాహ్మణేన మహాత్మనా
హావయామాస విధినా రామమంగళకారణాత్ (II, 25, 27)

ఓషధిం చ సుసిద్ధార్థాం విశల్యకరణీం శుభామ్
చకార రక్షాం కౌసల్యా మంత్రైరభిజజాప చ (II, 25, 38)

అనువాదమున రక్షాబంధమున్నను బ్రాహ్మణులచే హోమముగావింపించిన విషయము కానరాదు.

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు తమ ఆంధ్రవాఙ్మయ చరిత్రసంగ్రహమున రం. రా. నందలి యవాల్మీకాంశములనుగూర్చి వ్రాయుచు కౌసల్య రామునకు రక్షరేఖ కట్టిన విషయమునవాల్మీకముగ పేర్కొనినారు.[69] "చకార రక్షాం కౌసల్యా" అను పై వా. రా. శ్లోకమున రక్షాప్రసక్తి యున్నది కనుక నా విషయమవాల్మీకమనుటకు వీలులేదేమో !

v) మంథరచే దుర్బోధితయైన కైక క్రోధపరవశయై ఆభరణములన్ను పరిత్యజించి కోపగృహమునకు వెడలును. పట్టాభిషేక ప్రయత్నములను త్వరగా పూర్తిచేయవలసినదిగా అందరినాజ్ఞాపించి వసిష్ఠాదుల సెలవుగైకొని కైక యంతఃపురమును ప్రవేశించును. కాని శయ్యపై కైక కనబడలేదు. ఈ సందర్భమున వాల్మీకి దశరథునిట్లు వర్ణించినాడు.

న దదర్శ స్త్రియం రాజా కైకేయీం శయనోత్తమే
స కామబలసంయుక్తో రత్యర్థీ మనుజాధిపః
అపశ్యన్ దయితాం భార్యాం పప్రచ్ఛ విషసాద చ
(వా. రా. II, 10, 17-18)

దశరథుడు కామపరవశతతో రత్యర్థియై వచ్చినట్లుగను, దయితయగు కైక కనబడకపోవుటతో విషణ్ణుడైనట్లుగను పై శ్లోకమువలన తెలియుచున్నది. రామాభిషేకమనకై యాలోచించుసమయమున "జీర్ణస్యాస్య శరీరస్య విశ్రాంతి మభిరోచయే" (వా. రా. II, 2, 8) అని తనను జీర్ణశరీరుడుగా చెప్పుకొనిన దశరథుడు కామపరవశుడై రత్యర్థము కైక శయనాగారమునకు వెళ్ళెననుట అంత యుచితముగాదను భావముతో కాబోలు అనువాదమున పై శ్లోకముల భావము పరిహరింపబడినది.

vi) శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో అడవికి బయలుదేరు సమయమున సుమంతుఁడు కైక యకార్యమునకు వగచి ఆమెను గర్హించును. ఐనను కైకేయి తన నిర్ణయమును మార్చుకొనదు. అంత దశరథుడు రామునకరణ్యమున ఎట్టి

"గుణవత్యపి తు స్నేహాత్పుత్ర వక్ష్యామి తే హితమ్
భూయో వినయమాస్థాయ భవ నిత్యం జితేంద్రియః
కామక్రోధసముత్థాని త్యజస్వ వ్యసనాని చ
పరోక్షయా వర్తమానో వృత్త్యా ప్రత్యక్షయా తథా
అమాత్యప్రభృతీః సర్వాః ప్రజాశ్చైవానురంజయ
కోష్ఠాగారాయుధాగారైః కృత్వా సన్నిచయాన్ బహూన్
ఇష్టానురక్తప్రకృతిర్యః పాలయతి మేదినీమ్
తస్య నందంతి మిత్రాణి లబ్ధ్వాఽమృతమివామరాః
తస్మాత్పుత్ర త్వమాత్మానం నియమ్యైవం సమాచర"

(వా.రా. II, 4, 42-46)

భా. రా. న పై శ్లోకముల భావము అనూదితము కాలేదు.

iii) మంథర తన దుర్బోధలచే కైకమనమును కలుషితముగావించును. దశరథుడిచ్చిన వరములను జ్ఞప్తికితెచ్చి వానినిప్పుడు కోరుకొమ్మని కైకేయిని ప్రేరేపించును. అంత కైకేయి మంథరను కొనియాడుచు దాని యవయవ సౌందర్యమును ప్రశంసించును. అంతేకాక భరతుడభిషిక్తుడైనపిదప దాని గూనునకు స్వర్ణలేపమును, ముఖమునకు స్వర్ణతిలకమును, వివిధాభరణములను చేయింతుననియు పలుకును.[67] వా.రా.నగల యీ యాభరణాదుల ప్రసక్తిని భా.రా.కర్త విడిచివేసినాడు. వావిళ్లవారి భా.రా.న ఈ విషయము కొంత యున్నను[68] ఆభాగము ప్రక్షిప్తభాగమగుటచే నది భా.రా. కర్తృకమనుటకు వీలులేదు.

iv) శ్రీరాముడు వనవాసమునకేగు సమయమున కౌసల్య తన కుమారుని క్షేమముకొరకు హోమము చేయించినట్లుగను, విశల్యకరణిని రక్షగా దక్షిణభుజమున కట్టినట్లుగను మూలమున చెప్పబడినది.

జ్వలనం సముపాదాయ బ్రాహ్మణేన మహాత్మనా
హావయామాస విధినా రామమంగళకారణాత్ (II, 25, 27)

ఓషధిం చ సుసిద్ధార్థాం విశల్యకరణీం శుభామ్
చకార రక్షాం కౌసల్యా మంత్రైరభిజజాప చ (II, 25, 38)

అనువాదమున రక్షాబంధమున్నను బ్రాహ్మణులచే హోమముగావింపించిన విషయము కానరాదు.

శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు తమ ఆంధ్రవాఙ్మయ చరిత్రసంగ్రహమున రం. రా. నందలి యవాల్మీకాంశములనుగూర్చి వ్రాయుచు కౌసల్య రామునకు రక్షరేఖ కట్టిన విషయమునవాల్మీకముగ పేర్కొనినారు.[69] "చకార రక్షాం కౌసల్యా" అను పై వా. రా. శ్లోకమున రక్షాప్రసక్తి యున్నది కనుక నా విషయమవాల్మీకమనుటకు వీలులేదేమో !

v) మంథరచే దుర్బోధితయైన కైక క్రోధపరవశయై ఆభరణములన్ను పరిత్యజించి కోపగృహమునకు వెడలును. పట్టాభిషేక ప్రయత్నములను త్వరగా పూర్తిచేయవలసినదిగా అందరినాజ్ఞాపించి వసిష్ఠాదుల సెలవుగైకొని కైక యంతఃపురమును ప్రవేశించును. కాని శయ్యపై కైక కనబడలేదు. ఈ సందర్భమున వాల్మీకి దశరథునిట్లు వర్ణించినాడు.

న దదర్శ ప్రియం రాజా కైకేయీం శయనోత్తమే
స కామబలసంయుక్తో రత్యర్థీ మనుజాధిపః
అపశ్యన్ దయితాం భార్యాం పప్రచ్ఛ విషసాద చ
(వా. రా. II, 10, 17-18)

దశరథుడు కామపరవశతతో రత్యర్థియై వచ్చినట్లుగను, దయితయగు కైక కనబడకపోవుటతో విషణ్ణుడైనట్లుగను పై శ్లోకమువలన తెలియుచున్నది. రామాభిషేకమనకై యాలోచించుసమయమున "జీర్ణస్యాస్య శరీరస్య విశ్రాంతి మభిరోచయే" (వా. రా. II, 2, 8) అని తనను జీర్ణశరీరుడుగా చెప్పుకొనిన దశరథుడు కామపరవశుడై రత్యర్థము కైక శయనాగారమునకు వెళ్ళెననుట అంత యుచితముగాదను భావముతో కాబోలు అనువాదమున పై శ్లోకముల భావము పరిహరింపబడినది.

vi) శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో అడవికి బయలుదేరు సమయమున సుమంత్రుఁడు కైక యకార్యమునకు వగచి ఆమెను గర్హించును. ఐనను కైకేయి తన నిర్ణయమును మార్చుకొనదు. అంత దశరథుడు రామునకరణ్యమున ఎట్టి

యిబ్బంది కలుగకుండునట్లు ఆతనికి చతుర్విధబలాదులను, సమస్తసంపదలను ఇచ్చి పంపవలసినదిగా సుమంత్రునాజ్ఞాపించును.[70] అంత కైక కుపితయై

"రాజ్యం గతధనం సాధో పీతమండాం సురామివ
నిరాస్వాద్యతమం శూన్యం భరతో నాభిషత్స్యతే" (వా.రా. II, 36,12)

అని పలుకును. అనువాదమున సుమంత్రుడు కైకను గర్హించుట, దశరథుడు రామునకు చతుర్విధబలములను, సంపదలను ఇచ్చి పంపుమని యాదేశించుట, కైక నిస్సారమైన రాజ్యసంపద భరతునక్కరలేదని పలుకుట అను నీ విషయములు కానరావు.

vii) సీతారామలక్ష్మణులు గంగానది దాటి విశ్రాంతికై ఒక చెట్టుక్రింద కూర్చుందురు. అప్పుడు రాముడు లక్ష్మణునితో కైక కౌసల్యాసుమిత్రలనిప్పటికే బాధింపమొదలిడియుండుననియు, తనమూలముగ సుమిత్ర దుఃఖముల పాలగుట ఉచితము గాదనియు, కౌసల్యకాధారముగనుండుటకై లక్ష్మణుడు వెంటనే అయోధ్యకు వెడలుట యుక్తమనియు పలుకును. లక్ష్మణుడందుకంగీకరింపడు.[71] భా. రా. కర్త పై విషయమునువాదమున గ్రహింపలేదు.

viii) రామాదులు గంగా నదిని దాటి వత్స దేశమును చేరుకొందురు. అక్కడ వారొక యడవి పందిని, మనుబోతును, దుప్పిని, ఇఱ్ఱిని కొట్టితెచ్చి వాని మాంసమును భుజించినట్లుగ మూలమున నున్నది.

"తౌ తత్ర హత్వా చతురో మహామృగాన్
వరాహమృశ్యం పృషతం మహారురుమ్
ఆదాయ మేధ్యం త్వరితం బుభుక్షితౌ
వాసాయ కాలే యయతుర్వనస్పతిమ్" (వా.రా. II, 52, 102)

అవతార పురుషుడగు శ్రీరాముడు మృగ మాంస భక్షణము గావించుట యుచితము గాదని కాబోలు అనువాదమున ఈ మాంస భక్షణము పరిహరింపబడినది,

ix) చిత్రకూటమున లక్ష్మణుడు పర్ణశాలను నిర్మింపగా రాముడు వాస్తు పూజకై ఐణమాంసమును తెమ్మని లక్ష్మణు నాజ్ఞాపించును. లక్ష్మణు డట్లే మృగమును చంపి తెచ్చును. అంత రాముడు స్నానము చేసి వైశ్వ దేవబలి కావించును.[72] మూలమున గల ఈ మాంసబలి భా.రా.న కానరాదు.

x) సుమంత్రు డయోధ్యకు తిరిగి వచ్చి రామాదుల వివరములను కౌసల్యకు తెలియజేయును. కౌసల్య పుత్ర విరహ దుఃఖమును భరింపలేక తనను రామునొద్దకు తీసికొని పొమ్మని సుమంత్రుని ప్రార్థించును. అంత సుమంత్రుడు రామాదులకెట్టి బాధలు లేవని తెలిపి యామెనోదార్చును. వా. రా. న వర్ణింపబడిన యీ విషయమును అనువక్త గ్రహింపలేదు.

xi) దశరథుడు పుత్ర శోకముచే మరణించును. మంత్రులు, మార్కండేయాది మునులు వసిష్ఠునొద్దకు పోయి అరాజకమగు రాజ్యమున గలుగునుత్పాతములను పేర్కొని ఇక్ష్వాకు వంశీయులలో నొకరిని రాజుగా చేయవలయునని విన్నవింతురు. వా. రా. న నీ యుత్పాతముల వర్ణనము సుమారిరువది మూడు శ్లోకములలో నున్నది.[73] అనువాదమున నీ యుత్పాతముల వర్ణనము వదలివేయబడినది.

xii) మేనమామ యింట నున్న భరతుని తీసుకొని రమ్మని వసిష్ఠుడు విజయుడు మున్నగు దూతలను గిరివ్రజపురమునకు పంపును. ఆరాత్రి భరతుని కొక కల వచ్చును. భరతుడు తన స్వప్న వృత్తాంతము నిట్లు వివరించును.

స్వప్నే పితరమద్రాక్షం మలినం ముక్తమూర్ధజమ్
పతంతమద్రిశిఖరాత్ కలుషే గోమయే హ్రదే
ప్లవమానశ్చ మే దృష్టః స తస్మిన్ గోమయే హ్రదే
పిబన్నంజలినా తైలం హసన్నివ ముహుర్ముహుః
తతస్తిలోదనం భుక్త్వా పునః పునరధఃశిరాః
తైలేనాభ్యక్త సర్వాంగస్తైలమేవాన్వగాహత
స్వప్నేఽపి సాగరం శుష్కం చంద్రం చ పతితం భువి
ఉపరుద్ధాం చ జగతీం తమసేవ సమావృతామ్ (వా.రా.II,69,8-17)

అనువాదమునపై స్వప్నవృత్తాంతమందలి 'స్వప్నేఽపి సాగరం శుష్కం చంద్రం చ పతితం భువి' యను నొక్కశ్లోకభావముమాత్రమే గ్రహింపబడినది. తక్కిన వివరములనువాదమున కానరావు.

xiii) భరతుడు కైకేయిని నిందించు సందర్భమున తల్లికి పుత్ర శోకము కంటె మించిన దుఃఖము లేదని చెప్పుచు అందుకుదాహరణముగా తన సంతానము పడుక్లేశములను సహింపలేని కామధేనువు కథను వివరించును.[74] వా. రా. నందలి ఈ కామధేను కథ అనువాదమున గ్రహింపబడలేదు.

xiv) శ్రీరాముడు చిత్రకూటముపై నివసించుచున్న సందర్భమున ఆతడు చిత్రకూట పర్వత సౌందర్యమును గూర్చియు, తత్పరిసరమున ప్రవహించు చున్న గంగానది రామణీయకమును గూర్చియు సీతాదేవికి వివరించును. చిత్ర కూట వర్ణనము అయో. కాం.న 94 వ సర్గమునను, మందాకినీ వర్ణనము 95 వ సర్గమునను కలవు. భా. రా. న ఈ రెండు సర్గములును అనువదింపబడలేదు.

xv) భరతుడు చిత్రకూటముననున్న శ్రీరామునొద్దకు వచ్చి ఆతనిని రాజ్యభారము స్వీకరింపుమని ప్రార్థించును. రాముడు పితృనిర్దేశమును పాలించుట యవశ్యకర్తవ్యమని భరతునితో పలుకును. ఈ సందర్భమున జాబాలి శ్రీరాము నకు నాస్తిక మతమును గూర్చి వివరించుటయు, శ్రీరాముడు దానిని ఖండించి ఆస్తికధర్మ ప్రాశస్త్యమునుగ్గడించుటయు మూలమున రెండు సర్గలలో వర్ణింపబడి నవి. అనువాదమున నీ జాబాలి నాస్తికమతనిరూపణముకాని, రాముడు కావించిన జాబాలి మతనిరాకరణముగాని కానరావు. ఇట్లే మూలమున అయో. కాం. 110 సర్గయందు వసిష్ఠుడు కావించిన మనువంశకీర్తనమును అనువాదమున కానరాదు.

**అరణ్యకాండము :-** i) విరాధుడు తన్నుగూర్చి రామలక్ష్మణులకెరి గించుకొను సందర్భమున మూలమున నిట్లున్నది.

> 'పుత్రః కిల జవస్యాహం మాతా మమ శతహ్రదా
> విరాధ ఇతి మామాహుః పృథివ్యాం సర్వరాక్షసాః
> తపసా చాభిసంప్రాప్తా బ్రహ్మణో హి ప్రసాదజా
> శస్త్రేణావధ్యతా లోకేఽచ్ఛేద్యాభేద్యత్వమేవ చ" (వా. రా. III, 5, 6)

ఇట్లు విరాధుడు తల్లిదండ్రుల పేర్లను, తనకు శస్త్రములచే గల యవధ్యతను తెలియజేయుట అనువాదమున కానరాదు.

ii) రామాదులు పంచవటికి పోవుచుండగా మార్గమధ్యమున వారికి జటాయువెదురగును. ఆతడు తాను దశరథుని మిత్రుడనని తెలుపుటయేకాక తన జననక్రమమునుగూడ వివరించును. వా. రా. న నీ జననక్రమమిరువదియారు శ్లోకములలో వర్ణితమైనది.[76] ప్రస్తుతము లభ్యమగు బా. రా. ముద్రితప్రతు లన్నింటను నీ జననక్రమము కనబడుచున్నది.[77] కాని తా. ప్ర. లలో పెక్కింట ఈ విషయము కానరాదు· కావున ము. ప్ర. లయందు కనబడు నీ జన్మక్రమము తరువాతి కవులచే ప్రక్షిప్తమై యుండునని భావించవచ్చును.

iii) శ్రీరాముడు పంచవటి చేరుకొని యట పర్ణశాలలో కాలము గడుపు చుండును. అంత శరదృతువు గడచి హేమంతము వచ్చును. ఒకనాడు సీతారామ లక్ష్మణులు గోదావరికి స్నానమునకై బయలుదేరుదురు. లక్ష్మణుడు మార్గమధ్య మున హేమంతశోభను వివరముగా వర్ణించును. అంతేకాక అయోధ్యలో భరతుడు మునివృత్తి నవలంబించి పడు కష్టములనుకూడ రామునికి జ్ఞప్తిచేసి దానికంతకు మూలమైన కైకను నిందించును. అంత రాముడు మాతృనింద తగదని ఆతనిని మందలించి భరతుని గుణగణములను ప్రశంసించును. వా. రా. న నీవిషయ మంతయు దాదాపు 43 శ్లోకములలో వర్ణితమైనది[78]. భా. రా. న పై హేమంతర్తు వర్ణనముగాని, భరతుని గుణవర్ణనముగాని అనువదింపబడలేదు.

## కిష్కింధాకాండము

i) పంపా సరోవరమును చూడగనే రాముడు విరహతప్తుడై విలపిం చుటయు, లక్ష్మణుడాతని నోదార్చుటయు కి కాం.న 132 శ్లోకములలో విపులముగ వర్ణితములైనవి,[79] ముద్రితభా.రా.లలో ఈ విషయము అరణ్యకాండము చివర మిక్కిలి క్లుప్తముగ కనబడుచున్నది.[80] కాని యీ భాగము పెక్కు తా.ప్ర.లలో కానరాకపోవుటచే ఇది ప్రక్షేపమని భావింపవీలగుచున్నది. అంతేకాక యీఘట్టమున భా.రా న గల క్రింది పద్యము ఈ భాగము ప్రక్షిప్తమనుటను సమర్థించుచున్నది.

మఁగళపవనము నాదు ప్రి
యాంగనపైఁ బొలసి పొలయుమాదట నాపై
నంగంబలపక పంపా
సంగతరంగత్తరంగశైత్యము లొలయన్[81] (III. 2,434)

పై పద్యము వా రా. లోని

"వాహి వాత యతః కాంతా తాం స్పృష్ట్వా మామపి స్పృశ
త్వయి మే గాత్రసంస్పర్శ శ్చంద్రే దృష్టిసమాగమః" (VI, V, 6)

అను శ్లోకమున కనువాదప్రాయముగ నున్నది. వా.రా.న నీ శ్లోకము కిం కాం. న కాక యు.కాం.న కనబడుచున్నది. ఈశ్లోక భావమును గ్రహించి అనంతర కవులెవరో పై పద్యమును రచించియుందురని భావించవచ్చును.

ii) తార వాలి మరణమునకు వగచుచు తననుగూడ చంపినచో భర్తతో పాటు స్వర్గమునకు పోయెదనని శ్రీరాముని వేడుకొనును. విధి విధానము నతిక్రమించుట ఎవ్వరికిని సాధ్యము కాదని శ్రీరాముడామెనోదార్చును వా.రా.న నీవిషయము దాదాపు 25 శ్లోకములలో వర్ణితమైయున్నది.[82] తార శ్రీరాముని వేడుకొనుటయు, ఆతడామెనోదార్చుటయు అను నీ విషయములు భా రా. న కానరావు.

iii) వాలికై విలపించు తారను హనుమంతుడు సమాశ్వాసపరచినట్లు మూలమున నున్నను[83] అనువాదమున కానరాదు.

iv) వాలి మరణానంతరము సుగ్రీవుడు తాను గావించిన పనికి దుఃఖించి నిర్వేర్ణుడై తనకిక రాజ్యభోగములపై ఆసక్తి లేదనియు, ఇక ఋశ్య మూకముననే నిలిచి పోవుదుననియు రామునితో తెలుపును. మూలమున సుమారు 20 శ్లోకములతో వర్ణితమైన ఈ నిర్వేదము[84] అనువాదమున కానరాదు.

v) సుగ్రీవుని పట్టాభిషిక్తుని చేసినపిదప శ్రీరాముడు ప్రస్రవణగిరికి చేరుకొని యట నివాసమేర్పరచుకొనును. ఈ సందర్భమున మూలమున, ప్రస్రవణపర్వతమును, తత్ప్రాంతప్రదేశమును విపులముగ వర్ణింపబడినవి అనువాదమున నివి విడిచివేయబడినవి.

**vi)** వర్షర్తువు గడచి శరదృతువు ప్రవేశించినను తన మాటప్రకారము సుగ్రీవుడు రానందులకు శ్రీరాముడు కుపితుడై లక్ష్మణుని కిష్కింధకు పంపును. లక్ష్మణుడు కిష్కింధకు పోయి సుగ్రీవుని యతఃపురమును చూచి కోపముతో ధనుష్టంకారము గావించును సుగ్రీవుడు లక్ష్మణుడు వచ్చిన విషయము నెరిగి యాతనిని సాంత్వన వాక్యములతో ప్రసన్నుని గావింపుమని తారను కోరును. అట్లే తార లక్ష్మణుని సమీపించి యాతనిని శాంతింపజేయ ప్రయత్నించును. మూలమున నీ విషయము కి.కాం.న 31వ సర్గలో చెప్పబడియున్నది. కాని యనువాదమున నిది కానరాదు. ఈ వృంత్తాంతము దాక్షిణాత్య పాఠమున మాత్రమే కనబడుచున్నది.

**vii)** సుగ్రీవుడు హనుమదాదులకు భూమండలమందలి పెక్కు నదీనదములను, పర్వతములను తెలిపి యందు సీతాదేవిని వెదుకవలసినదిగా వారినాజ్ఞాపించును. అప్పుడు రాముడు 'నీకీ భూమండలజ్ఞానమెట్లు కలిగినద'ని ప్రశ్నించును. వాలి తనను వెంబడించినపుడాతని వలని భయముతో తాను భూమండలమంతయు చుట్టివచ్చినట్లుగ సుగ్రీవుడు తెలుపును. ఈ సందర్భమున మూలమున మాయావితో వాలికి జరిగినపోరాటము వర్ణింపబడినది.[86] రామసుగ్రీవులకు తొలుత సఖ్యమేర్పడిన సమయమున సుగ్రీవునకు వైరమేర్పడుటకు గల కారణమును గూర్చి శ్రీరాముడు ప్రశ్నించినప్పుడును సుగ్రీవుడు మాయావి వృత్తాంతమును చెప్పును.[87] ఈ రీతిగ మాయావివృత్తాంతము మూలమున రెండుచోట్ల వర్ణితమై యున్నది. ఒకే వృత్తాంతమును రెండుమారులు వర్ణించుట చర్విత చర్వణమగునను భావముతో అనువాదమున రెండవమారు వర్ణింపబడిన మాయావి వృత్తాంతము వదలివేయబడియుండును.

**viii)** సంపాతి జటాయువు సోదరుడని తెలిసిన పిమ్మట అంగదుడు.

"జటాయుషో యది భ్రాతా శ్రుతం తే గదితం మయా
ఆఖ్యాహి యది జానాసి నిలయం తస్య రక్షసః"

(వా.రా. IV, 58-9)

అని సంపాతిని కోరును. అంత సంపాతి రావణునిచే కొంపోబడుచున్న సీతాదేవిని తాను చూచినట్లుగ తెలుపుటయే కాక రావణుని నివాసమైన లంకలో సీత

యున్నదనియు, ఆ విషయమును తాను దివ్యచక్షువులతో తెలిసికొంటిననియు వివరించును.[88] కాని యీ విషయము 61వ సర్గమందలి విషయముతో భేదించుచున్నది. అందు రావణుడు సీతను కొంపోయిన విషయము తనకు సుపార్శ్వుడు చెప్పినట్లుగ సంపాతి తెలుపును. ఇట్లు పరస్పర విరుద్ధముగ నుండుటచే సంపాతి తాను స్వయముగా సీతాపహరణమును కాంచితినను విషయము ననువాదమున విడిచివేసి సుపార్శ్వుడు చెప్పిన వృత్తాంతమును మాత్రమే చెప్పెననుటలో నౌచిత్యము గలదు. లేదా మూలమందలి యావిషయము ప్రక్షిప్తమైనను కానవచ్చును.

ix) సంపాతి హనుమదాదులవలన జటాయువుమరణమును విని మిక్కిలి దుఃఖించుచు ఆతడు తన సోదరుడనియు, జయకాంక్షతో తాము సూర్యమండలమునకెగసినప్పుడు జటాయువు పక్షములు సూర్యకిరణములచే కమలిపోగా ఆతనిని తన పక్షములతో కప్పుటయు, అంత సూర్యతాపముచే తన పక్షములు కాలిపోగా తాను వింధ్యపర్వతముపై పడుటయు వివరించును. ఈ వృత్తాంతము మూలమున 58వ సర్గలో సంక్షేపముగను, 61 సర్గలో విపులముగను రెండు మారులు వర్ణింపబడినది.[89] అనువాదమున నీ విషయమొక్కమారే చెప్పబడినది. ఇట్లు చెప్పుటలో పునరుక్తిదోషము లేకపోవుటచే ఔచిత్యము పోషింపబడినదని చెప్పవచ్చును.

x) నిశాకరుడను ముని చెప్పిన వృత్తాంతమును సంపాతి వివరించు సందర్భమున మూలమున ఈ క్రింది శ్లోకములు గలవు.

> "పరమాన్నం చ వైదేహ్యా జ్ఞాత్వా దాస్యతి వాసవః
> యదన్నమమృతప్రఖ్యం సురాణామపి దుర్లభమ్
> తదన్నం మైథిలీ ప్రాప్య విజ్ఞాయేంద్రాదిదం త్వితి
> అగ్రముద్ధృత్య రామాయ భూతలే నిర్వపిష్యతి
> యది జీవతి మే భర్తా లక్ష్మణో వాఽపి దేవరః
> దేవత్వం గచ్ఛతోర్వాపి తయోరన్నమిదం త్వితి"
>
> (వా. రా. IV. 62, 8-10)

సీతాదేవికి దేవేంద్రుడమృతమును ప్రసాదింపబోవు విషయము పై శ్లోకములలో వర్ణితమైనది. అనువాదమున ఈ విషయము కానరాదు.

xi) సముద్రమును దాటగల సమర్థుని గూర్చి అంగదాదులు విచారించు సమయమున వానరవీరులు తామెంతెంతదూరము దాటగలుగుదురో వివరింతురు. హనుమంతుడు మాత్రము దూరమున ఏకాంతముగ కూర్చొనియుండును. అంత జాంబవంతుడాతనియొద్దకు పోయి ఆతని పరాక్రమమును ప్రశంసించుచు ఆతని జన్మవృత్తాంతమును తెలుపుటయేకాక హనుమంతుడను పేరు వచ్చుటకు గల కారణమును గూడ వివరించును. ఇంద్రుడు వజ్రాయుధముచే హనుమంతుని కొట్టినందులకు వాయువు కోపింపగా బ్రహ్మ ప్రత్యక్షమై హనుమంతునకు శస్త్రాదులచే మరణము లేకుండునట్లుగను, ఇంద్రుడు ప్రత్యక్షమై యాతనికి స్వచ్ఛంద మరణము కలుగునట్లుగను వరములిచ్చినట్లుగ ఇందు తెలుపబడినది.[90] ఇంద్రుడు హనుమంతుని వజ్రముతో కొట్టుట, బ్రహ్మేంద్రులు ప్రత్యక్షమై వరములనొసగుట యను నీ విషయములు ఈ సందర్భమున అనువాదమున విడిచివేయబడినవి.

సుందరకాండము :

i) హనుమంతుడశోకవనమున సీతాదేవిని చూచును. ఏకాక్షిమున్నగు భయంకరాకృతులు గల రాక్షసస్త్రీలామెను చుట్టుముట్టియుందురు. మూలమున నీ రాక్షసస్త్రీలవర్ణనము దాదాపు 13 శ్లోకములలో కావింపబడినది.[91] అనువాదమున నీ వర్ణనము పరిహరింపబడినది.

ii) రావణుడశోకవనమునకు వచ్చి సీతతో దుర్భాషలాడి యామె మనస్సును మార్చుటకు రాక్షసాంగనలను నియోగించి వెడలిపోవును. రాక్షసస్త్రీల తర్జన, భర్త్సనములకు సీత మిక్కిలి దుఃఖించుచు మార్గాంతరము తోచక ఉరిపోసికొని మరణింప నిశ్చయించుకొనును. అశోకవనమందలి ఒక శింశుపా వృక్షముక్రిందకు పోయి శ్రీరాముని ధ్యానించి చెట్టుకొమ్మను పట్టుకొనును. ఇంతలో ఆమెకనేకశుభనిమిత్తములు కనబడును.[92] మూలమున వర్ణింపబడిన సీత ప్రాణత్యాగప్రయత్నపు ప్రసక్తికాని, ఆమెకు కనబడిన శుభనిమిత్తముల ప్రసక్తికాని అనువాదమున కానరావు.

iii) సీతాదేవికి తనపై విశ్వాసము కలుగుటకై హనుమంతుడామెకు రామలక్ష్మణుల శరీరలక్షణములను వివరించుచు తన జన్మవృత్తాంతమునుగూడ నిట్లు తెలుపుకొనును.

> ''మాల్యవాన్నామ వైదేహి! గిరీణాముత్తమో గిరిః
> తతో గచ్ఛతి గోకర్ణం పర్వతం కేసరీ హరిః
> స చ దేవర్షిభిర్దిష్టః పితా మమ మహాకపిః
> తీర్థే నదీపతేః పుణ్యే శంబసాదనముద్ధరన్
> యస్యాహం హరిణః క్షేత్రే జాతో వాతేన మైథిలి
> హనూమానితి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా''
> (వా.రా. V, 35, 80-82)

అనువాదమున నీ జన్మవృత్తాంతము వదలివేయబడినది. హనుమ తాను రామదూత యని నమ్మిక కలిగించుటకు రామలక్ష్మణుల శరీరలక్షణవర్ణనమే ప్రధానముకాని హనుమజ్జన్మవృత్తాంతము కాదుకదా!

**iv**) ఇంద్రజిత్తు హనుమంతుని బ్రహ్మాస్త్రముచే బంధింపగా రాక్షసులాతనిని రావణాసురుని సభకు తీసికొనిపోవుదురు. అంత రావణుడాతనిని చూచి ఇంచుక జంకి

> "కిమేష భగవాన్నందీ భవేత్సాక్షాదిహాగతః
> యేన శప్తోఽస్మి కైలాసే మయా ప్రహసితే పురా
> సోఽయం వానరమూర్తిః స్యాత్కింస్విద్బాణోఽపి వాసురః''
> (వా. రా. V, 50, 2-3)

అని సందేహించును. పైరీతిగ రావణుడు సందేహించుట అనువాదమున కానరాదు.

**v**) సీతాదేవి హనుమంతునకు కాకాసురవృత్తాంతమునభిజ్ఞానముగ తెలుపు సందర్భమున మూలమున నిట్లు కలదు.

> 'ఉత్కర్షన్త్యాం చ రశనాం క్రుద్ధాయాం మమ పక్షిణి
> స్రంసమానే చ వసనే తతో దృష్ట్వా త్వయా హ్యహమ్
> త్వయా విహసితా చాహం క్రుద్ధా సంలజ్జితా తథా''
> (వా. రా. V, 38, 17-18)

సీత తన చనుగవను చంచుపుటముతో పొడుచుచు బాధించుచున్న కాకమును తన యొడ్డాణముతో నివారింపప్రయత్నించుటయు, ఆప్రయత్నమున నామెవసనమించుక జాఱుటయు, రాముడది చూచి సీతను పరిహసించుటయు పైశ్లోకములలో చెప్పబడినవి. అనువాదమున నీ మేఖలాప్రసక్తికాని, రాముని పరిహాసప్రసక్తికాని లేవు.

vi) అశోకవనికయందు సీతాదేవిని పలువురు రాక్షసస్త్రీలు చుట్టుముట్టియుండుటచే హనుమంతునకామెతో మట్లాడుటకవకాశము లభింపలేదు. అంత నాతడనేకవిధములుగ ఆలోచించినట్లు మూలమున చెప్పబడినది[93] మూలమున 43 శ్లోకములలోగల ఈ విషయమనువాదమున పరిహరింపబడినది.

vii) సీత యానవాలుగ నిచ్చిన శిరోరత్నమును హనుమంతుడు రామునకిచ్చెను. రాముడు దానిని చూడగనే సుగ్రీవునితో ఇట్లు పలుకును.

> ''మణిరత్నమిదం దత్తం వైదేహ్యాః శ్వశురేణ మే
> వధూకాలే యథాబద్ధమధికం మూర్ధ్ని శోభతే
> అయం హి జలసంభూతో మణిః ప్రవరపూజితః
> యజ్ఞే పరమతుష్టేన దత్తః శక్రేణ ధీమతా'' (వా. రా. V, 66, 4-5)

జనకుడు గావించిన యజ్ఞమునకు సంతుష్టుడైన దేవేంద్రుడాతనికి మణి నొసగుట, జనకుడు దానిని వివాహసమయమున సీతాదేవికి కానుకగా నిచ్చుట అను పై శ్లోకములందలి యంశములు అనువదింపబడలేదు.

viii) సీత అభిజ్ఞానముగ చెప్పిన కాకాసుర వృత్తాంతమును హనుమంతుడు రామునకు తెలియజేయుట మూలమున రెండుమారులు వర్ణింపబడినది. 65 వ సర్గమున అతి సంక్షిప్తముగ సూచింపబడి 67 వ సర్గమున విపులముగ వర్ణింపబడినది. 67 వ సర్గమందలిది భా.రా.న విడిచివేయబడినది. కాకాసుర వృత్తాంతము తెలిసిన రామునకు హనుమంతుడా విషయమును వివరించి తెలుపవలసిన అవశ్యకము లేదు కదా !

యుద్ధకాండము :

i) శ్రీరాముడు లంకకు బయలుదేర నిశ్చయించి వానరసైన్యముతో పాటు సముద్రతీరమును చేరుకొనును. అంత లక్ష్మణుడు తాము రావణుని వధించి తిరిగి సీతను తొందరగనే పొందగలమనియు, తత్సూచకముగ అనేక శుభ నిమిత్తములు కన్పట్టుచున్నవనియు రామునితో పలుకును. వా.రా.న 8 శ్లోకములలోగల ఈ శుభ నిమిత్తముల వర్ణనము[94] భా.రా న కానరాదు.

ii) ధూమ్రాక్షుడు మడిసిన విషయమునెఱిగి రావణుడు కోపోద్రిక్తుడై వానరులపై వజ్రదంష్ట్రుని పంపగా నాతడు వారితో యుద్ధముచేయుచు నంగదునిచే మరణించును. వజ్రదంష్ట్రుని యుద్ధము మూలమున 53 వ సర్గము నందును, ఆతని వధము 54 వ సర్గమునందును వర్ణితములై యున్నవి. భా.రా.న నీ రెండు సర్గములును అనువదింపబడలేదు. ఈ ఘట్టమున మూలమునలేని మహాకాయుని యుద్ధము అనువాదమున గన్పట్టుచున్నది.[95] రం.రా.నను వజ్ర దంష్ట్రుని ప్రసక్తి కానరాదు. భా.రా.న వర్ణితమైన మహాకాయ యుద్ధవర్ణనమిందు కలదు.[96]

iii) రావణునితో యుద్ధము చేయుచు పరిశ్రాంతుడై యున్న రాముని యొద్దకు అగస్త్యుడు వచ్చి 'ఆదిత్య హృదయ'స్తోత్రమునుపదేశించును. మూలమున నీ స్తోత్రము 31 శ్లోకములలో చెప్పబడినది.[97] అతిమహిమాన్వితముగను, మంత్ర తుల్యముగను భావింపబడు నీ స్తోత్రమునను వదించుట యుక్తముగాదని కాబోలు అయ్యలార్యుడు దీనిని వదలివేసినాడు. లేక యిది ప్రధానముగ సూర్యుని వివిధ నామములతో గూడియుండుటచే దీనిని యథాతథముగ ననువదించుట కావ్యమున రసస్ఫోరకముగ నుండకపోవుటయు దీనిననువాదమున వదలివేయుటకు కారణము గావచ్చును.

iv) రావణుని మరణమునకు దురపిల్లు విభీషణుని శ్రీరాముడీ క్రిందివిధముగ నోదార్చినట్లుగ మూలమున గలదు.

"నాయం వినష్టో నిశ్చేష్టః సమరే చండవిక్రమః
అత్యున్నతమహోత్సాహః పతితోఽయమశంకితః

నైవం వినష్టాః శోచంతే క్షత్త్రధర్మవ్యవస్థితాః
వృద్ధిమాశంసమానా యే నిపతంతి రణాజిరే
యేన సేంద్రాదయో లోకాస్త్రాసితా యుధి ధీమతా
అస్మిన్ కాలసమాయుక్తే న కాలః పరిశోచితుమ్
నైకాంతవిజయో యుద్ధే భూతపూర్వః కదాచన
పరైర్వా హన్యతే వీరః పరాన్వా హంతి సంయుగే
ఇయం హి పూర్వైః సందిష్టా గతిః క్షత్రియసమ్మతా
క్షత్రియో నిహతః సంఖ్యే న శోచ్య ఇతి నిశ్చయః"

(వా. రా. VI, 109, 14-18)

ఈ రీతిగ శ్రీరాముడు విభీషణునోదార్చుట యనువాదమున కానరాదు.

v) సీతాదేవి తన పావిత్ర్యమును ప్రకటించుకొనుటకగ్నిప్రవేశము గావింపగా బ్రహ్మాదిదేవతలు శ్రీరామునొద్దకు వత్తురు. దశరథుడును స్వర్గమునుండి పుష్పకమున నటకువచ్చును. రావణుని వధించినందులకు రాముని శ్లాఘించి యాశీర్వదించును. అంత రాముడు దశరథుని నీ విధముగ ప్రార్థించును.

"కురు ప్రసాదం ధర్మజ్ఞ కైకేయ్యా భరతస్య చ
సపుత్రాం త్వాం త్యజామీతి యదుక్తా కైకయీ త్వయా
స శాపః కైకయీం ఘోరాం సపుత్రాం న స్పృశేత్ప్రభో"

(వా. రా VI, 119, 25-26)

రాముడిట్లు దశరథుని ప్రార్థించినట్లు భా. రా. న కానరాదు.

C) ఈ విధముగ ననువాదమున సంగ్రహింపబడినవియు, పూర్తిగ వదలి వేయబడినవియు నగు నంశములున్నను నటనట మూలమును పెంచిన చోట్లును లేకపోలేదు. మల్లికార్జునుని బాల, కిష్కింధా సుందరకాండములందును హుళక్కి భాస్కరుని యు. కాం. పూర్వ భాగమునందును, అయ్యలార్యుని యుద్ధకాండోత్తర భాగమందును మూలమును పెంపుగావించిన భాగములనేకములు గన్పట్టుచుండగా నయోధ్యారణ్యకాండములందు మాత్రము చాల విరళముగ కనబడుచున్నవి.

ఏతత్కాండ కర్తలితరకాండల కర్తలకంటె మూలము నతిసంక్షిప్తము గావింప బూనుటయే దీనికి కారణమని యూహింపవచ్చును. మూలమున నయోధ్యాకాండము దాదాపు 4270 శ్లోకములలో నుండగా ననువాదమున నది 468 పద్యములలో సంక్షిప్తమైనది. ముద్రిత భా. రా. ప్రతులలో వావిళ్ళవారి మొదటి ముద్రణము (1910) నందును, ఆనందాశ్రమవారి ప్రతియందును నయోధ్యాకాండమున 327 పద్యములు మాత్రమే కలవు. అర. కాం. న మూలమున దాదాపు 2468 శ్లోకము లుండగా ననువాదమున ము. ప్ర. లన్నింటియందును 730 పద్యములు కన్పట్టు చున్నను తా. ప్ర. లలో నున్నవి 383 పద్యములు మాత్రమే. అనగా మూలముకంటె నయోధ్యాకాండము పదమూడు వంతులును, అరణ్యకాండము ఆఱు వంతులును సంక్షిప్తము గావింపబడివన్నమాట. తక్కిన కాండములీ రెండింటియంత సంక్షిప్తములు కావు.

భా.రా.న గావింపబడిన పెంపును ముఖ్యముగ నీక్రింది యారు విధములుగ విభజింపవచ్చును.

1. మూలమున లేని కథాంశములను చేర్చుట
2. అమూలకములగు వర్ణనములను ప్రవేశపెట్టుట.
3. మూలమున లేని భావములను నిబంధించుట.
4. మూలమునందలి పదమునో, పదసమూహమునో ఆధారముగ చేసుకొని యందలి భావమును విపులీకరించుట.
5. మూలమునందలి భావమునుత్ప్రేక్షాద్యలంకారయుక్తముగ పెంపుచేయుట.
6. వ్యక్తులను కాని, వస్తువులను కాని వర్ణించుచోట్ల మూలమున లేని విశేషణ ముల నధికముగ చేర్చి వర్ణించుట.

భా రా.న పై వానికనేకనిదర్శనములున్నవి. వానిలో ముఖ్యమైనవి కొన్ని మాత్రమే యిట పేర్కొనబడుచున్నవి.

అమూలక కథాంశములు :- అమూలకములగు కథా భాగములెక్కువగ యు.కాం న గలవు. ఇతర కాండములందటనట కొన్ని యమూలకాంశములున్నను

అవి కథాభాగములు కావు. అర.కాం.న జంబుకుమారవధ వృత్తాంతము ము.ప్ర. లలో కనబడుచున్నను తా. ప్ర. లలో కానరానందున దానిని భా. రా. నందలి అవాల్మీక కథాంశముగ గుర్తింప వీలులేదు. యు.కాం. న గల యవాల్మీకములగు కాలనేమి కథయు, తదంతర్గతమగు ధాన్యమాలిని కథయు దాదాపు 110 పద్యములలో[98] మనోజ్ఞముగ వర్ణింపబడినవి. ఇట్లే భరతుని దుఃస్వప్న వృత్తాంతము, రావణుని పాతాళ హోమము, మండోదరీ కేశగ్రహణము మున్నగు నంశములను భా. రా. కర్తలు క్రొత్తగా చేర్చి యు. కాం. ను విశేషముగా పెంపు కావించిరని తెలియుచున్నది. మూలమున యు. కాం. దాదాపు 5908 శ్లోకములలో నున్నది. వీనిలో 3442 శ్లోకముల గ్రంథమును హుళక్కి భాస్కరుడు 1168 పద్యములలోను, తక్కిన 2466 శ్లోకముల గ్రంథమును అయ్యలార్యుడు 1515 పద్యములలోను అనువాదములను కావించినారు. దీనినిబట్టి అయ్యలార్యుడు హుళక్కి భాస్కరునికంటె మిక్కిలి విపులము కావించినాడని తెలియుచున్నది.

ii) అమూలకములగు వర్ణనములను ప్రవేశపెట్టుట :

i) మూలమున నయోధ్యానగర వర్ణన సందర్భమున నా పురమందలి చాతుర్వర్ణ్యమును, చతురంగబలాదులును దాదాపు 9 శ్లోకములలో సాధారణముగ వర్ణింపబడినవి.[99] మల్లికార్జునుడీ యంశములకు మరికొన్నింటిని చేర్చి ఈ సందర్భమును పదమూడు వృత్తములలో నెంతో రమ్యముగను, విపులముగను వర్ణించి, పుర వర్ణనము విషయమున తరువాతికవులకు మార్గదర్శకుడైనాడు. ఈ సందర్భముననే యీతడు పరిసంఖ్యా, శ్లిష్టోపమా, విరోధాభాసాద్యలంకారములతో బాణుని రచనను తలపింపజేయు శైలిలో నయోధ్యాపురమును, అందలి ప్రజలను వర్ణించుట కావ్యమునకెంతో రామణీయకమును గూర్చుచున్నది. ఇట్టి వర్ణనము మూలమున కానరాదు.

ii) హనుమంతుడు సముద్రమును లంఘింపదలచి మహేంద్ర పర్వతమునెక్కగా అనతిదూరమున నాతనికి సముద్రము కనిపించును. మూలమున ఈ సందర్భమున సముద్రవర్ణనము కానరాదు. అనువాదమున ఈ వర్ణనము ముచ్చటగా మూడు పద్యములలో గావింపబడినది.[102] అనితరసాధ్యమగు సముద్ర లంఘనము గావింపబోవు హనుమంతుని ధైర్యసాహసములకే వర్ణనముత్కర్షాధాయకముగ నున్నది.

iii) ఆంజనేయుడశోకవనమును ప్రవేశించి యందలి శింశుపావృక్షమును చూచుటకు ముందు ప్రాతఃకాలము మూడు పద్యములలో వర్ణింపబడినది. ఈ వర్ణనము మూలమున కానరాదు.

iv) హనుమంతుడశోకవనముననున్న సీతాదేవిని గాంచి యామెకై పరితపించుచుండును. అంత వేగుజామగుచుండుటచే రాక్షసులకు భయపడి యామెతో నప్పుడు సంభాషించుట యుక్తముగాదనియు, రాత్రి వచ్చి తన వచ్చిన కార్యము విన్నవించుట యుక్తమనియు తలచి తరుశాఖా పర్ణములందొదిగి యుండును. ఈ సందర్భమున మూలమున నొక్క చంద్రోదయము మాత్రమే వర్ణింపబడినది.[104] కాని యనువాదమున చంద్రోదయముతోబాటు సూర్యోదయాస్తమయములును మనోహరముగ వర్ణింపబడినవి.[105]

v) వానరులు సేతువును నిర్మించుటను వర్ణించు సందర్భమున మూలమున సూర్యాస్తమయ, చంద్రోదయ, సూర్యోదయ వర్ణనములు కానరావు. భాస్కరుడీ ఘట్టమున నొకచోట సూర్యాస్తమయమును, మరొకచోట సూర్యాస్తమయ చంద్రోదయములతోపాటు సూర్యోదయమును వర్ణించినాడు. దినమంతయు సేతు నిర్మాణమున అలసిపోయిన వానరులు సేదదీర్చుకొనుట కనువగురీతిగ నిట్లు సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనములను గావించుట ఔచిత్య శోభితముగ నున్నది. ఈ వర్ణనములన్నియు ప్రకృత కథా వస్తువునకు సందర్భించునట్లు వర్ణింపబడుట వీనిలోని మఱొక విశేషము. ఇందలి రెండు పద్యములను మాత్రముదాహరింతును.

**సూర్యాస్తమయము :**

"నా నగము పెఱికి కట్టకు
వానరులంభోధిలోన వైవకయుండన్
నేనుండెదఁ గాపనుగతి
భానుం డస్తాచలంబు పైకేగుటయున్" (భా.రా. VI, 256)

**చంద్రోదయము :**

'కంటకిఁగూర్కు లేక దశకంఠుని చేఁబడు లోకమింక ని
ష్కంటకమయ్యె నా నుదధిఁగట్టగఁదానటఁబంచె రాముడి

ట్లొంటకఁగాదు బెగ్గిలకుడో యని వేల్పులు సాటనెత్తు జే
గంట తెఱంగునంబొలిచెఁగై రవబంధుడు బంధురద్యుతిన్"

(భా. రా. IV, 274)

vi) రావణుని మూలబలములు రామునితో యుద్ధమునకు దలపడినపుడు మూలమునలేని సూర్యోదయము క్రింది సీసపద్యమున మనోజ్ఞముగ వర్ణింపబడినది

రాక్షసీకబరీభరంబుల చాడ్పున
విపులాంధకారంబు విరియఁబాఱ
దానవీహారముక్తాఫలంబుల క్రియం
బొరిబొరిఁ దారల పొలుపు దొలఁగ
నసురీముఖోజ్జ్వల హాసంబుకై వడి
నిండారు వెన్నెల నిక్కుదక్క
నక్తంచరీలోచనంబుల పోలికి
నసితోత్పలంబుల పసనుపొలియఁ

గపుల ముఖములతోఁ గూడఁ గమలచయము
లోలి వికసింప నక్రభంబు నొఱపుతోన
జనపతుల నెమ్మనములు ప్రసాదమంద
నుదయశైలంబుపైఁ దోచె నుష్ణకరుఁడు. (భా. రా. VI, 1437)

vii) రెండవమాఱు సంజీవని దెచ్చుటకై బయలుదేరిన హనుమంతుని ప్రస్థానముగాని, ప్రయాణముగాని మూలమున వర్ణింపబడలేదు. అందు 'గత్వా చౌషధిపర్వతమ్' అను నొక్కవాక్యమున నాతని ప్రయాణము పేర్కొనబడినది. అనువాదమున 'శాఖాహివేగున శిరములు వంపఁగ నవనీధరంబుపై నడ్గునూది' (VI, 1614) యను పద్యమున నాతని ప్రయాణసన్నాహము పేర్కొనబడినది. 'సరసిజనాభముక్తమగు చక్రముకైవడి, (VI, 1615) యను తరువాతి పద్యమున నాతని ప్రయాణము వర్ణింపబడినది.

viii) శ్రీరాముని యభిషేకవిధికి సముద్రజలములను గొని వచ్చుటకై జాంబవదాదివీరులు బయలుదేరు ఘట్టమున మూలమునలేని సూర్యాస్తమయము,

అంధతమసము, చంద్రోదయము, సూర్యోదయము దాదాపు 17 పద్యములందును, నొక గద్యమునను వర్ణింపబడినవి.[106] అంధతమసము వర్ణింపబడిన గద్యము శ్లిష్టోపమలతో గూడినదియై బాణుని రచనను దలపించును.

iii) మూలమున లేని భావములను నిబంధించుట

i) ఋశ్యశృంగుడు జన్మించినది మొదలు స్త్రీపురుషవిభేదము తెలియని నాడు. నాగరికమైన యే విషయముతోడను ఆతనికి పరిచితి లేదు. అట్టి అతిముగ్ధ హృదయుని హృదయము నాకర్షింప సుభాషితలగు వారకాంతలు వచ్చి యాతనికి మోదకాది భక్ష్యములను సమర్పించి వీనులవిందుగా గానము సేయుదురు. అంత నాతడు వారికిచ్చిన మోదకములను రుచ్యములగు ఫలములనియు,గానమును మధుర స్వరవేదమనియు భావించి వానిని గూర్చి ప్రశ్నించును. అంతేకాక యా తరుణుల వృత్తస్తనములను, హారములను, చందన చర్చలను, వారు కట్టిన మృదువస్త్రము లను చూచి వానినిగూర్చి యమాయికముగ నిట్లు ప్రశ్నించును.

నాకుఁ బోలెఁగావు మీకురంబున రెండు
వలుదగుజ్జు కొమ్ములలరుచున్న
వలతి తులసిపూస లతిసితములు మేనఁ
దనర నలదినారు దా విభూతి

ఈ కట్టిన వల్కలములు
మీకెంతయు లెస్సలింత మృదువులు గలవే
యే కుజముల నారలో యివి
మాకును నివి యొసగవలయు మానుగ మీరల్

ఈ మధురస్వరవేదం
బేమెన్నడు వినము మీకు నే ముని సెప్పెన్
వేమఱు మీతోఁ జదివెద
నో మునివరులార చెప్పుడొప్పుగ నాకున్

(భా.రా.I, 84 & 86-87)

ఋశ్యశృంగుని ముగ్ధప్రవృత్తిని తెలియజేయు పై పద్యములందలి భావ ములు మూలమున కానరావు.

ii) శ్రీరాముడానవాలుగ నిచ్చిన యుంగరము నాంజనేయుడు సీతకీయగా నామె దానిని గ్రహించి యక్కున జేర్చి

"బ్రాతిగ నిటు గ్రైవేయక
మై తోచెదు నాకు, నాడు ప్రాణేశునకుం
జేతం బెట్టగఁ గంకణ
మైతో కేయూరమైతొ యచ్చటఁ జెపుమా" (భా.రా.V 293)

యని భావగర్భితముగ పలుకును. పై పద్యమందలి భావమమూలకము.

iii) ఆంజనేయుడు తన వాలాగ్నిచే లంకను గాల్చు సందర్భమున గల యీ క్రింది పద్యమును పరిశీలింపుడు.

'పదములు బట్టుచున్ దొడలు ప్రాకుచు నేచి కుచంబులంటుచుం
బెదవులు చీకుచుంగరము పేర్చి కచగ్రహణంబు సేయుచున్
సుదతులయందు రాగములు సూపుచుఁ బావకుఁడొప్పె నెంతయున్
మదనసుఖోచితక్రియలు మక్కువ జల్పెడు కామికైవడిన్
(భా.రా.V, 489)

ఇందు అగ్ని, సుదతులయందు శృంగారచేష్టలు సలిపెడి కాముకుడుగ వర్ణింపబడినాడు. ఈ మనోహరభావము మూలమున కానరాదు.

iv) శ్రీరాముడు రెండవమారు ఆంజనేయుని ఓషధులు దెమ్మని యిట్లు ప్రార్థించును.

సోదరులమేము నలువుర
మైదవ తోడగుదు వీవు ననయము జేతో
మోదంబు మిగుల గలుగున్
నాదెసఁగృపసేయవయ్య నగచరవర్యా (భా.రా. VI, 1608)

ఇట్లాంజనేయునకు సోదరస్థానమిచ్చి గౌరవించుట మూలమున లేని భావము. శ్రీరామున కాంజనేయునిపైనున్న వాత్సల్యము నీ పద్యము చక్కగ

వ్యక్తము చేయుచున్నది. ఈ పద్యమునకు మూలమనదగు శ్లోక మితర ప్రతులలో గన్పట్టకున్నను పశ్చిమోత్తర శాఖీయప్రతిలో కనబడుచున్నది.

"గచ్ఛ వీర మహాబాహో భ్రాతృభిక్షాం దదస్వ మే
చతుర్ణామేవ భ్రాతౄణామస్మాకం పంచమో భవ"[107]

v) శరణాగతరక్షకుడగు శ్రీరాముడు వైరిసోదరుడైన విభీషణున కాశ్రయమీయగా సుగ్రీవుడు

'అనఘచరిత్ర మీకు శరణాగతరక్ష కులవ్రతంబు మీ
సునిశితబాణజాలములు చోఁకునకోర్వక వచ్చి తా దశా
ననుఁడభయంబు వేడికొనినందగవెట్లగు' (భా. రా. VI, 191)

అని రాముని ప్రశ్నించును. అంత రాముడు 'అట్లయిన నిచ్చెదవాని కయోధ్య'నని పలుకును. శ్రీరాముని పాత్రమునకుదాత్తతను చేకూర్చు నీ భావము భాస్కరకల్పితమే. మూలమున లేని భావమిది. 'ఇతడనగ నెంత శరణాగతుఁడైన దశాస్యునైన గాతున్' అను పద్యమునను[108] ఈ భావమే పునరుక్తమైనది. త్యాగయ్య కూడ

"హితవుమాటలెంతో బాగ బల్కితివి
సతముగా నయోధ్య నిత్తునంటివి"

అన్న మధురమైన వాక్కులలో నీ భావమునే ప్రతిధ్వనింపజేసినాడు.

vi) ఆంజనేయుడు రెండవమారు ఓషధిని తెచ్చుటకు బయలుదేరుచుండును. అప్పుడు శ్రీరాముడాతని నిట్లాశీర్వదించును.

'హరి శిరమాదిత్యుడాననపద్మంబు
శశిమనోవృత్తియు శైలతనయ
కటియు వాయువు వీఁపు కామారి వాలంబు
నగ్ని పాదంబులు నబ్జభవుఁడు

మతిఁ బాశహస్తుండు మహనీయశక్తియు
బంకజనాభుండు పాణియుగము
గజముఖుఁడుదరంబు గడకతో నేఁ ప్రొద్దు
గాతురు నినుఁ బ్రీతిఁ బ్రోతురెపుడు (భా. రా. VI, 1613)

పై పద్యమందలి భావమమూలకము.

vii) శ్రీరాముఁడు లంకనుండి తిరిగివచ్చి అయోధ్యానగరమును ప్రవేశించిన సమయమున నందలి ప్రజలు రామలక్ష్మణులయు, వారికి సాహాయ్యము గావించిన సుషేణ, విభీషణ, హనూమన్నలసుగ్రీవులయు మహత్త్వమును గూర్చి తమలో తాము చెప్పుకొనుచు ఆనందించుట యనువాదమున మిక్కిలి వివరముగ వర్ణింపబడినది. శ్రీరాముఁడు సుగ్రీవాదుల సాహాయ్యమును గూర్చి మంత్రులకు చెప్పుటయు, ప్రజలు విని సంతోషించుటయు మూలముననున్నను నది రెండు మూడు శ్లోకములలో మిక్కిలి క్లుప్తముగ నున్నది.

iv) మూలముననున్న ఒక్క పదమునో, పదసమూహమునో ఆధారముగ చేసికొని అందలి భావమును విపులముగ చెప్పుట.

i) తాటకను సంహరించుటకు ముందు శ్రీరాముఁడు వనమునందలి వనాటులకు భీతిగొలుపునట్లు తీవ్రముగ మౌర్వి మొరయించుట మూలమున నీ క్రింది శ్లోకమున జెప్పబడినది.

ఏవముక్త్వా ధనుర్మధ్యే బద్ధ్వా ముష్టిమరిందమః
జ్యాఘోషమకరోత్తీవ్రం దిశః శబ్దేన నాదయన్" (వా. రా. I, 26, 6)

ఇందలి యుత్తరార్ధభావమును మల్లికార్జునుడు విపులీకరించి యెంత మనోహరముగ చిత్రించినాడో చూడుడు.

'అంతఁగడంక రాముఁడు సమగ్రభుజాబలవిక్రమోత్సవం
బెంతయుఁ బర్వ మౌర్వి మొరయించె దిగంతరదంతికర్ణరం
ధ్రాంతరసాగరాంతరధరాభ్రతలాంతరచక్రవాళశై
లాంతరసర్వభూధరగుహాకుహరాంతరపూరితంబుగన్'
(భా. రా. I, 258)

ii) విశ్వామిత్రుడు రామలక్షణ సహితుడై జనకుని యజ్ఞవాటమును ప్రవేశించును. ఈ సందర్భమున మూలమున యజ్ఞవాటికా వర్ణనము ఈ క్రింది విధముగ నున్నది.

బహూనీహ సహస్రాణి నానాదేశనివాసినామ్
బ్రాహ్మణానాం మహాభాగ వేదాధ్యయనశాలినామ్
ఋషివాటాశ్చ దృశ్యంతే శకటీశతసంకులాః

(వా.రా. I, 50, 3-4)

అనువాదమున 'మాళవనేపాళమగధాంధ్ర పాంచాల (I, 535) యను పద్యమున నీ విషయము విపులముగ వర్ణింపబడినది. ఇందు మూలమున లేని హోమధూమతతులు, దధిఘృతక్షీరాది హోమద్రవ్యములు, పశుసమంచిత యూపములు, కనకమయవేదికలు మున్నగు యజ్ఞాంగములు పేర్కొనబడుటచే యజ్ఞవాటిక సర్వాంగీణరూపము కన్నులకు గట్టునట్లుగ ప్రత్యక్షమగుచున్నది. మూలమునందలి 'నానాదేశనివాసినామ్' అన్న పదము 'మాళవనేపాళ మగధాంధ్ర పాంచాల భోజకాంభోజాది భూమిపతులు' అను సీసపాదమున వివరింపబడినది.

iii) విశ్వామిత్రుడు బ్రహ్మర్షిత్వమును పొందుటకై తపమాచరించుచుండగా నటకు మేనక వచ్చును. ఆమె యాతని దృష్టిపథమున బడిన విషయము మూలమున నిట్లు వర్ణింపబడినది.

'తాం దదర్శ మహాతేజా మేనకాం కుశికాత్మజః
రూపేణాప్రతిమాం తత్ర విద్యుతం జలదే యథా

(వా.రా. I, 68, 5)

పై శ్లోకమునందలి యుత్తరార్ధమును గ్రహించి మల్లికార్జునుడు మేనకా సౌందర్యమునెంత విపులముగ వర్ణించినాడో చూడుడు

"కరికుంభ స్తనభారమున్న తతటిత్కల్పప్రియాకారమున్
హరినీలోపలవేణియుంబ్రథిత దివ్యశ్రోణియుం బద్మభా
స్వరరూపాస్యవికాసమున్ శరదుదంచచ్చంద్రికాహాసముం
బరగన్ మేనక వచ్చి యచ్చటఁజరింపంజూచి మోహాంధుఁడై"

(I, 661)

విశ్వామిత్రుడు మోహాంధుడగుటకు కారణమైన మేనక సౌందర్యాతిశయ మును విపులముగ వర్ణించుట ఔచిత్యాపాదకముగ నున్నది.

iv) వనవాసార్థము బయలుదేరు సమయమున శ్రీరాముడు నారచీరలను ధరించి మునివృత్తిని గైకొనినట్లుగ నతిసాధారణముగ వర్ణింపబడినది.

'స చీరే పురుషవ్యాఘ్రః కైకేయ్యాః ప్రతిగృహ్య తే
సూక్ష్మవస్త్రమవక్షిప్య మునివస్త్రాణ్యవస్త హ' (వా.రా. II, 37,7)

మల్లికార్జునుడీ తాపసవేషధారణమును

"కస్తూరికాపుష్పగంధబంధురవేణి
బంధమూడిచి జటాభారమూని
కోమలచారుదుకూలంబు లెడలించి
కర్కశవల్కలాంశుకములు గట్టి
పరిలిప్త చందనపంకంబు వోఁజేసి
నిర్మలభసితంబు నిండనలది
మహనీయబహురత్నమండనంబులు పుచ్చి
లీలమై నక్షమాలికలు దాల్చి (భా.రా. II, 205)

యను సీసపద్యమున విపులముగ వర్ణించినాడు

v) రామాదులగస్త్యునిచే సత్కృతులై పంచవటికి పోవుచుండగా వారికి జటాయువెదురగును. ఈ సందర్భమున మూలమున జటాయువు వర్ణనము రెండు విశేషణములందు మాత్రమే కన్పట్టుచున్నది.

'అథ పంచవటీం గచ్ఛన్నంతరా రఘునందనః
ఆససాద మహాకాయం గృధ్రం భీమపరాక్రమమ్' (III, 14,1)

కాని యనువాదమున

బలితంపు తెక్కలు గలిగిన మైనాక
కుధరంబు మీఱిన గొప్పమేను
గండభేరుండాదిఖగములఁ గబళించి
వ్రక్కలు గావించు వలుదముక్కు

నుదయార్కబింబంబు నురుదీప్తిఁ గప్పెడు
ఖరదృష్టిఁ బెంపారు కన్నుఁగవయు
వజ్రాయుధంబు క్రొవ్వాడిమి మెచ్చని
ఖరనఖంబుల నొప్పు చరణయుగము' (భా.రా. III, 1, 102)

అను సీసపద్యమున జటాయువుభయంకరాకార మాతని పక్షాదుల విపుల వర్ణనముచే సంభృతమై మూలమునకు మెఱుగులుపెట్టుచున్నది.

vi) హనుమంతుడశోకవనముననున్న సీతను చూచి యామెను శ్రీరాముడు చెప్పిన యాభరణాద్యభిజ్ఞానముచే సీతగా నిర్ణయించుకొని

'అస్యా దేవ్యా యథారూపమంగప్రత్యంగసౌష్ఠవమ్
రామస్య చ యథారూపం తస్యేయమసితేక్షణా' (వా.రా. V, 15,51)

అని మనమున భావించును. ఇందు సూచనగా పేర్కొనబడిన సీతాదేవి యంగప్రత్యంగసౌష్ఠవము అనువాదమున విపులీకరింపబడినది.

సరసిజ సౌందర్య సదనంబు వదనంబు
చారుసధారసస్రావి మోవి
పరిభూతబిసపద్మ ఖాతులు చేతులు
కదళికాయుగళంబు గడలు దొడలు
ముహురుదంచితకాంతిముచములు కుచములు
భూరిసువర్ణవిస్ఫూర్తి మూర్తి
చతురవిలోకనాసాధ్యంబు మధ్యంబు
తీపారు కందర్పుతూపు చూపు

లోలభావసూచనములు లోచనములు
ధర్మవతి మతి యభిమానధనము మనము
కాన యీ సతి కెనయగు మానవతులు
సొరిది మూడు జగంబులఁ జూడగలరె (భా.రా. V. 158)

శబ్దాలంకారసౌందర్యముతో విలసిల్లు ఈ పద్యము తరువాతి కాలమున పోతన మహాకవికి గూడ అనుకార్యమైనది.

vii) ఆంజనేయుడు సీతమ్మకు తన విశ్వరూపమును చూపు సందర్భమున మూలమున ఆతని యౌన్నత్యము.

'మేరుమందర సంకాశో బభౌ దీప్తానల ప్రభః' (వా.రా. V, 37, 37) అను శ్లోకమందలి 'మేరుమందరసంకాశః' అను పదమున చెప్పబడినది. మల్లికార్జునుడు ఈ భావమును.

'జలనిధులు జానుదఘ్నం
బులుగాఁగులగిరులు గజ్జపొడవులుగాఁ దా
రలు దలపువ్వులుగా ది
క్కులు కడవంబెటిగెఁ గనకకుధరముఖంగిన్ (భా.రా.V, 308)

అను పద్యమున భంగ్యంతరముగ పెంచుటయేకాక మూలభావమును రమణీయతరము గావించినాడు.

viii) శ్రీరాముడు వానరసైన్యముతోపాటు సముద్రతీరమును చేరకొనియట తాను సీతావియోగముచే పొందు బాధను లక్ష్మణునికి తెలుపుకొనును. అంత సూర్యాస్తమయమగును. మూలమున నీ సూర్యాస్తమయము

'ఏవం విలపత స్తస్య తత్ర రామస్య ధీమతః
దినక్షయాన్మందవపుర్భాస్కరోఽ స్తముపాగతః (వా.రా.VI, 5,22)

అను నొక్క శ్లోకమున చెప్పబడినది. భాస్కరుడీసందర్భమున సూర్యాస్తమయముతోబాటు సంధ్యాసమయము, తమోవ్యాప్తి, తారకోదయము, చంద్రోదయము, చంద్రికావ్యాప్తి యనువానిని ఒక్కొక్కపద్యమున మొత్తమైదు పద్యములలో వర్ణించినాడు.[109]

ix) మృతుడై యుద్ధరంగమున పడియున్న రావణుని చూచుటకు మండోదరి మున్నగునంతఃపురస్త్రీలు అటకు పోవుదురు. ఈ సందర్భమున మూలమున

'పరిపేతుః కబంధాంకాం మహీం శోణితకర్దమామ్'

అను శ్లోకపాదమున యుద్ధరంగము సాధారణముగ వర్ణితమైనది. దీనినాధారముగ గ్రహించి అయ్యలార్యుడు ఒక పెద్ద గద్యముతోబాటు ఎనిమిది పద్యములలో విపులముగ వర్ణించినాడు[110].

x) రావణునొద్దకు దూతగా వెడలిన యంగదుడు

దూతోఽహం కోసలేంద్రస్య రామస్యాక్లిష్టకర్మణః
వాలిపుత్రోంఽగదో నామ యది తే శ్రోత్రమాగతః

అని తన్నెఱింగించుకొనును. భాస్కరుడిందలి 'అక్లిష్టకర్మణః,' 'యది తే శ్రోత్రమాగతః' అనువానిని అనువాదమున నిపులీకరించుచు నీ క్రింది పద్యమును రచించెను.

'చెఱనిడి నీ మదంబడఁగఁజేసిన యర్జును వేయిచేతులన్
నఱికి భుజావిజృంభణమునంగడుబేర్చిన జామదగ్న్యు విల్
విఱిచిన రాముబంట వినవే నను నంగదు సర్వగర్వమున్
నెఱిసెడ నాల్గు వారిధులు నిన్నటు ముంచిన వాలిపుత్రుఁడన్'

(VI, 505)

xi) నికుంభిలయందింద్రజిత్తు గావించుచున్న హోమమునకు విఘ్నము కలిగించుటకై లక్ష్మణుడు బయలుదేరుట మూలముననిట్లు చెప్పబడినది.

'కృతస్వస్త్యయనో భ్రాత్రా లక్ష్మణస్త్వరితో యయౌ'

(వా.రా. VI, 85,30)

ఇందలి 'కృతస్వస్త్యయనః' అను నొక్కపదమును గ్రహించి భాస్కరుడెంత వివరముగ రామునిచే స్వస్త్యయనము గావింపించినాడో చూడుడు.

"జయమొసగున్ రమావరుఁడు శంకరుఁడున్ సుఖమిచ్చు నగ్నియున్
నియతము తేజమొప్పఁగరుణించుఁ జిరాయురుపేతుఁజేయు బ్ర
హ్మయు నని పెక్కుదీవనల నాపతి తమ్ముని గారవించి వే
డ్కయు గృపతోడినెయ్యము బెడంగున ముప్పిరిగొనఁగ నెంతయున్"

(vI, 1312)

xii) ఇంద్రజిద్వధముచే క్రుద్ధుడైన రావణుడు రాఘవులను వధింపబూని రాక్షసమూలబలమును పంపు సందర్భమున మూలమున నిట్లున్నది.

"స ప్రవిశ్య సభాం రాజా దీనః పరమదుఃఖితః
నిషసాదాసనే ముఖ్యే సింహః క్రుద్ధ ఇవ శ్వసన్

అబ్రవీచ్చ స తాన్ సర్వాన్ బలముఖ్యాన్ మహాబలః
రావణః ప్రాంజలిర్వాక్యం పుత్రవ్యసనకర్శితః''

(వా. రా. VI, 93, 1-2)

మూలమున రావణుని క్రోధావేశము 'సింహః క్రుద్ధ ఇవ శ్వసన్' అను వాక్యమున మాత్రమే వ్యక్తముకాగా అయ్యలార్యుని రచనమున నది యెట్లు మూర్తీభవించినదో క్రింది పద్యమున కాననగును.

రోషాధిదేవతారుధిరోపహార పా
　　త్రలభంగి నెఱ్ఱ కన్నులకుఁదెచ్చి
ముడివడ్డ బొమలచే మొగములు ఘనరుద్ధ
　　విలయార్కమండలములనఁదనరి
దిగ్గజాధిపదంతదీర్ఘంబులగుచున్న
　　కోఱల క్రొమ్మెఱుంగులు వెలుంగ
రదనఘట్టనములఁబొదలిన మిడుగురు
　　గములోలి మిన్నెల్లఁగలయఁ బర్వ

జగములన్నియు నొక్కట సమయఁజేయ
నప్పళించు కృతాంతుని ననుకరించి
కలయ రాక్షసకోటులఁబలికె నిట్లు
ధీరవారాశినాదంబు తేటపడగ　　(VI, 1425)

**V) మూలమందలి భావమునలంకారయుక్తముగ పెంపుచేయుట :**

i) ఋశ్యశృంగమునిని అంగదేశమునకు కొనివచ్చుటకై బయలుదేరిన వారకాంతలు ఆతడు నివసించు పుణ్యావనమును ప్రవేశించినవిధము మూలమున

''వారముఖ్యాస్తు తచ్ఛ్రుత్వా వనం ప్రవివిశుర్మహత్''(వా.రా. I, 10, 7)

అను శ్లోకమున సాధారణముగ చెప్పబడినది. కాని యనువాదమున 'తరళహారద్యుతుల్ దంతకాంతులు బర్వి తరులకు నవపుష్పతతులుగాగ (I, 76) నను సీసపద్యమున వారు తమ యవయవకాంతులచే వనమునకు వింతశోభను కలిగించుచు ప్రవేశించిరని యాలంకారికముగ వర్ణింపబడినది.

ii) శతానందుడు జనకసభలో విశ్వామిత్రుని మహత్త్వమును వివరింపగా రామలక్ష్మణులు, అక్కడి సభాసదులును ఆతనిని ప్రశంసించి పూజింతురు. అంత సాయంకాలమగును. మూలమున

''కర్మకాలో మునిశ్రేష్ఠ లంబతే రవిమండలమ్'' (వా.రా. I, 65, 36)

అను శ్లోకమున సాయంకాలమైనట్లుగ పేర్కొనబడినది. మల్లికార్జునుడు దీనినాలంకారికముగ పెంచి యీ క్రిందిపద్యమును వ్రాసినాడు.

''నా కులజుఁడైన రాముఁడు
శ్రీకంఠుని విల్లు విఱిచి సీతంబ్రీతిం
గైకొను రేపని చెప్పగ
నాకమునకు నరుగు విధమునన్ రవి గ్రుంకెన్'' (భా.రా. I, 683)

iii) సుగ్రీవుడు శుకునితో రావణునకు సందేశమును పంపు సందర్భమున మూలమున నీ విషయము అతిసాధారణముగ వర్ణితమైయున్నది.[111] భాస్కరుడు విషయమునకు అలంకారికముగ నెంత వన్నె గూర్చినాడో క్రిందిపద్యము తెలియ చేయుచున్నది.

"విలు యూపంబు శరాళి దర్భతతి మౌర్వీటంకృతుల్ మంత్రముల్
గలితాసృక్ఛటలాజ్యధారలు నిషంగద్రోణికల్ స్రుక్స్రువం
బులుగా రాముఁడు యాజకుండయి సమిద్భూవేదిఁ గోపానలా
ర్చులతో నద్దశకంఠుఁడన్పశువు వేల్చున్ నిర్జరప్రీతిగన్" (vi, 208)

పై పద్యమందలి యాలంకారికత మూలమున కానరాదు.

iv) వానరులకును, రాక్షసులకును జరిగిన నిశాయుద్ధమును వర్ణించుటకు ముందు మూలమున

"యుధ్యతామేష తేషాం తు తదా వానర రక్షసామ్
రవిరస్తంగతః" (vi, 44,1)

అను శ్లోకమున సూర్యాస్తమయము నిరలంకారముగ చెప్పబడినది. భాస్కరుడు ఈ విషయమును

"ఇరుదెసలవారు నితరే
తరజయకాంక్షలఁ బెనంగఁదన బింబము ప
ల్దెరువులుగ విరియు నిక నని
యరుగుకరణిఁ దరణి గ్రుంగె నా సమయమునన్" (vi, 529)

అను పద్యమున ఉత్ప్రేక్షాసహితముగ నెంతో మనోహరముగ వర్ణించి నాడు.

v) నికుంభిలలో యాగము గావించుచున్న యింద్రజిత్తును సంహరింప బోవుచు చాపాదులను గ్రహించిన లక్ష్మణుని వర్ణనము మూలమున నిట్లున్నది.

'జగ్రాహ కార్ముకశ్రేష్ఠమన్యద్భీమపరాక్రమః
సన్నద్ధః కవచీ ఖడ్గీ సశరీ వామచాపభృత్' (వా.రా. VI, 85, 24)

ఇందు పేర్కొనబడిన చాపాదులను మూలమున లేని హరచాపాదులతో పోల్చుచు అయ్యలార్యుడు లక్ష్మణుని పరాక్రమాతిశయమునకు మెరుగులు దిద్దినాడు.

"హరుచాపంబనఁబోలు విల్లు నశనివ్యాఘాతబృందంబుతో
సరిజేయందగు సాయకంబులు నుదంచద్భీమనక్తంచరో
త్కరముంగూలుపఁజాలు ఖడ్గము సముద్యద్వజ్రసంఘాతభా
స్వరసారంబగు జోడు దాల్చి తనరెన్ సౌమిత్రి చూడంగడున్"
(VI, 1313)

vi) శ్రీరాముడు లంకానగరమునుండి అయోధ్యకు తిరిగిపోవునపుడు మార్గమధ్యమున సీతకు సముద్రమును చూపుచు నిట్లు పలుకును.

"పశ్య సాగరమక్షోభ్యం వైదేహి వరుణాలయమ్
అపారమివ గర్జంతం శంఖశుక్తిసమాకులమ్" (వా.రా. VI, 123, 18)

ఈ శ్లోకభావమును గ్రహించి అయ్యలార్యుడు

"కడగిన వేడ్క నభ్రనదిఁగౌగిటఁజేర్పగఁ బూనుకై వడిన్
విడువక మింటితో నొఱయు వీచిభుజంబులనొప్పి సంతసం

బవరెడుభంగి ప్రోయుచు నుదంచితఫేనము నవ్వుగాఁగ నొ
ప్పెడు నదె సాగరుండు గడు పెంపునఁ బేర్చు ప్రియుండుఁబోలుచున్"
(VI, 2494)

అను పద్యమున సముద్రుని ప్రియునితో పోల్చుచు ఉపమాలంకారమునే కాక రూపకాలంకారమునుగూడ నిబంధించి మూలభావము నలంకృతము గావించినాడు.

VI) విశేషణములనధికముగా వాడుట :

i) విశ్వామిత్రుడు యజ్ఞరక్షణార్థము రామలక్ష్మణులను తనతో పంపుమని ప్రార్థించుటకై దశరథునొద్దకు వచ్చు సందర్భమున మూలమున

'అభ్యాగచ్ఛన్మహాతేజా విశ్వామిత్రో మహామునిః' (వా.రా. I, 18, 39)

అని యున్నది. మూలమున నిట్లొకటిరెండు విశేషణములతో వర్ణితుడగు విశ్వామిత్రుని మల్లికార్జునుడు మూలమున లేని యనేకవిశేషణములతో నిట్లు వర్ణించినాడు.

"ధరణీశుంగన గాధిపుత్రుఁడు సముద్యత్పుణ్యగాత్రుండు భా
సురచారిత్రుఁడు సర్వసంయమిజనస్తోత్రైకపాత్రుండు సు
స్థిరసంపూర్ణతపః పవిత్రుఁడురుసందీప్తప్రభామిత్రుఁడ
ధ్వరసంపూజితవీతిహోత్రుఁడగు విశ్వామిత్రుఁడేతెంచినన్" (1,176)

పాత్రను తొలుత ప్రవేశపెట్టునప్పుడిట్లనేక విశేషణములతో వర్ణించుటలో నౌచిత్యము కన్పట్టుచున్నది. భా. రా. న అట్టివానికనేక నిదర్శనములున్నవి. ఇట కొన్ని మాత్రమే ప్రదర్శింపబడుచున్నవి.

ii) మూలము

'తాం దృష్ట్వా రాఘవః క్రుద్ధాం వికృతాం వికృతాననామ్
ప్రమాణేనాతివృద్ధాం చ లక్ష్మణం సోఽభ్యభాషత' (వా. రా. I, 26, 9)

అనువాదము

పాటితదుష్టసత్త్వవనవాటక, నిర్ధబలావరుద్ధ శృం
గాటక, గ్రంథిలభ్రుకుటిగాఢలలాటకఁ గ్రూరతారకా

నాటక, నాంత్రకాంచిపరిణద్ధ్రశవప్రపతత్క్రిమిటాచ్ఛ
కీటక, రక్తసిక్తపటుఖేటకఁ దాటకఁ గాంచిరయ్యెడన్ (I. 261)

తాటక యౌద్ధత్యస్ఫూర్తిని, క్రోధాతిశయమును పై పద్యమునందలి విశేషణములు చక్కగా అభివ్యక్తము చేయుచున్నవి.

iii) రామలక్ష్మణులు మిథిలకు పోవుచు మార్గమధ్యమున గంగానదిని చూచిన ఘట్టము.

**మూలము**

'జాహ్నవీం సరితాం శ్రేష్ఠాం దదృశుర్మునిసేవితామ్
తాం దృష్ట్వా పుణ్యసలిలాం హంససారససేవితామ్' (I, 261)

**అనువాదము**

"ఘను లా రాజన్యసూనుల్ గనిరెదురఁ గృతాకాశగంగాపరిష్వం
గను రంగత్తుంగభంగం గలితజలవిహంగన్ సదాశంభుసంగన్
మునిగేహోపాంతరంగన్ మురహరపదసంభూతపూతాంబుసంగన్
జనతాంహోభంగచంగన్ సగరనృపసుతస్వర్గసోపానగంగన్"
(I, 357)

iv) క్రోధముతో సుగ్రీవుని యంతఃపురమును ప్రవేశించిన లక్ష్మణుని వర్ణనము.

**మూలము**

"నిశ్శ్వసంతం తు తం దృష్ట్వా క్రుద్ధం దశరథాత్మజమ్
బభూవుర్హరయస్త్రస్తా న చైనం పర్యవారయన్" (వా. రా. IV, 33, 3)

**అనువాదము**

తటిదంచద్గుణచాపబాణధరు సందష్టాధరోష్ఠున్ నట
త్కటనాసాపుటసంకటోగ్రముఖు నుద్యద్భ్రూకుటీభంగసం
ఘటనాఘాటలలాటు, నుష్ణకరదీర్ఘశ్వాసవేగున్ విశం
కటకోపోత్కటవిస్ఫులింగయుత రూక్షప్రేక్షణున్ లక్ష్మణున్
(IV, 466)

D) భా రా. కర్తలు ప్రధానకథావిషయమున మూలమునే అనుసరించుచు అనువాదముఁగావించినను అటనట మూలమునందలి విషయములతో భేదించు అంశములు గూడ భా.రా.న లేకపోలేదు. వీరనుసరించిన మూలరామాయణములో నా విషయమట్లుండెనో లేదా వీరు బుద్ధిపూర్వకముగనే యౌచిత్యముకొఱకట్లు మార్చియుండిరో చెప్ప వలనుకాదు. అనువాదమున నిట్టి మార్పులు గోచరించు కొన్ని ఘట్టముల నాయా కాండములనుండి పేర్కొందును.

బాలకాండము :

i) రామలక్ష్మణుల నర్థించుటకై వచ్చిన విశ్వామిత్రుడు తన యాగమనమును దశరథున కెఱిగింపుమని దౌవారికునకు తెలుపును.

'శీఘ్రమాఖ్యాత మాం ప్రాప్తం కౌశికం గాధినః సుతమ్'

(వా. రా. I, 18, 40)

కాని యనువాదమున విశ్వామిత్రుడు వచ్చినంతనే దౌవారికులే స్వయముగ నతని రాకను దశరథునకు తెలియజేసినట్లుగ మార్పు కావింపబడినది.

"...... ......... విశ్వామిత్రుఁడేతెంచినన్"
కని దౌవారికుఁడురవడి
జని విశ్వామిత్రుఁ డిటకు జనుదెంచినవాఁ
డనుడుఁ బురోహితయుతుఁడై
జననాథుఁడు వాసవుండు చతురాస్యునకున్" (I, 176 - 177)

ii) పూర్వము సగరుడు భృగుమహర్షిని తన తపోమహిమచే ప్రసన్నునిచేసుకొనగా భృగువాతనికి సంతానవరమును ప్రసాదించుచు

"ఏకా జనయితా తాత పుత్ర వంశకరం తవ
షష్టిం పుత్రసహస్రాణి అపరా జనయిష్యతి" (వా.రా. I, 38, 8) అని

పలుకును. అంత నాతని భార్యలగు కేశినీ సుమతులు

"ఏకః కస్యాః సుతో బ్రహ్మన్ కా బహూన్ జనయిష్యతి
శ్రోతుమిచ్ఛామహే బ్రహ్మన్" (వా.రా. I, 38, 10) అని యా ఋషిని

ప్రార్థించినట్లుగ మూలమున నున్నది. కాని అనువాదమున నీ రీతిగ ప్రశ్నించినవాడు సగరుడే కాని ఆతని భార్యలు కారు.

"సగరుండు మునివరుం జూచి యిందెవ్వతె కొక్కపుత్రుండు, మఱి
యెవ్వతెకు బెక్కండ్రు పుత్రులనిన నీ సతులడిగిన యట్ల
యిచ్చెదననిన" (భా.రా. I, 399)

iii) రామాదుల వివాహ సందర్భమున వసిష్ఠుడు దశరథుని వంశ క్రమమును తెలిపిన పిమ్మట జనకుడు తన వంశ క్రమమును వివరించినట్లుగ వా.రా.న కలదు.[114] అనువాదమున వసిష్ఠుడే దశరథుని వంశ క్రమమును వివరించినట్లుగ నున్నను జనకుని వంశ క్రమమును మాత్రము మూలము నందువలె జనకుడుకాక శతానందుడు చెప్పినట్లుగ మార్పు చేయబడినది.[115] ఇక్ష్వాకు వంశ చరిత్రను తద్వంశ గురువగు వసిష్ఠుడు వివరింపగా జనకుని వంశ క్రమమును తద్వంశ పురోహితుడు వివరించుట యుక్తమని కాబోలు మల్లికార్జును డిట్లు మార్పు కావించినాడు. రం.రా.నను జనకుని వంశ క్రమమును శతానందుడే వర్ణించి నట్లుగ కలదు.[116]

iv) జనకుడు తన వంశమున జన్మించిన రాజుల క్రమమును తెలుపు సందర్భమున దేవమీఢునకు విబుధుడును, విబుధునకు మహీధ్రకుడును జన్మించి నట్లుగ మూలమున చెప్పబడినది.

"పుత్రః కీర్తిరథస్యాపి దేవమీఢ ఇతి స్మృతః
దేవమీఢస్య విబుధో విబుధస్య మహీధ్రకః" (వా.రా. I, 71, 10)

కాని అనువాదమున "...... కీర్తిరథుండా జననాయకునకు దేవమీఢుండా జగతీశ్వరునకు సువీరుఁడా నృపతికి మహీధ్రకుండు........" (I, 726) అని కలదు. మూలమున దేవమీఢుని పుత్రుడు విబుధుడు కాగా అనువాదమున సువీరుడని పేర్కొనబడినది.

**అయోధ్యాకాండము :**

v) రాముడు కౌసల్యతో తన వనవాసగమనవృత్తాంతమును తెలుపగనే కౌసల్య మిక్కిలి దుఃఖించుచు విలపించును. అంత లక్ష్మణుడు కోపముతో దశరథుని నిందించును. శ్రీరాముడు విలపించుచున్న తల్లిని, కుపితుడై యున్న లక్ష్మణుని సాంత్వనవాక్యములతో నోదార్చును. మూలమున నీ రీతిగా కౌసల్యా

విలాపము, లక్ష్మణుని యుద్రిక్తభాషణము, శ్రీరాముని సాంత్వనవాక్యములు క్రమముగ నుండగా[117] ననువాదమున కౌసల్యావిలాపము తరువాత మూలమున వలె లక్ష్మణుని కోపముకాక రాముడు కౌసల్యనోదార్చుటయే వర్ణింపబడినది.[118] ఆ పిమ్మటనే లక్ష్మణుని కోపవర్ణనము గలదు.[119] ఈ క్రమమే వావిళ్ళవారి పెక్కు ప్రతులందు కలదు. కాని వారు 1910 లో ప్రచురించిన ప్రతియందును, ఆనందాశ్రమమువారి ప్రతియందును పై విషయముల క్రమము భిన్నముగ నున్నది. వీనియందు లక్ష్మణుని కోపము, రాముడు తన వన వాసవృత్తమును కౌసల్యకు తెలియజేయగా నామె విలపించుట, రాముడు కౌసల్యనోదార్చుట యనునవి క్రమముగా కలవు. ఈ క్రమమున లక్ష్మణుని కోపమునకు ప్రసక్తి లేదు కదా యను సందేహము కలుగవచ్చును. కాని దీనికనుకూలముగ గావింపబడిన మార్పొకటి యీ ప్రతులందు కానవచ్చుచున్నది. వనవాసవృత్తాంతమును రామునకు తెలియజేయుటకై ఆతనిని తన భవనమునకు తీసికొనిరమ్మని దశరథుడు సుమంత్రుని పంపగా రాముడొక్కడేకాక ఆతనితోపాటు సీతా లక్ష్మణులు కూడ వెళ్లెదరు.[120] అట కైకేయి తన వరములను గూర్చి తెలుపగా రాముడు వనమేగుటకు సంతోషముతో అంగీకరించును. అంత లక్ష్మణుడు కోపరక్తాస్యుడగుచు దానికంతకు కారకుడైన దశరథుని నిందించును. ఇట్లు కైకేయి భవనమునకు రాముడు సీతాలక్ష్మణులతో పోయినట్లుగ మూలమున కానరాదు.

vi) శ్రీరాముని పాదుకలను భరతుడే స్వయముగ ప్రార్థింపగ నాతడు భరతునకు తన పాదుకలనిచ్చినట్లుగ మూలముననున్నది.[121] కాని యనువాదమున భరతుడు రామపాదుకలు గోరుచున్నట్లుగ వసిష్ఠుడు శ్రీరామునితో పలుకగా నాతడు గురు వచనము మీఱక తన పాదుకలను భరతునకిచ్చినట్లు మార్చబడినది.[122]

**అరణ్యకాండము :**

vi) జటాయువు తన జననక్రమమును రామలక్ష్మణులకు తెలుపు సందర్భమున కశ్యపుడు దక్షప్రజాపతి యఱువది కూతులలో పదుమువ్వురను పరిగ్రహించినట్లుగ భా. రా. న నున్నది.[123] కాని మూలమున కశ్యపుడు ఎనమండుగురిని మాత్రమే పరిగ్రహించినట్లుగ చెప్పబడినది.

కశ్యపః ప్రతిజగ్రాహ తాసామష్టౌ సుమధ్యమాః
అదితిం చ దితిం చైవ దనూమపిచ కాలకామ్
తామ్రాం క్రోధవశాం చైవ మనుం చాప్యనలామపి"

(వా.రా. III, 14, 11-12)

అంతేకాక మూలమున పేర్కొనబడిన మనువు, అనలయును అనువాదమున కానరారు. వ్యాసభారతమునను కశ్యపుడు పదుముగ్గురనే పరిగ్రహించినట్లు పేర్కొనబడినది.

'దదే స దశ ధర్మాయ కశ్యపాయ త్రయోదశ' (మ.భా.I, 70,8)

కాని యిందు దక్షుని కూతులేబదిమంది యని యున్నది.

"తతః పంచాశతం కన్యాః పుత్రికా అభిసందధే" (మ.భా. I, 70, 7)

వా.రా.న. దక్షుని కూతులఱువదిమంది.

"షష్టిర్దుహితరో రామ యశస్విన్యో మహాయశాః
కశ్యపః ప్రతిజగ్రాహ" (వా.రా.I, 14,10)

vii) కశ్యపునకు అదితియందు ముప్పదిముగ్గురు దేవతలు జన్మించినట్లుగ మూలమున నున్నది.

'అదిత్యాం జజ్ఞిరే దేవాస్త్రయస్త్రింశదరిందమ
ఆదిత్యా వసవో రుద్రా అశ్వినౌ చ పరంతప'

(వా.రా.III, 14,14-15)

కాని అనువాదమున అదితికి ఆదిత్యులును, రుద్రులును మాత్రమే జన్మించి నట్లుగ చెప్పబడినది.[124] వసువులు, అశ్వినులు వీరి ప్రసక్తి కానరాదు.

ముద్రిత భా.రా. ప్రతులన్నింటను జటాయువుజననమునకు సంబంధించిన పై వృత్తాంతములు కన్పట్టుచున్నను పెక్కు తా.ప్ర.లలో ఈ వృత్తాంతముగల భాగము (భా. రా. III, 1, 108-111) కన్పట్టదు ఈ భాగమంతయు ప్రక్షిప్తము కావచ్చును.

viii) మూలమున అర.కాం. 6వ సర్గమున శ్రీరాముడు రాక్షసులను వధించి మునులకు క్షేమము కలిగింతునని శపథము గావించుటయు, 7వ సర్గమున సుతీక్ష్ణాశ్రమవాసమును, 8వ సర్గమున ఆశ్రమమండలమును చూచుటకై రామాదులు బయలుదేరుటయు క్రమముగా వర్ణింపబడినవి. 9వసర్గమున హింస యధర్మమనియు, రాక్షసవధరూపమగు హింసను మానుమనియు సీత రాముని ప్రార్థించుట కలదు. కాని యనువాదమున నీ విషయక్రమము కొంత భిన్నముగ నున్నది. ఇందు రాక్షసవధమునకై శ్రీరాముడు శపథము గావింపగనే సీత పై విధముగ రాముని ప్రార్థించినట్లుగ వర్ణించబడినది. ఆతరువాతనే సుతీక్ష్ణాశ్రమవాసవర్ణనము గలదు. శ్రీరాముడు రాక్షసుల వధింతునని శపథము చేయగనే సీత పైవిధముగ రాముని నివర్తింపబూనుకొనుట ఉచితముగా నున్నది.

ix) అగస్త్యుడు శ్రీరాముని సత్కరించి యాతనికి వైష్ణవధనుస్సును, సూర్యసంకాశమగు శరోత్తమమును, అక్షయతూణీరద్వంద్వమును, ఒక ఖడ్గమును ప్రసాదించినట్లుగ మూలమున నున్నది.[125] అనువాదమున మూలమునవలె ఒక్క ఖడ్గమునుగాక ఖడ్గయుగ్మమును ప్రసాదించినట్లుగ నున్నది.[126]

x) సీతాపహరణమున తనకు సాహాయ్యము గావింపుమని రావణుడు మారీచు నీరీతిగ ప్రార్థించును.

'సౌవర్ణస్త్వం మృగో భూత్వా చిత్రో రజతబిందుభిః
ఆశ్రమే తస్య రామస్య సీతాయాః ప్రముఖే చర
త్వాం తు నిస్సంశయం సీతా దృష్ట్వా తు మృగరూపిణమ్
గృహ్యతామితి భర్తారం లక్ష్మణం చాభిధాస్యతి"

(వా. రా. iii, 36, 18-20)

పై రీతిగ మారీచుని మాయామృగము కమ్మని రావణుడు కోరినట్లుగ భా. రా. న కానరాదు. 'ఇందు' రాఘవాపాయంబేగతి మేదినీ తనయకుం బాటిల్లు నవ్వంచనోపాయం బొక్కడొనర్తుగాక" (III, 1, 290) యనియే మారీచుని కోరినట్లుగ నున్నది.

xi) మారీచుడు రామబాణహతుడై మరణించునపుడు "సదృశం రాఘవ స్యేవ హా సీతే లక్ష్మణేతి చ[127] అని సీతాలక్ష్మణుల నెలుగెత్తి పిలిచినట్లుగ మూలమున చెప్పబడినది. కాని యనువాదమున" "అదియన్ మేనుచ్చి హా లక్ష్మణా! యంచుంగూలె" (III, 2, 59)నని లక్ష్మణుని మాత్రమే పిలిచినట్లుగ నున్నది. ఆం. మ. భార. నందరణ్యపర్వమున గల రామాయణకథయందును, రామాభ్యుదయమునందును మారీచుడు మూలమునందువలె సీతాలక్ష్మణుల పిలిచినట్లుండగా[128] మొల్లరామాయణము మాత్రము 'వాడునుంగూలు నవ్వేళ' హా లక్ష్మణా! యను రవంబు జేసిన నా ధ్వని విని ..." (III, 33) యను గద్యమున బా. రా. ననుసరించినది.

xii) సీతనపహరించుటకై సన్యాసివేషమున వచ్చిన రావణుడు వామ భుజమున యష్టికమండలువులను ధరించినట్లుగ మూలమున చెప్పబడినది.

'వామే చాంసేఽవసజ్యాథ శుభే యష్టికమండలూ' (వా. రా. III, 46,3)

కాని యనువాదమున రావణుడు కుడిచేత యష్టిని, ఎడమచేత కమండలువును ధరించినట్లుగ నుచితముగ వర్ణింపబడినది.

"కావిగోచియుఁ గుశగ్రంథులు బెనచిన
ముక్కోల వలపలిముష్టి నమర
నిర్మలజలమును నిండ నించిన కమం
డలువు డాకేల బెడంగు మిగుల" (భా రా. III, 2, 82)

ముద్రితభా. రా. ప్రతులన్నింటను పై పద్యము కన్పట్టుచున్నను పెక్కు తా. ప్ర లలో పై పద్యముగల ఘట్టమంతయు భిన్నముగా నున్నది.[129] ఆ పాఠము ము. ప్ర.లలో పాఠాంతరముగ చూపబడినది.[130]

**కిష్కింధాకాండము :**

xiii) తార తన యుక్తియుక్తములగు వాక్కులతో లక్ష్మణుని శాంత పరచు సందర్భమున మూలమున నీ క్రింది శ్లోకము గలదు.

'ప్రాప్తకాలం న జానీతే విశ్వామిత్రో మహామునిః
ఘృతాచ్యాం కిల సంసక్తో దశవర్షాణి లక్ష్మణ'
(వా. రా. IV, 35, 6-7)

విశ్వామిత్రుడు మేనకయందనురక్తుడగుట ప్రసిద్ధము కాన మల్లికార్జునుడు 'యతియగు విశ్వామిత్రుడు, మతిచెడి మేనకకుఁజిక్కి మన్మథలీలారతుడై' (భా. రా. IV, 492) యని ఘృతాచిని తొలగించి మేనకను చేర్చినాడు.

xiv) సీతాన్వేషణమునకై వినతాదులను తూర్పుదిక్కునకును, హనుమదాదులను దక్షిణమునకును, సుషేణుడు మున్నగువారిని పశ్చిమమునకును, శతబలి మున్నగువారిని ఉత్తరదిశకును పంపుట మూలమున క్రమముగ 40, 41, 42, 43 సర్గలలో వర్ణింపబడినది. 44వ సర్గమున శ్రీరాముడు స్వనామాంకితమగు అంగుళీయకమును హనుమంతునకభిజ్ఞానముగ నిచ్చిన వృత్తాంతము కలదు. కాని యనువాదమున నీ క్రమము కొంత విపర్యస్తమైనది. ఇందు హనుమదాదులను దక్షిణదిశకు పొండని యాజ్ఞాపించినపిదపనే అంగుళీయక వృత్తాంతము కలదు. అనగా అనువాదమున 41 వ సర్గవిషయముతరువాత 44వ సర్గమందలి విషయము గ్రహింపబడినదన్న మాట. రం.రా.నను ఈ క్రమమే కలదు.[131]

xv) హనుమంతుడు బాల్యమున ఉదయించుచున్న సూర్యబింబమును చూచి ఫలమని భ్రమించి అంతరిక్షమునకెగయగా ఇంద్రుడాతనిని వజ్రాయుధముతో కొట్టుటయు, ఆ కారణముగ నతని హనువు భగ్నమైపోవుటయు మూలమున వర్ణింపబడినది.[132] కాని భా.రా.న హనుమంతుడంతరిక్షమునకెగిరినప్పుడు సూర్యకిరణముల వేడిమికి తాళజాలక యాతడాకాశమునుండి పర్వతముపై పడగా హనువు భగ్నమైనట్లుగ నున్నది.[133]

xvi) శ్రీరాముడు సుగ్రీవుని పట్టాభిషిక్తుని గావించి రావణునిపై దండెత్తుటకు శరత్కాలము యుక్తమని నిర్ణయించుకొని ప్రస్రవణగిరిపై కాలము గడపుచుండును. అంత వర్షర్తువేతెంచును. ఈ వర్షర్తువర్ణనము మూలమున దాదాపేబది శ్లోకములలో నున్నది. ఈ సందర్భమున మూలమున గల

"నవమాసధృతం గర్భం భాస్కరస్య గభస్తిభిః
పీత్వా రసం సముద్రాణాం ద్యౌః ప్రసూతే రసాయనమ్"
(వా. రా. IV, 28, 3)

అను శ్లోకమును మల్లికార్జునుడీక్రిందిరీతిగ ననువదించెను.

''ఇనరుచుల సర్వరసములు
బనుపడఁదిగిచికొని గగనభామిని ధరియిం
చిన యష్టమాసగర్భము
గనుపట్టె రసాయనంబు గనియెడువేళన్" (భా. రా. IV, 388)

మూలమున నవమాసగర్భమనియుండగా ననువాదమున నష్టమాసగర్భ మని మార్చబడినది. ఈ మార్పుకు కారణము తెలియదు.

**యుద్ధకాండము :**

**xvii)** శ్రీరాముడు వానరసైన్యముతో పాటు లంకకు బయలు దేరుచు సముద్రతటమును చేరుకొనును. అట నాతడు సీతకై మిక్కిలి విలపించుచుండగా సాయంకాలంమైనట్లుగ మూలమున చెప్పబడినది.

"ఏవం విలపతస్తస్య తత్ర రామస్య ధీమతః
దినక్షయాన్మందవపుర్భాస్కరోఽస్తముపాగతః" (వా.రా. VI, 5, 22)

కాని యనువాదమున విలాపమునకు పూర్వమే సూర్యాస్తమయమును, చంద్రోదయమును ఐనట్లుగ వర్ణింపబడినది.[184] రామునకు సీతావిషయకమైన రతి కలుగుటకును, తత్కార్యమగు విలాపమునకును ఉద్దీపకములగు సూర్యాస్తమయ చంద్రోదయవర్ణనములను ముందే వర్ణించుటలో ఔచిత్యము కలదు.

**xviii)** రావణుడు కుంభకర్ణాదిసభాసదుల యెదుట తాను గావించిన సీతాపహరణమునుగూర్చి తెలిపి భావికర్తవ్యమునకై సభాసదుల సమ్మతిని కోరగా కుంభకర్ణుడు కుపితుడై ఆతని యకార్యమును గర్హించును.[185] తిరిగి వెంటనే రావణునకనుకూలముగ

తస్మాత్త్వయా సమరాబ్ధం కర్మ హ్యప్రతిమం పరైః
అహం సమీకరిష్యామి హత్వా శత్రూంస్తవానఘ
అహముత్సాదయిష్యామి శత్రూంస్తవ నిశాచర
యది శక్రవివస్వంతౌ యది పావకమారుతౌ
'హత్వా చ రామం సహ లక్ష్మణేన
ఖాదామి సర్వాన్ హరియూథముఖ్యాన్" (వా.రా. VI, 12, 35-40)

అని ప్రతిజ్ఞ కావించును. అంతకుపూర్వము రావణుని నిందించుచున్న కుంభకర్ణుడు తత్‌క్షణమే హఠాత్తుగ నాతనికనుకూలముగ పైరీతిగ మాట్లాడుటకు మూలమున కారణము కానరాదు. భాస్కరుడు "అనిన విని పదిమొగములు జేవురింప నున్న దశగ్రీవుని కోపరసభావం బెఱింగి మఱియొక్కింతసేపునకు కుంభకర్ణుడిట్లనియె"[136] నను వచనమున కుంభకర్ణుని మనసు మాఱుటకుగల కారణమును తెలియజేసినాడు. రావణుని యకార్యమును నిందించుచున్న కుంభకర్ణుని మాటలకు రావణుని పదిమొగములు జేవురించినవట. దీనిచే ఆతని కోపోద్రిక్తతను భావించి యాతని కనుకూలముగ రాఘవులను, సుగ్రీవాదులను చంపివేయుదునని ప్రతిజ్ఞ చేసినాడు. భాస్కరుడు గావించిన యీమార్పు ఎంతో ఔచిత్యశోభితముగా నున్నది.

xviii) ఇంద్రజిద్వధమునుగూర్చి విన్న రావణుని మంత్రులాతనికీ విషయమును తెలియజేయుట మూలమున నిట్లున్నది.

'తతః పౌలస్త్యసచివాః శ్రుత్వా చేంద్రజితో వధమ్
ఆచచక్షురభిజ్ఞాయ దశగ్రీవాయ సత్వరాః
యుద్ధే హతో మహారాజ లక్ష్మణేన తవాత్మజః
విభీషణసహాయేన మిషతాం నో మహాద్యుతిః"
(వా. రా. VI, 92, 2-3)

మూలమున ఇంద్రజిన్మరణమును రావణునకాతని సచివులెఱిగింపగా అనువాదమున యుద్ధరంగమునుండి వచ్చిన రాక్షసులే యీ విషయమును రావణునకు వివరింతురు. అంతేకాక మూలమున రావణ సచివులు సత్వరులై

యకస్మాత్తుగ ఇంద్రజిన్మరణమును తెలియజేసినట్లుండగా అనువాదమున దైత్యులు క్రమక్రమముగ నెఱిగించినట్లు వర్ణించుటలో మరణ వృత్తాంతమును చెప్పుటలోగల ఔచిత్యము పాటింపబడినది.

'హతశేషులైన యా దితిజులు లంకకు
చని దశాననుఁ గాంచి సభయులగుచు
దనుజకులేంద్ర నీ తనయుండు రణమునఁ
బ్లవగకోటులనెల్ల బారిసమరి
మన లంకఁగాల్చిన మారుతాత్మజు నొంచి
యవ్విభీషణుమేన నధికశస్త్ర
చయములు గీలించి చటులబలుండైన
సౌమిత్రితోడుతఁ జాలఁబోద్ధు
సమరలీల సల్పి చండప్రతాపుఁడై
ఘోరభంగిఁజేర్చి కొంతవడికి
ప్రథితలక్ష్మణాస్త్రపావకజ్వాలల
శలభవృత్తిఁదాల్చెఁబొలుపు దక్కి" (భా.రా. VI, 1391)

xix) సంజీవనిని తెచ్చుటకై హనుమంతుడోషధిపర్వతమును చేరుకొనును. అంతనందున్న ఓషధులన్నియు అదృశ్యములగును. అందులకు హనుమంతుడు మిక్కలి కుపితుడై ఆ యద్రిని పెకలించి తీసికొనిపోవును.[137] ఇట్లోషధులదృశ్యమైనంతమాత్రముననే హనుమంతుడు క్రుద్ధుడై యద్రిని పెకలించినట్లు మూలమున నుండగా అనువాదమున భిన్నముగా నున్నది. ఓషధులకై హనుమంతుడు ప్రార్థింపగా నా పర్వతమాతనిని నిందించినట్లుగను, తత్కారణముగ హనుమంతుడు క్రుద్ధుడై దానిని పెకలించి తీసికొనిపోయినట్లుగను మార్చి భాస్కరుడౌచిత్యమును పోషించినాడు.[138]

xx) ఇంద్రుడు తనకు సహాయునిగ పంపిన మాతలిని శ్రీరాముడు విభీషణుని పట్టాభిషేకము జరుగకముందే ఇంద్రలోకమునకు వీడ్కొలిపినట్లుగ మూలమున నున్నది.[139] కాని యనువాదమున విభీషణుని పట్టాభిషేకమైన పిమ్మటనే రాముడు తనకు విభీషణుడు సమర్పించిన వివిధ మణిభూషణాదులను

మాతలికి ఉపాయనముగ సమర్పించి వీడ్కొలిపినట్లుగ మార్పుగావింపబడినది. రావణవధ విషయమున తనకు సాహాయ్యముగావించిన మాతలిని శ్రీరాముడు సత్కరించి పంపుటయు, విభీషణుని పట్టాభిషేకోత్సవమును చూచి యానందించు నవకాశ మాతనికి కలిగించుటయు ఉచితములే కదా !

xxi) రామునితో యుద్ధముగావించి మకరాక్షుడు మరణించును. రావణుడు రోషావిష్టుడై రావణిని యుద్ధమునకు ప్రేరేపించును. అంత నాతడు యజ్ఞభూమికి పోయి యజ్ఞము గావించినట్లుగ మూలమున నున్నది.[140] అనువాదమున నాతడు రణభూమియందే యజ్ఞము గావించినట్లుగను, అందుండి కృత్య యేతెంచి యాతనితో "పంపుమెయ్యదియైన నేఁడెంపుతోడ, నివుడఁజేయుదు"నని పలికినట్లుగను ఉన్నది. మూలమున లేని కృత్యాప్రసక్తి అనువాదముననుండుట మఱొక విశేషము.

xxii) భా.రా. కర్తలు మూలమును సంక్షేపించుచునో, పెంపుచేయుచునో, అన్యథాకరించుచునో తమ యనువాదమును సాగించినను మూలశ్లోకములను యథాతథముగ ననువదించిన చోట్లును అటనట గలవు. ఆయా కాండములనుండి కొన్ని మాత్ర మిటనుదాహరింపబడుచున్నవి.

బాలకాండము :

1. "ఇమౌ కుమారౌ భద్రం తే దేవతుల్యపరాక్రమౌ
గజసింహగతీ వీరౌ శార్దూలవృషభోపమౌ
పద్మపత్రవిశాలాక్షౌ ఖడ్గతూణధనుర్ధరౌ
అశ్వినావివ రూపేణ సముపస్థితయౌవనౌ'' (వా.రా. I, 48, 2-3)

"కరిసింహాంచితగాము లశ్వినిసమాకారుల్ దళత్పద్మభా
స్వరనేత్రుల్ కమనీయయౌవనులు గీర్వాణప్రతాపుల్ భయం
కరశార్దూలమహోక్షసన్నిభులు లోకత్రాణపారీణులు
ద్ధురకోదండకృపాణబాణయుతదోఃస్థూణుల్ ప్రవీణుల్ గడున్"
(భా. రా. I, 512-541)

2. "సముద్ర ఇవ నిర్వేగో భగ్నదంష్ట్ర ఇవోరగః
ఉపరక్త ఇవాదిత్యః సద్యో నిష్ప్రభతాం గతః
హతపుత్రబలో దీనో లూనపక్ష ఇవ ద్విజః" (వా.రా. I, 55, 9-10)

**అయోధ్యాకాండము :**

3. "రామం దశరథం విద్ధి మాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యామటవీం విద్ధి గచ్ఛ తాత యథాసుఖమ్" (వా రా. II, 40,9)

"మనమున రాముని దశరథ
జననాయకుగాఁదలంపు జనకతనూజన్
ననుగాఁ దలఁపుము కానన
ము నయోధ్యగఁదలపుమేగు ముదమునఁ దండ్రీ (భా.రా. II, 224)

**అరణ్యకాండము :**

4. క్రూరై రనార్యైః సౌమిత్రే పరిహాసః కథంచన
న కార్యః ........................ ........ (వా. రా. III, 18, 19)

5. "జలప్రపాతాస్రముఖాః శృంగై రుచ్ఛ్రితబాహుభిః
సీతాయాం హ్రియమాణాయాం విక్రోశంతీవ పర్వతాః"
(వా. రా. III, 52, 37)

"ఓలి శృంగంబులెత్తినకేలు గాఁగ
నిర్ఘరంబుల పెనుమ్రోత నిగిడి బెరయ
గిరులు జనకరాజాత్మజపరిభవంబు
జగములెఱుగ నాక్రోశించుపగిదిఁదోచె" (భా.రా. III, 2, 52)

6. 'చంద్రే లక్ష్మీః ప్రభా సూర్యే గతిర్వాయౌ భువి క్షమా
ఏతచ్చ నియతం నిత్యం త్వయి చానుత్తమం యశః"
(వా. రా. III, 65, 5)

"తరిణికిఁదేజంబు సుధా
కరునికిఁగళ పవనునికిని గమనంబు వసుం
ధరకు ధృతి నైజమగుగతి
నరనాయకనీకుఁ దమము నైజగుణమిలన్"

(భా. రా. III, 2, 342)

**కిష్కింధాకాండము :**

7. "శూరాయ న ప్రదాతవ్యా కన్యా ఖలు విపశ్చితా
శూరభార్యాం హతాం పశ్య సద్యో మాం విధవాం కృతామ్"

(వా. రా. IV, 23, 8-9)

'శూరునకుఁ గన్య నీఁజన
దారయ మృతిఁబొందు శూరుఁడన వేగమ యే
శూరునకుఁ బత్నినై శుభ
గౌరవమెడలంగ విధవఁగానె కపీంద్రా! (భా. రా. IV, 354)

8. "పతిహీనా తు యా నారీ కామం భవతు పుత్రిణీ
ధనధాన్యసమృద్ధాఽపి విధవేత్యుచ్యతే జనైః" (వా.రా. IV, 23, 12)

"తన విభుఁడు లేని కాంతను
ధనదాన్యసమృద్ధనైనఁదగు పుత్రిణి నై
నను విధవ యంద్రు ధాత్రీ
జను లీ కష్టంపుమాట సైపఁగ వశమే"(భా.రా. IV, 30, 343

9. "దర్శయంతి శరన్నద్యః పులినాని శనైః శనైః
నవసంగమసంవ్రీడా జఘనానీవ యోషితః" (వా. రా. IV, 30, 58)

'శరదాపగలల్లనఁ దమ
సురుచిర పులినములు వరుసఁజూపెడు నవ్య
స్మరకేళీరంజితలగు
తరుణులు జూపెడు లసన్నితంబములగతిన్' (భా.రా. IV, 414)

సుందరకాండము

10. "స తం పరిత్యజ్య మహారథో రథం
సకార్ముకః ఖడ్గధరః ఖముత్పతన్
తతోఽభియోగాదృషిరుగ్రవీర్యవాన్
విహాయ దేహం మరుతామివాలయమ్" (వా. రా. V, 47, 33)

రక్కసుండట్లు నుగ్గైన రథము విడిచి
ఖడ్గకోదండపాణియై గగనమునకు
నెగసె యోగపథంబున నియతితోడ
నొడలు డిగ్రావి దివికేగు యోగిపగిది (భా. రా. V, 403)

యుద్ధకాండము (పూ. భా.)

11. వాహి వాత యతః కాంతా తాం స్పృష్ట్వా మామపి స్పృశ
త్వయి మే గాత్రసంస్పర్శశ్చంద్రే దృష్టిసమాగమః (వా.రా.VI,5,6,)

"మందానిలంబ నాపైఁ
బొందుగ సతిమీదఁ బొలసి పొలయుము నీచే
నొందుచుఁ దత్తను సంగతి
చందురునందెట్లు దృష్టిసంగతి గలుగున్ (భా. రా. VI, 46)

12. "విద్యాస్వభివినీతో యో రాజా రాజన్నయానుగః
స శాస్తి చిరమైశ్వర్యమరీంశ్చ కురుతే వశే (వా. రా. VI. 35, 7)

అఖిలవిద్యల శిక్షితుఁడై సమస్త
నీతికళలందుఁదుదముట్ట నేర్పు గలిగి
వలను దప్పక వర్తించువాడు పగఱ
గెలుచుఁబొలుచు నైశ్వర్యంబు గలిగి వెలుగు (భా.రా. VI, 410)

యుద్ధకాండము (ఉ. భా.)

13. 'అర్థేన హి విముక్తస్య పురుషస్యాల్పచేతసః
విచ్ఛిద్యంతే క్రియాః సర్వా గ్రీష్మే కుసరితో యథా
(వా. రా. VI, 83,33)

ధనహీనుఁడైన పురుషున
కనయము జెడుఁగార్యసిద్ధులన్నియు గ్రీష్మం
బున సెలయేరుల క్రియ (భా. రా. VI, 1295)

14. దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః
తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః

ఎలనాగలు జుట్టంబులు
గలుగుదు రెచ్చోటనయినఁ గరమరుదారం
దలప సహోదరునెలమిం
గలుగఁగ నెచ్చోటఁ బడయగాఁ దరమగునే
(భా. రా. VI, 1598)

15. ఇంద్రియాణి పురా జిత్వా జితం త్రిభువనం త్వయా
స్మరద్భిరివ తద్వైరమింద్రియైరేవ నిర్జితః (వా.రా. VI, 111,16)

లలి నీవింద్రియముల మును
గెలిచి జగత్త్రయమునోలి గెలిచితివని యా
చలమున నవి నిను గెలిచెను
దలపగఁ బగఁ దీర్చునట్లు దానవనాథా ! (భా.రా. VI, 2252)

16. న గృహాణి న వస్త్రాణి న ప్రాకారాస్తిరస్క్రియాః
నేదృశా రాజసత్కారా వృత్తమావరణం స్త్రియాః
(వా.రా. VI, 114, 27)

చీరలు దగు గృహములు ప్రా
కారములునుఁ దగిన తెరలు గాపులు మఱువే
నారీజనులకు సమ్యగు
దారంబగు చరితమొండు దప్పింపంగన్ (భా.రా. VI, 23337)

## సూచికలు

1. నన్నయ భారతము డా॥ దివాకర్ల వేంకటావధాని; పే 522.
2. ఈ సంఖ్య వావిళ్ళవారు 1923 లో ప్రచురించిన భా.రా. ప్రతి ననుస రించి యీయబడినది.
3. వా. రా. I, 33, 11-18.
4. భా. రా. I, 329-332.
5. భా. రా. I, 330-331.
6. వా.రా. II, 68 సర్గ 12-22.
7. భా. రా. II, 335.
8. వా. రా. II, 71 సర్గ.
9. భా. రా. II, 355.
10. వా. రా. II, 71, 19-43.
11. భా. రా. II, 359.
12. వా. రా. II, 75, 11-11.
13. భా. రా. II, 361.
14. వా. రా. II, 75, 21-58.
15. భా. రా. II, 362.
16. వా. రా. II, 83 సర్గ.
17. వా. రా. II, 91, 59.
18. వా. రా. II, 91, 11-83.
19. భా. రా. II 379.
20. వా. రా. అయో. కాం. 100 సర్గ.
21. వా. రా. II 113-114 సర్గలు.
22. భా. రా. II, 399.
23. II, 115 సర్గ.
24. భా. రా. II, 399-400.
25. భా. రా. III, 1, 89.
26. వా. రా. III, 1, 1-9.
27. భా. రా. III, 1, 10.

28. వా. రా. III, 3 సర్గ.
29. భా. రా. III, 1, 51.
30. వా. రా. III, 6, 1-6.
31. వా. రా. III, 29, 2-14, 216-24.
32. భా. రా. III, 1, 238-239.
33. వా. రా. III, 37-39 & 41 సర్గలు.
34. భా. రా, III, 2, 3-18.
35. వా. రా. III, 47, 5-22.
36. వా. రా. IV, 1, 1-115.
37. భా. రా. III, 2, 427-434.
38. వా. రా. IV, 58 & 60 సర్గలు.
39. వా. రా. IV, 28 సర్గ.
40. భా. రా. IV, 383-393.
41. వా. రా. IV, 30 సర్గ.
42. వా. రా. IV, 410-416.
43. వా. రా. IV. 10, 37-49.
44. వా. రా. V, 19, 2-22.
45. బా. రా. V, 30 సర్గ.
46. భా. రా. V, 262.
47. వా. రా. V 52.
48. V, 453-454.
49. వా. రా. V, 58-59 సర్గలు.
50. భా. రా. V, 531.
51. వా. రా. V, 67 సర్గ.
52. భా. రా. V, 557-562;
53. వా. రా. VI, 30, 11-25;
54. భా. రా. VI, 374-376.
55. వా. రా. VI, 41, 61-72;
56. భా. రా. VI, 502-503;

57. వా. రా. VI, 46 సర్గ.
58. భా. రా. VI, 569-570;
59. వా. రా. VI, 65 సర్గ;
60. భా. రా. VI, 909-910.
61. వా. రా. 1-1 సర్గ;
62. వా. రా. 1-3 సర్గ;
63. వా. రా. I, 37, 25-38;
64. భా. రా. I-682.
65. వా. రా. I, 75, 2-3;
66. వా. రా. II, 2, 26-57;
67. వా. రా. II, 9 సర్గ.
68. భా. రా. II, 65;
69. పే. 59 (f.n.)
70. వా. రా. II, 36, 1-9;
71. వా. రా. II, 56 సర్గ.
72. వా. రా. II, 56, 18-32;
73. వా. రా. II, 67, 9-31;
74. వా. రా. II, 74, 15.
75. వా. రా. II, 108-109 సర్గలు;
76. వా. రా. III, 14, 7-33;
77. భా. రా. III, 1, 107-110.
78. వా. రా. III, 16 సర్గ;
79. వా. రా. IV, 1 సర్గ;
80 భా. రా. III. 2, 426-435;
81. భా రా. III, 2, 434;
82. వా. రా IV, 24, 31-40; iv 24, 41-43; IV-25, 1-11;
83. వా. రా. IV, 21 సర్గ;
84. వా. రా. IV, 24, 4-2౭;
85. వా రా. IV, 27, 6-28;

86. వా. రా IV, 46 సర్గ;
87. వా. రా. iV, 9-10 సర్గలు.
88. వా. రా. IV, 58, సర్గ;
89. వా. రా. IV, 58, 4-7; iv 61 సర్గ;
90. వా. రా. IV, 66, 26-28;
91. వా. రా. V, 17 5-17;
92. వా. రా. V, 28 సర్గ.
93. వా. రా. V, 30, 2-44;
94. VI, 4, 46-53;
95. భా. రా. VI, 666-723.
96. రం. రా. 376-383 పేజీలు (రాయల్ &కో)
97. వా. రా. VI, 105 సర్గ.
98. భా. రా. VI, 1618-1723;
99. వా రా. I, 17-25;
100. భా.రా. I, 30-42.
101. భా. రా. I, 43;
102. భా. రా. V, 12-14;
103. భా రా. V, 135-137;
104. వా. రా. V, 16, 31 & V, 17, 1-2;
105. భా. రా. V, 166-168;
106. VI, 2645-2662;
107. వా. రా. VI, 81, 44; పశ్చిమోత్తరశాఖీయప్రతి.
108 భా. రా. VI, 181;
109. భా. రా. VI, 33-36;
110. భా. రా. VI, 2218-2225;
111. వా. రా. VI, 20, 23-28;
112 వా. రా. I, 10,20;
113. భా. రా. I, 94;
114. వా. రా. I, 71, 1-2;

115. భా. రా. I, 725;
116. రం. రా. 70271 పే. (రాయల్&కో)
117. వా. రా. II, 20&21 సర్గలు;
118. భా. రా. II, 114-126;
119. భా. రా. II,
120. భా. రా. (వావిళ్ళప్రతి 1910) II, 31;
121. వా. రా. II, 112, 20-22;
122. భా. రా. II, 397;
123. భా. రా. III, 1, 110.
124. భా. రా. III, 1, 110;
125. వా. రా. III, 12, 31-34;
126. భా. రా. III, 1, 98;
127. వా. రా. III, 44, 18;
128. III, VI, 329; రామా. V, 165;
129. భా. రా. III, 2, 77-91;
130. భా. రా. 184 - 186 పే.
131. రం. రా. 230 పే. (రాయల్ & కో. 1957)
132. వా. రా. IV, 66, 22-23;
133. భా. రా. IV, 310;
134. భా. రా. VI, 33-46;
135. వా. రా. IV, 12, 27-35;
136. భా. రా. VI, 105;
137. వా. రా. VI, 74 సర్గ;
138. భా. రా. VI, 1106-1117;
139. వా. రా. VI, 112 సర్గ;
140. వా. రా. VI, 80 సర్గ.

హైదరాబాదు మున్నగుచోట్ల గ్రంథాలయములయందు ఈ రామాయణ తా. ప్ర. లనేకములు భద్రపఱుపబడి యున్నవి. (చూ. అనుబంధము) ఇంతేకాక వివిధ వ్యక్తులయొద్దను తమ సొంత ప్రతులుండవచ్చును. తాళపత్ర గ్రంథముల విలువ తెలియక చలిమంటలకో, పొయిమంటలకో ఉపయోగింపగా నష్టమైన ప్రతులును అనేకములనుటలో సందేహము లేదు. వ్యక్తులయొద్దనున్న సొంతప్రతులలో నాకు లభించినవి రెండు మాత్రమే. ఒకటి శ్రీ బి. రామరాజు గారి ప్రతి. రెండవది శ్రీ సుందరాచార్యుల ప్రతి. వీనిలో శ్రీరామరాజుగారి ప్రతి ప్రాచీనమైనది.[1] పైన పేర్కొన్న గ్రంథాలయములందలి ప్రతులతోపాటు పై రెండు ప్రతులు యథాశక్తి పరిశీలింపబడినవి, భా. రా. నకు తా. ప్ర. లధికసంఖ్యలో నుండుటచేతను, పరిమాణమున నిది చాల పెద్ద గ్రంథమగుటచేతను భా. రా. తాళపత్ర ప్రతుల నన్నింటిని, సంపూర్ణముగను, సూక్ష్మముగను పరిశీలించుట ఏ ఒక్క వ్యక్తికిని సాధ్యమగు పని కాదు. అది ఒక సంస్థ చేయవలసిన కార్యము. స్థూలపరిశీలనమున తా. ప్ర. లలో కన్పట్టిన విశేషములనిట పేర్కొందును.

1923 లో వావిళ్ళవారు ప్రకటించిన భా. రా ప్రతిలో గ్రంథారంభమున నొక సంగ్రహరామాయణము చేర్పబడినది. కాని యిది తా. ప్ర. లలో నెందును కానరాదు. వా. రా. న నున్నట్లుగ సంగ్రహరామాయణమిందుగూడ నుండుట యుచితమని కాబోలు పరిష్కర్తలగు మేడేపల్లివారే దీనిని రచించి యిందు చేర్చియుందురు. ఆచార్యులుగారు భా రా. పీఠికలో నిట్లు తెలిపినారు. "మునుపటి ప్రతిలో లేని విశేషములు కొన్ని దీనిలో చేర్చబడినవి. ఎట్లంటే వా. రా. నకు మొదట సంగ్రహరామాయణమున్నట్లు దీనిలోగూడ నొక సంగ్రహరామాయణము చేర్చబడినది.''[2] ఆచార్యులుగారు సంగ్రహరామాయణమిందు చేర్చబడినట్లుగ తెలిపిరే కాని అది యెందుండి గ్రహింపబడినదో తెలియజేయలేదు. ఈ సంగ్రహ రామాయణకర్తలు ఆచార్యులవారే యని చాగంటివారు తలంచినారు.[3] శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు దీనిని భా. రా. కర్తలు రచించినదిగా భావించి యందలి తొలిపద్యము శ్రీకారాది యగుటచే భా. రా. శ్రీకారముతో ప్రారంభమైనదనియు, ఇందు కవి తన కావ్యరచనమునకుగల హేతువులను తెలుపలేదనియు 'రామాయణ కవులు' అను వ్యాసమున తెలిపియున్నారు.[4] కాని యిది తా. ప్ర. లలో నెందును కానరాకపోవుటచే దీనిని ప్రక్షిప్తమని భావించుటయే ఉచితము.

ప్రాచీన తాళపత్రకోశములనుండి కొన్ని పద్యములను తీసి సందర్భాను సారముగా ఆయా కాండములయందు కూర్చబడినట్లుగను ఆచార్యులవారు భా. రా. పీఠికలో తెలిపియున్నారు.[5] ఇట్లు చేర్చబడిన పద్యగద్యములన్నియు కుండలీ కరణ చిహ్నములలో చూపబడినవి. ఈ యధికపద్యములు బా. కాం. న 28; అయో. కాం. న 128; అర. కాం. న 3; కి. కాం. న 7; సుం. కాం. న 2 కలవు. కాని యీ పద్యములుగల ప్రాచీన తాళపత్రకోశములు భా. రా. నకు సంబంధించినవా లేక యితర రామాయణములకు సంబంధించినవా యను విషయమును ఆచార్యులవారు తెలుపరైరి. పెక్కు తా. ప్ర లలో నీ యధిక పద్యములు కానరావు. ఈ పద్యములు లేకున్నను కథాగతికెట్టి యసంగతి కలుగదు. అంతేకాక యీ పద్యముల శైలిని పరిశీలించినచో నివి భా. రా. కర్తలచే రచితములేనా యను సందేహము రాకమానదు. ఈ క్రింది పద్యములను పరిశీలింపుడు.

బాం.కా. "ఇవి యిన్నియు బంగారము
సవరణలను నొప్పనిత్తు స్యందనములు నే
భువి నెనమనూఱు నిచ్చెద
నవిగాకను నెద్దియైన నడుగుము నిత్తున్." (568)

అయో.కాం. "అందఱు నొకమాటుగ సం
క్రందనసమభోగ నీవు రాముని పట్టం
బందముగ గట్టవలెనను
క్రందు మహామంచిదనుచు గణుతించిరొగిన్. (12)

పై పద్యముల రచనములో ఇతర పద్యములందున్న బిగువు కానరాదు. అధికముగా చేర్చబడిన తక్కిన పద్యములన్నియు చాలవఱకు నిట్లే కలవు. అంతేకాక యీ పద్యములెక్కువగా కందపద్యములో, ఆటవెలదులో, తేట గీతులో ఐయుండుటచే నివి యితర కవులచే రచితములైన పద్యములని యు, భా.రా. కర్తృకములు కావనియు చెప్పవచ్చును. వావిళ్ళవారు ప్రకటించిన తొలి ప్రతిలో నీ యధికపద్యములు కానరావు.

# భాస్కర రామాయణము
# పాఠభేదములు

భా.రా.తాళప్రతుల యందలి పాఠభేదములను పరిశీలింప బోవుటకుముందు భా.రా.నకిప్పటివఱకు వచ్చిన ముద్రితప్రతులనుగూర్చి తెలిసికొనుట యవసరము. వివిధ ముద్రాపకులచే నిది సుమారు 12 పర్యాయములు ముద్రితమైనది. వాని వివరములు ఈ విధముగ నున్నవి.

1. కరాలపాటి రంగయ్యగారు మఱియు వైయాకరణం రామానుజాచార్యులుగారు పరిష్కరించిన ప్రతి. ఇది మదరాసు వాణీ నికేతనముద్రాక్షరశాల యందు 1864 లో ముద్రితమైనది.
2. ఐరూరి వేంకటరాయార్యులు ప్రకటించిన ప్రతి. ఇది 1885లో మదరాసు గీర్వాణాంధ్రభాషారత్నాకరముద్రాక్షరశాలలో ముద్రింపబడినది.
3. పండిత పరిష్కృతము. కమలాపద్మ విలాసినీముద్రాక్షరశాల (మదరాసు) లో 1888 లో ముద్రితమైనది.
4. కొమాండూరు అనంతాచార్యులవారిచే పరిష్కృతము. వేమూరు వేంకటకృష్ణమసెట్టి అండ్ సన్స్ వారిచే 1897 లో ఆనంద ముద్రాక్షరశాల యందు ముద్రితమై ప్రకటితమైనది.
5. శతావధాని పురాణం సూర్యనారాయణతీర్థులచే పరిష్కృతమై వావిళ్ళ వారిచే 1910 లో ప్రచురింపబడినది. వావిళ్ళవారు ప్రకటించిన భా రా. తొలిముద్రణ మిదియే.
6. షేడేపల్లి వేంకటరమణాచార్యులుగారిచే పరిష్కృతముకాగా వావిళ్ళవారిచే 1923 లో ప్రకటింపబడినది. 1915 లో ప్రచురితమైన వావిళ్ళవారి భా.రా.నకును, దీనికిని కొంత భేదము కలదు. అందు లేని సంగ్రహరామాయణమును, ఆయా కాండములందు కొన్ని అధికపద్యములును ఇందధికముగా చేర్చబడినవి.

7. మేడేపల్లివారిచే పరిష్కృతము. వావిళ్ళవారిచే 1930 లో ప్రచురితము.
8. మేడేపల్లివారిచే పరిష్కృతము. వావిళ్ళవారిచే 1941 లో ప్రకటితము.
9. మేడేపల్లివారిచే పరిష్కృతము. వావిళ్ళవారిచే 1953 లో ప్రచురితము.

పై 7,8,9 వ ముద్రణములు 1923 లో ప్రకటితమైన వావిళ్ళ వారి భా.రా. ప్రతికి ప్రతిబింబములే యని చెప్పవచ్చును.

10. తంజనగరం తేవప్పెరుమాళయ్యగారిచే పరిష్కృతమైన ప్రతి. ఇది ఆనందాశ్రమగ్రంథమాలవారిచే 1912 లో ప్రచురింపబడినది.
11. నాతా నమ్మయ్యసెట్టి & సన్స్‌వారిచే 1953 లో ప్రకటితమైన ప్రతి.
12. ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడెమీవారిచే 1969 లో ప్రకటింపబడిన ప్రతి. ఇది భా.రా. నకు సంక్షిప్తరూపమేకాని సంపూర్ణము కాదు. పరిష్కర్తలు శ్రీ భారతుల మార్కండేయశర్మగారు.

పైవానిలో మొదట పేర్కొనబడిన భా. రా. ప్రతి ముఖపత్రమున నిట్లు కలదు.

"చెన్నపురి, కాంచీపురము, పచ్చప్ప మొదలారిగారి పాఠశాలయందు సంస్కృతాంధ్ర ప్రథమోపాధ్యాయులగు వైయాకరణ రామానుజాచార్యులవారి చేతనున్ను, ద్వితీయోపాధ్యాయులగు కరాలపాటి రంగయ్యగారిచేతనున్ను రెండవ మాఱు పరిష్కరింపబడిన ప్రతికి సరిగా............ మూడవమాఱు ముద్రింపబడి ప్రచురము చేయబడియెను."

పై వాక్యమునుబట్టి యీ ముద్రణమునకు పూర్వమే కరాలపాటి రంగయ్యగారును, వైయాకరణము రామానుజాచార్యులు గారును కలిసి పరిష్కరింపగా భా. రా. రెండు పర్యాయములు ముద్రితమైనట్లుగ తెలియుచున్నది. కాని యీ ప్రతులు ప్రస్తుతమలభ్యములు. వీనినిగూడ కలుపుకొన్నచో నింతవఱకు భా. రా. సుమారు 14 పర్యాయములు ముద్రణమునొందినట్లుగ తేలుచున్నది.

ఇక భా. రా. తాళపత్ర గ్రంథములనుగూర్చి పరిశీలింతము. అవతార పురుషుడగు శ్రీరాముని చరితమిందలి వర్ణ్యాంశమగుటచే దేశమున ఈ గ్రంథమున కనేక తాళపత్రప్రతులు వెలసినవి. మదరాసు, తంజావూరు, తిరుపతి, కాకినాడ,

హైదరాబాదు మున్నగుచోట్ల గ్రంథాలయములయందు ఈ రామాయణ తా. ప్ర. లనేకములు భద్రపఱుపబడి యున్నవి. (చూ. అనుబంధము) ఇంతేకాక వివిధ వ్యక్తులయొద్దను తమ సొంత ప్రతులుండవచ్చును. తాళపత్ర గ్రంథముల విలువ తెలియక చలిమంటలకో, పొయిమంటలకో ఉపయోగింపగా నష్టమైన ప్రతులును అనేకములనుటలో సందేహము లేదు. వ్యక్తులయొద్దనున్న సొంతప్రతులలో నాకు లభించినవి రెండు మాత్రమే. ఒకటి శ్రీ బి. రామరాజు గారి ప్రతి. రెండవది శ్రీ సుందరాచార్యుల ప్రతి. వీనిలో శ్రీరామరాజుగారి ప్రతి ప్రాచీనమైనది.[1] పైన పేర్కొన్న గ్రంథాలయములందలి ప్రతులతోపాటు పై రెండు ప్రతులు యథాశక్తి పరిశీలింపబడినవి, భా. రా. నకు తా. ప్ర. లధికసంఖ్యలో నుండుటచేతను, పరిమాణమున నిది చాల పెద్ద గ్రంథమగుటచేతను భా. రా. తాళపత్ర ప్రతుల నన్నింటిని, సంపూర్ణముగను, సూక్ష్మముగను పరిశీలించుట ఏ ఒక్క వ్యక్తికిని సాధ్యమగు పని కాదు. అది ఒక సంస్థ చేయవలసిన కార్యము. స్థూలపరిశీలనమున తా. ప్ర. లలో కన్పట్టిన విశేషములనిట పేర్కొందును.

1923 లో వావిళ్ళవారు ప్రకటించిన భా. రా ప్రతిలో గ్రంథారంభమున నొక సంగ్రహరామాయణము చేర్పబడినది. కాని యిది తా. ప్ర. లలో నెందును కానరాదు. వా. రా. న నున్నట్లుగ సంగ్రహరామాయణమిందుగూడ నుండుట యుచితమని కాబోలు పరిష్కర్తలగు మేడేపల్లివారే దీనిని రచించి యిందు చేర్చి యుందురు. ఆచార్యులుగారు భా. రా. పీఠికలో నిట్లు తెలిపినారు. "మునుపటి ప్రతిలో లేని విశేషములు కొన్ని దీనిలో చేర్చబడినవి. ఎట్లంటే వా. రా. నకు మొదట సంగ్రహరామాయణమున్నట్లు దీనిలోగూడ నొక సంగ్రహరామాయణము చేర్చబడినది.''[2] ఆచార్యులుగారు సంగ్రహరామాయణమిందు చేర్చబడినట్లుగ తెలిపిరే కాని అది యెందుండి గ్రహింపబడినదో తెలియజేయలేదు. ఈ సంగ్రహ రామాయణకర్తలు ఆచార్యులవారే యని చాగంటివారు తలంచినారు.[3] శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు దీనిని భా. రా. కర్తలు రచించినదిగా భావించి యందలి తొలిపద్యము శ్రీకారాది యగుటచే భా. రా. శ్రీకారముతో ప్రారంభమైనదనియు, ఇందు కవి తన కావ్యరచనమునకుగల హేతువులను తెలుపలేదనియు 'రామాయణ కవులు' అను వ్యాసమున తెలిపియున్నారు.[4] కాని యిది తా. ప్ర. లలో నెందును కానరాకపోవుటచే దీనిని ప్రక్షిప్తమని భావించుటయే ఉచితము.

ప్రాచీన తాళపత్రకోశములనుండి కొన్ని పద్యములను తీసి సందర్భాను సారముగా ఆయా కాండములయందు కూర్పబడినట్లుగను ఆచార్యులవారు భా. రా. పీఠికలో తెలిపియున్నారు.[5] ఇట్లు చేర్చబడిన పద్యగద్యములన్నియు కుండలీ కరణ చిహ్నములలో చూపబడినవి. ఈ యధికపద్యములు బా. కాం. న 28; అయో. కాం. న 128; అర. కాం. న 3; కి. కాం. న 7; సుం. కాం. న 2 కలవు. కాని యీ పద్యములుగల ప్రాచీన తాళపత్రకోశములు భా. రా. నకు సంబంధించినవా లేక యితర రామాయణములకు సంబంధించినవా యను విషయమును ఆచార్యులవారు తెలుపరైరి. పెక్కు తా. ప్ర లలో నీ యధిక పద్యములు కానరావు. ఈ పద్యములు లేకున్నను కథాగతికెట్టి యసంగతి కలుగదు. అంతేకాక యీ పద్యముల శైలిని పరిశీలించినచో నివి భా. రా. కర్తలచే రచితములేనా యను సందేహము రాకమానదు. ఈ క్రింది పద్యములను పరిశీలింపుడు.

బాం.కా. "ఇవి యిన్నియు బంగారము
సవరణలను నొప్పనిత్తు స్యందనములు నే
భువి నెనమనూఱు నిచ్చెద
నవిగాకను నెద్దియైన నడుగుము నిత్తున్." (568)

అయో.కాం. "అందఱు నొకమాటుగ సం
క్రందనసమభోగ నీవు రాముని పట్టం
బందముగ గట్టవలెనను
క్రందు మహామంచిదనుచు గణుతించిరొగిన్. (12)

పై పద్యముల రచనములో ఇతర పద్యములందున్న బిగువు కానరాదు. అధికముగా చేర్చబడిన తక్కిన పద్యములన్నియు చాలవఱకు నిట్లే కలవు. అంతేకాక యీ పద్యములెక్కువగా కందపద్యములో, ఆటవెలదులో, తేట గీతులో ఐయుండుటచే నివి యితర కవులచే రచితములైన పద్యములని యు, భా.రా. కర్తృకములు కావనియు చెప్పవచ్చును. వావిళ్ళవారు ప్రకటించిన తొలి ప్రతిలో నీ యధికపద్యములు కానరావు.

ప్రస్తుతము మనకు లభించుచున్న ముద్రితభా.రా. ప్రతులను తా.ప్ర.లతో పోల్చి చూచినప్పుడు ము.ప్ర.లలో కానరాని కొన్ని విశేషములు తా.ప్ర.లలో కానవచ్చుచున్నవి. అట్టివానిలో ప్రధానముగ పేర్కొనదగినవి అధికపద్యములు. అయో.కాం.నందును, అర.కాం.నందును కల అధికపద్యముల పాఠాంతరములు గమనింపదగినవి. తొలుత ఆయా కాండములలో కన్పట్టు పాఠాంతరపద్యములను తెలిసికొని పిదప అయోధ్యారణ్యకాండములందలి పాఠాంతరములవలన తెలియ వచ్చు విశేషములను పరిశీలింతము.

కావ్యాదిని శ్రీకారము నిలిపిన సకలదోషములు తొలగి శ్రేయస్సులు కలుగునని తెలుపుచు అప్పకవి శ్రీకారమహత్త్వమును ఈ క్రిందివిధముగ నుగ్గడించినాడు.

''వేదములకెల్ల నోంకారమాదియైన
కరణిఁ గృతులకునెల్ల శ్రీకారమాది
గానఁ గవివరులెల్లరు దానిఁదక్క
నితరవర్ణంబులిడరు సత్కృతుల మొదల" (అ. క. II-354)

కృతిప్రారంభమున శ్రీకారమేకాక అమరవాచకములు, మంగళార్థవాచక ములును ఉండుట ప్రశస్తమని చెప్పి ''అమరవాచకంబులకు నేకావళియందు 'ప్రాలేయాచలకన్యకా' అనియును, కల్పితకల్పవల్లియందు 'హేరంబమవలంబే' అనియును, రామాయణమునందు 'రాముని శుభచరితమ్ములు' అనియును........ (అ క. II-364) అని అప్పకవి వివరించియుండుటచే భా.రా. శ్రీకారముతో ప్రారంభము కాలేదని తెలియుచున్నది. కొన్ని తా.ప్ర.లలోమాత్రము శ్రీకారముతో ఆరంభమగు నీ క్రింది పద్యములు గ్రంథారంభమున కానవచ్చుచున్నవి.

'శ్రీసీతావల్లభుఁడు వి
కాసాబ్జదళాయతాక్షుఁ డజహరముని హృ
త్సంసేవ్యుఁడు రాముఁడు దర
హాసాస్యుండు మమ్ము బ్రోచు ననిశము కరుణన్'[6]

'శ్రీకరరామకథామృత
సేకాహృతతాపనిఖిలచేతననిలయున్
లోకత్రాణచణున్ వా
ల్మీకిమునిన్నాదికవి నమితమతిఁ గొల్తున్'[7]

'శ్రీరఘురామావతారము
నారదుఁడెఱిగించుటయు నలువ యనుజ్ఞన్
శారదకృప వాల్మీకి యు
దారత రామాయణముఁ దా రచియించెన్'[8]

శ్రీమద్రామచరిత్రము
రామాయణముగ రచించి ప్రాచేతసుకై
ప్రేమ నెఱిగించి తగనిజ
ధామమునకు నారదుండుదారతఁ జనియెన్'[8]

'శ్రీరామాయణ కావ్యసారలలిత శ్రీకల్పశాఖాగ్రమం
దారూఢస్థితిఁ బొల్చి భాసురజనాహ్లాదంబుగా మాధురీ
చారుప్రౌఢిమ 'రామ రామ' యనుచున్ సమ్యగ్వచోవైఖరుల్
మీరంబల్కు పికంబునాఁబరగు వాల్మీకిం బ్రశంసించెదన్'[9]

పై పద్యములలో మూడవదియగు 'శ్రీరఘురామావతారము' అన్న పద్యము 'శ్రీరఘురామచరిత్రము' అను కొద్ది మార్పుతో వావిళ్ళవారి భా. రా. న మూడవ పద్యముగ కన్పట్టుచున్నది. కాని యీ పద్యము పెక్కు తా. ప్ర. లలో కానరాదు. ఇక నాలుగవ పద్యమగు 'శ్రీమద్రామచరిత్రము' అనునది. 'రాముని శుభ చరితము' అను కొద్ది మార్పుతో రెండవ పద్యముగ నున్నది. 'శ్రీరామాయణ' అను చివరిపద్యము వావిళ్ళవారి భా. రా. న తొలిపద్యముగ కన్పట్టు చున్నది. అందీపద్యము 'శ్రీ ఆంధ్రపరిశోధక మహామండలి పంచమ వార్షికోత్సవ సంచిక, నుండి తీసికొనబడినట్లుగ అధఃసూచికలో తెలుపబడినది.[10] కృత్యాదిని శ్రీకారము లేకుండుట యుక్తము కాదను నభిప్రాయముతో లేఖకులు శ్రీకారాదులుగ పద్యములను రచించి చేర్చుటయు, కొన్నింటిని శ్రీకారాదులుగ మార్చుటయు జరిగియుండ

వచ్చును. కానిచో బా.కాం.కర్త ఒక్కడే యిన్నితీరుల శ్రీకారాదిగల పద్యములను వ్రాయుట అసంగతమే కదా!

బా.కాం. ప్రారంభమున అయోధ్యాపురము పదునారు పద్యములలో వర్ణితమైనది.[11] వీనిలో చాతుర్వర్ణ్యమును వర్ణించు నాలుగు పద్యములలో ధర విలసిల్లు (I-32); బలవంతంబున (I-33) అను రెండు పద్యములు క్రమముగా వైశ్య శూద్రులను వర్ణించునట్టివి. ఈ రెండును అధికముగా చేర్చబడిన పద్యములు. ఈ గ్రంథకర్త పరిశీలించిన కొన్ని తా. ప్ర. లలో పై పద్యములకు మారుగా నీ క్రింది పద్యములు కన్పట్టుచున్నవి.[12]

'శరధికైనను రత్నముల్ చాల నొసఁగ
నల కుబేరున కర్థంబు లందియీయఁ
జాలి యున్నట్టి వైశ్య లసంఖ్యముగను
మెరసి యుందురు తత్పురవరమునందు'

'వర్ణత్రయసంసేవో
దీర్ణమహత్త్వంబు గలిగి ధృతిచే హిమవ
త్స్వర్ణధరంబులొ యనఁగా
పూర్ణములై యుందురెపుడు పురిఁ దగ శూద్రుల్'

ప్రస్తుతము మనకు లభించుచున్న వావిళ్ళ వారి భా. రా. ప్రతులలో సాహిణిమారుని సంబోధనము గల 'శ్రీరామాకుచయుగళీ' (I-25) అన్న పద్యమొకటి బా. కాం. న 24 వ పద్యము తరువాత కనిపించుచున్నది. కృతిభర్తృ సంబోధనముగల యీ పద్యము ఆస్థానమున నుండదగినది కాదు. ఆశ్వాసారంభముననుండదగినది. అర. కాం. ద్వితీయాశ్వాసారంభమందలి పద్యమే కొద్ది మార్పుతో ఇట చేర్పబడియుండును. వావిళ్ళవారి తొలిముద్రణమున లేని ఈ పద్యము తరువాతి ముద్రణములలో బా.కాం.న నెందుకు చేర్చబడినదో తెలియదు. తా.ప్ర.లలో బా. కాం. న నీ పద్యము మృగ్యము.

వావిళ్ళవారి భా.రా. ముద్రణములలో తొలి రెండింటిలో తప్ప తక్కిన వానిలో అయో. కాం. న 128 గద్యపద్యములధికముగా చేర్పబడినవియు, నవి

భా.రా. కర్తచే రచితములు కావనియు నింతకుముందే సూచింపబడినది. అంతేకాక వీనిలో అయో.కాం. పద్యములు చాలవఱకు ఒక క్రమము లేక ముద్రింపబడినవి. 1910, 1915 సం.లలో ముద్రింపబడిన వావిళ్ళ భా. రా. ప్రతులందలి అయో. కాం. పద్యములు తా. ప్ర. ల పద్యములననుసరించియే యున్నవి పై రెండు ప్రతులయందలి పద్యక్రమమును తా.ప్ర. ల యందలి పద్యక్రమమును ఒకేరీతిగ నున్నవి. కాని తరువాతి ముద్రణములలో నీ క్రమభంగమెట్లు కలిగినదో తెలియదు. దీనిని గూర్చి శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తిగారు భారతిలో నొక వ్యాసమును ప్రకటించియున్నారు.[18] అందు వారు ప్రస్తుత భా. రా. నందలి అయోధ్యాకాండపద్య క్రమమునకు భిన్నముగ నాంధ్రవిశ్వవిద్యాలయ గ్రంథాలయ ప్రతులలో పద్యక్రమమున్నట్లుగను,అదియే యుచితమగు పాఠమనియు తెలిపినారు. తా. ప్ర. లందన్నింటను శ్రీరామమూర్తిగారు చెప్పిన క్రమమేయున్నది. ఆ క్రమ మంతయు నిటచూపిన గ్రంథము విస్తృతమగును. వావిళ్ళవారి మొదటి ముద్రణ ప్రతిని (1910) కాని, ద్వితీయముద్రణప్రతిని (1915) కాని తరువాతి ముద్రణ ములతో పోల్చి చూచినచో నీ విషయము స్పష్టము కాగలదు. కరాలపాటివారి ప్రతియు, ఆనందాశ్రమమువారి ప్రతియు వావిళ్ళవారి తొలి రెండు ముద్రణముల వలె తా.ప్ర.లయందలి పద్యక్రమమునే అనుసరించియున్నవి.

పద్యక్రమము విషయముననే కాక ఈ క్రింది విషయముల యందును తా.ప్ర.లు ముద్రితప్రతితో భేదించుచున్నవి.

శ్రీరాముని పట్టాభిషేకమునకు సర్వసన్నాహములు జరుగుచుండును. వసిష్ఠుడభిషేకమండపమున కావలసిన యేర్పాట్లనన్నింటిని కావించి యభిషేక లగ్నమాసన్నము కాగా దశరథుని తోడ్కొనిరమ్మని సుమంత్రుని పంపును. సుమంత్రుడా విషయమును దశరథునకు తెలియజేయును. అంత కైకేయి రామునకు వనవాసవిషయమును తెలియజేయుటకై రాముని తీసుకొనిరమ్మని యా సుమంత్రునే పంపును. ఈ సందర్భమున తా.ప్ర.లలో నీ క్రింది పద్యము గలదు.

> "ఇటకుండోకొని రమ్ము నావుడు సతండేతెంచి విచ్చేయు మ
> చ్చొటికిన్నిన్ను విభుండు రమ్మనియె నంచుంజెప్పగా నాశీర్వచః

స్ఫుటనాదంబులతో సుమిత్రకొడుకున్ భూపుత్రియుందాను నా
క్కొటఁదేరెక్కి నృపాలఫాలముల మ్రొక్కుంగేలుదోయొప్పగన్'

పై పద్యమున శ్రీరాముడు కైకేయీ భవనమునకు సీతా రామలక్ష్మణు లతో వెళ్ళినట్లుగ వర్ణింపబడినది. కాని వావిళ్ళవారి తృతీయ ముద్రణమునను, ఆ తరువాతి ముద్రణములందును నీ పద్యము కానరాదు. ఈ పద్యమునకు బదులు వీనిలో నారు పద్యములు గలవు.[14] వీనిలో శ్రీరాముడు లక్ష్మణునితో మాత్రమే కైక భవనమునకు వెళ్ళినట్లుగ వర్ణితమైనది.

భరతుడు శ్రీరాముని పాదుకలు గ్రహించి నంది గ్రామమున వసించుచు 'అఖిలనృపాలలోక మరుదందగ' రాజ్యపాలనము చేయుచుండును. ఈ సందర్భ మున తా.ప్ర. లన్నింట నీ క్రింది పద్యము కలదు.

'అంతనక్కడ రాముఁడచటికి భరతుండు
క్రమ్మర వచ్చి సామ్రాజ్యమునకుఁ
దన్ను రమ్మనుచుఁ బ్రార్థన సేయునో యని
చింతించి యాత్మలోఁ జిత్రకూట
మునఁ గల మునిజనంబుల వీడుకొని మార్గ
తరువీక్షణంబునఁ గరము వేడ్క
మిగులంగ సీతాసుమిత్రాపుత్ర సమేతుడై
దండకావన మహీస్థలికి నరిగె

అనగ మహి నయోధ్యాకాండ మభినుతముగ
వినినఁ జదివిన వ్రాసిన జనులకెపుడు
నాపదలుఁ బాయఁజేయు సౌఖ్యంబు బొసఁగు
నాయురారోగ్య సంపాదియై తనర్చు'

ఈ వ్యాసకర్త పరిశీలించిన తా.ప్ర. లందన్నింటను నీ పద్యమే అయో. కాం. చివరి పద్యముగా నున్నది. దీని తరువాత మూడాశ్వాసాంత పద్యములు మాత్రము కలవు. వావిళ్ళవారి భా.రా. ముద్రణములందు కాని, తదితర ముద్రణ ములందుకాని యీ పద్యము కానరాదు. అంతేకాక రాముడు చిత్రకూటమున కుల

పతి యను మునివరుని దర్శించుట. అత్రి మహర్షి యాశ్రమమును దర్శించి యట సీతాదేవి యనసూయాదేవితో తన వివాహ వృత్తాంతమును చెప్పుట మున్నగు అంశములు వర్ణింపబడిన 52 పద్యములు (II,400-452) తా.ప్ర.లలో కొన్నింట మాత్రమే కానవచ్చినవి.[15] కాని వీనిలో నివి అయోధ్యాకాండాంతమునకాక అరణ్య కాండారంభమున కలవు. ము.ప్ర.లలో 52 పద్యములలో వర్ణింపబడిన పై అంశములన్నియు శ్రీ బి. రామరాజుగారి ప్రతి యందును, మరికొన్ని తా.ప్ర.ల యందును నీ క్రింది గద్యమున అతి సంక్షిప్తముగ చెప్పబడినవి.[16]

"ఇట్లు గని యచటనున్న యత్రి మహాముని చరణంబుల కనుజన్ముండును దానును సీతాసహితంబుగా మ్రొక్కిన నత్తపోధనుండు దీవించి సత్కారంబు చేసి తదనంతరంబ యమ్మునీశ్వరుని సతియైన యనసూయామహాదేవి జనకనందనకు సంగరాగం బొసంగె నిట్లు రఘూత్తము డమ్మునితోడను సుఖగోష్ఠి సేయుచు నా రాత్రి యచట నిలిచి మఱునాడు గదలిపోయెదమని యా సంయమీశ్వరుతోడం జెప్పి యనుజ్ఞాతుండై".

దీనినిబట్టి సంక్షిప్తముగానున్న అయో. కాం. ను పెంపు చేయవలయునన్న యుద్దేశముతో తరువాతి కవి యెవరో కొన్ని పద్యములను రచించి గ్రంథమున చేర్చి యుందురని యూహింప వీలగుచున్నది. ఈ యూహను బలపరచు నొకటి రెండు తా.ప్ర.లు ఈ వ్యాసకర్తకు లభించినవి. వీనిలో T 527 నెంబరు గల ఉ.వి. తాళపత్రప్రతి మొదటిది. ఇక రెండవది 115/14 నెంబరుగల ఆ.సా.ప. (కాకినాడ) ప్రతి. మొదట ఉ.వి. ప్రతిని పరిశీలింతము.

ఇందు బా.కాం. మొదలు సుం.కాం. వరకు ఐదు కాండములు కలవు. ఇందలి బాల, కిష్కింధా, సుందరకాండ భాగము లించుమించుగా వావిళ్ళవారి తొలి ముద్రణము ననుసరించియే యున్నవి. అయోధ్యారణ్య కాండములు మాత్రము ము.ప్ర.ల కంటె మిక్కిలి భిన్నముగా నున్నవి. ము.ప్ర. యందలి అయోధ్యా కాండభాగ మీ ప్రతియందు నాలుగింతలు పెంపుగావింపబడినది. ఇట్లు పెంపుచేసిన కవి యెవ్వరో స్పష్టముగా తెలియదు. ఈ ప్రతిలో అయోధ్యా కాండారంభమున గల యీ క్రింది పద్యములవలన నా కవి పేరు తెలుసుకొనుటకు వీలగునో పరిశీలింతము.

'శ్రీనుత నూకలాఖ్యకులశేఖరు రంగనృపాలు వాక్సుధా
నూన వివర్ధితాత్మహృదయోల్లసదంబుజుడై కవీణ్ముదా
మాన కృతిక్రియా నిపుణతాఖని మామిడిపల్లి వేంకటా
ఖ్యానుఁడు కీర్తిభాసురుఁడకల్మషుఁడూర్జితకౌతుకంబునన్'

'శ్రీరామాయణమందు భాస్కరకవిశ్రేష్ఠుండు సంక్షేప లీ
లారూఢస్థితి కాండపంచకమయోధ్యాకాండయే యాదిగా
శ్రీ రంజిల్ల రచించెనందు కథలన్ శ్రేష్ఠప్రసిద్ధంబులన్
సూరివ్రాతము మెచ్చఁజెప్పె ధర నాసూర్యాబ్జమై వర్తిలన్'

పైవానిలో తొలిపద్యమున మామిడిపల్లి వేంకటార్యుని ప్రసక్తి యున్నది. ఆతడు నూకలవంశమునందు ప్రసిద్ధుడైన రంగనృపాలుని వాక్సుధచే వివర్ధితమైన హృదయాంబుజము గలవాడనియు, కవిశ్రేష్ఠులకు మోదముగూర్చుటయందు నిపుణుడనియు, కీర్తిమంతుడనియు, పవిత్రుడనియు తెలియుచున్నది. కాని యీతడే అయో.కాం.ను పెంపుచేసినట్లుగ మాత్రమిందు చెప్పబడలేదు.

ఇక రెండవపద్యమున భాస్కరకవి ప్రసక్తి యున్నది. ఈతడు శ్రీరామాయణమున అయో.కాం.మొదలుగా కాండపంచకమును సంక్షిప్తముగ రచించి యందు శ్రేష్ఠములు, ప్రసిద్ధములు నగు కథలను సూరివ్రాతము మెచ్చునట్లు చెప్పినట్లుగ విదితమగుచున్నది.

పై పద్యములు రెండును వేనికవి స్వతంత్రములని భావించినచో మొదటి పద్యమునందలి 'ఊర్జితకౌతుకంబునన్' అన్న పదమునకన్వయము కానరాదు. రెండవపద్యమునను దానికన్వయము కుదురదు. రెండవపద్యమందలి 'రచించె' ననుదానికి 'రచింప' నను పాఠాంతరమును చెప్పికొన్నచో నీ పదమునకు కొంతవఱకన్వయమును సాధింప వీలగును. అప్పుడు భాస్కరకవి శ్రేష్ఠుడు అయో.కాం మొదలుకొని ఐదుకాండములను సంక్షేపముగ రచింపగా మామిడిపల్లి వేంకటార్యుడు కౌతుకముతో ఇందు శ్రేష్ఠములు, ప్రసిద్ధములు నగు కథలను చేర్చి విస్తృతముగావించినట్లుగ పై పద్యముల భావముగా గ్రహింపవలసియున్నది. పై పద్యములకిట్టి యన్వయము చెప్పుట క్లిష్టమార్గమైయైనను మార్గాంతరము

కానరాదు. భాస్కరకవి అయో. కాం. మొదలుకొని ఐదు కాండములను సంక్షిప్తముగా రచించినట్లు పై పద్యములలో రెండవపద్యమున చెప్పబడినది. మంత్రి భాస్కరుడు పూర్వము రామాయణమును రచించినట్లొక ప్రవాదమున్నను ఈ పద్యమున పేర్కొనబడిన భాస్కరుడు మంత్రిభాస్కరుడనుటకాధారములు లేవు. అంతేకాక యీతడు బా.కాం. వదలి అయో.కాం.నుండియే రచన గావించుటకు గల కారణమేమియో తెలియకున్నది. మొత్తముపై సంక్షిప్తముగానున్న భా.రా.ను కవులు పెంపుచేసిరనుటకు మాత్ర మీ ప్రతి సాక్ష్యమగుచున్నదనుటలో సందేహము లేదు. పెంపుచేసిన భాగమందలి పద్యముల శైలిని తెలుసుకొనుటకు అయో.కాం. నుండియు, అర.కాం.నుండియు రెండేసి పద్యములు ఉదాహరింపబడుచున్నవి.

'ఏకముఖంబునన్ ఫణికులేశుసహస్రముఖున్ జయించు భా
షాకృతిచేఁ ద్రినేత్రుడయి శక్రు సహస్రవిలోచనున్ సమ
స్తాకలనేక్షచేఁ గెలుచు నాయతవృత్తభుజద్వయుండునై
యేక సహస్రభానుని రవిన్ గడు మీఱు రవిప్రతాపలీలచేన్[17].

అందమై లోచనానందమై దరహాస
కందమై తగుమోము గలుగువాని
సోగలై కెంజాయ తీగలై యెలదమ్మి
రాగలై తగు సునేత్రములవాని
గొప్పలై జయలక్ష్మితిప్పలై కాంతిపెన్
గుప్పలై తగుమూపులొప్పువాని
వ్యూఢమై యత్యంతభాఢమై హారసం
లీఢమై తనరు నురోలీలవాని

మకుటకుండలదీప్తులు మలయువాని
రూపగుణముల పురుషుల చూపు మనము
చూరగొనువాని రామునిఁ జూచి పంక్తి
రథుడు సంతోషవార్ధినిమగ్నుడయ్యె[18]

**అర. కాం. :**

'శరఖడ్గక్షతి ముష్టిఘట్టనతటస్పర్ధోరుజాస్యాంఘ్రి కూ
ర్పరఘాతంబులఁ జావడయ్యె నసురప్రౌఢుండు వీఁడెంతయున్

వరదానంబుననో తపోబలిమి నో వధ్యుండు గాఁడారయన్
ద్వరదశ్రేష్ఠముఁబోలె గర్తమున వీనింద్రోయఁగర్జంబగున్[19]

'నీలాభ్రద్యుతిమాలికల్ నిగుడ వర్ణింపంగ నానావిధో
త్తాలస్ఫారసుమాభినందితలసద్వల్లీ సమావేల్లిత
వ్యాలోలద్రుమ శోభితంబు ఖచరీవ్యాలీఢకూటాగ్రమౌ
శైలంబొక్కటిఁ జూచి రాఘవమహీజంభారి సంరంభియై[20]

ప్రస్తుతము మనకు లభ్యమగుచున్న భా. రా. ముద్రిత ప్రతులయందలి అర. కాం. భాగమంతయు పరస్పరము భేదమేమియు లేక ఒకేవిధముగ నున్నది. వీనిలో ప్రథమాశ్వాసమున 291 పద్యములును, ద్వితీయాశ్వాసమున 437 పద్యములును కలిసి అర.కాం. న మొత్తము 728 పద్యములును కలవు. ఈ ప్రతులందన్నింటను నటనట ప్రధాన పాఠముగ నొక పాఠమును, అందలి పద్యముల కధోభాగమున పాఠాంతరపద్యములును చూపబడినవి. ప్రధాన పాఠముగ చూపబడిన పద్యములయు, వానికి వ్రాతప్రతిలోనివిగా నధోభాగమున చూపబడిన పద్యములయు వివరములు క్రింద చూపబడుచున్నవి.

| ప్రధాన పాఠమందలి పద్యములు | | | | అధోభాగమున చూపబడిన పాఠాంతరపద్యములు |
|---|---|---|---|---|
| అర. కాం. 1 ఆ. : | | | | |
| 66 వ పద్యమునుండి | 71 వఱకు | = | 6 | 4 |
| 168 ,, ,, | 190 ,, | = | 22 | 10 |
| 192 ,, ,, | 199 ,, | = | 8 | 6 |
| 214 ,, ,, | 244 ,, | = | 31 | 25 |
| 261 ,, ,, | 264 ,, | = | 4 | 1 |
| 266 ,, ,, | 279 ,, | = | 14 | 8 |
| 281 ,, ,, | 291 ,, | = | 11 | 6 |
| | | | 96 | 60 |

అర. కాం. 2 వ ఆశ్వాసము :

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 77 వ పద్యమునుండి | | | 91 వఱకు | | = | 15 | | 9 |
| 148 | ,, | ,, | 389 | ,, | = | 242 | | 62 |
| 406 | ,, | ,, | 423 | ,, | = | 18 | | 21 |
| | | | | | | 275 | | 92 |

ఇతరకాండములందలి పాఠాంతరపద్యములకును, అర. కాం. నందలి పాఠాంతర పద్యములకును చాల భేదము గలదు. ఇతరకాండములందలి పాఠాంతర పద్యము లధికపద్యములే కాని యవి ము. ప్ర.లలోని పద్యముల స్థానమున నుండదగినవి కావు. కాని అర. కాం. నందలి పాఠాంతరపద్యము లధికపద్యములు కాక ప్రధాన పాఠమందలి విషయమునే తెలుపునట్టివి. పై నొసగబడిన ము.ప్ర లయందలి ప్రధానపాఠపద్యసంఖ్యను, పాఠాంతరపద్యసంఖ్యను పరిశీలించినచో పాఠాంతరపద్యములను రచించిన కవి క్లుప్తరచనయందభిమానము గలవాడని స్పష్టమగుచున్నది. కాని ప్రధానపాఠముగ చూపబడిన పై పద్యములు భాస్కర రచితములా యను అంశమును పరిశీలింపవలసియున్నది. ఒకటిరెండు తా. ప్ర. లలో తప్ప తక్కిన యనేక తా. ప్ర.లయందు దిగువ పాఠాంతరముగ చూపబడిన పద్యములు మాత్రమే కనబడుచున్నవి. ము.ప్ర.ల ప్రకారముగ దిగువ చూపబడిన పెక్కు పద్యములధికపాఠములసంకలనమనియు, ప్రధానపాఠముగ చూపబడిన పద్యమే తా. ప్ర.లపాఠమనియు పాఠకులు భ్రమపడుటకవకాశము కలుగుచున్నది. కాని పెక్కుతా. ప్ర.లలో ము.ప్ర.లయందు దిగువ చూపబడిన పాఠమే యుండుట వలనను, ప్రధానపాఠముగ చూపబడిన పద్యములు గల తా.ప్ర.లు అతివిరళమగుటచేతను దిగువ చూపబడిన పద్యములే ప్రధానపాఠమనియు, ప్రధాన పాఠమున నీయబడిన పద్యములు తరువాతికవులు పెంపుచేసిన భాగమనియు ఊహింపవచ్చును. భా. రా. కర్తలందరును అర. కాం. విషయమున నంతకు పూర్వము కరాలపాటి రంగయ్యగారి పరిష్కరణమున ముద్రితమైన భా.రా. ప్రతి (1864) పాఠమును యథాతథముగ గ్రహించుటయే పెక్కు తా. ప్ర లందలి పాఠము పాఠాంతరముగ నధోభాగమున చేరుటకు కారణము కావచ్చును.

ఆనందాశ్రమమువారు 1897 లో ముద్రించిన భా రా. లో ప్రారంభమున గల విజ్ఞాపనమున నీ క్రింది విధముగ నున్నది.

"........... ఈ గ్రంథమును మేము ముద్రింపబూని దుర్వహప్రయాస మునకునోర్చి ఘనత వహించిన గవర్నమెంటువారిచే బాలింపబడుచుండు పుస్తక భాండాగారము (ఓరియంటల్ లైబ్రరీ) నందు గల ప్రాచీనతాళపత్రసంపుట ములతో సరిచూడ నారంభింపగా అర. కాం. తక్క తక్కిన భాగములు అక్షర స్ఖాలిత్యములు దక్క మఱియేవిధమైన లోపము లేకయుండెనుగాని యారణ్య కాండము మాత్రము సగమునకు మీదనే రచన నవీనమనియు, అఖితప్రతులలోనిది ప్రాచీనమనియు నూహింపదగియుండెను. కనుక మేము ఉభయమును ఇందు చేర్చి ముద్రింపించితిమి."

పై వాక్యములనుబట్టి అర.కాం. నందలి యధోభాగపాఠమే తా.ప్ర. పాఠ మనియు, అదియే ప్రాచీన పాఠమనియు నా గ్రంథ పరిష్కర్తలు గుర్తించినట్లుగ తెలియుచున్నది. ఐనను వీరు కూడ ము.ప్ర. యందలి పాఠమునే ప్రధాన పాఠ ముగ గ్రహించి తా.ప్ర. పాఠమును ఎందుకో పాఠాంతరముగ చూపియున్నారు. తా.ప్ర.లతో పోల్చి అర.కాం. న గల ప్రక్షేపములను గుర్తించి తత్కాండ స్వరూపమును నిర్ణయించుటకు ప్రయత్నము జరుగలేదు. తా.ప్ర.లలో అర. కాం.న కనబడు కొన్ని పద్యములు ముద్రిత భా.రా.న లేకుండుటయు, ముద్రిత భా.రా.లో నున్న యనేక పద్యములు పెక్కు తా.ప్ర.లలో కానరాకుండుటయు పై యూహకు సమర్థకములు. మొట్టమొదటిసారిగా భా.రా ను పరిష్కరించి ముద్రింపించిన కరాలపాటి రంగయ్యగారే సంక్షిప్తముగనున్న అర కాం.ను పెంపుచేయగోరి తామే స్వయముగ పద్యములను రచించి యిందు చేర్చియుందు రని భా.రా. పీఠికాకారులు తం. వేవపెరుమాళయ్యగారూహించినారు.[21] కాని ఈ పద్యములు గల ప్రాచీన తా.ప్ర.లు రెండు ఆం.సా. ప. (కాకినాడ) పుస్తకాలయ మున నుండుటచే నీ పద్యముల రచయిత కరాలపాటివారు కారని తెలియుచున్నది.

అర.కాం న అధోభాగమున చూపబడిన పాఠముల విషయముననే కాక తక్కిన భాగములందును అటనట ము ప్ర.ల పాఠమునకును, తా.ప్ర.ల పాఠము నకును భేదము కనబడుచున్నది. ఆ భేదము రెండు విధములుగ నున్నది.

1. ము.ప్ర.ల యందు విపులముగా వర్ణింపబడిన భాగములకు బదులుగ తా.ప్ర.లలో భిన్నపద్యములు సంక్షిప్తముగ నుండుట. ఇంతకుపూర్వము పేర్కొనబడిన పాఠభేద పద్యములు ము. ప్ర. లో చూపబడగా నీ పద్యములు మాత్రము ము,ప్ర.లలో పాఠాంతరములుగా సూచింపబడలేదు.

2. ము.ప్ర.లలో కనబడు కొన్ని పద్యములు తా.ప్ర లలో లేకుండుట.

పై రెండు భేదముల వివరములు దిగువ చూపబడుచున్నవి.

| ముద్రిత ప్రతి | | | | | తాళపత్ర ప్రతి |
|---|---|---|---|---|---|
| **అర.కాం. 1 ఆ.** | | | | | |
| 2వ పద్యము నుండి | | 8వ పద్యము వఱకు | | = 7 | లేవు |
| 15 | ,, | 26 | ,, | = 12 | ,, |
| 34 | ,, | 41 | ,, | = 8 | ,, |
| 79 అగస్త్యమాహాత్మ్య వర్ణనము | ,, | 97 | ,, | = 19 | 3 భిన్నపద్యములు |
| 108 | ,, | 111 | ,, | = 4 | లేవు |
| 117 | ,, | 132 | ,, | = 16 | లేవు |
| 144వ పద్యము | | | | = 1 | లేదు |
| 151వ పద్యము నుండి | | 155 వఱకు | | = 5 | 1 భిన్నపద్యము |
| 160 | ,, | 161 | ,, | = 2 | 1 భిన్నపద్యము |
| **అర.కాం. 2 ఆ.** | | | | | |
| 6 | ,, | 18 | ,, | = 13 | 2 భిన్నపద్యములు |
| 24 | ,, | | | = 1 | లేదు |
| 39 వ పద్యము నుండి | | 49 వఱకు | | = 13 | 4 భిన్న పద్యములు |
| 52 | ,, | 60 | ,, | = 9 | 3 ,, |
| 64 | ,, | 66 | ,, | = 3 | 1 ,, |
| 70 | ,, | 74 | ,, | = 5 | 1 ,, |
| 95 | ,, | 100 | ,, | = 5 | 1 ,, |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 103 | ,, | 109 | ,, | = 7 | 7 | ,, |
| 112 | ,, | 113 | ,, | = 2 | లేవు | |
| 128 | ,, | 133 | ,, | = 6 | ,, | |
| 426 | ,, | 437 | ,, | = 12 | ,, | |

ము. ప్ర. ల యందును, తా. ప్ర. ల యందును కనబడు పద్య సంఖ్యను పరిశీలించినచో క్లుప్తముగనున్న అర. కాం. ను పెంపుచేయనుద్దేశముతో ప్రక్షేపములు జరిగియుండునని తెలియుచున్నది. ఈ విధమగు ప్రక్షేపములు అర. కాం. న మాత్రమే యుండుట గమనింపదగిన విషయము. అర. కాం. న అటనట పాఠాంతరముగ చూపబడిన పద్యములకు మారుగా ప్రధానపాఠమున చూపబడిన ప్రక్షిప్త పద్యములు గల తా.ప్ర. లు రెండు ఆం. సా. ప పుస్తక భాండాగారమున నున్నవి. అవి 100/14, 183/14 నెంబర్లుగల ప్రతులు. ఈ రెండు ప్రతులును ఒక్కరీతిగ లేవు 100/14 నెం. ప్రతిలో ము.ప్ర. యందలి 66 వ పద్యము (III-1 ఆ.) నుండి 71 వ పద్యము వఱకు గల ప్రధాన పాఠమేయున్నను తక్కిన పద్యములన్నియు పాఠాంతర పద్యములనే అనుస రించియున్నవి. ఇక ద్వితీయాశ్వాసమున పాఠాం తరపద్యములే అంతట కలవు. 183/14 నెం ప్రతిలో 1 ఆశ్వాసమున ము.ప్ర. యందలి ప్రధానపాఠమే యంతట నున్నను 2 వ ఆశ్వాసమున మాత్రము 77 వ పద్యమునుండి 91 వఱకు ప్రధాన పాఠమును, 149 వ పద్యమునుండి 389 వఱకు, 406 వ పద్యమునుండి 423 వఱకును గల ప్రధాన పాఠమునకు మాఱుగా అధోభాగమందలి పాఠాంతర పద్యములును కలవు అంతేకాక ము ప్ర. లందు కనబడుచు బహు తా. ప్ర. ల యందు కానరానివియు, తా.ప్ర. లలో క్లుప్తముగనుండి ము.ప్ర. లలో విపుల ముగానున్న పద్యములును కొన్ని యీ రెండు ప్రతులయందు కనబడుచున్నవి. ఈ ప్రతులలో కనబడు మరొక్కవిశేషమేమనగా ము ప్ర. లలో కానరాని యనేక పద్యము లాయా ఘట్టములందధికముగ కానవచ్చుట. శ్రీరాముడు శరభంగుని, సుతీక్ష్ణుని దర్శించుట యను వృత్తాంతము ము.ప్ర. లో 23 గద్య పద్యములలో వర్ణింపబడగా[23] నీ రెండు ప్రతులలో నీ వర్ణనము 60 గద్యపద్యములలో నున్నది.[24] ఈ ఘట్టమందలి కొన్ని పద్యములు దిగువ నుదాహరింపబడుచున్నవి.

వాసవరథ్యముల్ హరితవర్ణము లంబరచారు లీ రథా
గ్రేసరులైన వింద దిలకించి కెలంకుల నస్త్రపాణులై
భాసురలీలఁ గ్రాలు నెలప్రాయములుంగలవారు నాక భూ
వాసులు నింగి నిట్లు వినవచ్చు రవంబులు దివ్యగానముల్

రాకనలంకరించు నుడురాజన నొప్పెడు నాతపత్రమ
స్తోకమణిప్రభాపటలితో రమణీకరధూయమాన చా
మీకర చారుచామర సమీర విహారవిలోలకుంతలున్
దా కమనీయుఁ డింద్రుఁడగు నైనను నేర్పడఁజూచి వచ్చెదన్

అ(ఇ)తని తెఱఁగెఱింగి యే వచ్చునందాక
నీవు జనకసుతయు నిచటనుండు
డనుచు రామచంద్రుఁ డాశ్రమవనమున
కరుగుదేర నప్పుడమరవిభుఁడు

సురలమైన మనలఁ జూచు తలంపున
వచ్చుచున్నవాఁడు వాఁడె రాముఁ
డితనితోడ మనకు నిప్పుడు సంభాష
ణంబు సేయ నవసరంబు గాదు.

అగస్త్యుడు శ్రీరామునకు దివ్యాయుధములను ప్రసాదించు ఘట్టము మొదలు కొని ఖరుడు శ్రీరామునిపై కదిసి వచ్చు ఘట్టము వరకును గల విషయమంతయు ము ప్ర.లో 71 పద్య గద్యములలో వర్ణితమైనది.[25] ఇందు గల జంబుకుమార వధఘట్ట మీ ప్రతులలో కానరాదు. ఈ వృత్తాంతముగల యిరువది పద్యములను[26] తీసివేసినచో పై విషయము లేబది పద్యములలో వర్ణింపబడినవన్నమాట. ఈ యేబది పద్యములకు మాఱుగ నీ రెండు ప్రతులలో సుమారు నూరుపద్యములు గలవు. ఈ పద్యముల మధ్య అటనట ము.ప్ర.లోని క్రింది పద్యములును చోటు చేసుకొన్నవి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| అర.కాం. 1 ఆ. | 108 నుండి | 111 వరకు | = | 4 |
| ,, ,, | 144 | — | = | 1 |

,, ,, 151 నుండి 155 వరకు = 5

—

10

—

ఐనను ఇట్టి పద్యములు పదికంటె నెక్కువగా లేవు. ము.ప్ర.లో కానరాక యీ ప్రతులలో కన్పట్టు పై ఘట్టములందలి యధిక పద్యములలో కొన్ని యిట నుదాహరింపబడుచున్నవి.

**అగస్త్యుడు శ్రీరామునకు దివ్యాయుధములను ప్రసాదించు ఘట్టము:**

"అని పలికి నియమింప నమ్మునికుమారుండు నవ్విధం బాచరించె. తద నంతరంబ వానప్రస్థ విధిప్రకారంబున నా రాఘవుంబూజించి కుంభసంభవు డిట్లనియె

అంచితదీప్తిమన్మణిమయంబగు నీ ధనురుత్తమంబు నీ
కాంచనపుంఖమైన వరకాండము లీ శరజాలమోజమై
నించిన తూణయుగ్మమును నీ ఘనఖడ్గము విశ్వకర్మ ని
ర్మించె మురారి యివ్విలు ధరించియ త్రుంచె సమస్తదైత్యులన్

బ్రహ్మదత్తంబులైన........ రమ సంధ
నములు ......... చ్చెను వైష్ణవములనంగఁ
బరఁగ యిది మహేశని ప్రభల వెలుగు
వీని ధరియించి రఘువర విజయమందు

అనుచు నద్దివ్యాయుధంబులిచ్చి యన్నరేంద్రనందనుం గనుంగొని

సీ॥ భూపాల యీ బాల పుష్పకోమల భవ
ద్వాత్సల్యమున నిట్లు వచ్చెఁగాన
దుర్గమవనములు దుస్తరాయాసంబు
లనుభవింపఁగ నేర్వదట్లు గాక

ప్రకృతితత్త్వంబు, పడతుల కత్యంత
మృదువిహారంబులు మిగుల గోర్కి
కాన సమర్థున కామించి వర్తింతు
రొల్లరు విషమ.... ........

నరయ మెఱుగులకంటె నస్థిరము శిలల
కంటె నంబు శరములకంటె వాడి
గాలికంటె వేగము శిఖికంటె వేడి
క్రకచమునకంటె బరువ మంగనల మనసు

శ్రీరామునొద్దకు వచ్చిన శూర్పణఖవర్ణనము:

'అరుదగు మేనిమాంస మవినాయతదంష్ట్రిలు ఘోరవక్త్రగ
హ్వరమును దీర్ఘజంఘలు నుదగ్రమహోల్కల నీను నక్షివి
స్ఫురణము నూర్ధ్వకేశములు జూడ్కికి నోట యొనర్పఁ బంక్తి కం
ధరునను జన్మ శూర్పణఖ నా నొకరాక్షసి వచ్చెఁ జెచ్చెరన్'

ఇట్లు వికృతాకారంబు ఘోరంబుగా జనుదెంచి

'దలదిందీవరసుందరద్యుతియుతున్దారుణ్యలక్ష్మీ సము
జ్జ్వలు నుద్బంధురకంధరుంగరికరస్పర్ధోరు బాహార్గళుం
జలజస్ఫారవిశాలలోచను విరాజత్పార్థివవ్యంజనా
కలనాలంకృతుఁగాంచెఁ గట్టెదుర నా కాకుత్స్థవంశాగ్రణిన్[127]

ఈ సందర్భమున నొక విషయమును చెప్పవలసియున్నది. మొదట మంత్రిభాస్కరకృతమగు నొక రామాయణముండెననియు, అందితరకాండములు నష్టముకాగా నొక యరణ్యకాండమే మిగిలినదనియు, అందును అటనట శైథిల్య మేర్పడగా హుళక్కిభాస్కరుడు పూరించెననియు కొందరి వాదము. అట్లైనచో పైన చూపబడిన పాఠాంతరపద్యములును, ము.ప్ర.లలో అర.కాం.న నధోభాగ సూచితపాఠములకు గల ప్రధానపాఠపద్యములును హుళక్కి భాస్కరునిచే పూరితములని భావింపవలసియున్నది. కాని యీ యూహ సరియైనదిగా తోచదు. ఏమన ము ప్ర లలో ప్రధానపాఠముగ చూపబడిన పద్యములును, ము.ప్ర.లలో

కెక్కని పై పద్యములును పాలకుర్కి భాస్కరరచితములేయగుచో నీ పద్యములు గల తా.ప్ర లు విశేషముగ ప్రచారమున నుండవలెనుకదా! అంతేకాక ము.ప్ర. యందలి ప్రధాన పాఠపద్యములును, పై నుదాహరింపబడిన పద్యములును వివరణాత్మకములుగనే యున్నవికాని పూరకములుగ కనబడవు. పై పద్యములు లేకున్నను కథాగతికెట్టి యసంగతి కానరాదు. పై పద్యములన్నియు పెంపు కోసము వ్రాయబడినవే యను విషయము నీ క్రింది పద్యములను పరిశీలించినచో సులభముగ నవగతము కాగలదు.

"అవని చలింప నై జవికృతాకృతిఁగైకొని పేర్చి సీతపైఁ
గవిసినఁజేయి మాటిడిచుఁగ్రమ్మన లక్ష్మణ దీనిఁబట్టి యం
గవికలఁజేయుమన్న నురుగాఢరయంబునఁగోసె ముక్కునుం
జెవులును గ్రూరధార విలసిల్లు కుఠారమునంగఠోరతన్"

శూర్పణఖ సీతాదేవిని మ్రింగబోవుటయు, శ్రీరాముడామెకు చేయి యడ్డు పెట్టి శూర్పణఖ ముక్కుచెవులు కోయుమని లక్ష్మణునకాజ్ఞ యిచ్చుటయు, ఆతడాయాజ్ఞను నెరవేర్చుటయు పై పద్యమున వర్ణ్యాంశములు. పెక్కు తా.ప్ర. లలో కనబడు పై పద్యమునకు మాఱుగా ము ప్ర లలో నీ క్రింది యైదు పద్యములు కనబడుచున్నవి.

కొఱవులభంగి మండుమిడిగ్రుడ్డుల నిప్పులు రాల దీప్తి గ్రి
క్కిఱిసి మహోల్క రోహిణిపయింబఱతెంచినమాడ్కిఁ జూడ్కికిన్
వెఱవు జనింప సీతపయి వే పఱతేఱ నృపాలుఁడొక్క చే
బిఱుసునఁబట్టె నయ్యబలఁ బెల్కుఱు రాక్షసిఁ బట్టె నొక్కటన్

ఇట్లన్ని శాచరింబట్టి లక్ష్మణుఁగనుంగొని

క్రూరులు దుష్టాత్ములు నగు
వారలతో నగవులెపుడు వలవదు కంటే
నేరమి మనదెసఁ గల్గుట
నీ రక్కసి జనకతనయకిమ్మెయిఁ దొడరున్

కాపున దీనినింక విరూపింజేయుమనుటయు నా సుమిత్రాపుత్రుండు

ఘోరక్రోధంబున న
వ్వీరోత్తము నాజ్ఞ నొక్క పెస నన్నక్తం
చారిణి నప్పుడ పట్టి కు
ఠారంబున ముక్కుసెవులు డగ్గఱఁగోయన్[28]

పైన పేర్కొన్న 'అవని చలింప' నను నొక్క పద్యమున నున్న విషయమే పై ఐదు పద్యములలో వివరముగా చెప్పబడినదనుటలో సందేహము లేదు కదా!

ము. ప్ర. లోని అర. కాం. పాఠములకు కొన్నింటికి తా. ప్ర. లలో కనబడు పాఠాంతరములను తెలిసికొందము.

ము. ప్ర. లన్నింటను అర. కాం. ప్రారంభమున 'శ్రీ హితనయవిలసిత' యను పద్యము కలదు. కాని కొన్ని తా. ప్ర. లలో నీ క్రింది పద్యము చోటు చేసుకొన్నవి.[29]

శ్రీరమ్యస్మితవదన ప
యోరుహ ఖండాలగండయుగళితవిగళ
ద్ధారాళదానధారా
సారాప్లుతభువనహార సాహిణిమారా!

పై పద్యముతో నారంభమగు అర. కాం. గల తా. ప్ర. లందన్నింటను ము. ప్ర. లందయోధ్యాకాండాంతమున గల కులపతిమునివృత్తాంతమును, అత్ర్యనసూయలవృత్తాంతమును (భా. రా. II, 401-452) అర. కాం. ఆరంభమున నుండుట గమనింపదగినది. కొన్ని తా. ప్ర. లలో నీ వృత్తాంతము లసలే కానరావు.[30]

ము. ప్ర. యందలి 'జనపతి ప్రియమెసలారఁగ' (III, 1, 12) నను పద్యము తరువాత కొన్ని తా. ప్ర. లలో నీ క్రింది గద్యపద్యములు కనబడు చున్నవి.[31]

కాంచె విభుండు తుంగపరికల్పిత సౌధగదాపిపాపని
స్సంచయమస్తకస్ఫురితచారుకిరీటము రత్ననిర్మితా
కుంచితవక్త్రిప్రపఘనఘోషమహోరు సుమేరుభూధరో
దంచితగోపురోత్కలితహైమకవాటము హేమకూటమున్

వ॥ ఇట్లు గని యచ్చటనున్న యత్రిమహాముని చరణంబుల కా రఘు నందనుండనుజన్ముండును దానును సీతాసహితంబుగా మ్రొక్కిన నత్తపోధనుండు దీవించి సత్కారంబు సేసె, తదనంతరంబ యమ్మునీశ్వరుని సతియైన యనసూయామహాదేవి జనకనందనకు నంగరాగంబొసగె నిట్లు రఘూత్తము డమ్మునిసత్తముతో సుఖగోష్ఠి నిలిచి యా రాత్రి నచట నిలిచి మరునాడు గదలి పోయెదమంచు సంయమితోడంజెప్పి యనుజ్ఞాతులై"

పై పద్యములపిమ్మట 'పుణచరిత్రుఁడత్రిముని' యను పద్యము (భా.రా. III, 1, 2) కలదు.

ము. ప్ర. లందుగల 'జానకి డించి' యను రెండే పదముల వచనము (భా.రా. III, 1, 28) తా.ప్ర. లన్నింటిటను నీ క్రింది పద్యముగా కలదు.

"జానకి డించి భీమరభసంబున శూలముగొంచు నార్పుతోఁ
బై నిగుడింపఁ ద్రుంచెఁ బటుభల్లమునంగరశూల ముద్ధతిం
దోనఁగడంగి లక్ష్మణుఁడు తూపుల ముంచె నిశాటు నెమ్మెయిం
బూని నిగుడ్చు నంపగమిఁ బొంకము గొంకక దైత్యుఁడుద్ధతిన్"

ఇట్లే ము.ప్ర.లో అర.కాం. 2 ఆ. న గద్యరూపమున చూపబడిన రెండు భాగములు (117, 393) కొద్ది భేదముతో తా. ప్ర. లలో పద్యరూపమున కనబడుచున్నవి.

"అన విని యోహో వెఱవకు
మెనయక నే నున్నవాడ యిన్నిటుని స
య్యనఁ బొరిగొని విడిపించెద
నని పలుకుచుఁబెలుచ నట్టహాసము చేసెన్"

"ఇట్లు గూలి యా దైత్యుఁడొకింతవడికిఁ
దెలివినొంది మీరెవ్వ రలఘుశౌర్యు
లార యనుటయు జెప్పె నింపారఁ దమ వి
ధంబు దెలియంగ నా సుమిత్రాసుతుండు"

ము.ప్ర. యందలి 'చని చని దట్టమై' (III, 1, 13) యను పద్యము తరువాత కొన్ని ప్రతులలో[32] నీ క్రింది పద్యము గలదు.

"కని రా రాజన్యు లుగ్రక్రకచకఠినసంఘట్టనక్రూరదంష్ట్రా
జనితజ్వాలాకరాళుంజటులమృగపతిస్రగ్ధనాభీలశూలున్
ఘనఘోరాకారరోషోత్కటనిటలతటగ్రంథిలభ్రూవికారున్
హననవ్యాపారు చాపవ్యసనసులభు మిథ్యావిరోధున్ విరాధున్"

'చని చని దట్టమై' యను పూర్వపద్యమున 'కనిరొక్కచో నెదుర భూధరసన్నిభకాయు ...... విరాధు నుద్ధతున్' అను వాక్యమున రామలక్ష్మణులు విరాధుని చూచినట్లుగ వర్ణితమైనది కదా! మరల నీ పద్యమున విరాధుని చూచి నట్లుగ వర్ణించుట పునరుక్తి యగును. కావున నీ పద్యము ఏ యితరరామాయణము నుండియో గ్రహింపబడి యిందు చేర్చబడియుండునని యూహింపవచ్చును.

ము. ప్ర. లలో అర. కాం. 1 ఆశ్వా. నందలి 33 వ గద్యము తా.ప్ర.ల యందలి గద్యముతో కొంత భేదించుచున్నది. తా.ప్ర.లలోని గద్య మీ క్రింది విధముగ నున్నది.

"ఇవ్విధంబునఁ గూలుటయు ననేకజంతువులతోడ నచ్చేరువ భూరుహంబులును, బొదలును బొరలు నయ్యసురంబొలియింపపోక కర్జంబుగాదని కదిసి నిర్ఘాతపాతంబులంబోలు పదప్రహారంబులంబిడికిటిపోట్లం జానుకూర్పరఘాతంబుల నొప్పించిన నప్పిశితాశనుండు ప్రాణవ్యయసమయంబున వాడు రాఘవులఁ బ్రస్తుతించి యేను తుంబురుడను గంధర్వుండ కుబేరుశాపంబున నట్టి రూపంబు దాల్చి మీచేత శాపమోక్షితుండనైతినని చెప్పి యియ్యెడకు రెండు యోజనంబుల శరభంగుడను మునీంద్రునాశ్రమంబు గలదచ్చటికిం జనుడెండు మేలగునని చెప్పి ప్రాణంబులతోఁ బాసె తదనంతరంబ."

పై గద్యముతరువాత ము.ప్ర. యందలి 'ధరణీపృష్ఠ ప్రపోద' (భా.రా. III, 1, 42) అను పద్యము గలదు. ము.ప్ర. లలో పై గద్యము భిన్నముగ నుండుటయే కాక యందు వివరింపబడిన విషయము తొమ్మిది పద్యములలో విస్తరింపబడియున్నది.[33] ఈ పద్యము లొకటిరెండు తా.ప్ర. లలో మాత్రమే కనబడుచున్నవి. సంక్షిప్తముగనున్న యీ విరాధవృత్తాంతమును అనంతరకవి పెంపుకొఱకు తొమ్మిదిపద్యము లధికముగ వ్రాసి చేర్చుటయేకాక అందుకను కూలముగ తా. ప్ర. ల యందలి గద్యమును కూడ మార్చుకొన్నాడనుట స్పష్టమే కదా!

100/14 నెం. గల ఆం. సా. ప. (కాకినాడ) ప్రతిలో ము.ప్ర. యందలి అర. కాం. 1 ఆ. 14 వ పద్యము తరువాత ఈ క్రింది పద్యమధికముగా నున్నది.

'వడిఁ జనుదెంచి రామజనవల్లభు వల్లభి గృధ్రమామిషం
బొడిసినభంగి నెత్తికొని యుద్ధతి నంబరవీథికేగి యె
క్కడి నరు లేటి కీ వనము గాసికిఁ జొచ్చితిరింక నాకు లోఁ
బడితిరి మీరు మీరొక తవస్వులె తాపసవేషదూషకుల్.'

పై పద్యమునకు ముందున్న 'శరభసింహవ్యాఘ్ర (III, 1, 14) యను సీసపద్యపు చివరిపాదమైన "అగుచు రాముఁగదిసి యార్చి మఱియు" అను దానికి బదులుగా నీ ప్రతిలో 'అగుచు ఘోరరూపుఁడై చెలంగె' అని కలదు.

ము. ప్ర. లలో 19 పద్యముల (III, 1, 79-97) లో వర్ణింపబడిన అగస్త్యుని వృత్తాంతము పెక్కు తా. ప్ర. లలో నీ క్రింది మూడు పద్యము లలో అతిసంక్షిప్తముగ కనబడుచున్నది.

'అనఘుఁడగస్త్యుతమ్ముని మహామునిఁగాంచి తదీయమైన య
వ్వనమున నాడు నిల్చి జనవల్లభుఁడమ్మునిముఖ్యు భక్తి పే
ర్కొని యటఁగాంచెఁ గుంభజుఁ బ్రభూర్జితపూర్ణ మహార్ణవాంతరం
బున సహసర్చపూరపరిపూరితవిస్తృతహస్తపంకజున్.'

'కని కడుభక్తి ప్రమొక్కుటయు కౌతుకమొప్పఁగ గారవించి త
న్మని తను గొల్చియున్న మునిముఖ్యులకెల్లను రామచంద్రుడు స
ద్వినుతగుణావళుల్ ప్రబలవిస్తరభంగిగఁ జెప్పచుం బ్రియం
బునఁగొనియాడుచున్ విహితపూజలఁ దృప్తులఁజెసె నెమ్మితోన్.'

జనవరునకు లక్ష్మణునకు
జనకసుతకుఁ గందమూలశాకాదికమై
మునిమాననీయమగు భో
జనమునఁ బరితృప్తిచేసె సమ్మదమారన్'

పై వృత్తాంతమే మఱికొన్నిప్రతులలో భిన్నపద్యములలో వర్ణితమైనది.[84] అవి ఈ రీతిగ నున్నవి.

అనిన విని రామచంద్రుఁడు
మునివర వినిపింప నగస్త్యమునివరుఁడు మునున్
ఘనుఁడగు వాతాపినిఁ జం
పిన విధమెట్లనినఁజెప్పెఁ బృథివీపతికిన్

వసుధేశ యిల్వలవాతాపులనువారు
కల రుగ్రదనుజులు కలుషమతులు
అందులో వాతాపి యజరూపమై యుండ
నిల్వలుండును మునినియతి నుండు
మునివరేణ్యులఁ జూచి ముదమొప్పఁ గొనివచ్చి
కొసరకమ్మేషంబు గోరి చంపి
కూరలుగా వండి కుడువనొప్పగఁబెట్టు
వాతాపి రమ్మను వరుసఁజీరు

వారి తనువులు ప్రవయ్యంగ పుచ్చివెడలి
కపటభోజనము వెట్టు నీకారణమున
నరసి యిబ్బంగి నుత్తములైన మునుల
జఱచి యీ రీతి దనుజులఁ జంపుచుండు

అంతట నొక్కనాడు కలశాంతఁజుడచ్చటి కేగుదెంచినన్
సంతసమంది సంయమికి సయ్యన మేషము జంపిపెట్టినం
జింత యొకింతలేక యతి శీఘ్రత భోజనమొప్పఁజేసి యు
న్నంతన వాతపింబిలువ నమ్మని యిల్వలుఁజూచి నవ్వుచున్

జీర్ణమయ్యెను వాతాపిఁ జీరెదేల
యనిన నత్యుగ్రరాక్షసుండతనిమీఁదఁ
గవిసినను వేగఁగుంభసంభవుఁడు కోప
భరితుఁడై చూచె నిల్వలు భస్మముగను.

అట్లయ్యిద్దఱ దనుజులఁబరిమార్చి యచ్చటి తపోధనులకెల్లం బ్రమోదంబు చేసె నదియునుంగాక యమ్మౌని సామర్థ్యంబులు జెప్పనశక్యంబులు.

పై గద్యపద్యముల తరువాత ము.ప్ర.లోని 'అనుచుఁ గొనియాడి' (III, 1,78) యను పద్యము కలదు. ఆ తరువాత ము.ప్ర.లోని III, 1,79వ పద్యము మొదలుకొని III, 1,97 వ పద్యమువఱకు గల 19 పద్యములకు మారుగా-అనఘుఁడగస్త్యు తమ్మని, కని కడుభక్తి, జనవరునకు అను పైన పేర్కొనబడిన మూడు పద్యములును కలవు. ఈ మూఁటింటికి బదులుగా ము.ప్ర. లలో గల పద్యములలో అగస్త్య మాహాత్మ్యమును రామచంద్రుడు లక్ష్మణునకు తెలిపినట్లుండగా పై పద్యములలో శ్రీరాముడు, అగస్త్యుడు వాతాపిని చంపిన విధమెట్లని సుతీక్ష్ణుని ప్రశ్నింపగా నాతడగస్త్యుని మహత్త్వము నెఱిగించినట్లుగ కనబడుచున్నది.

శ్రీ బి.రా.రా.గారి ప్రతియందును, D 140 నెం. మదరాసు ప్రతియందును అర కాం. 1 ఆ. 112 వ పద్యము తరువాత నీ క్రింది మూడు పద్యములు కలవు.

'చని కనియెన్ ధరావిభుడు సంభృతసంహృతపద్మరాగసం
తనముని సంతతద్విపదసంగతతుంగతరంగమున్ మహా
మునిజనవాసరమ్యతటమున్ స్ఫురితానిలఫేనమున్ జగ
ద్వినుతఫలాభిరామమును విశ్రుతదివ్యనదీలలామమున్'

కనుగొని యచ్చటన్ మునుల కందఱకుం దగ భక్తి మ్రొక్కి-సన్
జనవిభుఁ బూజసేసి మునిసంయములెల్లను రామచంద్రుతో
ననఘవరేణ్య ధన్యులము నర్మిలి నిక్కడ నిల్పుమంచు వా
రనుమతి సేయఁ బొంగి వసుధాధిపుఁ డనుజునితోడ నిట్లనున్.

ఈ గౌతమి యీ వనములు
నీ గిరు లీ యాశ్రమంబు లీ తపసుల ము
న్నేగతిఁ జూడము నెన్నఁడు
బాగిచ్చట నుండ మనకుఁ బ్రమదముతోడన్.

వీని తరువాత ము.ప్ర.యందలి 'చని యచ్చట ననుజన్మని' (iii, 1,113) అను పద్యము కలదు. కాని తా. ప్ర. లలో 'చని' యను పదమునకు బదులుగ 'అని' అని కలదు. పై యధికపద్యముల రచయిత తాను చేర్చిన పద్యముల కనుకూలముగ 'చని'ని 'అని'గా మార్చి యుండునని యూహింపవచ్చును.

శూర్పణఖ రావణునకు సీతా సౌందర్యమును గూర్చి చెప్పు సందర్భమున గల 'విదియ చందురుఁడైన' (iii, 1,280) అను పద్యమునకు ముందొక పద్యమును, తరువాత నొక పద్యమును కొన్ని తా.ప్ర.లో కనబడుచున్నవి.[35] ఆ పద్యము లీ క్రింది విధముగ నున్నవి.

'కరిణీయానంబు నవ్వున్ గతి నవలతికాకార మంగంబు చంద్రుం
బురుణించున్ ముద్దుమోమంబురుహదళములంబోలు కన్నుల్ విపంచీ
స్వరసంకాశంబు పల్కుల్ చలద.... స్పర్ధియై యిందువేణీ
భరమాతన్వంగి కింద్రప్రముఖనిఖిలదిక్పాలకాభీలశౌర్యా !'

'అలినిభవేణి చంద్రసదృశానన యుత్పలపత్రనేత్ర కో
మలలతికాభిరామభుజ మంజులవక్త్రి సమస్తనద్వయీ
కలిత సుమధ్య హృద్యకటి కామ్యతరోరువు రమ్యజంఘ యు
జ్జ్వలచరణాబ్జ తద్వసిత జానకి నా విలసిల్లు రావణా !'

నేలటూరి వేంకటరమణయ్యగారు పై రెండు పద్యముల నెఱ్ఱన కృతములుగ నూహించినారు[36] వారికి లభించిన ఆనెగొంది ప్రతిలో నీ పద్యము లెఱ్ఱన రచితము లను సూచన యున్నదేమో తెలియదు. ఈ వ్యాసకర్త చూచిన ప్రతులలో మాత్రమివి యెఱ్ఱన కృతములను సూచన లేదు.

రాముని జోలికి పోవలదని మారీచుడు రావణునకు హితబోధ చేయు సందర్భమున కల 13 పద్యములకు (iii, 2.6-18) మాఱుగా పెక్కు తా.ప్ర. లలో నీ క్రింది రెండు పద్యములు మాత్రమే కలవు.

'ఈ నడుమ రామచంద్రుని
నెను దొరలముగుర మ్రుగమెసగు పులులమై
పూని వధింపఁగఁ జని చని
యా నరపతి యింతనంత నటఁ జేరుటయున్'

'శరములు మూఁడొకముష్టిం
చిరముగఁదొడిగేసె వారు ద్రెళ్ళిరి వెసనే
సురిగి యిటు వచ్చి ఘనభయ
పరవశమున నున్నవాఁడఁ బటుశౌర్యనిధీ'

ము.ప్ర.లోని 2 ఆ. 23వ గద్యము తా.ప్ర.లో పెక్కింట నీ క్రింది విధముగ కొంత భిన్నముగ నున్నది.

"....... . ......... అర్ధరాజ్యంబిత్తునని యుపచరించుచుంజనియెఁ బరమోత్సాహంబున"

దీని తరువాతగల 'రుచిరవైదూర్యంబు' (III, 2, 24) అను పద్యమునకు మారుగ పెక్కు తా.ప్ర.లలో నీ క్రిందిపద్యము కలదు.

'ఇవ్విధంబున నరిగి రాజేంద్రచంద్రుఁ
డున్న కదళీవనంబున కొయ్యఁ జేరి
యచట రావణు నిలిపి మాయాకురంగ
మయ్యె మారీచుడురుదీప్తు లతిశయిల్ల'

'రుచిరవైదూర్యంబు' (III.2,24) అను పద్యమునను, దానితరువాతి పద్యమగు 'నెలలోని యిట్టికి' (III,2,25) అను పద్యమునను మాయామృగ వర్ణనము కలదు. 'రుచిరవైదూర్యంబు' అను పదము పెక్కు తా.ప్ర.లలో కానరాదు. వర్ణనప్రీతిచే మరొకకవి యీ పద్యమును రచించియైనను, మరొక రామాయణమునుండి గ్రహించియైనను గ్రంథమున ప్రక్షేపించియుండును. తాను చేర్చిన పద్యమునకనుకూలముగ లేని పై గద్యము (III,2,23) ను కొంత మార్చుటయు, 'ఇవ్విధంబున నరిగి'యను పద్యమును తీసివేయుటయు జరిగినదని యూహింపవచ్చును.

ము.ప్ర.లో 2 ఆ. 38 వ వచనము తా.ప్ర.లలో"............ .... ... ఆడనోడి వెఱచుచు నిట్లనియె"నను వాక్యముతో ముగియుచున్నది. దీని తరువాత ము.ప్ర లో గల 11 పద్యములకు (39-49) మారుగా పెక్కు తా.ప్ర. లలో నీ క్రింది నాలుగుపద్యములు మాత్రమే కనబడుచున్నవి.

'కనకపుమేనును రత్నపు
తనురుచులును గలుగు మృగము ధరణింగలదే
జనవర యిది మాయామృగ
మని యెఱుగంగరాదె దీని యసురుల మాయల్'

'అన విని యల్ల నవ్వుచు ధరాధిపుడెంతయుఁబ్రీతిఁదమ్మునిన్
గనుగొని యీ మృగంబుపయిఁ గౌతుకమెప్పుడు పట్టితేరగాఁ
జనకిటులూరకున్న మహి జానకి యెంతయుఁ జిన్నబోదె స
య్యనఁ గొని యేగుదెంచెద గుణాకర యేమఱకుండుమిచ్చటన్'

'ఇది దనుజమాయయేనిన్
మది సంశయమేల మాయ మాయించి శిత
ప్రదరంబునఁ దునిమెదనని
కదలెంబతి ఖడ్గతూణకార్ముకధరుఁడై'

'కదలి రఘూద్వహుండరుగగా నట ముందటఁగొంత చేరువన్
మెదలుచు డాసినంబెదరి మోపినయట్లును దాటుమన్ మృగం-

బదెయిదె నాగఁ బెన్బొదల నవ్వలనివ్వలఁదోచుచున్ రయం-
బొదవగ డాయ వేగఁగొనిపోయె మహాగహనంబులోనికిన్'

పై తా.ప్ర. పద్యములకు బదులుగా ము.ప్ర. లో కనబడు పద్యములు అనంతరకవిచే ప్రక్షిప్తములై యుండవచ్చును. ప్రక్షిప్త పద్యములకనుకూలముగ నీ కవి 38 వ గద్యమునందలి చివరిభాగమును 'ఆడనోడి వెఱచుచునుండె వెండియు రఘువరుండు' అను రీతిగ మార్చుటయు జరిగినది.

ము.ప్ర. లో అర. కాం 2 ఆ. 52 వ పద్యమునుండి 60 వ పద్యము వఱకు గల పద్యములకు మాఱుగా ననేక తా.ప్ర. లలో నీ క్రింది మూడు పద్యములు మాత్రమే కలవు.

'తిరిగి తిరిగి కడుదవ్వున
కరయగ నిది దనుజమాయ యగునని కోపో
ద్ధురుఁడై యమోఘశరమున
ధరణీశుండేసె శ్రీఘ్రదారుణభంగిన్'

'అదియును మాయ ప్రమింగి దనుజాంగము సొచ్చి పగిల్చె వాడు బె-
ట్టిదముగ మీదికిన్నెగసి దెప్పరమై యిలఁగూలి వ్రాలి పె
ల్లదరుచు లక్ష్మణా.... ....రాముసెలుంగుభంగియై
యద్రువగ నన్నిదిక్కుల మహాధ్వని సీత కలంగునట్లుగన్

'అని ఘోరంబుగ నఱచుచు
దనుజుండపుడాత్మరూపధరుడై పడియెం
బెనుమేనితోడ రాముఁడు
గనుగొని విభ్రాంతి జాలఁగదిరెడి మదితోన్'

అర. కాం. 2 ఆ. నందలి 64, 65, 66 పద్యములకు మారుగా అనేక తా.ప్ర. లలో నీ క్రింది పద్యమొక్కటి మాత్రమే కలదు.

'భూపతి యార్తిఁ బొందెనని భూసుత తల్లడమంది లక్ష్మణా!
పాపముఁబొందెదెమ్మ వెసఁబాయుము రాక్షసబాధనొందఁగా
నోపు రఘూద్వహుండు నినునొత్తిలి చీరె నిశాటకోటిచే
నేపఱఁబోలుఁ బోర వెసనేగు జవంబునఁబొమ్ము నెమ్మదిన్'

అర. కాం 2 ఆ. న 70 నుండి 74 వఱకు గల 4 పద్యములకు మాఱుగ తా. ప్ర. లలో నీ క్రింది ఒక్క పద్యమే కలదు.

"అనవుడు బేర్చిన శోకం
బునఁ బెల్లేడ్చుచు.... నమ్మహాత్ముఁ బుణ్యచరిత్రున్
మనుజేంద్రుఁ గావదగదే
చనుమా రామునకుఁదోడు చనవు రయమునన్"

రావణుడు సీతాదేవిని ప్రలోభపెట్టు సందర్భమున ము. ప్ర. లలో నైదు పద్యములు కలవు.[86] కాని తా. ప్ర. లలో నీ క్రింది యొక్క పద్యమే కనబడుచున్నది.

'ఏను మన్నించు సుందరు లేనువేలు
నిన్నుఁగొలువంగ ధన్యలై నన్నుఁజెంది
మనుడుఁగాకింక యీ పేదమనుజుతోడి
మనువు నీకేలఁ జనుదెమ్మ వనజవదన'!

పై పద్యమునకు బదులుగ ము. ప్ర. యందు కనబడు పద్యములు (III, 2, 96-100) మరొకకవిచే రచితములై గ్రంథభాగమున ప్రక్షిప్తములై యుండును. ఈ పద్యములు లేకున్నను కథాగతికి ఎట్టి యసంగతి కానరాదు. తాను చేర్చిన పద్యములకనుకూలముగ వానికి ముందు 'అని పెండియు' (III, 2, 96) అను తా. ప్ర.లలో లేని గద్యమునధికముగ ఇతరకవి చేర్చియుండును. ప్రక్షిప్త పద్యములందలి చివరి రెండు పద్యముల (III, 2, 99-100) లో సీత రావణుని నిందించుట వర్ణితము. వీని తరువాత తా. ప్ర.లలో 'అనినన్భూసుత రోషవిస్మయభయవ్యాలోలయై (III, 2, 101) అను పద్యము గలదు. ప్రక్షిప్తములగు పై రెండు పద్యములకు ఈ పద్యముతో నన్వయము కుదురుటలేదు.

అందుకై ప్రక్షిప్తపద్యకర్త తాను చేర్చిన పద్యముల యన్వయసంగతికై 'అనుచున్ వెండియు' అను రీతిగ మార్చినాడు. తా. ప్ర. లందన్నింట 'అనిన న్నృపసుత' యను పాఠమేకాని 'అనుచున్ వెండియు' అను పాఠము కానరాదు. పాఠమునిట్లు మార్చుట తన ప్రక్షిప్తపద్యముల యన్వయసంగతికొరకే యనుట స్పష్టమే కదా!

ము.ప్ర.లో 2 ఆ. 103 ప. నుండి 109 ప. వరకు గల పద్యములకు బదులుగ ఈ క్రిందిపద్యములే పెక్కు తా.ప్ర.లలో కలవు.

అనిన నన్నెమిగాఁజూచి యాడెదనుచు
నసుర వింశతిబాహులు నతిశయోగ్ర
వదనదశకంబు మెఱయంగ వామనయన
యెదుర నిలిచినఁగంపించి యుదిలకొనుచు

తిరుగుడువడి వెనువెనుకకు
నరుగగ వడిఁబొదివిపట్టి యరదముపైఁ జె
చ్చెర నిడి యంబరపథమున
నరిగె దశాననుఁడు వికసితాననుఁడగుచున్

అత్తఱి సీత తల్లడిలి హా రఘునాయక! హా నరేంద్ర న
న్నిత్తఱి గావ రమ్మనుచు నెంతయు నేడ్వగఁ బంక్తికంధరుం
డత్తరుణిన్నయంబఱి భయంపడునట్లుగ బిట్టదల్చుచుం
దత్తరమందుచున్నిజరథంబు నభంబునఁదోలె నుద్ధతిన్

తా ప్ర.లలో గల పై మూడు పద్యములకు మారుగా ము.ప్ర.లలో గల పద్యములలో 'పెఱుకుదునే ఫణీంద్రు విషభీకరదంష్ట్రిలు' (III. 2, 104) అను పద్యమొకటి కలదు. రావణుడు సీతాదేవినపహరించుసందర్భమున నామె నిందోక్తులను సంహింపనివాడై క్రోధముతో తన మహత్త్వమును తెలుపుకొనుట యీ పద్యమందలి వర్ణ్యాంశము. ఈ పద్యమే కొద్దిభేదముతో యు. కాం. నను కలదు.[37] అర. కాం. పద్యమందలి ఉత్తమపురుషైకవచనరూపములన్నియు యు.కాం.న ఉత్తమపురుషబహువచనరూపములుగ కనబడుచున్నవి. ఈ పద్యము

కొద్దిభేదముతో అర. కాం. నను, యు. కాం. పూర్వభాగముననుఁ ఉండుటచే ఈ రెండు కాండములును హుళక్కి భాస్కరరచితములే యని శిష్టా రామకృష్ణశాస్త్రి గారు తమ ఆం చ.స.లో తెలిపినారు.[38] కాని ము ప్ర.లో అర.కాం.న కనబడు పద్యము పెక్కు తా. ప్ర.లలో కానరాదు. అనంతరకవులెవరో యు. కాం. పద్యమును గ్రహించి యందలి బహువచనక్రియారూపములను సందర్భాను గుణముగ నేకవచనాంతములుగ మార్చి అర.కాం.న చేర్చియుందురు. అర.కాం. కర్తయు, యు. కాం. (పూ. భా.) కర్తయు నొక్కరే యనుట కీ ప్రక్షిప్తపద్యము ఆధారము కాజాలదు.

ము. ప్ర. లో అర. కాం. 2 ఆ. న అధోభాగమున పాఠాంతరముగ చూపబడిన 'అల్లంత నెదురుగా నజ్జాస్య ప్రియముతో నేతేరకుండుట యెట్టు లొక్కొ' (పే. 202) యను పద్యము తరువాత R 2019 నెం. మదరాసు ప్రతిలో నీ క్రింది యైదు పద్యములధికముగ నున్నవి.

లోనైనన్ వెలినైన సీత యటు నాలోకించలేదేమొకో
యానాతిచ్చట లేదొకాక యిది మాయావాసముంగాదొకో
యేనిందుండఁగ సీత గానబడదో యేనొండెనుం గానదో
యే నా రాముఁడనైన సీత వెలియై యిట్లుండగా నోర్తునే.

ఏనుండన్ నిను దాడిగా వెఱవదే యీశానుఁడుంబూని నా
మానంబారయ వెండి దాగి తుది యీ మానంబె నిన్‌బాసి నా
మేనంబ్రాణము నిల్చునే యెఱుగవే మేలంబు నోనాడుదే
ఓ నాతీ పొడఁజూపవే నిబిడరంభోరుద్వయీ ! జానకీ !

వ్యాళభుజంగమోదరనివాసము సొచ్చితె జృంభితోగ్రశా
ర్దూలముఖాగ్రకోటరము దూఱితె మర్త్యపలాశనార్థిదై
త్యాళినిశాతదంష్ట్రికల నందితె యేకతమెందువోయితే
లోలవిశాల సారసవిలోచన మత్ప్రియశిష్య జానకీ !

పాటితనంబునంగడమ బల్కితె లక్ష్మణునంచు నీవు మో
మోటమిజేసి నాకెదుర నొల్లక ............... దాగితో ము

మ్మాటికి సైచి తన్మదనమార్గణభిన్నతనుండి....  ....నా
మాటకు వేగవేగ మఱుమాట మృదుధ్వని పల్కు మైథిలీ.

తన్నుం దా నెఱుగండపోలె ధృతికిందవ్వై విలాపించుచుం
గన్నుంగోనల బాష్పపూరములు లోగింగ్రుమ్మ హా సీత హా
యన్నిద్రాంబుజనేత్ర హా నిబిడరంభోరుద్వయీ జానకీ
నిన్నుం బాయుట పాడియే యనుచు నానారోదనధ్వానుడై,'

ఈ పద్యములకు ముందున్న 'అల్లంత నెదురుగా' నను సీసపద్యపు చివరి పాదమైన 'చూచి మూర్ఛిల్లె దుఃఖాబ్ధివీచు లడర' అని కలదు. ఇంతకు పూర్వము పేర్కొనబడిన యధికపద్యములవలె నీ పద్యములును వర్ణనప్రియుడగు మరొకకవిచే ప్రక్షిప్తములై యుండును. 'చూచి మూర్ఛిల్లె దుఃఖాబ్ధివీచులడర' అను పాదమును 'చూచి కానక దుఃఖాబ్ధివీచు లడర' అనురీతిగ మార్చుట పై విషయమునకు సమర్థకముగానున్నది.

అర. కాం. 2. ఆ. న పాఠాంతరపద్యములందలి 'అనుచు నేమిటనైన' (పే. 209) అను పద్యము తరువాత 9383 నెం. ఉ.వి. ప్రతిలో నీ క్రింది సీసపద్యమధికముగా గలదు.

అత్తన్వి సుభగిని నడవిలోఁ గానరే
కమనీయమదమత్తగజములార
కమనీయ మదదమత్తగజగామిఁ గానరే
నవసహకారపల్లవములార
నవసహకారపల్లవహస్తఁ గానరే
సుకుమారవాచాలశుకములార
సుకుమారవాచాలశుకవాణిఁగానరే
మెలఁగి మెలఁగి చూచు మృగములార
మెలఁగి మెలఁగి చూచు మృగనేత్రఁగానరే
నవవికసితకోకనదములార
అనుచు సీత వెదకె నాత్మవిభుఁడు

ము.ప్ర లో 2 ఆ. 393 ప. నుండి 397 ప. వరకు గల పద్యములకు మారుగ అనేక ప్రతులలో నీ క్రింది రెండు పద్యములు కానవచ్చుచున్నవి.

ఇట్లు గూలిన దైత్యుఁడొక్కింతపడికి
తెలిసి మీరెవ్వ రత్యలఘుశౌర్యు
లార యనుటయుఁజెప్పె నింపారఁ దమవి
ధము దెలియనంతయు సుమిత్రాసుతుండు

విని రామలక్ష్మణులరే
జనవంద్యులు మీరు మీ ప్రసాదంబున మ
ద్ఘనదుఃఖమెల్లఁ బాసెను
వినుడస్మద్విధము మీకు వినుతింతుఁదగన్

పై వానిలో తొలిపద్యము ము.ప్ర. లన్నింటను పొరపాటున గద్యముగ ముద్రితమైనది.[38]

అర. కాం. 2 ఆ. న పాఠాంతరభాగమున కల 'తడవుగా ననిఁజేసి'[39] యను పద్యము తరువాత 933 నెం. గల ఉ.వి. ప్రతిలో నీ క్రిందిపద్యమొకటి యధికముగ కనబడుచున్నది.

హరిపురికేగి మజ్జనకునందుఁగనుంగొని పక్షినాథ! యే
ధరణితనూజఁ గోల్పడువిధంబది చెప్పకుమయ్య మద్భుజా
పరిచితచండకాండపటుబాహువిఖండితబంధురోరుకం
ధరుఁడయి యా దశాననుఁడు దానె నిజంబెఱిగించునంతకున్

ఈ రీతిగ అర.కాం.న అనేక ప్రక్షిప్త పద్యములు చేరి ఆ కాండము యథార్థస్వరూపము ప్రస్తుత ము.ప్ర లలో కానరాకున్నది. ఇట్టి మార్పులకు, చేర్పులకు గల కారణములను పరిశీలింతము. ఈ విషయమున నీ క్రింది మూడు మార్గములు స్ఫురించుచున్నట్లుగ చాగంటివారూహించి వాని యౌచిత్యము నీరీతిగ విమర్శించియున్నారు.

1. ఇరువురు కవులు రామాయణమును రచించిరనియు, అందొకరు క్లుప్తముగ రచింపగ రెండవకవి విపులము గావించెననియు, ప్రతుల విలేఖకు లందలివి కొన్ని, యిందలివి కొన్ని చేర్చి తామొక స్వతంత్రగ్రంథముగా చేసియుందురని తలంచుట మొదటి మార్గము

కాని యిట్టి మార్పు కవికి సాధ్యమగునట్టిదే కాని విలేఖకులకు సాధ్యమగు పనికాదు. అంతేకాక యిట్టి మార్పులొక్క అర.కాం న మాత్రమే చేయుటకుగల ప్రత్యేక కారణము దురూహము. వేరొక కవి రచించిన అర.కాం. మాత్రమే వారికి లభించినదన్నను 200 పద్యములను తీసివేసి సుమారు 500 పద్యములను చేర్చుట స్వభావవిరుద్ధమేకాక ప్రయోజనశూన్యము కూడ.

2. మొదటికవి రచించిన గ్రంథమున కొంత శిథిలముకాగా అనంతరకవి దానిని పూరింపదలచి శిథిలముకాని భాగములనట్లె యుంచి శిథిలభాగములను పూరించెననియు, అదియే యిప్పుడున్న ము ప్ర యనియు, నటుపిమ్మట శిథిల మైనదనుకొన్న భాగము మరల లభించుటచే కొన్ని తా.ప్ర.లలో ఆ భాగమే యుండుచువచ్చినదనియు అదియే పాఠాంతరముగ ము.ప్ర.లలో చూపబడిన దనియు తలంచుట రెండవ మార్గము.

కాని భా.రా.న నాయా భాగములు శిథిలమైనవనుటకాధారములు లేవు. అంతేకాక ప్రస్తుతము లభ్యమగు పెక్కు తా ప్ర లలో మొదటికవి రచించినవిగ చూపబడిన భాగమంతయు పూర్తిగ నున్నది. అందు కథాసూత్రమునకెట్టి భంగ మును కానరాదు. శైథిల్యము సరిగా వర్ణనములున్నచోట్లనే కలిగినదనుటయు సమంజసము కాదు.

3. దాదాపు 400 పద్యములలో నున్న అర.కాం.ను సంక్షిప్తముగ నున్నదను కారణముచే అనంతరకవి విపులముగ వ్రాయదలచి యందలి సుమారు 180 పద్యములను వదలివేసి తక్కిన 220 పద్యములను గ్రహించి యదనముగా 500 పద్యములను రచించి అందు చేర్చి కాండమును పూర్తిచేసి యుండుననుట మూడవ మార్గము.

500 పద్యములను స్వతంత్రముగ రచించిన కవి తక్కిన 200 పద్యములనుగూడ తానే రచించి అర కాం.ను పూర్తిచేసి యుండును కదా యను నస్వారస్యము ఈ పక్షమునను న్నను పై యభిప్రాయములకన్న నిది మేలుగ కన బడుచున్నది. అనంతరకవి తానధికముగ చేర్చిన పద్యములకనుకూలముగ అటనట మూలప్రతియందలి భాగములను మార్చుటయు ఈ అభిప్రాయమునకు సమర్థక మంగ నున్నది. సంక్షిప్తముగనున్న అయోధ్యారణ్యకాండములను పెంపుచేసి వ్రాయవలయునన్న ఉద్దేశము కవులలో నుండెననుటకు 527 నెం ఉ. వి. ప్రతియు; 115/14 నెం. ఆం.సా.ప. ప్రతియు ప్రబలసాక్ష్యములనుట యింతకు ముందే నిరూపింపబడినది.

మొత్తముమీద ప్రస్తుతము మనకు లభ్యమగుచున్న అర.కాం.న ఇద్దఱు కవుల రచన ఉన్నదనుటలో సందేహము లేదు. వీనిలో మొదటిరచనము మంత్రి భాస్కరునిదనియు, అనంతరరచనము హుళక్కి భాస్కరునిదనియు చాగంటివారు తెలిపియున్నారు.[41] కాని యీ యధికపద్యములు హుళక్కి భాస్కరునివనుట కాధారములు లేవు. అధికపద్యములు హుళక్కి భాస్కరునివే యగుచో నా పద్యములు గల ప్రతులు ఆతని రచనమేయగు యు.కాం. పూర్వభాగముగల ప్రతులవలె అధిక సంఖ్యలో లభింపవలెను కదా! కాని అట్టి ప్రతులకొరకంజనము వేసికొని ప్రయత్నింపవలసివచ్చుచున్నదనుట మనకు తెలిసిన విషయమే.

ఏమైనను ము.ప్ర.లోని అర.కాం. ఇతరకవుల అధికపద్యములతో కలగాపులగమై యథార్థ రూపమున మాత్రము లభించుట లేదనుట యథార్థము. కొంతవఱకు బాలాయోధ్యకాండలు కూడ నిట్లే యున్నవి. తా.ప్ర.లతో సంప్రదించి యీ మూడు కాండములను పరిష్కరించి ముద్రింపవలసిన యావశ్యకత మెంతయో కలదు.

**ఆశ్వాసాంత పద్యములు :**

ము.ప్ర.లలో అయో. కాం. న 'రాజ కిరీట కీలిత, భూరిభుజార్గళల సదసి, వినయగుణవిశాలా యను మూడాశ్వాసాంత పద్యములు' గలవు.[41a] ఈ మూడును సంబోధనాంతములుగ నున్నవి. ఇందు సాహిణిమారుని పేరు కానరాదు. కాచమాంబా కుమారా యను సంబోధన మిందుండుట చేతను, ఆశ్వాసారంభమున సాహిణి మారని పేరుండుటచేతను సాహిణిమారని

తల్లి కాచమాంబ యని యూహించుట కవకాశమున్నది. కొన్ని తా.ప్ర.లలో నీ పద్యములకు బదులుగ నీ క్రింది పద్యములు కనబడుచున్నవి.[42]

మందారద్రుమసామ్యదానఖని యున్మాదాంధవిద్వేషిరా
ట్సందోహప్రకటోగ్ర శౌర్యహరణోత్సాహస్ఫురద్బాహుఁడా
నందాపాదితభూసురప్రకరనానాస్తోత్రపాత్రుండు కుం
దేందుప్రఖ్యముఖారవిందుఁడు గుణాన్వితుండు ధీరుండనిన్

బాలాలాలితనవపాం
చాలుఁడు సుకవినికరసంతతమృదువా
చాలుఁడు విపులాభరితయ
శోలలితుఁడు వైరిహృదయశూలుఁడు పేర్మిన్

భువనభరితకీర్తిస్ఫూర్తి.... ....రోరుగాత్రుం
డవహితసుమహచ్చౌర్యస్ఫురచ్ఛత్రుజైత్రుం
డు వితరణరణోగ్రాటోప సప్తాశ్వపుత్రుం
డు విబుధజనరక్షణాఢ్యుండు సన్మిత్రుఁడుర్విన్

ము.ప్ర. యందలి పద్యములవలె నివి సంబోధనాంతములుకాక అర.కాం. ప్రథమాశ్వాసాంత పద్యములవలె ప్రథమాంతములుగ నున్నవి. అరణ్యకాండాంత పద్యమందు వితరణఖని యనియు, ఈ పద్యములలో తొలి పద్యమున దానఖని యనియు నుండుటచే అర. కాం. రచయితయు, అయో. కాం. రచయితయు నొక్కరే యని చాగంటివారూహించినారు.[43]

ము.ప్ర.లలో కిష్కింధాకాండాంతమున నీ క్రింది రెండు పద్యములున్నవి.

లాటీ చందనచర్చ చోళమహిళా లావణ్య సామగ్రి క
ర్ణాటీ గీతకళాసరస్వతి కళింగాంతఃపురీమల్లికా
వాటీమంజరి గౌడవామనయనా వక్షోజహారాళియై
పాటింపందగు నీదు కీర్తి రథినీపాలాగ్రణీ సాహిణీ !

'సురనుతపదపద్మా శుద్ధవిజ్ఞానసద్మా
హరిణకలితహస్తా యాపగాసిక్తమస్తా
హరిహయసురరమ్యా యంచితధ్యానగమ్యా
స్ఫురదురుగిరిచాపా పుణ్యపీఠిస్వరూపా !

పెక్కు తా. ప్ర. లలో 'సురనుత' యను రెండవ పద్యమే కాని సాహిణి సంబోధనముగల 'లాటీ చందన' యను పద్యము కానరాదు. అప్పకవీయమున నీ పద్యము నిత్యసమాసవిశ్రాంతికుదాహరణముగ నీయబడినది.44 అప్పకవికి లభించిన ప్రతిలో నీ పద్యముండవచ్చును. మల్లికార్జునభట్టు రచనములగు బాల, సుందరకాండముల యాశ్వాసాంతములందు కందమును, మాలినీపద్యమును కలవు. అతని రచనమేయగు కి కాం. నను 'లాటీచందన చర్చ' యను సాహిణి మారని సంబోధనము గల పద్యమునకు బదులు శివసంబోధనాత్మకములగు కంద పద్యములుండవలసియున్నది. మల్లికార్జునుని యితర కాండములందు శివసంబోధనాత్మకములగు నాశ్వాసాంతపద్యములే కాని సాహిణిమారని పేర పద్యములు కానరావు. కనుక కి. కాం. న సాహిణి సంబోధనముగల యీ పద్యముండుట యుక్తముగా తోచదు.

R 1844 నెం. ప్రతిలో ము. ప్ర. లో లేని యీ కింది ఫలశ్రుతి పద్యమొకటి కి. కాం. చివర కనబడుచున్నది.

ఈ కిష్కింధాకాండము
ప్రాకటముగ వ్రాయ వినిన పఠియించిన సు
శ్లోకుఁడగు రాముకృపచే
చేకొని సుగతియు నభీష్టసిద్ధులు నపుడున్

**ఆశ్వాసాంతగద్యములు :**

అదేమి కారణమో కాని భా. రా. నందలి ఆశ్వాసాంత గద్యములు తా. ప్ర. లలో నొక్కరీతిగ కానరావు. ఆయా కాండల కర్తృత్వ నిర్ణయ విషయమున నీ గద్యములు కొంతవరకుపయుక్తములగునను నుద్దేశముతో ము. ప్ర గద్యమును, వివిధ తా. ప్ర లలో కనబడు భిన్న భిన్న గద్యములును దిగువ చూపబడుచున్నవి.

బాలకాండము :

ము. ప్ర. గద్యము :- ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర భాస్కర సత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన శ్రీమద్రామాయణ మహాకావ్యంబు నందు బా. కాం. సర్వంబు నేకాశ్వాసము.

తా. ప్ర. లందలి గద్యములు :

1. ఇది శ్రీమదష్టభాషా కవిమిత్ర కులపవిత్రయశస్కర భాస్కర నామధేయప్రణీతంబైన శ్రీమద్రామాయణమహాకావ్యంబునందు బా. కాం సర్వంబు సంపూర్ణము.[45]

2. ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర యశస్కర భాస్కర సత్కవిపుత్ర మల్లికార్జునభట్టప్రణీతంబైన శ్రీమద్రామాయణమహాకావ్యంబునందు బా. కాం. సర్వంబు.[46]

3. (శిథిలము ) మిత్రహుళక్కి భాస్కరసత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన శ్రీరామాయణ మహాకావ్యంబునందు బా. కాం. సర్వంబు నేకాశ్వాసము.[47]

4. ఇది సకలసుకవిజనవినుతయశస్కర భాస్కర ప్రణీతంబైన శ్రీమద్రామాయణంబునందు బా. కాం. సర్వంబును నేకాశ్వాసము.[48]

5. శ్రీమదష్టభాషాకవిమిత్ర భాస్కరసత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన శ్రీమద్రామాయణమహాకావ్యంబునందు బా. కాం. సర్వంబు నేకాశ్వాసము.[49]

6. ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర వినుతయశస్కరహుళక్కి భాస్కరప్రణీతంబైన శ్రీ రామాయణంబను మహాకావ్యంబునందు బా. కాం. సర్వంబు వేకాశ్వాసము.[50]

7. శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర భాస్కరసత్కవి ప్రణీతంబైన శ్రీ రామాయణ మహాకావ్యంబునందు బా. కాం. నందు సర్వమున్ను ఏకాశ్వాసము.[51]

**అయోధ్యాకాండము :**

**ము. ప్ర. యందలి యాశ్వాసాంతగద్యము:-** ఇది సకలకళావిశారద శారదాముఖముకురాయమాణ సారస్వతభట్టబాణనిశ్శంక వీరమారయ కుమార కుమారరుద్రదేవ ప్రణీతంబైన శ్రీ రామాయణ మహాకావ్యంబునందు అయో.కాం. సర్వంబు నేకాశ్వాసము.

**తా. ప్ర. ల యందలి గద్యములు :**

1. సకలసుకవి జనవినుత యశస్కర భాస్కరనామధేయ ప్రణీతంబైన రామాయణంబునందు అయో. కాం. సర్వంబు నేకాశ్వాసము.[52]

2. శ్రీ సకలకళా విశారద శారదాముఖ ముకురాయమాణ సారస్వత శ్రీమదష్టభాషాకవిమిత్ర భాస్కరసత్కవిప్రణీతంబైన శ్రీ రామాయణంబునందు అయో. కాం. సంపూర్ణము.[53]

3. ఇది సకల కళావిశారద శారదాముఖ ముకురాయమాణ సారస్వత భట్టబాణుని మారయకుమార రుద్రదేవ ప్రణీతంబైన శ్రీ రామాయణ మహా కావ్యంబు నందయోధ్యాకాండంబు నేకాశ్వాసము.[54]

4. సకల కళావిశారద శారదాముఖ ముకురాయమాణ సారస్వత భట్ట బాణ నిశ్శంక వీరమారయ కుమార రుద్రదేవ ప్రణీతంబైన శ్రీ రామాయణంబు నందయోధ్యాకాండ సర్వంబు నేకాశ్వాసము.[55]

5. ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర భాస్కరసత్కవిపుత్ర మల్లికార్జున భట్ట ప్రణీతంబైన శ్రీమద్రామాయణంబునందయోధ్యాకాండ సర్వంబు నేకాశ్వాసము.[56]

6. సకల కళా విశారద శారదాముఖ ముకురాయమాణ సారస్వత భట్ట బాణ నికుమారయ కుమార సకలసుకవి జనవినుత యశస్కర హుళక్కి భాస్కర ప్రణీతంబైన శ్రీమద్రామాయణంబునందు అయోధ్యాకాండ సర్వంబు నేకాశ్వాసము.[57]

7. ఇది సకలకళా విశారద శారదాముఖ ముకురాయమాణ సారస్వత శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర భాస్కర సత్కవిపుత్ర మల్లికార్జున భట్ట ప్రణీతంబైన శ్రీరామాయణంబునందయోధ్యాకాండ సంపూర్ణము.[58]

8. ఇది శ్రీమదష్ట భాషా కవిమిత్ర కులపవిత్ర వినుత యశస్కర హుళక్కి భాస్కర ప్రణీతంబైన శ్రీమద్రామాయణంబను మహా కావ్యంబునందు అయో. కాం. సర్వంబును నేకాశ్వాసము.[59]

**అరణ్యకాండము :**

ము. ప్ర. యందు గల 'సకలసుకవిజనప్రణుతయశస్కరభాస్కర ప్రణీతంబైన శ్రీరామాయణమహాకావ్యంబునందు అర.కాం. నం ప్రథమాశ్వాసము (అర.కాం. సర్వంబును ద్వితీయాశ్వాసము) అను గద్యమే తా.ప్ర. లందన్నింటను కలదు. ఇతరకాండములోవలె ఈ కాండమందలి గద్యములందు భేదము కానరాదు.

**కిష్కింధాకాండము :**

**ము ప్ర యందలి ఆశ్వాసాంగతగద్యము :**

శ్రీమదష్టభాషాకవిమిత్రకులపవిత్ర భాస్కరసత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన శ్రీరామాయణంబునందు కి.కాం. సర్వంబు నేకాశ్వాసము.

పెక్కు తా. ప్ర. లలో ము. ప్ర. లోవలెనే ఆశ్వాసాంతగద్యమున్నను కొన్నిప్రతులలో నీ క్రిందిగద్యములు కూడ కనబడుచున్నవి.

1. ఇది శ్రీమదష్టభాషాకవిమిత్రభాస్కరప్రణీతంబైన శ్రీమద్రామాయణ **మహాకావ్యం**బునందు కి. కాం. సర్వంబును నేకాశ్వాసము.[60]

2. ఇది సకలకళావిశారదశారదాముఖముకురాయమాణ..........భట్టబాణ నిశ్శంకవీరమారయరుద్రదేవప్రణీతంబైన శ్రీమద్రామాణంబను నాదికావ్యంబు నందు కి. కాం. సర్వము ఏకాశ్వాసము[61].

3. ఇది సకలసుకవిజన వినుతయశస్కర భాస్కరనామధేయ ప్రణీతంబైన శ్రీరామాయణంబను మహాకావ్యంబునందు కి. కాం. సర్వమున్నేకా శ్వాసము[62].

4. శ్రీమదష్టభాషాకవిమిత్ర యశస్కరభాస్కరసత్కవిపుత్ర మల్లికార్జున భట్ట ప్రణీతంబైన శ్రీ రామాయణంబునందు కి కాం. సర్వంబు నేకాశ్వాసము.[63]

5. ఇది శ్రీ సకలసుకవిజనవినుత యశస్కర హుళక్కి భాస్కర ప్రణీతంబైన శ్రీమద్రామాయణంబను మహా కావ్యంబునందు కి.కాం. సర్వంబును నేకాశ్వాసము.[64]

6. ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర యశస్కర భాస్కర సత్కవిప్రణీతంబైన శ్రీ రామాయణంబను మహాకావ్యంబునందు కి.కాం. సర్వంబును నేకాశ్వాసము.[65]

**సుందరకాండము :**

**ము.ప్ర లోని ఆశ్వాసాంతగద్యము :**

ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర భాస్కర సత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన శ్రీమద్రామాయణంబునందు సుం.కాం. సర్వంబు నేకాశ్వాసము.

తా.ప్ర.లలో ము.ప్ర.లలోనున్న పై గద్యముతోపాటు ఈ క్రింది గద్యములును కలవు.

1. ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర యశస్కర భాస్కర సత్కవిపుత్ర మల్లికార్జునభట్టప్రణీతంబైన శ్రీమద్రామాయణంబునందు సుం.కాం. సర్వంబు నేకాశ్వాసము.[66]

2. ఇది శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర హుళక్కి భాస్కర సత్కవిపుత్ర మల్లికార్జునభట్ట ప్రణీతంబైన శ్రీమద్రామాయణంబునందు సుం. కాం. సర్వంబు నేకాశ్వాసము.[67]

3. ఇది శ్రీ మదష్టభాషాకవిమిత్ర యశస్కర భాస్కర కవి ప్రణీతంబైన శ్రీ మద్రామాయణంబను మహాకావ్యంబునందు సుం.కాం. సర్వంబు నేకాశ్వాసము[68]

4. ఇది సకల సుకవిజనయశస్కర భాస్కర నామధేయ ప్రణీతంబైన శ్రీమద్రామాయణంబునందు సుం.కాం. సర్వంబు నేకాశ్వాసము[69].

5. ఇది శ్రీమదష్ట భాషాకవిమిత్ర కులపవిత్ర యశస్కర భాస్కరభట్ట ప్రణీతంబైన శ్రీ రామాయణంబునందు సుం.కాం. సర్వంబు నేకాశ్వాసము.[70]

6. శ్రీమదష్టభాషాకవిమిత్ర కులపవిత్ర భాస్కరప్రణీతంబైన శ్రీరామాయణ మహాకావ్యంబునందు సుం.కాం. సర్వంబు నేకాశ్వాసము.[71]

7. శ్రీమదష్టభాషాకవిమిత్ర భాస్కరప్రణీతంబైన శ్రీరామాయణంబునందు సుం.కాం. సర్వంబు నేకాశ్వాసము.[72]

8. శ్రీమదష్టభాషా కవిమిత్ర కులపవిత్ర సుకవిజనవినుత .. భాస్కర ప్రణీతంబైన శ్రీరామాయణ మహాకావ్యంబునందు సుం.కాం. సర్వంబును నేకాశ్వాసము.[73]

## యుద్ధకాండము

**ము.ప్ర. యందలి యాశ్వాసాంతగద్యము**

ఇది శ్రీశాకల్య మల్లకవి వీరనరసింహ వరజాప్పలార్య నందనోభయ భాషా కవితావిశారద శారదా చరణ కమల పరిచరణ పరిలీఢమానసాయ్యలార్య విరచితంబైన శ్రీరామాయణ మహాకావ్యంబునందు యు.కాం. సర్వంబు నేకాశ్వాసము.

**తా. ప్ర. ల యందలి యాశ్వాసాంతగద్యములు**

పైన పేర్కొన్న గద్యముతోపాటు తా. ప్ర. లలో నీ క్రింది గద్యములు కూడ కనబడుచున్నవి.

1. ఇది శాకల్యమల్లకవి కవిరాహు నృసింహావరజాప్పలార్యవరనంద నోభయ భాషా కవితావిశారద శారదా కమల పరిచరణ పరివృఢ మానసాయ్యలార్య రచితంబైన శ్రీరామాయణంబునందు యు. కాం. శేషంబునందు షష్ఠాశ్వాసము.[74]

2. శ్రీశాకల్యమల్ల కవిరవిరాహు నృసింహావరజాప్పలార్యవరనందనో భయభాషా కవితావిశారద శారదాముఖముకురాయమాణ సారస్వత భట్టబాణ

75 ..........

3. శ్రీమదష్టభాషా కవిమిత్ర కులపవిత్ర భాస్కర సత్కవిమిత్ర అయ్యలార్య విరచితంబైన శ్రీమద్రామాయణంబునందు యు.కాం. శేషంబు సర్వము న్నేకాశ్వాసము.[76]

4. ఇది శ్రీశాకల్యమల్లకవి రాఘవనృసింహావరజాప్పలార్య వరనందనోభయభాషా.... .......... .... ...[78]

5. శాకల్యమల్లకవి వీరనృసింహావరజాప్పలార్య వరనందనోభయ భాషా... .... .... ........[77]

6. శాకల్యమల్లకవివీరరాఘవ నృసింహావరజాప్పలార్య వరనందనోభయభాషా కవిశారదా చరణకమల.... .. .... ... .... ....

యు. కాం. శేషంబున సర్వంబును సప్తమాశ్వాసము.[79]

7. ఇది శ్రీశాకల్యమల్లకవి సింహావరజాప్పలార్యవరనందనోభయభాషా .... .... .... .... ... ....[80]

8. శ్రీమదష్టభాషా కవిమిత్రయశస్కర భాస్కరప్రణీతంబైన శ్రీరామాయణంబునందు సర్వము యు. కాం. సంపూర్ణము.[81]

ఈ రీతిగా భా. రా. నందలి ఆశ్వాసాంత గద్యములు తా. ప్ర. లలో నొకదానికొకటి సంబంధము లేక కలగాపులగముగ కానవచ్చుచున్నవి. లేఖకుల యనవధానతయే దీనికి కారణము కావచ్చును.

ఇంతవఱకు, ము. ప్ర. లోని పద్యములకు భిన్నముగ తా. ప్ర. లలో కనబడు వివిధపాఠాంతరములు చూపబడినవి. ఇట్లే పద్యైకదేశములందును తా. ప్ర. లలో పెక్కు పాఠాంతరములు కనబడుచున్నవి. తా. ప్ర. లలో కొన్నిచోట్ల ము. ప్ర. పాఠములకంటె యుక్తతరములగు పాఠములున్నవి. సరియైన పాఠ నిర్ణయములతో కూడిన భా రా పరిష్కృతప్రతి యిప్పటికి రాలేదనియే చెప్పవచ్చును యధార్థమైన పాఠము లభింపనప్పుడు వచ్చు విమర్శనమును యథార్థము కాజాలదు ఇందుకొక్క ఉదాహరణము. అర. కాం ఆ. న "మిహిరసమాన తేజుఁడు సుమిత్రతనూజుడు గొల్వఁగా ముదా, వహముల యయ్యెఁ దత్సమయవాసరముల్ గురువంశభర్తకన్" (III, 1, 116) అను పద్యము గలదు సూర్య

సమానతేజుడగు లక్ష్మణుడు తనను సేవించుచుండగా రామునకు వనవాసదినములు సుఖావహములయ్యెనని యీ పద్యభావము. ఇందు రామునకు అను నర్థమున 'గురువంశభర్తకున్' అను పదము ప్రయుక్తమైనది. శ్రీ కాశీభొట్ల సత్యనారాయణ గారు తమ 'ఆంధ్రకవుల ఔచిత్యవిచారణ' యను గ్రంథమున కులౌచిత్యమను నౌచిత్యభేదమును వివరించుచు పై పదమునుదాహరించి యిట్లు వ్రాసినారు.

"శ్రీరామచంద్రుని 'గురువంశభర్త' యనుటలో నౌచిత్యము సందేహాస్పద మైనది. ఇక్కడ శబ్దము 'కురు' అని విడుటచేతను, గురుశబ్దమునకు విశేషించి ఇచ్చట అర్థము లేకపోవుటచేతను, కురువంశభర్త యనుచో శ్రీరాముడనునర్థము తేలికగా ద్యోతకము కాకపోవుటచేతను ఇట కులౌచిత్యము సందేహాస్పదమైనది. ఇంతకంటె చక్కని అర్థద్యోతకములగు ఇన, రఘు పదములేవి వాడినను ఔచిత్య మతిశయించెడిది.[82]

ము. ప్ర. లలో పెక్కింట 'గురువంశభర్తకున్' అను పాఠమే యుండుట పై విమర్శకు దారితీసినది. కాని. తా. ప్ర. లలో నీ సందర్భమున 'రఘువంశ భర్తకున్' అను పాఠమే కలదు. వావిళ్ళవారి భా. రా. తొలిముద్రణమునందును, కరాలపాటివారు పరిష్కరించి ప్రకటించిన ప్రతియందును 'రఘువంశభర్తకున్' అను పాఠమే కలదు. తరువాతి ప్రతులలో 'రఘువంశభర్త' 'గురు (కురు) వంశ భర్త' యగుటకు కారణము తెలియదు. శ్రీ సత్యనారాయణగారికి భా. రా. ప్రాచీన ముద్రణము లభించియుండిన వారు ఈ చర్చ చేయవలసిన యవసరముండెడిది కాదు. దీనినిబట్టి సాధుపాఠనిర్ణయమెంత ఆవశ్యకమో అవగతమగుచున్నది.

తా. ప్ర. లను పరిశీలించు సందర్భమున దృష్టికి వచ్చిన కొన్ని యుక్త ములగు పాఠముల నిట వివరించుచున్నాను.

**1.** ము. ప్ర. పాఠము

"......................పుణ్య చరిత్రు బహు క్రియాకలా
కోవిదు బుశ్యశృంగు నిటకుంగొనివచ్చి మనోహరంబుగన్" (I, 98)

తా.ప్ర. పాఠము

"..... .. ........పుణ్య చరిత్రు బహు క్రతుక్రియా
కోవిదు ............... ........................"[83]

ఋశ్యశృంగుడు బహుక్రియాకలాకోవిదు డనుటకంటె 'బహుక్రతుక్రియా కోవిదు, డనుటలో నౌచిత్యమున్నది.

**2.** ము.ప్ర. పాఠము

"..........రావణుందునిమి ధర్మమెలర్ప సమస్తదేవ భూ
దేవగణంబులన్ మనుపు దిక్కుల నీ నిజకీర్తి వర్ధిలన్" (1, 149)

తా.ప్ర. పాఠము

"..... ...........................................
........ .. ........................నీ జయకీర్తి వర్ధిలన్"[84]

ము. ప్ర. పాఠమున నీ నిజకీర్తి యనుచోట గల పునరుక్తి తా.ప్ర. పాఠమున కానరాదు.

**3.** ము.ప్ర. పాఠము

కావున నదితియు నేనును
దేవహితము గోరుచున్న త్రిజగద్ధితమున్
వేవేగ సిద్ధిఁ బొందగఁ
గావింపుము దేవ దేవ......................" (I, 289)

తా.ప్ర. పాఠము

కావున నదితియు నేనును
దేవతలును గోరుచున్న...... .... ......"[85]

ము. ప్ర. పాఠమున పూర్వార్ధమున నన్వయమసంగతముగ నున్నది. తా.ప్ర. పాఠమున నీ దోషము కానరాదు.

**4.** ము.ప్ర. పాఠము

కనకాద్రి తనూభవయై
తనరు మనోరమకు....... ......." (I, 361)

తా.ప్ర. పాఠము

కనకాద్రి తనూభవయై
తనరిన మేనకకు................................''86

తనకాద్రితనూభవ మేనకగాని మనోరమ కాదు. వా.రా.న నీ సందర్భమున నిట్లున్నది.

''యా మేరుమహితా రామ ! తయోర్మాతా సుమధ్యమా
నామ్నా మేనా మనోజ్ఞా వై..................................'' (I,35,15)
కనుక పై పద్యమున 'తనరిన మేనకకు' అను పాఠమే గ్రాహ్యము.

5. ము.ప్ర. పాఠము

సురమునిగంధర్వులు గడు
బరమాశ్చర్యమున జహ్నుఁబ్రార్థనతో (I, 469)

తా.ప్ర. పాఠము :

సురమునిగంధర్వులు గడు
నరుదంచుచు జహ్నుఁ బ్రార్థనతో[87]

ము.ప్ర.లోని 'కడు పరమాశ్చర్యమున'నను పాఠమున గల పునరుక్తి తా.ప్ర.పాఠమున లేకుండుటచే తా.ప్ర.పాఠమే యుచితమని భావింపవచ్చును. అంతేకాక మల్లికార్జునుని రచనమున 'అరుదందు' అను ప్రయోగము బహుళముగ ప్రయుక్తమగుచుండుటయు ఈ పాఠౌచిత్యమునకు సమర్థకముగా నున్నది.

6. ము.ప్ర.పాఠము :

అట్లు కశ్యపుఁడేగఁగ నధికనిష్ఠఁ
దగఁ గుశాసనముననుండి దారుణమగు
తపము దితి సల్పుచుండఁగ.... (I, 496)

తా. ప్ర. పాఠము :

అట్లు కశ్యపుఁడేగఁగ నధికనిష్ఠఁ
దగఁ గుశప్లవమున నుండి.........[88]

దితి కుశాసనముననుండి తపము గావించినదనుటలో విశేషము లేదు. 'కుశప్లవమున'నను పాఠమున నామె తపము గావించిన స్థలమునకు సంబంధించిన విశేషము తెలియుచున్నది. వా.రా.నను ఇట్లే కలదు.

"కుశప్లవం సమాసాద్య తపస్తేపే సుదారుణమ్" (I, 46. 8)

7. ము.ప్ర.పాఠము :

బ్రహ్మాదులు మదిఁ బొగడఁగ
బహ్మాండము విస్ఫులింగపంక్తుల నిగుడన్
బ్రహ్మర్షి వరుని మీఁదను
బ్రహ్మాస్త్రము మంటలెగయ బలువిడి నేసెన్ (I, 589)

తా. ప్ర. పాఠము :

బ్రహ్మాదులు మదిఁ బెగడగ
బ్రహ్మాండము........[89]

విశ్వామిత్రుడు వసిష్ఠునిపై బ్రహ్మాస్త్రము సంధించుట పై పద్యమున వర్ణ్యాంశము. బ్రహ్మాస్త్ర సంధానసమయమున బ్రహ్మాదులు బెగడుట సహజము. అంతేకాక యీ పద్యమునకు ముందటి పద్యమునను దేవతాదులు చలనము పొందినట్లు వర్ణింపబడుటచే ఈ పద్యమున బ్రహ్మాదులు బెగడినట్లుగ వర్ణించుటయే యుక్తము. వా.రా.నను 'దేవర్షయశ్చ సంభ్రాంతాః[90] అను శ్లోకమున దేవర్షులు భయభ్రాంతులై నట్లుగనే వర్ణితమైనది. కనుక నిట 'బెగడగ'నను పాఠమే యుక్తమని తోచుచున్నది. వావిళ్ళవారి ముద్రణము (1923)న నిది పాఠాంతర ముగ చూపబడినది.

8. ము.ప్ర.పాఠము :

'ఘను లీ రాజకుమారులు
దనరగ నీ యింటనున్న ధనువు క్రమమునం
గనుగొనఁగోరెద రిటకున్' (I, 685)

తా.ప్ర. పాఠము

'ఘను లీ రాజకుమారులు
దనరగ నీ యింటనున్న ధనురుత్తమమున్'[91]

ఈ సందర్భమున వా·రా.నను 'ద్రష్టుకామౌ ధనుశ్శ్రేష్ఠం యదేతత్త్వయి తిష్ఠతి' (I, 66, 5,) అను శ్లోకమున 'ధనుః శ్రేష్ఠమ్' అని యుండుటచే అను వాదమున ధనురుత్తమమను తా.ప్ర పాఠమే యుక్తమని భావింపవచ్చును.

9. అటు వొడగాంచి యందఱు భయాపహమంత్రము లుచ్చరించుచుంఁ బటు గతి నర్ఘ్యపాద్యములు భక్తిమెయింగొని పేవ వాని నాదట వరియింపకమ్మునులంఁదాటి .. .... " (I, 750)

తా.ప్ర. పాఠము

అటు వొడగాంచి ... ... ... ....

.... .... .... .... .... ... .....నా

దట వరియించి యమ్మునులఁదాటి [92]

'ప్రతిగృహ్య తు తాం పూజాం ఋషిదత్తాం ప్రతాపవాన్' (వా. రా. I, 74, 24,) అను మూలముననుసరించి యుండుటచే తా.ప్ర. పాఠమే యుక్తమన వచ్చును.

తా ప్ర.లలో నీ రీతీగ ననేకసాధుపాఠములు లభించునవకాశము కలదు. అర.కాం. నందలి ప్రక్షిప్త పద్యములను గుర్తించు ప్రయత్నమున తా.ప్ర.లను పరిశీలింపగా దృష్టికివచ్చిన కొన్ని పాఠభేదములు పైన వివరింపబడినవి. మఱి కొన్ని యుక్తములగు పాఠాంతరములు దిగువ చూపబడుచున్నవి.

**బాలకాండము :**

| ము.ప్ర. పాఠము | తా. ప్ర. పాఠము |
|---|---|
| i) ప్రాభవశోభిత పుష్పదామముల్ (42) | భాసురసౌరభ పుష్ప.... ........ [93] |
| ii) యతబాణోన్నతతూణులై బిరుద కేయూరాఢ్యదోస్థూణులై (221) | యుతబాణోన్నత తూణులై .[94] ... ... ... ... |
| iii) నాయెదం గనికరమయ్యెడున్ (263) | నాయెదం గనికర ..... .... [95] |

| | | |
|---|---|---|
| iv) | వనటం బొందెడి తనయల(324) | వనటం బొగలెడి....[96] |
| v) | అనిమిషలోకములోనికి (416) | అనిమిషలోకముకై నను[97] |
| vi) | ప్రథితదివ్యశ్రోణియున్ (661) | సికతదివ్యశ్రోణియున్[98] |
| vii) | నీవే ప్రాయశ్చిత్తము గావింపగ వలయు (639) | వేవే ప్రాయశ్చిత్తము....[99] |
| viii) | తానాత్మ వేయేడులింక నిరాహారుఁడ (672) | తానంత వేయేడు లింక నిరాహారుఁడ[100] |
| ix) | పిశంగాంచజ్జటాసోమునిన్ (749) | పిశంగాంచజ్జటా స్తోమునిన్[101] |

**అయోధ్యాకాండము :**

| | | |
|---|---|---|
| i) | మౌక్తికసేసలు (102) | మౌక్తపుసేసలు[102] |
| ii) | శశ్వద్గుణధామ (160) | భాస్వద్గుణధామ[103] |
| iii) | సుతులంబాయంగలేని సుదతులు గలరే (128) | సుతులంబాయంగఁజాలు సుదతులు గలరే[104] |

**అరణ్యకాండము :**

| | | |
|---|---|---|
| i) | కనియుఁ దమ్ముడు దానును.... (I, 11) | కనుచుఁ దమ్ముడు దానును[105] |
| ii) | ఎవ్వఁడొకో లయాంతకునియెక్కుడు కన్నులకాలఁ దన్నె (I, 158) | ఎవ్వఁడొకో పురాంతకుని యెక్కుడు కన్నులకాలఁ దన్నె[106] |
| iii) | ఎవ్వఁడొకో పురాంతకుని నేనని మార్కొని కోఱమీటె (I, 158) | ఎవ్వఁడొకో లయాంతకుని నేనని మార్కొని కోఱమీటె[107] |
| iv) | దనుజరథము దిటిగె నీఱ తాఱల నడలన్ (II, 124) | దనుజరథము దిటిగె మింటఁ దారలు చెదరన్[108] |
| v) | నీచుఁ దన పూర్వమంత్రి మారీచుకడకు (I - 254) | ఏచి తన పూర్వ....[109] |

**కిష్కింధాకాండము :**

| | |
|---|---|
| i) కనదురరత్నపుంఖములు (87) | కనదురురుక్మపుంఖములు[110] |
| ii) కామినీకరవిరోధంబు (118) | కామినీకృతవిరోధంబు[111] |

**సుందరకాండము :**

| | |
|---|---|
| i) మరకతనిర్మలజలభాసుర శాద్వలతలమున (7) | మరకతనిర్మలతరభాసుర ...[112] |
| ii) భటస్తోమాతిభూయిష్ఠమున్ (63) | భటస్తోమాతిభీమంబునై[113] |
| iii) పుష్పగృహంబుల (114) | పుష్పవనంబుల[114] |
| iv) తతధూమావృత వహ్నిసంగతిని (143) | తతధూమావృతవహ్నికీలగతి[115] |
| v) బాతిగ నిడ గ్రైవేయకమై (293) | బ్రాతిగ నిట గ్రైవేయకమై[116] |
| vi) శుష్కకాష్ఠనిచయజ్వలి యగ్ని సమప్రదీప్తుడై (459) | శుష్కకాష్ఠనిచయజ్వలితాగ్ని ............[117] |

**యుద్ధకాండము :**

| | |
|---|---|
| i) ఇనతురగరింఖాహతి (34) | ఇనతురంగఖురాహతి[118] |
| ii) జగంబవానరము జేసి కదా పది వేలు నైజముల్ (64) | జగంబవానరము జేసికదా మఱి చెల్లు బీరముల్[119] |
| iii) దాశరథులు సమరతలమునఁ జంద్రార్కులైన (107) | దాశరథులు సమరతలమున శక్రార్కులైన[120] |
| iv) తెంపుమే, కొన నీకెత్తిన కాలదండ మన నా యుద్దండ....(822) | తెంపుమైనొనరన్నెత్తిన కాలదండ మన నా యుద్దండ....[121] |
| v) కృతమిది కార్య మెల్లఁబరికించిన (1871) | కృతమతి కార్యమెల్లఁబరికించిన[122] |

సూచికలు :

1. ఈ ప్రతి లేఖనకాలము యువ నామసంవత్సర శ్రావణ శుద్ధ పంచమి, ఇందువారము; 5-8-1695.
2. భా.రా. పీఠిక; పుట. 2.
3. క.త. 2 సం. పుట. 98.
4. విజ్ఞానసర్వస్వము.
5. భా.రా. పీఠిక; పుట. 2.
6. సుందరాచార్యుల ప్రతి.
7. ఉ. వి. ప్రతి. నెం. 527.
8. **R** 2157/మద. ప్ర; **D** 140/మద.ప్ర; **D** 143 మద.ప్ర; **R** 371/ మద.ప్ర. 8**b**, **R** 263/మద. ప్ర.
9. **T** 19-7/**APGOML**. ప్రతి.
10. భా. రా. 1 పుట.
11. భా.రా. **I**, 27-43.
12. **D** 142 / తిరు ప్ర; **R** 2072 / మద. ప్ర; 130/14. కాకి. ప్ర; 129/14. కాకి. ప్ర; **T**. 19-10. **APGOML.**
13. భారతి; జనవరి 1959.
14. భా. రా. **II**, 95-100.
15. 933 / ఉ. వి. ప్ర; 61 కమ్మ; **D** 141 / తిరు. ప్ర. 72 వ కమ్మ; **R** 262/తిరు. ప్ర; **R** 263/తిరు. ప్ర.
16. బి. రా. ప్రతి. 58 (**a**) కమ్మ; 887/ఉ.వి.ప్ర; **D** 140/తిరు. ప్ర; **R** 2157/మద. ప్ర; **R**. 2274/తిరు. ప్ర;
17. 37 వ పద్యము - 50(**a**) కమ్మ;
18. 60 వ పద్యము. 51 (**a**) కమ్మ.
19. 35 వ పద్యము 115 (**a**) కమ్మ.
20. 79 వ పద్యము. 119 (**a**) కమ్మ.
21. భా. రా. (ఆనందాశ్రమముద్రణము 1912) పీఠిక; పుట. **xvi.**
22. 100/14; 183/14. కాకి. ప్రతులు.
23. భా. రా. **III**, 1, 41-63.

24. 100/14; కాకి.ప్ర. పుట. 91b-94b; 183/14 కాకి.ప్ర. పుట. 100 (a)-104.
25. భా. రా. **III-1-97-168.**
26. భా. రా. **III**, 1, 117-136.
27. 183/14 కాకి. ప్ర. **III** (b) పుట.
28. భా. రా. **III**, 1, 151-155.
29. 933/ ఉ.వి; ప్రతి; పుట. 61; **D** 141 మద. ప్రతి; **T** 527/ ఉ.వి. ప్రతి. **T** 19-12/**APGOML**; 100/14 కాకి. ప్రతి మొ॥
30. **T** 19-57/**APGOML**.
31. వి. రా. రా. ప్రతి; 877/ ఉ. వి. ప్రతి; **R** 2157; **R** 2274/మద. ప్రతి; **D** 140/ తిరు. ప్రతి.
32. వి. రా. రా. ప్రతి; 887/ ఉ. వి. ప్రతి; **R** 2157; **R** 2274/మద. ప్రతి; **D** 140/తిరు. ప్రతి.
33. భా. రా. **III**, 1, 33-42.
34. వి. రా. రా. ప్రతి. పుట 61 (a); 877/ ఉ.వి. ప్ర; **D**. 140/తిరు. ప్ర; **R** 2284/మద.ప్ర.
35. **T** 19 - 50 / **APGOML**; **T** 19-12/**APGOML**; **R** 1844/ మద. ప్ర.
36. భా. రా. **III**, 2, 97-100.
37. భా. రా. **VI**, 60.
38. పుట. 605 & 606.
38.b. **III**, 2, 393.
39. పుట. 216.
40. పుట. 82 (b) 8, 9 పంక్తులు.
41. ఆం. క. త. 2 సం. 118 పుట.
41.b. భా. రా. **III**, 2, 453-455.
42. **T** 19-58; **T** 19-11/**APGOML**; 933/ ఉ. వి. ప్రతి మొ॥
43. ఆం. క. త. 2 సం. 125 పుట.
44. అప్ప. క. **III**-138.

45. T 812 ఉ. వి. ప్ర.
46 887/ ఉ. వి. ప్ర; T 19-11 APGOML; 174/14. కాకి. ప్రతి;
47. R 1947/ మద. ప్ర.
48. D 143/ మద. ప్ర; 412/14 కాకి. ప్రతి.
49. T 932/ ఉ. వి. ప్ర; R 1844/ మద. ప్ర; R 1240 / మద. ప్ర. R 2204/మద. ప్ర.
50. 108/14 కాకి. ప్ర
51. 184/141 కాకి. ప్ర; 183/14. కాకి. ప్ర.
52. సుందరాచార్యుల ప్రతి; T 933/ఉ.వి.ప్ర; T 507/ఉ.వి.ప్ర; T 887/ ఉ.వి.ప్ర. R 1833/మద.ప్ర. మొ॥
53. 507/ఉ. వి. ప్ర;
54. R 1844/మద. ప్ర; R 2019/మద. ప్ర; R 2114/మద. ప్ర; R 141/మ. ప్ర.
55. R 262/మద. ప్ర; R 263/మద. ప్ర.
56. R 2060/మద. ప్ర.
57. R 2157/మద. ప్ర.
58. T 19-50; T 19-64 APGOML.
59. 108/14. కాకి. ప్ర.
60. R 2072/మద. ప్ర.
61. T 527/ఉ. వి. ప్ర.
62. 140/8; 212/14. కాకి. ప్ర.
63. 19-77; 19-58; 19-19 APGOML.
64. 108/14. కాకి. ప్ర.
65. 103/14. కాకి. ప్ర.
66. సుందరాచార్యుల ప్రతి.
67. 933/ఉ. వి. ప్ర.
68. 528/ఉ. వి. ప్ర; 1/SML; T 19/14. కాకి. ప్ర.
69. 507/ఉ. వి. ప్ర.

70. R 2072; R 1828 మద. ప్ర; T 19-65 & T 19-60 **APGOML.**
71. 121/14 కాకి. ప్ర.
72. 183/14; 1.0/8 కాకి. ప్ర.
73. 108/14 కాకి. ప్ర.
74. సుందరాచార్యుల ప్రతి.
75. 887/ఉ. వి. ప్ర.
76. 528/ఉ. వి. ప్ర; 188/14; 23/2; 187/14 కాకి. ప్ర.
77. 84/14; 130/14 కాకి. ప్ర.
78. 110/14 కాకి. ప్ర.
79. 34/14 కాకి. ప్ర.
80. 167/14 కాకి. ప్ర.
81. 126/14 కాకి. ప్ర.
82. పేజీ 74 & 75.
83. **D** 143 (బ్రౌన్ వ్రాయించిన వ్రాతప్రతి) మద. ప్ర.
84. వి. రా. రా. ప్రతి.
85. వి. రా. రా. ప్రతి.
86. అదే.
87. అదే.
88. అదే.
89. అదే.
90. వా. రా. I - 5-15.
91. వి. రా. రా. ప్రతి.
92. అదే.
93. **D** 143/మద. ప్ర.
94. వి. రా. రా. ప్రతి.
95. **D** 143/మద. ప్రతి.
96. వి. రా. రా. ప్రతి.
97. అదే.

98. అదే.
99. **D** 143/మద. ప్ర.
100. బి. రా. రా. ప్రతి.
101. అదే.
102. అదే.
103. **D** 143/మద. ప్ర.
104. అదే.
105. **R** 371; **D** 146/మద.ప్ర.
106. బి. రా. రా. ప్రతి; **D** 143 మొ॥
107. అదే.
108. **D** 143/మద. ప్ర.
109. బి. రా. రా. ప్రతి; **D** 3029.
110. **D** 143/మద. ప్ర.
111. **D** 143/మద. ప్ర.
112. **D** 143/మద. ప్ర.
113. అదే.
114. అదే.
115. అదే.
116. అదే.
117. అదే.
118. **D** 154.
119. అదే.
120. "యది శక్రవివస్వంతౌ"— వా. రా. **VI,** 12, 36.
121. **D** 154.
122. అదే.

# భాస్కర రామాయణము అవాల్మీకాంశములు

నన్నయాదులు వ్యాసభారతమునందలి వర్ణనములను కొన్నిచోట్ల పెంచియు కొన్నిచోట్ల తగ్గించియు, మరికొన్నిచోట్ల వదలివేసియు, కథలో స్వల్పములైన మార్పులను చేసియు, భారతమునను వదించిరే కాని కథయందు పెద్ద మార్పులను కావింపలేదు. భా.రా.కర్తలును చాలవఱకిట్టి స్వతంత్రానువాదపద్ధతినే అనుసరించినను అటనట అవాల్మీకములగు కథాంశములను కూడ ప్రవేశపెట్టినారు. లోకమున రామకథకు గల ప్రచారమే అందవాల్మీకాంశము లేర్పడుటకు కారణమని చెప్పవచ్చును. రాముని భగవదవతారముగను, సీతాదేవిని లోకమాతగను భావించిన జనులు సీతారాములయందలి భక్తిభావముచే తాదాత్మ్యము నొంది వారి సుఖమును తమ సుఖముగను, వారి దుఃఖమును తమ దుఃఖముగను భావించి రామకథను తమకు నచ్చినరీతిగ మలచుకొన్నారు. భారతకథ భౌతిక విషయములతో నిండియున్నదే కాని అందు భక్తిభావమునకు స్థానము తక్కువ. కనుకనే రామకథయందవాల్మీకములు చోటుచేసికొనినట్లుగ భారతకథయందవైయాసములు ప్రవేశింపలేదు. భా.రా.నందలి యవాల్మీకాంశములకు కొన్నింటికి మూలము అధ్యాత్మానందాది సంస్కృత రామాయణములందును, తెనుగు రామాయణములలో రం.రా.నందును కనిపించుచున్నది. మఱికొన్నింటికి ప్రజల వాడుకలోనున్న రామకథాంశములే మూలము కావచ్చును. భా.రా.న అయా కాండములందున్న అవాల్మీకాంశములను పరిశీలింతము.

బాలకాండము :

i) వాల్మీకమున గౌతముడహల్యను పాషాణము కమ్మని శపించినట్లుగ లేదు. అందు అహల్య వాయుభక్షయు, నిరాహారయు, భస్మశాయినియు, అదృశ్యయునై యుండుమనియే శపించినట్లు కలదు! కాని భా.రా.నందలి వాయుభక్షణువు, నిరాహారవు, భస్మశాయినివియునై యెవ్వరికినింగానరాక పాషాణంబవై

యుండుము (I, 527) అను గద్యమున గౌతముఁడహల్యను శిల కమ్మని శపించినట్లుగ వర్ణింపబడినది. ఇట్లహల్యను శిల కమ్మని శపించు విషయము సంస్కృతమున అధ్యాత్మానందరామాయణములందును, పద్మపురాణమునందును తెనుఁగున రం.రా.నను కలదు.[2]

ii) దశరథుడు గావించిన పుత్రకామేష్టియందలి హవిర్భాగములను గ్రహింపవచ్చిన దేవతలు బ్రహ్మతో రావణుడు తమకు కలిగించు బాధలను విన్నవించుకొందురు. అప్పుడు బ్రహ్మ విష్ణువు నరుడై దేవతల బాధలను తొలగించి రక్షించునని తెలుపును. ఈ సందర్భమున రావణుడు పూర్వ జన్మమున హిరణ్యకశిపుడనియు, ఆతనిని విష్ణుమూర్తి నరసింహాకృతిబూని వధించెననియు బ్రహ్మ దేవతలతో తెలిపినట్లుగ నీ క్రింది భా.రా.పద్యమున వర్ణింపబడినది.

"నరసింహాకృతిఁబూని భీకరగతిన్ నారాయణుండుద్ధతో
ద్ధురబాహాబలుడై హిరణ్యకశిపుందున్మాడి సంప్రీతి నా-
దరమాన్ సురకోటిఁ బ్రోచెఁ దగ నా దైత్యాధినాథుండ యి
ద్ధర జన్మించెను రావణుండనఁ బులస్త్యబ్రహ్మకుం బుత్రుడై (I, 142)

రావణుని యీ పూర్వజన్మ వృత్తాంతము వాల్మీకమున కానరాదు. భా.రా. కర్త యీ యంశము నీ క్రింది రం.రా. ద్విపదలనుండి గ్రహించియుండవచ్చును.

'విశదంబుగా నింక వినుఁడు హిరణ్య
కశిపుఁడు లోకముల్ గారించునాడు
నరసింహరూపంబు నారాయణుండు
ధరియించి వాని విదారించినాడు
వాఁడె వీఁడై విశ్రవసునకుఁ బుట్టి
నాఁడు[3]

iii) శ్రీరాముడు బుధవారమునను, భరతుడు గురువారమునను లక్ష్మణ శత్రుఘ్నులు శుక్రవారమునాడును జన్మించినట్లుగ భా.రా.న చెప్పబడినది.[4]

వాల్మీకమున నీ వారముల ప్రసక్తి కనిపింపదు. అంతేకాక వాల్మీకమున నొక్క శ్రీరాముని జన్మతిథి మాత్రమే పేర్కొనబడగా భా.రా.న భరతుడు దశమినాడును, లక్ష్మణ శత్రుఘ్నులు ఏకాదశినాడును జన్మించినట్లుగ చెప్పబడినది[5] రం.రా.న శ్రీరాముడు బుధవారమున జన్మించినట్లుగనున్నను అందు భరతాదుల జన్మవారములుగాని, తిథులుగాని పేర్కొనబడలేదు.[6] మొల్ల తన రామాయణమున శ్రీరామాదులందరును నవమీ భానువాసరమున జన్మించినట్లుగ వర్ణించినది.[7] ఇట్లు శ్రీరామాదులు భానువాసరమున జన్మించినట్లు వర్ణించుటకు వారు భానువంశీయు లగుట కారణము కాబోలు !

iv) రామాదుల వివాహమునకు పూర్వము దశరథుని వంశక్రమమును, జనకుని వంశక్రమమును వాల్మీకమున వర్ణింపబడియున్నవి. ఇందు దశరథుని వంశక్రమమును వసిష్ఠుడు వర్ణింపగా జనకుని వంశక్రమమును జనకుడే వర్ణించు కొనినట్లుగ నున్నది. కాని భా.రా. కర్త జనకుని వంశక్రమమును శతానందుడు వర్ణించినట్లుగ మార్పు గావించినాడు.[8]

**అయోధ్యాకాండము :**

i) మంథరకు రామునిపై ద్వేషము కలుగుటకు వాల్మీకమున కారణ మేమియు కానరాదు. అందు మంథర 'పాపదర్శిని' యని మాత్రమే చెప్పబడినది. రాముడు బాల్యమున గావించిన 'చరణతాడన భంగంబు'ను వైరకారణముగాగొని రాముని పట్టాభిషేకమునకు భంగము గావింపదలపెట్టినట్లుగ భా.రా.న కలదు.[9] రం.రా.నను ........రాముడు బాల్యంబునందు

'తన కాలు విఱిచిన తప్పు సాధింప
నిది నాకు తఱి' యని మంథర రామునికి హాని తలపెట్టినట్లుగ పేర్కొన బడినది.[10] రాముడు బాల్యమున మంథర కాళ్లను పట్టి లాగిపడవేసినట్లుగ నీ క్రింది అగ్నిపురాణ శ్లోకమువలనను తెలియుచున్నది.

"పాదౌ గృహీత్వా రామేణ కర్షితా సాపరాధతః
తేన వైరేణ సా రామం వనవాసం చ కాంక్షతి" (VI, 87)

ii) మంథర కైకకు దుర్బోధచేయు సమయమున పూర్వము జయంత పురమున పురందరశంబరులకు జరిగిన యుద్ధమున ఇంద్రునకు తోడుగా దశరథుడు పోయి యుద్ధము చేయుటయు, ఆ రాక్షసుడనేకమాయలు గావింపగా కైకేయి తాను ధవళాంగుడను మునివలన పడసిన మంత్రవిద్యచే నా మాయలకు ప్రతీకారము గావించుటయు, అందుకు దశరథుడు మెచ్చి తనకు రెండు వరములిచ్చుటయుః జ్ఞప్తికి తెచ్చును. భా.రా. నందలి యీ ధవళాంగుని ప్రసక్తి కాని, మంత్రవిద్యా ప్రసక్తికాని వా.రా.న కానరావు. అందు క్షతుడైన దశరథుని యుద్ధరంగమునుండి దూరముగ కొనిపోయి రక్షిచినట్లుగ మాత్రమే కలదు.

"తత్రాకరోన్మహాయుద్ధం రాజా దశరథ స్తదా
అసురైశ్చ మహాబాహుశ్శస్త్రైశ్చ శకలీకృతః
అపవాహ్య త్వయా దేవి! సంగ్రామాన్నష్టచేతసః
తత్రాపి విక్షతశ్శస్త్రైః పతిస్తే రక్షిత స్త్వయా
తుష్టేన తేన దత్తౌ తే ద్వౌ వరౌ శుభదర్శనే" (వా.రా. II, 9, 15-17)

మూలభిన్నమగు నీ విషయమును రుద్రదేవుడు రం.రా. నుండి గ్రహించి యుండును.

iii) కాకాసురుని వృత్తాంతము వాల్మీకమున అయోధ్యాకాండమున కాక సుం కాం.న మాత్రమే కలదు. కాని యీ వృత్తాంతము భా.రా.న సీతారాములు చిత్రకూటపర్వతమున విహరించుచున్న సందర్భమునను అయో. కాం న కనబడు చున్నది.[12] అధ్యాత్మానంద రామాయణములందును, పద్మపురాణమునందును నీ కథ అయో.కాం. కథాసందర్భమునను వర్ణింపబడినది.[13] ఆనందరామాయణమున కాకము సీత చరణాంగుష్ఠమును ఆమిషబుద్ధితో చంచువుతో విదారించినట్లుగ కలదు.[14]

iv) సీత అనసూయతో తన వివాహవృత్తాంతమును చెప్పు సందర్భమున సీతాదేవి జన్మవృత్తాంతమునకు సంబంధించిన అవాల్మీకమగు నొక వింత విషయము భా.రా న కనిపించుచున్నది. ఒకప్పుడు జనకుడు తన సహధర్మ చారిణులతో కలిసి యజ్ఞభూమికి పోగా అట మేనక కనిపించును. జనకుడామె రూపమునకు ముగ్ధుడై

"........ . ....అధికపుణ్యుడఁ గానే
యనపత్యుఁడ నగు నే ని
వ్వనజాననయందపత్యవంతుఁడనైనన్" (భా.రా. II, 434)

అని మనమున తలపోయును. అంత నాకాశవాణి మేనకవలన జనకునకు 'అసమరామణీయకవైభవంబు వెలయు మానసాపత్యంబు గలుగు'నని తెలుపును. జనకుడు యజ్ఞభూమియందు బీజముష్టివిక్షేపము చేయగా నట భూగర్భమున సీతాదేవి లభించును.[15] సీతాదేవి జన్మమునకు మేనకాసంబంధము కల్పించుటయు, ఆమెను మానసపుత్రిగ పేర్కొనుటయు వాల్మీకమున కన్పడవు. కాని వా. రా. గౌడీయప్రతియందును. పశ్చిమోత్తరశాఖీయప్రతియందును నీ విషయమున్నట్లుగ 'రామ్‌కథా ఔర్ వికాస్' అను గ్రంథమున పేర్కొనబడినది.[16]

v) సీతారాములు గంగాతీరమున గుహుని కలుసుకొని సాయంకాలమగుటచే అట సంధ్యాది నియమములు తీర్చుకొని ఆతడు తెచ్చిన కందమూలాదుల నాహారముగగొని పర్ణతల్పమున నిద్రించుచుందురు. అప్పుడు లక్ష్మణుడు అహర్నిశములు నిద్రవదలి పదునాలుగేండ్లు రాముని సేవింతునని ప్రతిజ్ఞ చేయుట భా.రా.న నీ క్రింది పద్యమున వర్ణింపబడినది.

"ఆ పదునాలుగేడులు నహర్నిశముందన నిద్రదప్పి యా
రోపితచాపుఁడై రఘువరుంగొలువంబరమాద్భుతప్రతి
జ్ఞాపరుఁడైన లక్ష్మణుఁడు జానకి విన్నదనంబు చిత్తసం
తాపము సేయ నా శబరనాథునకద్దెసఁ జూపి వెండియున్ (II, 266)

పదునాలుగు సంవత్సరములు నిద్రపోనని లక్ష్మణుడు ప్రతిజ్ఞ చేసినట్లు వాల్మీకమున కానరాదు. రం రా కర్త లక్ష్మణునిచే నీ ప్రతిజ్ఞ గావింపజేసినాడు. కాని అందు నిద్రాదేవి లక్ష్మణునావేశించుటయు, లక్ష్మణుడు వనవాసాంతము వఱకు ఊర్మిళ నాశ్రయించి యుండుమని నిద్రాదేవితో జెప్పుటయు అధికముగ కనిపించుచున్నవి.

vi) దశరథుడు కౌసల్యతో మునిబాలకుని వృత్తాంతమును చెప్పునపుడు బాణహతుడైనముని బాలకుడు 'హా నమః శివాయ' యనుచు కూలెనని భా రా.న

చెప్పబడినది.[18] ఈ సందర్భమున మూలమున 'హా హేతి పతితస్తోయే' అని మాత్రమే కలదు.[19] దీనినిబట్టి అనువక్తృకవి అద్వైతాభిమానము తెలియవచ్చు చున్నది.

vii) యజ్ఞదత్తుడు మరణింపగా నతనికై ముని మాత్రమే విలపించినట్లుగ వా.రా.న కలదు [20] కాని యనువాదమున మునిపత్ని విలాపము గూడ వర్ణింప బడినది. అంతేకాక భా.రా. కర్త మునిపత్ని విలాపమునే ప్రథమముగ వర్ణించి స్త్రీ హృదయముయొక్క సహజమైన దుఃఖాసహిష్ణుతను, మార్దవమును ప్రకటించినాడు.

**అరణ్యకాండము :**

i) శూర్పణఖా విద్యుజ్జిహ్వుల కుమారుడగు జంబుకుమారుడు తన తండ్రి పగ తీర్చుకొనుటకై ఇంద్రుని గూర్చి తపముచేయగా ఇంద్రుడు మెచ్చి అతనికి చంద్రహాసమును పంపును అప్పుడు జంబుకుమారుడు తన తపోబలమున కిది ఎంతటిది అని దానిని గ్రహింపలేదు. లక్ష్మణుడు దానిని గైకొని యక్కడి మునుల సూచనానుసారముగ అటనున్న వెదురువనమును ఖండింపగా అందున్న జంబుకుమారుడు (ఇతడు జంబుమాలి కాడు. జంబుమాలి ప్రహస్తుని కుమారుడు) మరణించును. శూర్పణఖాగమనమునకు చక్కని పీఠికగానున్న యీ ఘట్టము పదిహేనుపద్యములలో వర్ణితమై ముద్రిత భా.రా. ప్రతులన్నింటియందును కనిపించుచున్నది.[21] స్వల్పభేదముతో నీ కథ రం.రా.నను కలదు.[22] ఈ విషయము సంస్కృత రామాయణములలో ఆనందరామాయణమున మాత్రము కనిపించుచున్నది.[23] కాని యిందు జంబుడని కాక సాంబుడని కలదు. విమర్శకు లందరును జంబుకుమారవధ వృత్తాంతమును భా.రా.నందలి యవాల్మీకాంశముగ పేర్కొనినారు. ఈ ఘట్టము ము.ప్ర.ప.లన్నింట కనిపించుచున్నను ఈ వ్యాసకర్త పరిశీలించిన బహుళ తా.ప్ర.లలో నెందును కానరాకపోవుటచే నిది భాస్కరుడు రచించినది కాదనియు, తరువాత నెవరిచేతనో రచితమై యిందు ప్రక్షిప్తమై యుండుననియు తలంచుటకవకాశము లేకపోలేదు మొట్టమొదటిసారిగా భా రా.ను పరిష్కరించి ముద్రించినవారు కిరాలపాటి రంగయ్యగారు.[24] వీరు స్వయముగ గొప్ప కవులగుటచే నీ జంబుకుమారవృత్తాంతమును రచించి యిందు చేర్చి యుండిరేమో! ఆనందాశ్రమమువారు ప్రకటించిన భా.రా. పీఠికాకర్తలగు తంజ

నగరము తేవప్పెరుమాళయ్యగారును అరణ్యకాండమున వ్రాతప్రతులకును. ముద్రితప్రతులకును గల భేదమును పరిశీలించుచు ము.ప్ర.లయందలి అధికపద్య పాఠమునుగూర్చి తెలుపుచు పై సందేహమునే ప్రకటించియున్నారు.[25] ఇట్టి ప్రక్షిప్తఘట్టములు, ప్రక్షిప్తపద్యములు భా రా.న ఇంకెన్నియున్నవో! పరిష్కృత ముద్రణమునగాని తేలని విషయము.

ii) జటాయువు తన జన్మ వృత్తాంతమును చెప్పుకొను సందర్భమున కశ్యపుని గూర్చి తెలుపుచు ఆతడు దక్ష ప్రజాపతి యిరువది మంది కూతుళ్ళలో ఎనమండుగురిని మాత్రమే పరిణయ మాడినట్లుగ వా.రా.న వర్ణితమైనది.[26] కాని భా.రా.న పదముగ్గురు కన్యలను పరిణయ మాడినట్లుగ ఉన్నది.[27] అంతేకాక కశ్యపున కదితియందు 33 గురు దేవతలు (ఆదిత్యులు 12, వసువులు 8, రుద్రులు 11) జన్మించినట్లు వాల్మీకమున నుండగా[28] భా.రా.న నిరువదిముగ్గురు మాత్రమే (ఆదిత్యులు 12, రుద్రులు 11) జన్మించినట్లుగ కలదు.[29] భా.రా. నందలి యీ ఘట్టము జంబుకుమారవధ ఘట్టము వలె తా.ప్ర.లలో కానరాదు.

iii) రాముడు అగస్త్యాశ్రమమునకు పోయి అగస్త్యుని దర్శించును. అట నగస్త్యుడు రాముని తగు రీతి నాదరించి యాతనికి దివ్యమైన రెండు ఘనఖడ్గము లను, వైష్ణవమగు ధనుస్సును, అమోఘములగు బాణములను, అక్షయమగు తూణ యుగమును ప్రసాదించినట్లుగ భా.రా.న వర్ణింపబడినది.[30] అగస్త్యుడు రామున కొకే ఖడ్గము ప్రసాదించినట్లుగ వాల్మీకమున కలదు.[31]

iv) రాముని సౌందర్యమునకు ముగ్ధురాలైన శూర్పణఖ తనను చేపట్టుమని యాతనిని కోరును అప్పుడు రాముడు 'వినిర్జితమారు'డగు లక్ష్మణుని పొందుమని యాతని యొద్దకు పంపగా లక్ష్మణుడు శూర్పణఖతో 'త్రిజగములందు నేర్పులగు దిట్టయగు రాముడుండగా శుద్ధజడుడగు తనను పొందనాశించుట యెందులకని తిరిగి శ్రీరామునొద్దకు పంపును. శూర్పణఖ శ్రీరామునికడకు వచ్చుటతోడనే ఆమెను చూచి సీతాదేవి నవ్వును. దానితో శూర్పణఖకు కోపమినుమడించును. రోహిణిపయి మహోల్క పరతెంచిన విధమున సీతాదేవిని మ్రింగెదననుచు నామెపైకి రాగా శ్రీరాముడడ్డుకొని క్రూరాత్మయగు నా శూర్పణఖను విరూపిణి చేయుమని లక్ష్మణు నాదేశించును. లక్ష్మణుడు కుఠారమున శూర్పణఖ ముక్కుచెవులు కోసివేయును.

ఇట్లు సీతపై శూర్పణఖ కపియుటకు సీతాదేవి నవ్వును కారణముగ చెప్పుట యవాల్మీకాంశము.

v) శ్రీరాముడు సీతను వెదకుచు కానక మందాకినికి వెళ్ళి చూడుమని లక్ష్మణునకు చెప్పును. లక్ష్మణుడటకు పోయి సీతను కానక తిరిగి రామునొద్దకు వచ్చి యా విషయమును తెలుపును, అప్పుడు సమస్తభూతములు సీతాదేవివార్తను శ్రీరామున కెఱిగింపవలసినదిగా మందాకినిని ప్రార్థింతురు. మందాకిని శ్రీరాము నొద్దకు పోయి సీతాదేవిని రావణుడపహరించి లంకా నగరమునకు తీసుకొని పోయెనని తెలుపును.

రామునితో దశకంఠుఁడు
భూమిజ నెత్తికొని వేగ పోయెను లంకా
ధామంబునకని చెప్పుచు
నా మందాకిని నిజాలయంబున కరిగెన్ (భా. రా. III,2,311)

వాల్మీకమున నీ విషయము కానరాదు.

**కిష్కింధాకాండము :**

i) ఈ కాండమున ప్రధానముగ కనబడు నవాల్మీకాంశము తారా శాపము. వాలివధముచే దుఃఖోద్విగ్నయైన తార రావణవధానంతరము సీత తిరిగి రామునకు లభించినను అనతికాలముననే సీత భూప్రవేశముగావించి రామునకు వియోగదుఃఖమును గలిగించునని రాముని శపించినట్లుగ భా. రా. నందలి యీ క్రిందిపద్యమున వర్ణితమైనది.

"నరవర! యిట్లకారణము నా పతిఁ జంపితి గాన యీవు బం
ధురభుజశక్తితో మహిజఁదోకొని వచ్చిన సీత నీ కడం
జిరతరకాలమింపుగ వసింపక నీ పతి దుఃఖపాటుతో
నెరియుచునుండి భూమిఁజొరనిమ్మనుచున్ శపియించెఁ గిన్కతోన్"
(IV, 305)

భా. రా.న వర్ణితమగు నీ తారాశాపము వాల్మీకమున లేదు. పట్టాభిషేకానంతర సీతాపరిత్యాగఘట్టమునకు ఈ శాపమును భా రా. కర్త భూమికగా కల్పించుకొనియుండవచ్చును. వా.రా. పశ్చిమోత్తరీయప్రతియందును, గౌడీయ ప్రతియందును తారాశాపము కనబడుచున్నది.

"అచిరేణ తు కాలేన త్వయా బాణైరుపార్జితా
న సీతా మమ శాపేన చిరం త్వయి భవిష్యతి
ఆత్మనః శౌచమాధార్య పతివ్రతగుణా సతీ
యాచ్యమానా త్వయా సీతా పునర్యాస్యతి భూతలమ్"

(గౌ ప్ర. IV, 20, IV, 16)

సీత బాల్యమున అజ్ఞానముచే కీరదంపతులకు వియోగము కలిగించి వాని శాపమునకు గురియైనట్లుగ పద్మపురాణమున నొక కల్పన కావింపబడినవి.

ii) లంకకు పోయి సీతను కనుగొని రమ్మని సంపాతి తన కుమారుడగు సుపార్శ్వుని పంచినట్లుగ భా.రా.న కలదు. సంపాతి రామభక్తిని ప్రదర్శించు నీ యంశము వా.రా.న కనబడదు.

iii) జాంబవంతుడు హనుమంతుని జన్మ వృత్తాంతమును చెప్పి ఆతనిని ప్రశంసించి సీతా వృత్తాంతమును తెలిసికొనిరమ్మని యాదేశించిన పిదప హనుమంతుడు మరల తన జన్మ వృత్తాంతమును వానరులకు తెలిపినట్లుగ భా.రా.న నున్నది.[32] వా.రా.న జాంబవంతుడు చెప్పిన హనుమజ్జన్మ వృత్తాంతమే కాని హనుమంతుడు స్వయముగా తన జన్మ వృత్తమును చెప్పుకొనుట కనబడదు. భా.రా.న హనుమంతుడు చెప్పిన స్వీయజన్మవృత్తాంతమిట్లున్నది.

పశ్చిమ సముద్రముచెంత ప్రభాసమను పుణ్యతీర్థమొకటి కలదు. అచ్చటి మునులు ఆ తీర్థమున స్నానము చేయుటకు రాగా శంఖశబలులను దుష్టగజములు రెండు వచ్చి వారిని పొడిచి బాధించుచుండెను. ఒకనాడాగజములు భరద్వాజునిపై కవియగా నట పర్వతకూటముననున్న కపివీరుడు (హనుమంతుని తండ్రి) చూచి వానినొక సాలమున మర్దించి వధించెను. మునులను నిత్యము బాధించుచున్న యా

దుష్టగజములను వధించినందులకు భరద్వాజుడు మిక్కిలి సంతోషపడి ఆతనికి ప్రియమగు ఒక్కవరమును ప్రసాదించవలసినదిగా మునులనాదేశించును. కపివీరుడు 'అనిలసమబలుడు, అవ్యయతనుడు, కామగముడు, మహాజవసత్త్వుడు, కామరూపియు నగు తనయుడు తనకు కలుగునట్లు వరము కోరుకొనెను. మునులట్లే వరమును ప్రసాదించినారు. ఒకనాడు అంజన మలయపర్వతశృంగమున విలాసముగ విహరించుచుండగా వాయుదేవుడు ఆమె యౌవనవిలాసమునకు ముగ్ధుడై యామె నాలింగనముచేసికొనును. ఆతని సంగముచే అంజనాదేవికి ఆంజనేయుడు జన్మించును.[33] వాయుదేవునివలన అంజనాదేవి కాంజనేయుడు జన్మించుట యను విషయము వాల్మీకమున జాంబవంతుడు చెప్పిన హనుమజ్జన్మ వృత్తాంతమున నున్నను మునులను బాధించుచున్న దుష్టగజములను వధించుటయు, తద్వధచే నాతనికి కేసరి యను నామము గలుగుటయు, మునులాతనికి బలిష్ఠుడగు కుమారుడు జన్మించునని వరమొసగుటయు నను విషయములందు కానరావు. అంతేకాక వాల్మీకమున కపివీరుడు శంబసాదనుడను దానవుని సంహరించినట్లు కలదు.[34]

iv) హనుమంతుడు బాల్యమున నొకసారి ఉదయించుచున్న సూర్యబింబమును చూచి ఫలమని భ్రమించి దానిని గ్రహించుటకై యంతరిక్షమున కెగయగా ఇంద్రుడాతనిని వజ్రాయుధముతో కొట్టినట్లుగను, అందుచే నాతని హనువు భగ్నమైనట్లుగను వా.రా.న చెప్పబడినది.[35] కాని భా.రా.న హనుమంతుడు సూర్యకిరణముల వేడిమిని తట్టుకొనజాలక ఆకాశముమండి కొండపైబడగా నాతని హనువు భగ్నమైనట్లుగ వర్ణితమైనది. ఇందు మూలమందలి యింద్రుని వజ్రఘాత ప్రసక్తి కానరాదు [36]

v) సీతకోసము దక్షిణ దిశయందు వెదుకవలసిన ప్రదేశములనుగూర్చి సుగ్రీవుడు హనుమంతునకు చెప్పుచు 'తృణాంగి' యను మునీంద్రుని యాశ్రమమును పేర్కొనును. భా.రా.న గల యీ తృణాంగిముని ప్రసక్తి[37] వాల్మీకమున కానరాదు.

vi) రామ సుగ్రీవులు సఖ్యము గావించుకొను సందర్భమున సుగ్రీవుడు మానుష రూపమును ధరించినట్లుగ క్రింది వా.రా. శ్లోకమువలన తెలియుచున్నది.

"స కృత్వా మానుషం రూపం సుగ్రీవః ప్లవగర్షభః
దర్శనీయతమో భూత్వా ప్రీత్యోవాచ చ రాఘవమ్" (IV, 5, 9)

భా.రా.న ఈ సుగ్రీవుని మానుషరూపధారణ ప్రసక్తి కానరాదు.

**సుందరకాండము**

i) లంకాదాహము గావించిన యనంతరము హనుమంతుడు తన వాలానలమును సముద్రమున నార్చుకొనుచుండగా నట హనుమంతుని కొఱకు చింతిల్లుచున్న సీతకడకు సరమ పోయి యాతని క్షేమమును తెలుపును. భా.రా.న వర్ణితమగు నీ యంశము[38] వాల్మీకమున కానరాదు. రం.రా.నను సరమప్రసక్తి లేదు. అందు హనుమంతుని క్షేమమును సీత దనుజకాంతలచే విన్నట్లుగ నున్నది.[39]

**యుద్ధకాండము**

i) సీతను రామునకప్పగించి యతనితో సంధి చేసుకొనుట యుక్తమని విభీషణుడు రావణునకు హితబోధ కావించును. అందుకు రావణుడు కుపితుడై విభీషణుని ఉరముపై తన్ని యాతనిని పురము వెడలగొట్టించును. ఇట్లు రావణునిచే పరాభూతుడైన విభీషణుడు తల్లియగు కైకసిని దర్శించి సభామధ్యమున తనకు గలిగిన యవమానమును తెలిపి తాను శ్రీరాముని సన్నిధికి వెడల నిర్ణయించుకొనినట్లుగ తెలుపును. కైకసియు ముందే యీ విషయమును తనకు విశ్రవసుడెఱిగించినాడని చెప్పి శరణాగత వత్సలుడైన రాముని నాశ్రయింపుమని విభీషణుని దీవించి పంపినట్లుగ భా.రా.న వర్ణితమైనది. రావణుడు విభీషణుని తన్నుట, కైకసిదీవన యను విషయములు వాల్మీకమున లేవు. రం.రా.న కలవు.[41] అవాల్మీకమగు నీ యంశము అధ్యా రా.న కలదు.[42]

ii) వానరులు సముద్రముపై సేతువును నిర్మించు సందర్భమున నలుడు

"విఘ్నేశాయ నమో నమో భగవతే వేదండతుండాయ ని
ర్విఘ్న క్షేమకృతే నమోఽస్తు భవతే విశ్వప్రభో" యనుచు విఘ్నేశ్వర ప్రార్థన కావించినట్లు భా.రా.న కలదు.[43] ఇది హుళక్కి భాస్కరుని యద్వైత

మతాభిమానమును వ్యక్తము చేయుచున్నది. వాల్మీకి నలునిచే నీ విధముగ విఘ్నేశపూజ కావింపలేదు.

iii) సేతుబంధనసమయమున సముద్రుడు రామునకు ప్రత్యక్షమై తనకు దశరథునితోగల సఖ్యమును తెలుపుటయేకాక దేవాసురసంగ్రామమున ఇంద్రునకు సహాయుడుగ వచ్చిన దశరథునకు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను నలుగురు కుమారులు జన్మింతురని యింద్రాది దేవతలు వరమొసంగుచు నాతనికి దివ్య రథంబును, అమృతసంభవమైన చూడామణిని, అనేక రత్నములను కానుకలుగా నిచ్చి గౌరవించిరనియు, పిమ్మట దశరథుడు తన నయోధ్యకు తోడ్కొని యట నొకమాసము వివిధ ప్రకారముల సంభావించెననియు తెలుపును.[44] భా. రా.న వర్ణింపబడిన యీ యంశము వాల్మీకమున కానరాదు. దశరథుడు సముద్రుని సంభావించుట యను నీ యంశము రం. రా. న నున్నను అందు దశరథునకు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులను నలువురు పుత్రులు కలుగునట్లు దేవతలు దీవించుట, దివ్యరథాదులను కానుకలుగా నొసంగుట యను విషయములు లేవు.[45]

iv) వానరులు సేతునిర్మాణమునకు కడగుచు తరుగిరులను సముద్రమున పడవేయుచుండగా నవియన్నియు నీటిలో మునిగిపోవుచుండును. అందుకు వానరులు చింతిల్లి రామున కా విషయము విన్నవింతురు. అంత సముద్రుడు వచ్చి శ్రీరామునితో నీ వనచరులు తెచ్చు తరుగిరులను మొదట నలుడు వైచినచో నవి క్రుంకక తేలియుండుననియు, ఆపిమ్మట వానరులు వానిపై తరుగిరులను వేసి సులభముగ సేతువును నిర్మింపవచ్చుననియు తెలిపినట్లుగ భా. రా. న కలదు.[46] అవాల్మీకమగు నీ విషయము రం. రా. నను కలదు.[47] కాని యందలి పశు కణ్వుడను ముని నలుని శపించిన వృత్తాంతము మాత్రము భా. రా. న లేదు.

v) రావణుడు కుంభకర్ణుని మేల్కొలిపి ప్రహస్తాదివీరులు రామాదుల నెదుర్కొని మడిసిన విషయమును తెలుపును. అంత కుంభకర్ణుడు పరస్త్రీని కొనివచ్చుట తగదనియు, సీతను రామునకప్పగించుమనియు రావణునకు నీతి బోధ కావించును. అంతేకాక తానొకనాడు వనభూమిలో విహరించుచుండగా దేవ సభనుండి తిరిగివచ్చుచున్న నారదుడెదురై దేవతలందరును తాము రావణునిచే పడు బాధలను బ్రహ్మతో తెలుపగా విష్ణువు దశరథునకు పుత్రచతుష్టయముగ

జన్మించుననియు, వారిలో శ్రీరాముడు రావణుని సంహరించుననియు బ్రహ్మ అభయమిచ్చుటయు తెలిపినట్లుగ రావణునకు తెలుపును. అంత రావణుడు రాముని నారాయణునిగను, సీతను లక్ష్మీదేవిగను తెలిసికొనియే వారిచే నిహతుడై కైవల్యపదమునొందుటకు సీతాపహరణము గావించితిననియు తెలుపును.[48] రావణ కుంభకర్ణులిట్లు భా.రా.న ఆత్మజ్ఞానపరాయణులుగ చిత్రింపబడుట యవాల్మీకము. రం.రా నను భా.రా. లో వలె రావణకుంభకర్ణులాత్మజ్ఞానపరాయణులుగనే చిత్రింపబడినారు. శ్రీరామునివలన తాను కైవల్యపదమునాకాంక్షించినట్లు రావణుడు స్వయముగ ప్రకటించుకొనుట మండోదరి నీతి బోధగావించు సందర్భమునను భా.రా.న కలదు.[49]

vi) ధూమ్రాక్షాదిరక్షోవీరులు కపిసైన్యముతో పోరాడి మరణింపగా మండోదరి రావణునొద్దకు పోయి శ్రీరాముని మహత్త్వమును తెలిపి యాతనితో సంధి చేసుకొనుటయే మేలని రావణునకు నీతిబోధ కానించును. అవాల్మీకమై భా.రా న వర్ణితమైన యీ యంశము ర.రా.నను కలదు.[50] ఈ యంశము దేశీయములగు వా.రా. ప్రతులందు లేకున్నను ఇటాలియన్ ప్రతిలో నున్నట్లుగ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ రం.రా. పీఠికలో తెలియజేసినారు.[51]

vii) నాగపాశబద్ధులగు రామలక్ష్మణులయొద్దకు నారదుడు వచ్చి రాముని స్తుతించి, గరుడుని స్మరింపుమని పలుకును. శ్రీరాముడు మనమున గరుడుని స్మరింపగా తత్ క్షణమే గరుడుడు వచ్చి రామలక్ష్మణులను బంధ విముక్తులనుగా చేసినట్లు భా.రా.న కలదు.[52] ఇందలి నారదాగమనము, నారదుడు గావించిన రామ స్తుతి, గరుడుని స్మరింపుమని నారదుడు శ్రీరామున కుపదేశించుట అను నీ విషయము లవాల్మీకములు. వాల్మీకమున నారద ప్రసక్తి లేకయే గరుడుడు స్వయముగా వచ్చి రామలక్ష్మణుల బంధ విముక్తుల కావించినట్లు వర్ణితమైనది.[53] అధ్యా.రా. న నారదాగమనము కలదు.[54]

viii) ఇంద్రజిత్తు రామలక్ష్మణులకదృశ్యుడై వారిని బాణపరంపరలతో బాధించుచుండగా వానరులు భయకంపితులై పారిపోయి శ్రీరాముని శరణుజొత్తురు. అంత వాయుదేవుడు ప్రత్యక్షమై మాయా యుద్ధము కావించుచున్న ఇంద్రజిత్తుపై

ఆంగిరసబాణము వేసి కృత్యను పాపుమని రామచంద్రునకుపదేశించును. భా.రా. న వర్ణితమగు నీ యంశము[55] వాల్మీకమున లేదు.

ix) భా.రా. యుద్ధకాండమున వర్ణింపబడిన అవాల్మీకాంశములలో ప్రధాన మైనది కాలనేమి వృత్తాంతము. ఈ ఘట్టము భా.రా.న సుమారు 106 పద్య గద్యములలో వర్ణింపబడి ఒక మనోహర లఘుకావ్యముగ భాసిల్లుచున్నది.[56] అధ్యాత్మానంద రామాయణములందు ఈ కథ వర్ణితమైయున్నది.[57] కాని వీనియందు కాలనేమికథాంతర్గతమగు ధాన్యమాలిని వృత్తాంతము మిక్కిలి క్లుప్తముగా నున్నది. రం.రా. నను కాలనేమికథ వర్ణింపబడినది. భా.రా.న వర్ణితమగు కాలనేమివృత్తాంతము ఈ క్రింది విధముగ నున్నది.

రావణుని శక్తిచే మూర్ఛితుడైన లక్ష్మణుని పునర్జీవితుని కావించుటకై హనుమంతుడు సంజీవని కోసము వెడలుచుండును. మార్గమధ్యమున రావణ ప్రేరితుడైన కాలనేమి (మారీచుని పుత్రుడు) మాయాముని రూపము గైకొని హనుమంతునకు విఘ్నముగావింప ప్రయత్నించును. కాలనేమి సూచించినవిధమున హనుమంతుడు తత్కల్పితమగు కృతకాశ్రమమందలి సరస్సున దప్పిక తీర్చుకొనుటకు దిగగా అందలి మకరి హనుమంతుని పట్టుకొనును. అతడు దానితో పోరాడి దానిని సంహరించును. అంత నా మకరి ఒక యప్సరసగా మారును. ఆమె తన పేరు ధాన్యమాలిని యనియు, తనపై మరులుగొన్న శాండిల్యుడను మహర్షి తనను కవయగోరగా నా సమయమున తాను రజస్వలననియు, నాల్గవదినమున కృతాభిషేకనై వత్తుననియు పలికి తన నివాసమునకు వెడలిపోగా ఆ దినముననే యటకు రావణుడు వచ్చి మోహపరవశుడై రజస్వలనని చెప్పినను వినక తనను బలాత్కారముగ రమించెననియు, నా విషయమున దివ్యదృష్టిచే నెఱిగిన శాండిల్యుడు తనను మకరిగా కమ్మని శపించి పిదప హనుమంతునివలన శాపవిముక్తి గలుగుననియు వివరించును. ఇవి భా.రా.న వర్ణింపబడిన కాలనేమి కథలోని ప్రధానాంశములు.

అవాల్మీకముగ భావింపబడుచున్న యీ కాలనేమికథ వా.రా.ఇటాలియన్ ప్రతియందును, దేశీయమగు పశ్చిమోత్తరశాఖీయప్రతియందును వర్ణింపబడినదని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రం.రా పీఠికలో తెలుపుటయేకాక ఆ

ప్రతులయందలి యా భాగములనుకూడా ఉద్ధరించి చూపినారు[58] ఇటాలియన్ ప్రతిలో యు.కాం. 82వ సర్గలో 60 శ్లోకములలోను, పశ్చిమోత్తరశాఖీయ ప్రతిలో యు.కాం. 81 వ సర్గలో 51 శ్లోకములలోను కాలనేమికథ వర్ణితమైనది. ఈ రెండు ప్రతులయందలి కథ భా.రా.నందలి కథతో కొన్ని యంశములలో భేదించుచున్నది. మొదట ఇటాలియన్ ప్రతియందలి కథాంశములకు భా.రా. కథాంశములతో గల భేదములు దిగువ పేర్కొనబడుచున్నవి.

i) హనుమంతుడు సంజీవనికై యాకాశమార్గమున ద్రోణాద్రికి పోవుచుండును. అప్పుడు నందిగ్రామముననున్న భరతుడు అతనిని చూచి అది యొక భూతమని భావించి దానిపై ధనుస్సునెక్కుపెట్టినట్లుగ ఇటాలియన్ ప్రతిలో నున్నది. ఈ యంశము భా.రా.నందున్నను ఇందు హనుమంతుడు ద్రోణాద్రిని తీసుకొని లంకకు తిరిగివచ్చు సందర్భముననే వర్ణితమైనది.

ii) భరతుడు హనుమంతునిపై విల్లెక్కుపెట్టగా హనుమంతుడు తాను రాముని దూతనని స్వయముగ చెప్పుకొని యాతని నా ప్రయత్నమునుండి మాన్పినట్లుగ ఇటాలియన్ ప్రతిలో నుండగా[59] భా.రా.న అశరీరవాణి హనుమంతుడాతని కాప్తుడని తెలిపి యాతని ప్రయత్నమును మాన్పినట్లుగ కలదు.[60]

iii) లక్ష్మణుడు యుద్ధరంగమున రావణునిచే ప్రహృతుడై మూర్ఛితుడైనట్లుగ హనుమంతునివలన తెలుసుకొని భరతుడు రావణునితో రామునకు వైరమేర్పడుటకు గల కారణమును తెలుపుమని హనుమంతుని ప్రశ్నించును. అప్పుడు హనుమంతుడు సీతాపహరణాది విశేషములను తెలుపును. ఇటాలియన్ ప్రతిలో గల యీ విషయము భా.రా.న కానరాదు.

iv) హనుమంతునిచే వధింపబడిన మకరి పూర్వరూపమున 'గంధకాలి' యను నప్సరస యని ఇటాలియన్ ప్రతిలో నుండగా భా.రా.న గంధమాలిని యని పేర్కొనబడినది. ఆ.రా.న నీమె గంధమాలి.[61]

v) ఇటాలియన్ ప్రతిలో గంధకాలి శాపవృత్తాంత మీ క్రింది శ్లోకములలో వర్ణింపబడినది.

'జానీహి మామప్సరసం గంధకాలీం తు నామతః
ఆకాశేన తు గచ్ఛంతీ కుబేరభవనం పురా
విమానేనార్కవర్ణేన తప్తకాంచనవర్చసా
నాపశ్యం తత్ర వేగేన తపస్యంతం మహామునిమ్
యక్షో నామ మహాతేజా మునిశ్శాపాయుధస్తదా
అవధూతో మయా చాసౌ విమానేన హరీశ్వర
అబ్రవీత్స మహాతేజా మునిరుగ్రతపాస్తదా
ఉత్తరస్యాం దిశి గిరిర్యో నామ్నా గంధమాదనః
దక్షిణే తస్య పార్శ్వే తు సమీపే యత్సరో మహత్
గ్రాహీ తత్ర భవిత్రీ త్వం సర్వప్రాణ్యపహారిణీ
తతోఽహం శాపనిర్దగ్ధా పతితాస్మి మహీతలే'[62]

ధాన్యమాలినిని శపించిన మహర్షి భా.రా.న శాండిల్యుడు. వా.రా. ఇటాలియన్ ప్రతిలో యక్షుడను మహర్షి, ధాన్యమాలిని శాపమునకుగల కారణమును ఈ రెండింటియందొకవిధముగ లేదు. గంధకాలి విమానమున కుబేరుని భవనమునకు పోవుచు తపముగావించుచున్న యక్షమునిని చూడక అవమానించుటవలన నాతడు శపించినట్లుగ ఇటాలియన్ ప్రతిలో నుండగా భా.రా.న తనను మోసగించి రావణునితో భోగించినదను కారణమున నామెను శపించినట్లుగనున్నది.

శాపవిముక్తయగు ధాన్యమాలిని కాలనేమిమోసమునుగురించి హనుమంతునకు తెలిపినట్లుగ భా.రా.న నుండగా[63] ఇటా.ప్ర.లో తననాదరించిన మహర్షి రాక్షసుడై యుండునని యాతని చేష్టలచే హనుమంతుడే స్వయముగ ఊహించినట్లు కలదు.

vi) హనుమంతుడు తనను పట్టుకొన్న మకరిదంతములను భేదింపగా అది మహాగ్రహముతో హనుమంతుని మ్రింగివేయును. హనుమంతుడు దాని యుదరమునందలి నరములను, ప్రేగులను, ఎముకలను త్రుంచి ఆ మకరిని చంపినట్లుగ భా.రా.న నున్నది. హనుమంతుని మకరి మ్రింగుట ఇటాలియన్ ప్రతిలో లేదు.

ఈ విధముగ ఇటా.ప్ర యందలి కాలనేమికథకును, భా.రా.కాలనేమి కథకును భేదములు కొన్ని కనబడుటచే భా.రా.నందలి కాలనేమికథకు ఇటా. ప్రతి. మూలమని చెప్పుటకు వలనుపడదు.

ఈ కథ ఇటా.ప్ర లోనే కాక వా.రా.పశ్చిమోత్తరశాఖీయప్రతులలోను కానవచ్చుచున్నది. ఈ ప్రతిలోని కాలనేమికథకును, ఇటా.ప్ర.యందలి కథకును గల భేదములను తెలుసుకొందము.

i) హనుమంతుడు సంజీవనికై నందిగ్రామముపైగా ద్రోణాద్రికి పోవునపుడు భరతుడాతనిని భూతమని భ్రమించి పిల్లు సంధించుట, హనుమ రామదూతనని చెప్పుకొనుట, భరతుని కోరికప్రకారము సీతాపహరణాదివృత్తాంతములు చెప్పుట మున్నగు ఇటా.ప్ర.యందుగల విశేషములు పశ్చి.శా.ప్ర.లో కానరావు.

ii) మకరిగా శప్తయైన అప్సరస ఇటా.ప్ర.లో 'గంధకాలి' కాగా ఇందామె విద్యున్మాలగా పేర్కొనబడినది.[64] ఆమెను శపించిన ఋషిపేరు కాని, ఆమె మునికి గావించిన యపరాధపు వివరములుగాని పశ్చి.శా.ప్ర.లో కానరావు. ఒకప్పుడు తానాకాశమార్గమున పోవుచుండగా నొక ఋషిని (ఋషిపేరు లేదు) అవమానించినట్లుగను, ఆతడు కోపముతో తనను శపించినట్లుగను మాత్రమే పశ్చి శా.ప్ర.లో పేర్కొనబడినది.[65]

iii) మాయామునిరూపమున హనుమంతుని మోసగించినవాడు కాలనేమి యను రాక్షసుడనియు, దుర్బిద్ధియగు నాతనిని చంపివేయుమనియు శాపవిముక్తయగు విద్యున్మాల హనుమంతునకు తెలిపినట్లుగ పశ్చి.శా.ప్ర.లో నున్నది. ఇటాలియన్ప్రతిలో నిది లేదు.

iv) హనుమంతుడు కాలనేమి యాశ్రమమునకు పోయి దప్పిక తీర్చుకొనుటకు జలమిమ్మని కాలనేమిని ప్రార్థింపగా, నాత డటనున్న సరస్సును చూపినట్లుగ పశ్చి.శా.ప్ర.లో నున్నది.[66] ఇటా.ప్ర.లో నీ హనుమంతుని దాహవృత్తాంతము లేదు. అందు సరస్సునందలి దివ్యజలమును గ్రహించి తన యాతిథ్యమును స్వీకరించుమని కాలనేమి హనుమంతుని కోరినట్లుగ మాత్రమే కలదు.

ఆనంద రామాయణమునందును ఈ కాలనేమి కథ వర్ణితమైనది[67] ఇందలి యీ క్రింది యంశములు ఇటా.ప్ర.తో భేదించుచున్నవి.

i) హనుమంతుడు దప్పిక తీర్చుకొనుటకు జల మిమ్మని కాలనేమిని ప్రార్థించుట.

ii) కొలనిలో నీరు త్రాగునపుడు కన్నులు మూసుకొని త్రాగుమని కాలనేమి యుపదేశించుట.[68]

iii) మకరిగా శపింపబడిన అప్సరస పేరు ధాన్యమాలిని యని పేర్కొనబడుట.

iv) ధాన్యమాలి పూర్వవృత్తాంతము లేకుండుట.

v) భరతుడు బాణఘాతముచే హనుమంతుని చేతియందలి ద్రోణ పర్వతమును పడగొట్టుట.

వివిధ సంస్కృత రామాయణములందు వర్ణితమగు కాలనేమి కథ ఏవో కొన్ని యంశములందు భా. రా. నందలి కథతో భేదించుచునే యున్నది. అన్ని యంశములందును భేదము లేకుండ సంవదించు కథాభాగము రం.రా.న మాత్రమే కనిపించుటచే భా.రా. కర్త యీ అవాల్మీకాంశమును రం.రా. నుండియే గ్రహించి యుండునని యూహింప వీలగుచున్నది.

vii) హనుమంతుడు ద్రోణాద్రిని పెఱుకగా దానిని రక్షించు చిత్రసేనాది గంధర్వపతులు హనుమంతునితో యుద్ధమునకు తలపడుటయు, హనుమ వారిని సమయించుటయు భా.రా.న వర్ణింపబడినవి.[69] ఈ విషయములు వాల్మీకమునగాని అధ్యా.రా. నందుగాని కనబడవు. వీనికి రం రా. మూలము కావచ్చును.[70]

viii) భా.రా.న వర్ణింపబడిన భరతుని దుఃస్వప్న వృత్తాంతము, ఆకాశమున పోవుచున్న హనుమంతుని భరతుడు భూతమని భ్రమించి, విల్లెక్కు పెట్టుట మున్నగు వృత్తాంతములును[71] అవాల్మీకములే.

ix) సంజీవనిచే లక్ష్మణుడు పునర్జీవితుడైనట్లుగ తెలుసుకొన్న రావణుడు శుక్రాచార్యునొద్దకు పోయి రాముని వధించు మార్గమును తెలియజేయుమని ప్రార్థిం

చగా శుక్రాచార్యుడాతనికి పాతాళ హోమము చేయుమని ఉపదేశమిచ్చును. తదను సారముగ రావణుడు పాతాళహోమము చేయుచుండగా అంగదుడు మండోదరి శిరోజములు పట్టి రావణునొద్దకు ఈడ్చుకొని వచ్చును. ఆ సందర్భమున మండోదరి శ్రీరాముని మాహాత్మ్యమును రావణునకు వివరించును. భా.రా.న అతి వివరముగ వర్ణింపబడిన యీ పాతాళ హోమాది విశేషము లన్నియు[72] అవాల్మీ కములే. వీని కధ్యాత్మరామాయణము మూలము కావచ్చును.

x) రాముడు రావణుని శిరములను, బాహువులను ఎన్ని మారులు ఖండించినను అవి మరల మొలచుచునే యుండును. అందులకు రాముడు విషణ్ణుడై యుండగా విభీషణుడు రావణుని నాభియందు అమృతము కుండలాకారముననున్న దనియు, పావకాస్త్రముచే దానినింకింపజేయుమనియు రామునకు తెలుపగా రాముడట్లే చేసి రావణుని వధించును. భా.రా.న వర్ణితమగు నీ యంశము వాల్మీకమున లేదు. అధ్యాత్మానందరామాయణములందు కలదు.[73] రాముడు రావణుని తలలను నూటొక్కమారు త్రుంచినట్లు మూలమున నుండగా భా.రా.న నూట తొమ్మిది మారులు త్రుంచినట్లుగ నున్నది.[74]

పైన చూపబడిన అవాల్మీకాంశములలో కొన్ని పశ్చి. శా. ప్ర. లో నున్నట్లుగ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ రం.రా. పీఠికలో తెలియజేసినారు.[75] వానిని దిగువ పొందుపరచుచున్నాను.

| | అవాల్మీకముగ భావింపబడు నంశము | పశ్చి. శా. ప్రతి |
|---|---|---|
| 1. | నాగపాశ బద్ధులగు రామలక్ష్మణుల కడకు నారదుడువచ్చుట | యు. కాం. 26వ సర్గ |
| 2. | శ్రీరాముని బలపరాక్రమములనుతెలిపి రావణునకు మండోదరి హితోపదేశము చేయుట | యు. కాం. 26వ సర్గ |
| 3. | కాలనేమివృత్తాంతము | ,, 81 సర్గ |
| 4. | రావణుడొనరించు హోమమునకు విఘ్నమాచరించుట, అంగదుడు మండోదరిని రావణునొద్దకు ఈడ్చుకొని వచ్చుట | ,, 82 సర్గ |

పైన పేర్కొనబడిన భా. రా. నందలి అవాల్మీకాంశములలో కొన్నింటిని ఔచిత్యము కొఱకును, కొన్నింటిని చమత్కృతికొఱకును ఇతర రామాయణముల నుండియు, పురాణములనుండియు, జానపదులలో వ్యాప్తమైయున్న రామ కథ నుండియు, జైనబౌద్ధ రామాయణ కథలనుండియు భా. రా కర్తలు గ్రహించి తమ రామాయణమున చేర్చియుందురని భావింపవచ్చును. ఇతరకాండములకంటె యు. కాం. న అవాల్మీకాంశము లెక్కువగ చోటుచేసుకొనుట గమనింపదగిన విషయము.

సూచికలు :-

1. "వాయుభక్షా నిరాహారా తప్యంతీ భస్మశాయినీ, అదృశ్యా సర్వభూతానా మాశ్రమేఽస్మిన్నివత్స్యసి" - వా. రా. I-48-31
2. అధ్యా. రా. I, 6, 14; ప. పు. vi, 269, 134-135; రం రా; పే 50.
3. రం. రా; పుట. 16.
4. I-167;
5. Ibid.
6. రం. రా; పుట. 19.
7. 1-45.
8. I-725.
9. II-52.
10. రం. రా; 89 పుట.
11. భా. రా. II, 63.
12. II - 292 - 293.
13 ఆనందరామాయణము, సారకాండము VI, 86-90.
14. సీతాంగుష్ఠం మృదుం రక్తం పిదదారావిషాశయా - ఆ. రా. 1-6-67.
15. భా. రా II, 432 - 440.
16. పుట. 369.
17. II, 339.
18. II - 304.

19. వా. రా. **II** 63 - 24.
20. **II** - 64 సర్గ.
21. భా. రా. **III** - 1 - 118 నుండి 132 వఱకు.
22. పుట. 154 - 157.
23. సారకాండము, 7 సర్గ.
24. వీరు పరిష్కరించిన ప్రతి 1864 లో ముద్రితమైనది.
25. భా. రా. (వావిళ్ళ, 1923) పీఠిక, పుట. **XVI.**
26. **III** - 14 - 11.
27. **III** - 1 - 110.
28. వా. రా. **III**, 14, 14.
29. **III**, 1, 110.
30. **III**, 1, 98.
31. **III**, 12, 32 - 34.
32. **IV**, 814 - 822.
33. భా. రా. **IV**, 814 - 822.
34. వా. రా. V, 35, 80 - 81.
35. "క్షిప్తమింద్రేణ తే వజ్రం కోపావిష్టేన ధీమతా
తదా శైలాగ్రశిఖరే వామో హనురభజ్యత" - **IV**, 66, 22-23.
36. భా. రా. **IV** - 809.
37. **IV** - 561.
38. **V**, 493 - 495.
39. పుట. 276.
40. **VI**, 155 - 162.
41. పుట. 301 - 302.
42. "న శృణోతి చ మాం హంతుం ఖడ్గముద్యమ్య చోక్తవాన్
ధిక్త్వాం గచ్ఛేతి మాం హత్వా పదా పాపిభిరావృతః"
**VI**, 8, 11 - 12.

43. భా. రా. VI, 148.
44. భా. రా. VI, 233.
45. రం. రా. 314. పుట.
46. VI, 237 - 240.
47. పుట. 315
48. "జనకసుత లక్ష్మి రాముండు వనజనాభు, డగుట నిక్క_మెఱింగియు నితనిచేత, బవరమునఁ గూలి కై వల్యపదమునొంద, సీతఁ దెచ్చితి"
భా. రా. VI - 900.
49. భా. రా. VI, 1936 - 1938.
50. భా. రా. VI, 1936 - 1938; రం. రా. పుట. 386 - 387.
51. రం. రా. (రాయల్ & కో) పీఠిక, పుట. 25.
52. VI - 609 - 629;
53. VI - 50 సర్గ.
54. అధ్యా. రా. VI.
55. భా. రా. VI - 1269.
56. VI, 1617 - 1723.
57. ఆ. రా. I,11,46 - 60. అధ్యా. రా. VI, 6,36 నుండి VI, 7,33 వరకు.
58. రం. రా. (రాయల్ & కో; 1957) పీఠిక; పేజీలు 17-24; 26-29:
59. 'కృతాంజలిరువాచేదం భరతం వాయునందనః
భో భో రామానుజ శరం సంహరస్వ మహాభుజ'
రం. రా. (రాయల్ & కో) పీఠిక; పుట. 19.
60. నిలిచనతటి యశరీరిణి, పలికెన్ నీ కరయ నాప్తబంధుఁడితనిపై నలుగవలదు కరుణింపుము, బలవదమోఘాస్త్రజాల భరతనృపాలా''
భా. రా. VI-1749.
61. ఆ. రా. VI, 11,57.
62. రం. రా. పీఠిక (రాయల్ & కో) పుట. 23.
63. VI, 1669.

64. మాం విజానీహ్యప్సరసం విద్యున్మాలేతి విశ్రుతామ్. (రం. రా. పీఠిక; రాయల్ & కో-పుట. 28)

65. గచ్ఛంత్యాకాశమార్గేణ స్వర్భానుర్దీప్తిసంగ్రహః
ఋషిర్మయా౽వధూతో హి తేనాహం పతితా భువి''
(రం. రా. (రాయల్ & కో) పీఠిక; పుట. 28)

66. ''పానీయం పాతుమిచ్ఛామి శీఘ్రం సంభాయస్వ మే
యేన తృప్తిం గమిష్యామి తత్కురుష్వ మహాతపాః
.... .... .... .... .... .... .... .... .... .... .... ....
ఇదం మహత్సరో దివ్యం తపసా నిర్మితం మయా
అస్మిన్ పీత్వా తు పానీయం మాసం భవతి న క్షుధా''
(రం. రా. రాయల్ & కో పీఠిక; పే 28.)

67. సారకాండ; 11, 44-60 శ్లో.

68. గచ్ఛాక్షిణీ పిధాయ త్వం జలం పిబ యథాసుఖమ్
(అధ్యా. రా. VI-11-51)

69. భా. రా. VI, 1733 - 1737.

70. రం. రా; పుట. 508.

71. భా. రా. VI, 1738 - 1765.

72. భా. రా. VI, 1829 - 1925.

73. అధ్యా. రా. VI, 11,53-54; ఆ. రా. VI, II, 78.

74. VI, 2172.

75. రం. రా. (రాయల్ & కో) పీఠిక; పుట. 25, 26.

———

# భాస్కర రామాయణము అనుకరణములు

సృష్టియందనుకరణము సహజ ధర్మము. వివిధ విషయములయందు మానవుడనుకరణము లేక ప్రవర్తించుట సాధ్యముకాని పని. వాఙ్మయ విషమునను ఈ యనుకరణము ప్రధాన పాత్ర వహించుచున్నది. కాళిదాసభవభూతులును తమకు పూర్వులగు వ్యాస వాల్మీకులను పలుచోట్ల అనుకరించినవారే. తెలుగున వెలసిన ప్రాచీన సాహిత్యమంతయు సంస్కృత సాహిత్యమున కేదో యొక విధముగా ననుకరణమే కదా! అట్లే నేడు తెలుగున వెలసిన వివిధ వాఙ్మయ ప్రక్రియలకు పాశ్చాత్య భాషలయందలి ప్రక్రియలే మూలమనుట సర్వ విదితము. కావున అనుకరణమనునది సాహిత్యమున తప్పని సరి. ఒకానొక కవి తన కావ్యమున పూర్వ కవులననుసరించి రచన గావించినచో నది యాతనికి వారి యందున్న గౌరవభావమునే సూచించును కాని యది యాతని న్యూనతకు మాత్రము హేతువు కాజాలదు.

రాజశేఖరుడు తన కావ్యమీమాంస యందు అనుకరణమును ప్రతిబింబాకార సంవాదము, అలేఖ్యాకార సంవాదము, దేహాంతర తుల్యసంవాదము అని మూడు విధములుగా విభజించి యివి క్రమముగా హీనము, మధ్యమము, ఉత్తమము అని తెలిపియున్నాడు.

1. ప్రతిబింబాకార సంవాదము :- బింబమెట్లుండునో అద్దమందు ప్రతిబింబమట్లే కనబడును. ఆ విధముగ సృష్టింపబడిన రచన ప్రతిబింబాకార సంవాదమనబడును. అనగా ఒక కవి రచించిన పద్యమును మరొకకవి గ్రహించి దాని నట్లే తన కావ్యమున చేర్చుకొనుట యన్నమాట. ఇట్టి అనుకరణము హీనము.

2. ఆలేఖ్యాకారసంవాదము :- ఒకడు వ్రాసిన చిత్తరువును చూచి వేరొకడు దానివలెనే మరొకపదార్థమును చిత్రించినట్లుగా ఒక కవి వర్ణించినవిషయమును మరొకకవి యనుసరించుచు అదేరీతిలో వేరొకవిషయమును వర్ణించిన అది ఆలేఖ్యాకారసంవాదమనబడును. ఇట్టి యనుకరణము మధ్యమము.

3. దేహాంతరతుల్యసంవాదము :- కరచరణాద్యవయవములచే ఒకని నొకడు పోలియున్నను వారి యాత్మలు, శరీరములును భిన్నములగుటచే వారి పురునొకరే యనుటకు వీలులేదు కదా! అట్లే ఒక కావ్యమునందున్న రచనా సామగ్రియే మరొక కావ్యమునందు సమముగా నున్నను దేని కల్పన దానికి విశిష్టముగా నుండుటచే నవి స్వతంత్ర రచనలనియే చెప్పవలసి యుండును. ఇట్టి యనుకరణము దేహాంతరతుల్యసంవాదము. ఇది ఉత్తమము. కవులకిట్టి యనుకరణము స్వీకార్యమే కాని దోషము కాదు. ధ్వన్యాలోకమునను పై త్రివిధ సంవాదములే పేర్కొనబడినవి.

సంవాదాస్తు భవంత్యేవ బాహుల్యేన సుమేధసామ్
నైకరూపతయా సర్వే తే మంతవ్యా విపశ్చితా
సంవాదో హ్యన్యసాదృశ్యం తత్పునః ప్రతిబింబవత్
ఆలేఖ్యాకారతత్తుల్యదేహివచ్చ శరీరిణామ్
తత్ర పూర్వమనన్యాత్మ తుచ్ఛాత్మ తదనంతరమ్
తృతీయం తు ప్రసిద్ధాత్మ నాన్యసామ్యం త్యజేత్కవిః
ఆత్మనోఽన్యస్య సద్భావే పూర్వస్థిత్యనుయాయ్యపి
వస్తు భాతితరాం తన్వ్యాశ్శశిచ్ఛాయామివాననమ్[2]"

భా. రా. న నన్నెచోడుడు, నన్నయ, తిక్కన మున్నగు తెలుగు కవులయు, బాణుడు మున్నగు సంస్కృత కవులయు అనుకరణములు పలుచోట్ల కలవు. వీనిలో ఎక్కువగ దేహాంతర సంవాదమునకు చెందినట్టివే భా. రా. కర్తలు నన్నయాది పూర్వ కవుల ననుసరించిన రీతిగనే పోతన మున్నగు అనంతర కవులు భా. రా. ను వివిధ సందర్భము లందనుకరించినారు. తొలుత భా. రా. న గల పూర్వకవ్యనుసరణములను పరిశీలింతము.

బాణుడు వర్ణన సందర్భములందు శ్లేషానుప్రాణితమగు నుపమాలంకారమునో, విరోధాభాసాలంకారమునో లేదా పరిసంఖ్యాలంకృతినో విశేషముగ వాడుచుండును. భా.రా. కర్తలలో మల్లికార్జునుడు బాణుని పలుచోట్ల అనుకరించినాడు. చూడుడు.

**కాదంబరి :**

'శరదివ కలహంసధవలాంబరా, జామదగ్న్యపరశుధారేవ వశీకృత సకలరాజమండలా, వింధ్యవనభూమిరివ వేత్రలతావతీ, రాజ్యాధిదేవతేవ విగ్రహిణీ ప్రతీహారీ.' (కథాముఖము)

**భా.రా. :**

సదాశివుని దేహంబునుం బోలె దుర్గావరణ భూషితంబై, గగనతలంబు నుంబోలె నినసుతబుధకవిరాజమిత్రపరివృతంబై, భానుమండలంబునుం బోలె ప్రభాభాసురంబయి, యలకాపురంబునుంబోలె నిధానధనేశాశ్రితంబయి, లంకాపురంబునుం బోలె పుణ్యజనసేవితంబై, మదనతూణీరంబునుం బోలె, నసమాయుధభరితంబై .... వెలయు నప్పట్టణంబున (I, 43)

శ్లేషానుప్రాణితములగు నుపమాలంకారపరంపరలతో కావింపబడిన పై అయోధ్యాపుర వర్ణనమునకు కాదంబరీ గద్యమే మూలమని భావింప వచ్చును.

**కాదంబరి :**

శూద్రకుని వర్ణనము :- 'అపరిమితపరివారజనమప్య ద్వితీయం, అనంత గజతురగసాధనమపి ఖడ్గమాత్రసహాయమ్, ఏకదేశస్థితమపి వ్యాప్తభువన మండలమ్, ఆసనగతమపి ధనుషి నిషణ్ణమ్, ఉత్సాదితాశేషద్విషదింధనమపి జ్వలత్ప్రతాపానలమ్, ఆయతలోచనమపి సూక్ష్మదర్శనమ్ ........ రాజాన మద్రాక్షీత్ (కథాముఖము)

**భా. రా. :**

"రత్నాకరంబయ్యు భంగరహితంబయి, విబుధాప్సరఃసంతానహరి చందననిలయంబయ్యును ధరణీతలవిలసితంబయి, యినకుల పాలితంబయ్యును భీమవిజయ ధర్మరాజసుయోధనయువరాజరావిజితంబయి, పద్మాకరం బయ్యును విషపంకవర్జితంబయి సకలసుగుణాకరంబయి వెలయు నప్పట్ట ణంబున" (I. 43)

బాణుని విరోధాభాసము నొరవడిగా గొనియే మల్లికార్జునుడు పై గద్యమును రచించినాడనుట స్పష్టము.

**కాదంబరి :**

శూద్రకుని రాజ్యమందలి ప్రజల వర్తనమును బాణుడు ఈ క్రిందివిధముగ వర్ణించినాడు.

"యస్మింశ్చ రాజని జితజగతి పరిపాలయతి మహీం, చిత్రకర్మసు వర్ణ సంకరాః, రతేషు కేశగ్రహాః, శాస్త్రేషు చింతా, స్వప్నేషు విప్రలంభాః, ఛత్రేషు కనకదండాః, ధ్వజేషు ప్రకంపాః, గీతేషు రాగవిలసితాని, కరిషు మదవికారాః, చాపేషు గుణచ్ఛేదాః, గవాక్షేషు జాలమార్గాః, శశికృపాణకవచేషు కలంకాః, రతికలహేషు దూతసంప్రేషణాని, శార్యక్షేషు శూన్యగృహాః ప్రజానామాసన్" (కథాముఖము)

**భా. రా.**

"గానవిద్యలయంద మూర్ఛనలు, వల్మీకములయంద ద్విజిహ్వసంచారంబులు, ఆనందంబులయంద బాష్పోద్గమంబులును, ఛత్రచామరములయంద కనకదండంబులు, తరుణులయంద బంధంబులు, అనంగపీడలయంద యధరపానంబులు, నిద్రలయంద యజ్ఞానంబులు కామినీఘనకుచంబులయంద కఠినత్వంబులును" (I, 43)

పై భా. రా. గద్యమునందలి పరిసంఖ్యాలంకారరచనకు కాదంబరీగద్యమే యనుకార్యము.

**నైషధము**

నలుడుద్యానవనమును ప్రవేశింపగా ఆతని అశ్వబలము గావించిన మృషాయుద్ధవర్ణనము.

'ప్రయాతుమస్మాకమియం కియత్పదం
ధరా తదంభోధిరపి స్థలాయతామ్
ఇతీవ వాహైర్నిజవేగదర్పితైః
పయోధిరోధక్షమముద్ధతం రజః (I, 69)

భా. రా :- రావణుని మూలబలముల యుద్ధవర్ణనము.

'ఇంత సేనకుఁ బోరంగ నిమ్ము సాల
దా రణస్థలిఁ గావున వారిరాశి
కిలను గావింపబూనినకరణి నెగసెఁ
జదలు ప్రమింగుచుఁ బెల్లైన సైన్యరజము (vi, 1431)

ప్రసన్నరాఘవము

"అయే! బహుముఖతా నామ బహుప్రలాపితాయాః కారణమ్, విగ్రహస్య తు బహుబాహుత్వైవ" (1వ అంకము)

భా. రా.

"బహుముఖంబులు బహువిధభాషణముల
కరయఁ గారణమనవుడు ననియె నంత
బహుభుజంబులు బహుతరప్రాజ్యసత్వ
మునకుఁగానగవచ్చిన మూలమనుచు" (vi, 2013)

పై ప్ర. రా. నాటకమునందలి భావము నాధారముగగొని అయ్యలార్యుడు రామరావణుల సంభాషణరూపమున నెంతో మనోహరముగ చిత్రించినాడు. ప్ర. రా. నందలిదే యగు 'సౌమిత్రే నను సేవ్యతాం తరుతలమ్" అన్న శ్లోకమునే భాస్కరుడు అర. కాం. న తపసనుడు వేపఁ జొచ్చె నను తమ్ముడ (III,2,264) అను పద్యముగ ననువదించుకొనినట్లుగ భా. రా. పీఠికాకర్తలగు మేడేపల్లివారు వ్రాసినారు.[3] కాని పై పద్యము పెక్కు తా. ప్ర. లలో కానరాదు. అనంతరకవు లెవరో ప్ర. రా. నందలి శ్లోకమును పై పద్యరూపమున ననువదించి ప్రక్షేపించి యుందురు.

వీరేశలింగం పంతులుగారు తమ కవుల చరిత్రమున మాఘుని శిశుపాలవధము నందలి యేడవ సర్గమంతయు ననువదింపబడి భా.రా. యుద్ధకాండమున చేర్పబడి నట్లుగ తెలిపినారు.[4] మాఘమున నేడవ సర్గమున ఉద్యానవిహారము వర్ణ్యాంశము. భా.రా.న యుం.కాం.న నెచ్చటను నీ వనవిహార వర్ణనము కానరాదు. పైవిధముగ

పంతులుగారు వ్రాయుటకు కారణము తెలియదు. అటనట నయ్యలార్యుడు మాఘుని ననుసరించిన పట్టులు లేక పోలేదు. ఒక్క ఉదాహరణము మాత్రము చూపబడు చున్నది.

**మాఘుడు :**

"నవకుంకుమారుణపయోధరయా
స్వకరావసక్త రుచిరాంబరయా
అతిసక్తిమేత్య వరుణస్య దిశా
భృశమన్వరజ్యదతుషాకరః" (శిశుపాలవధం, IX-7)

భా. రా. :

"ఉరుతరకుంకుమారుణపయోధరయై కరసక్తభాసురాం
బరయగు పాశహస్తుదెస భానుఁడు జేర దృఢానురాగసుం
దరయగు తూర్పు దాల్చె నుచితస్థితిలేనిదవోలె, నన్యులన్
మరఁగిన కాంత కాంతులకు మానుగఁ బశ్చిమగణ్యయే కదా !
(VI, 2646)

భా. రా. కర్తలు ప్రాచీన సంస్కృత కవులనే కాక తమకు పూర్వులైన నన్నయాద్యాంధ్ర కవులను గూడ నా యా సందర్భములందనుకరించినారు. కొన్నింటిని మాత్రమిట పేర్కొందును.

నన్నయ భారతము : దమయంతి నలుని వెదకు సందర్భము

సహకార మత్ప్రియ సహకారుఁ బున్నాగ
పున్నాగుఁ దిలక భూవనతిలకుఁ
జందన బుధహరిచందనుఁ బుష్పితా
శోక సుహృజ్జన శోకదమను
వకుళ కులైకదీపకు విభీతక భయ
భీతార్తి హరు నలుఁ బ్రీతితోడ (ఆం.మ.భా. III,2,294)

భాస్కరుడు :

రాముడు సీతను వెదకుచు నామెను కానక విలపించు ఘట్టము

''సహకారతరువ మత్సహచరి నతిముక్త
కంబ యనతిముక్త కాంచనంబ
కాంచనవరవర్ణకర్ణికారంబ యా
కర్ణాంతలోచనఁ గ్రముకతరువ
వరనవక్రముకకంధరఁ దిలకంబ స
త్కులతిలకంబు బంధూకకుజమ
బంధూకకుసుమ విభ్రాజితాధరఁ బీన
సరకుచలికుచంబ చంపకంబ'' (పు. 205)

ఈ పద్యము ము. ప్ర. లో నధోభాగమున పాఠాంతరముగ చూపబడిన పద్యములలోనిది.

తిక్కన :

ఎవ్వాని వాకిట నిభమదపంకంబు
రాజభూషణరజోరాజినడఁగు
నెవ్వాని చారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు........ (విరా. II, 191)

భాస్కరుడు :

పై పద్యమందలి యెత్తుగడ యీ క్రింది భా. రా. పద్యమున కానవచ్చుచున్నది.

''ఎవ్వని పొక్కిట నీరేడు జగములు
పన్నిన విధుఁగన్న పద్మమలరు
నెవ్వని యురమున నిందిర సవతియై
చిరలీల కౌస్తుభశ్రీ మెలంగు
నెవ్వని చేతుల హేతులారఁగ గదా
కరవాలశంఖచక్రములు మెఱయు
నెవ్వని యంఘ్రి మున్మిడి పాపములఁబాపు
గంగ పుట్టిన పుణ్యకథలఁబొల్చు'' (భా.రా. VI, 613)

తిక్కన :

అభిమన్యువధకు దురపిల్లునర్జునుని కరుణరసనిర్భరమగు విలాపము.

"హా యను ధర్మరాజతనయా యను నన్నడఁబాయ నీకు జ
న్నే యనుఁ దల్లి నేపఁజనునే యను కృష్ణుడు వీడు వచ్చె రా
వే యను నొంటిపోక తగవే యను నేగతిఁబోవువాడనే
నో యభిమన్యుడా యనుఁ బ్రియోక్తుల నుత్తరఁదేర్పవే యనున్"
(ద్రోణ, II, 242)

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు తమ ఆం.సా.చ.లో భా.రా. నందలి యీ క్రింది పద్యమును పై తిక్కన పద్యమునకనుకరణముగ చూపియున్నారు.

"హా యను నో నరేంద్ర యను హా రఘుకుంజర నీవు వేగ రా
వే యను నెంతదూరమున కేగితొకో యను నా యెలుంగు విం
టే యను విన్న నీ శరములీ తలలింతకుఁ ద్రుంచివైపకు
న్నే యనుఁ గైక కోర్కి ఫలియించె ఛీ యను దైవమా యనున్"
(III, 2, 112)

ఈ పద్యము పెక్కు తా.ప్ర.లలో కానరాదు. ప్రక్షిప్తము కావచ్చును. యజ్ఞదత్తునికొఱకాతని తండ్రి విలపించు ఘట్టమందలి యీ క్రింది భా.రా. పద్యము పై తిక్కనపద్యమునకు అనుకరణమని చెప్పవచ్చును.

"హా యను నో కుమార యను నక్కట పల్కవదేమి పుత్ర పు
త్రా యనుఁ దల్లి జూడుమను దమ్ముడ తూరగ నాటెనే యమో
ఘాయతసాయకంబను నృపాధముఁ డేటికి నెసెఁ బట్టి పట్టి
యను నీకు నీ గతి ఘటించెఁగదే యను దైవమా యనున్"
(భా.రా. II, 346)

శ్రీరాముడు పర్ణశాలయందు సీతను కానక విలపించు సందర్భమున గల 'హా యను సీత సీత యను నక్కట యెక్కడ పోయితిందు రావే యను' అను భా. రా. పద్యము (III, 2, 78) పై నుదాహృతమైన తిక్కనపద్యమును పోలియున్నది. కాని యిదియు పెక్కు తా.ప్ర.లలో కానరాదు.

తిక్కన :

ద్రౌపది కౌరవులవలన పొందిన యవమానమునుగూర్చి శ్రీకృష్ణునితో చెప్పుకొని విలపించుసమయమున తన యాభిజాత్యాదులను వివరించు సందర్భము.

"వరమునఁబుట్టితిన్ భరతవంశముఁజొచ్చితి నందు పాండు భూ
వరునకుఁ గోడలైతి జనవంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థిరులగు పుత్రులంబడసితిన్ సహజన్ములఁబ్రాపు గాంచితిన్
సరసిజనాభ యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాననెంతయున్"

(ఉద్యోగ. III)

అయ్యలార్యుడు :

శ్రీరామునిచే ప్రత్యాఖ్యాతయైన సీతాదేవి దీనముగ నాతనితో మొర పెట్టుకొను సందర్భము.

"అనయము ధాత్రికిందనయనై యెలమిన్ మిథిలేశుఁడైన య
జ్జనకుఁడు పెంపగాఁ బెరిగి సమ్మదమందగ నీకుఁబత్నినై
యినకులుడైన యా దశరథేశ్వరు కోడలినైన నాకు ని
ట్లనుచితపాపకృత్యములయందుల వేడ్కలు గల్గనేర్చునే"

(భా. రా. VI, 2359)

తిక్కన :

కరికళేబరములు ధరణీధరమ్ములు
తురగగాత్రమ్ములు గ్రాహసమితి
నరశరీరములు మీనములు కౌక్షేయక
క్షురికాది శస్త్రంబు లురగకులము
రుధిరార్ద్రశిరములు రుచిరప్రవాళముల్
ప్రేవుల ప్రోవులు ఫేనతతులు
నెత్తురు వెల్లువ నీళులు భూషణ
స్తోమాస్థిచయముల తుమరులిసుక
కాఁగ నంబురాశికరణి సంగ్రామభూభాగమొప్పు" (ద్రోణ II, 128)

పైరీతిగ సంగ్రామభూమిని సముద్రముగను, అందలి కళేబరాదులను సముద్రమందలి వివిధపదార్థములుగను రూపించుట తిక్కన భారతమున పలుచోట్ల కాననగును. ఇట్టి వర్ణనమే క్రింది భా. రా. పద్యమునను కానవచ్చుచున్నది.

**అయ్యలార్యుడు :**

రథయానపాత్రంబుఁ బృథుచక్రకమఠంబు
శవమకరంబును శయభుజంగ
మురుతర చామరోత్కర ఫేనవితతి తు
రంగతరంగంబు రాజదస్త్ర
బడబాగ్నిదుర్గంబు బహురత్నసహితంబు
నగుచు నబ్ధివోలె............ (భా. రా. VI, 1974)

**తిక్కన :**

నిర్వ.రా. నందలి అష్టమాశ్వాసాంత పద్యములు.

"పుణ్యుఁడు భారతీవిభవపూత వికాసముఖారవిందలా
వణ్యుఁడు తీవ్రకోపదవవహ్ని నిరర్గళదగ్ధశాత్రవా
రణ్యుఁడు మానినీహృదయరంజన నైపుణరూఢరూప తా
రుణ్యుఁడు భీతివిహ్వలవిరోధి శరణ్యవరేణ్యుఁడున్నతిన్" (137 ప.)

"వితరణఖని యుద్యద్వీర శృంగారలక్ష్మీ
పతి, రతివరలీలాభంగకృత్సంగతాంగుం
డతులితమతివిస్తారాప్తదేవేజ్యుఁ డిజ్యా
ప్రతిదినపరితృప్తి ప్రాప్త సప్తార్చిధాత్రిన్ (139 ప.)

**భాస్కరుడు :**

అర.కాం. ప్రథమాశ్వాసాంతపద్యములు.

"పుణ్యుండూర్జిత శౌర్యధైర్యమహిమస్ఫూర్తిస్ఫురద్వైభవా
గణ్యుండార్య జనానురంజితమహాకారుణ్యుఁడున్ శ్లాఘ్యసా
గుణ్యుండన్వయవార్ధి చంద్రుఁడు రిపుక్షోణీశ్వరస్థాపితా
రణ్యుండార్తశరణ్యుఁడుజ్జ్వలయశోరమ్యుండు సౌమ్యుండిలన్"

"వితరణఖని యుద్యోద్వర్యశౌర్యప్రభావో
న్నతుఁడు భుజబలాత్యున్మాదవిద్విడ్ధరిత్రీ
పతిహరణసమిద్భాగరమ్యుండు సంభా
వితపరిణతచిత్తోర్వీసురుండుర్వి నెందున్" (293, 294, ప.)

**తిక్కన :**

అంధకారబంధురమైన నర్తనశాలవర్ణనము.

"....... ........ వివేకరహితు హృదయంబునుంబోలెఁ దమోదూషితంబును, విదగ్ధవనితాప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును, ఘోరాటవీభాగంబునుంబోలె నిర్మానుష్యంబును, కాపురుషలక్ష్మీవిలాసంబునుంబోలె ననుపయోగ్యంబును, అనభ్యస్తశాస్త్రంబునుంబోలె దుర్గమంబును, విషమకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబును. (IV-2-325)

**అయ్యలార్యుడు :**

అంత వివేకశూన్యుండగు రాజు చిత్తంబునుంబోలె సమీకృత నీచా నీచపదంబై .... కుకావ్యంబునుంబోలె ననభివ్యంజిత పదార్థంబై, వధూ చేష్టితంబునుంబోలె ననిశ్చిత తత్త్వంబై, శబ్దా వభోధ రహితకృత వాక్య బంధంబునుంబోలె సాశంకీకృతపదవిన్యాసంబై సూచిభేద్యంబగు నంధతమసంబు ........ భువనంబు బొదువు నవసరంబున. (యు. కాం.)

అయ్యలార్యుడు గావించిన పై తమోవర్ణనము తిక్కన వర్ణనమువలె శ్లిష్టోపమాలంకారరూపమున నుండుటయేకాక అందలి కొన్ని ఉపమానములు యథాతథముగ నిందు కనబడుచున్నవనుట స్పష్టమే కదా!

**నన్నెచోడుడు :**

చంద్రోదయ వర్ణనము.

'రంజిల్లు పూర్వదిక్సతికటిమణికాంచి
రంజిల్లు నాయకరత్నమొక్కొ
విలసిల్లు నద్దేవివృత్తస్తనాంతరా
పూరితకాశ్మీరపుంజమొక్కొ
తనరారు నా హరిత్తరళాక్షిపరిపక్వ
బింబారుణాధరబింబమొక్కొ
మేలిల్లు నబ్బాల ఫాలతటంబున
విలసిల్లు రోచనతిలకమొక్కొ (కు. సం)

అయ్యలార్యుడు :

''నెలకొన నమృతంబు నిండారఁబోసిన
కొమరారు రాజతకుంభమనఁగఁ
జిరకాలసంభృతవిరహపాండురమైన
వరయామినీవధూవదనమనఁగ
పాలసముద్రంబుఁ బాసివచ్చిన సుధా
గురుతరసారంపు గుప్ప యనఁగ
వలరాజు శృంగారమలవడ వీక్షింప
నమరింపఁదగు నిల్వుటద్దమనఁగ
చంద్రుండు నభమునఁబొగడ నెగడె'' (భా. రా. VI, 2660)

నన్నెచోడుడు :

"ఏసియు వైచియుఁ బొడిచియు
వేసరకొండొరులఁ బట్టి విడువక కేశా
కేశిఁ బెనగుచుఁ బోర మ
హాసురముగఁ బోరి రా సురవీరుల్" (కు.సం. 12-168)

భాస్కరుడు :

"ఏసియు వైచియుఁ బొడిచియు
వేసియు నిరుదెసలవారు వెస నని లీలం
జేసిరి విజయము గైకొను
నాసాసల సిద్ధచారణాదులు వొగడన్" (భా.రా. VI-523)

నన్నెచోడుడు :

జితదేవాధీశదర్పోర్జిత బలుఁడు.... .... .... .... .... ....
.... .... .... ....వడింగూలె నుగ్రాజిలోనన్.... .... ....
శతధారాపాత పక్ష క్షతవిపులక్ష్మాధరాపాత భాతిన్''

(కు.సం. 12-190)

**భాస్కరుడు :**

సంభూత క్రోధఘోరజ్వలనపరిగతస్వాంతులై
.... .... .... .... .... .... .... .... .... .... .... ....
.... ఖడ్గోద్యత రుచులెసగన్ దాటిరవ్వైరి గూలెన్
శుంభద్దంభోళిధారాచ్యుత విపులగురుక్షోణిభృత్పాతభాతిన్ (III, 1,32)

**ఎఱ్ఱన :**

"శ్రీరాముడు మాయామృగము ననుసరించిన ఘట్టము
అసదృశకార్ముకధరుఁడై
మసలక యా మృగమువెనుక మర్దితరిపు డే
పెసగంగ నరుగఁ దొడగెను
వెస రుద్రుఁడు యజ్ఞమృగము వెనుకొనుమాడ్కిన్ (అర. VI. 325)

**భాస్కరుడు :**

.... .... .... .... ....
మడుగులకు నల్ల దార్చుచు నడుసు గలుగు
కొలది బట్టంగ నగునని వెలిచి వెలిచి
యల మృగము వెంటనొయ్య నాసాసఁ దిరిగె
నా మృగవ్యాధరుద్రుఁడో యనఁగ విభుఁడు. (III, 2, 51)

**పాల్కురికి సోమన :**

స్వీకృతభక్తలోక యవశీకృతకర్కశవావదూక యూ
రీకృతసద్వివేక యురరీకృతజంగమభక్తిపాక దూ
రీకృతదుష్టపాక యధరీకృతవేదవిరుద్ధబౌద్ధ చా
ర్వాక శరణ్యమయ్య బసవా! బసవా! బసవా! వృషాధిపా.
(వృ. శ. 24 ప.)

**అయ్యలార్యుడు :**

స్వీకృత పుణ్యశీలుఁడు వశీకృతసర్వనిలింపనాథుఁడూ
రీకృత ధర్మమార్గుఁడురరీకృతనీతివిశారదుండు దూ
రీకృతదుష్టచేష్టుడు నరీకృతదానవవల్లభుండు మో
క్షీకృతవీరవైరి సుముఖీకృతధీవరుఁడు రాఘవుండిలన్ (VI 2682)

భా. రా. న రం. రా. అనుకరణములు పెక్కులున్నవి. అవి విడిగా నొక ప్రకరణమున చూపబడినవి. ఇక భా. రా. కర్తలను తదనంతర కవు లెట్లనుసరించిరో పరిశీలింతము. పోతన, గోపరాజు, రామభద్రుడు, మొల్ల మున్నగు కవుల రచనములలో భా. రా. అనుకరణములు కానవచ్చుచున్నవి. పోతన యంత్యానుప్రాసప్రయోగములకు భా. రా.మే మార్గదర్శకమని శ్రీ రావూరి దొరసామిశర్మగారు అభిప్రాయపడినారు.[5] ఆయాకావ్యములందు కానవచ్చు భా.రా. అనుకరణములు దిగువ ఉదాహరింపబడుచున్నవి.

**భా. రా.**

తాటకావర్ణనము
''పాటితదుష్టసత్త్వవనవాటక సిద్ధబలావరుద్ధశృం
గాటక గ్రంథిలభ్రుకుటిగాఢలలాటక యుగ్రరూరతారకా
నాటక నాంత్రకాంచిపరిణద్ధశవప్రపతత్త్రిక్రమిచ్ఛటా
కీటకరక్తసిక్తపటుఖేటక దాటకఁ గాంచిరయ్యెడన్" (I, 261)

**పోతనభాగవతము :**

"సవరక్షార్థము తండ్రి పంపఁజని విశ్వామిత్రుడుందోడ రా
నవలీలందునుమాడె రాముఁడదయుండై బాలుఁడై కుంతల
చ్ఛవి సంపజ్జితహాటకన్ కపటభాషావిస్ఫురన్నాటకన్
జవభిన్నార్యమఘోటకన్ గరవిరాజత్ఖేటకందాటకన్'' (IX, 259)

**భా. రా.**

సరసిజసౌందర్యసదనంబు వదనంబు
చారుసుధారసస్రావి మోవి
పరిభూతబిసపద్మభాతులు చేతులు
కదళికాయుగళంబు గడలు దొడలు
ముహురుదంచితకాంతిముచములు కుచములు
భూరిసువర్ణవిస్ఫూర్తి మూర్తి
చతురవిలోకనాసాధ్యంబు మధ్యంబు
తీపారు కందర్పుతూపు చూపు

లోలభావసూచనములు లోచనములు
ధర్మవతి మతి యభిమానధనము మనము (V, 153)

భాగవతము

పల్లవవైభవాస్పదములు పదములు
కనకరంభాతిరస్కారు లూరు
లరుణప్రభామనోహరములు కరములు
కంబుసౌందర్యమంగళము గళము
మహితభావాభావమధ్యంబు మధ్యంబు
చక్షురుత్సవదాయి చన్నుదోయి
పరిహసితార్ధేందుపటలంబు నిటలంబు
జితమత్తమధుకరశ్రేణిశ్రేణి
భావజాశుగముల ప్రాపులు చూపులు
కుసుమశరుని వింటికొమలు బొమలు
చిత్తతోషణములు చెలువభాషణములు
జలజనయనముఖము చంద్రసఖము (X-1711)

భా. రా.

'పుణ్యచరిత్రు నత్రిమునిపుంగవు వీడ్కొని రాముఁడంచితా
గణ్యగుణాభిరాముఁ డుపకంఠమునంజని కాంచె దండకా
రణ్యము సిద్ధసంయమివిరాజితచారుతపోనుజాత స
త్పుణ్యము నిర్మలాంబువరపుష్కరపూర్ణ సరోవరేణ్యమున్ (III, 1, 2)

భాగవతము :

'పుణ్యుఁడు రామచంద్రుఁడటు పోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యము తాపసోత్తమశరణ్యము నుద్ధతబర్హిబర్హలా
వణ్యము గౌతమీవిమలవాఃకణపర్యటనప్రభూతసా
ద్గుణ్యము నుల్లసత్తరునికుంజవరేణ్యము నగ్రగణ్యమున్' (IX, 267)

పై భాగవత పద్యములందలి శబ్దాలంకారరచన భా. రా. పద్యరచనతో సంవదించుచున్నదనుటలో సందేహము లేదు.

భా. రా.

మందారభూజంబు మరగిన భృంగికి
పిచుమందశాఖిపై ప్రేమ గలదె
లలి మానసంబున మెలగెడు హంసికి
వెలయు పల్వలములపై వేడ్క గలదె
మలయద్రుమంబున మలయు భుజంగికి
బర్బూరతరువుపై వలపు గలదె
భాస్కరోదయంబున భాసిల్లు పద్మిని
కిందుకరస్పృష్టి నెలమి కలదె (VI, 2415)

భాగవతము :

మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁదేలు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికాస్ఫురిత చకోరక
మరుగునే సాంద్రనీహారములకు (VIII-150)

పై భాగవతపద్యము రచనయందేకాక భావమునందును, వృత్తము నందును భా.రా.పద్యమును పోలియున్నది. పై పద్యభావమునకు

'క్షీరాబ్ధిలోపలఁ గ్రీడించు హంస
గోరునే పడియల నీరు ద్రావంగ'

అను పాల్కురికి సోమన ద్విపదలు మూలములనదగినను ఎత్తుగడయందును, వృత్తమునందును భాగవతపద్యము భా.రా.పద్యముతోనే అధికముగ సంవదించుచున్నదనుట యుక్తము.

భా.రా.

చంద్రోదయవర్ణనము.

"కలువలవిందు జక్కవలగాలము తమ్ములకెల్ల వైరి చు
క్కల చెలికాడు చోరతతి కన్నుల నొప్పి తమంబుగొంగ జా
రుల పెనుగాలి సంకలియ రుద్రుని పువ్వు సుధాహ్రదంబు వె
న్నెల యను తీగదుంప రజనీకరుఁడొప్పె సురేంద్రుదిక్కునన్"

(VI, 2658)

సింహాసనద్వాత్రింశిక :

'కలువలవిందు జక్కవలకందువ వెన్నెల తీవదుంప ము
చ్చుల మెడకోఁత మంగజుని చూపరి చూపుల యింపు జారకాం
తల వెఱగొంగ రాత్రికులదైవము చల్లనిరాజు పంకజం
బుల మకుగొయ్య యచ్యుతుని ముద్దుమఱంది వెలింగె నయ్యెడన్'

పై రెండు పద్యముల యెత్తుగడయు, కొంతవరకు భావమును ఒక్కటే. వృత్తము గూడ నొక్కటే. గోపరాజు అయ్యలార్యుని పై పద్యము నొరవడిగా గొని సూర్యోదయవర్ణనమును గూడ నదే రీతిలో గావించినాడు.

'కలువలవైరి జక్కవలగావఁగఁ బూనిన దాత ముజ్జగం
బులకును సాక్షి యంబరవిభూషణ మా నెలతాల్పు వేల్పుకు
న్వలపలి కన్ను ముక్తి తలవాకిలి చీకటి వీడుకోలు నా
వెలుఁగుల ఱేడు తామరలవిందు వెలుంగుచునుండె నయ్యెడన్'

(సిం. ద్వా. I, V, 89)

ఘటికాచలమాహాత్మ్యము :

'కలువల గోము జక్కవలగాము వియోగుల బాము నల్లవే
ల్పులదరయొజ్జసాని నెఱమోహపు దీము విభావరీ సతీ
తిలకము మోము తుంటవిలుదేవుని యాము గులాము ర
చ్చల తెలిగీము కుందరుచిసాంద్రుఁడు చంద్రుఁడు దోచెఁదూర్పునన్'

(II, 147)

**రామాభ్యుదయము :**

కుముదవనంబుకోరికి చకోరికపండుగ భోగిభాగధే
యము ననవిల్తుకాక కడియాలము చీకటిముట్టుకొల్పు పు
న్నమకొకవన్నె చేకుఱ నొనర్చిన యొప్పులకుప్ప యామినీ
రమణుఁడు దోచె నొయ్యనఁ గరంబులు సాచి దిశాముఖంబునన్

(VI, 124)

**భా. రా.**

సాంధ్యశోణిమవర్ణనము

"తరువులయందుఁ బల్లవపదస్థితి నద్రులయందు ధాతుబం
ధురగతి నఁగనాజనపృథుస్తనమండలిఁ గుంకుమంబునై
పరగుచు సాంధ్యశోణిమవిభాసురమై జలనాథదిక్తట
ద్విరదము కుంభసంభవనవీనగళద్రుధిరంబు నాఁదగన్" (VI, 2648)

**సింహాసనద్వాత్రింశిక :**

'గిరిశృంగంబుల గైరికాకృతిని శాఖిశ్రేణిపై పల్లవో
త్కరలీలంగరిరాజకుంభములమీదన్ రక్తచూర్ణాకృతిన్
శరధిద్వీపములంబ్రవాళరుచి గాసారంబులన్ శోణపు
ష్కరకాంతిం దరుణాతపంబడరె దిక్కాంతాంగకాశ్మీరమై (I, 5,88)

మడికి సింగన పద్మపురాణములో రామకథావర్ణన ఘట్టమున ఋశ్యమూక పర్వతవర్ణనము ఈ క్రింది విధముగ గలదు.

"రాకొమరుల్ గనుంగొనిరి రత్నగుహారమమాణ దివ్య నా
రీకము పుష్పరేణుక పరిష్కృత కుంజలసన్మృగేశ్వరా
నీకము శృంగసంగళిత నిర్ఝరలోకము ఖర్మగండక
స్తోకము సానుజాలపరిశోభినదీకము ఋశ్యమూకమున్"

(VIII - 184)

పై పద్యమునకు అనుకార్యమనదగు నీ క్రింది పద్యము భా.రా న కలదు.

'రాకొమరుల్ గనుంగొనిరి రమ్యగుహాగతకిన్నరీకమున్
స్వీకృతనాకసింధుజలసేకము సంకులదంతిదంత భి
దీకరపుండరీకమును దీపితసంయమివేదనాదజ
ల్పాకము సిద్ధసేవితతపఃపరిపాకము ఋశ్యమూకమున్'

(III, 2,436)

ముద్రిత భా.రా. ప్రతులలో నీ పద్యము కన్పట్టుచున్నను తా.ప్ర.లలో మాత్రము కానరాదు.

భా. రా.

'సరసిజకువలయ పరికర
పరిమళపరిమిళితశిశిరపావనరంగ-
త్తరళతరంగాంబుకణో
త్కరధరమలయానిలంబు తనపైం బొలయన్' (III, 2,426)

మనుచరిత్ర :

మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువ పొలుపు దెలుపు మారుత మొలసెన్ (II, 24)

భా. రా.

మాయా తపస్వియగు కాలనేమి యాశ్రమవర్ణనము

'వల్లరీ వలమానఝల్లరీఝుంకార
వల్లకీ కలనాద వేల్లితంబు
వరకుహూకంఠీరవస్ఫార కంఠీర
వత్రస్తపథికేభవలయితంబు
శుకశారికారబ్ధ సురుచిరశ్రుతితర్క
మూలవచో యుక్తిముఖరితంబు
శింజానమంజీరమంజుగుంజితహంస
సారసోత్సుక సారసారసంబు'

వసుచరిత్ర :

లలనాజనాపాంగ వలనావసదనంగ
తులనాభికాభంగదోః ప్రసంగ
మలసానిలవిలోల దళసా సవరసాల
ఫలసాదర శుకాలపనవిశాల
మలినీగరుదనీకమలినీకృతధునీ
కమలినీసుఖిల కోకకులవధూక
మతికాంతసలతాంతలతికాంతర నితాంత
రతికాంతరణతాంత సుతనుకాంత (I,124)

శబ్దచమత్కృతియందును, పద్యరచనరీతియందును పై రెండు పద్యములకు సంవాదము గలదనుట స్పష్టము.

భా. రా

శ్రీరాముని జయించుట రావణునకు దుస్సాధ్యమని మహోదయుడు తెలుపు సందర్భము.

"హరి గిరి వహ్ని గిహ్ని మఱి యంతకు గింతకు దైత్యు గీత్యు వా
ర్వరు గిరు గాడ్పు గీడ్పు ధనవల్లభు గిల్లభు రుద్రు గిద్రు సం
గరమున నోర్చినట్లు దశకంధర నీకు జయింపవచ్చునే
సురనగధీరు నుగ్రరణశూరుఁ బయోధిగభీరు రాఘవున్" (Vi. 907)

మొల్ల రామాయణము :

హరి గిరి వహ్ని గిహ్ని ప్రళయాంతకు గింతకు దైత్యు గీత్యు వా
ర్వరు గిరు గాడ్పు గీడ్పు ధనవల్లభు గిల్లభు రుద్రు గిద్రు సం
గరమున నోర్చినట్టి దశకంధర నీకు జయింపవచ్చునే
సురనగధీరు నుగ్రరణశూరుఁ బయోధిగభీరు రాఘవున్ (VI 3,77)

మొల్ల భా.రా. పద్యమును ఏమాత్రము మార్చక యథాతథముగా తన రామాయణమున చేర్చుకొన్నది. ఇది రాజశేఖరుడు చెప్పిన ప్రతిబింబాకార సంవా

దమున కుదాహరణము. భా.రా. పద్యము నీరీతిగ మొల్ల ఉన్నదున్నట్లుగ తన రామాయణమున చేర్చుకొన్నను ఈమె పూర్వ కవి స్తుతిలో మాత్రమెందుకో భాస్కరుని పేర్కొనలేదు.

భా. రా.

వర్షర్తువర్ణనము.

"యమునద్గంగము కృష్ణభూమదిలమబ్జాక్షన్మనుష్యంబు నీ
లమహీధ్రన్నిఖిలాచలావళి తమాలద్భూజ మిందీవర
త్కుముదశ్రేణి పికద్విహంగము తమస్స్వోమద్గ్రిహార్క ప్రభా
సముదాయంబగుచుండె లోక మలఘుశ్యామాభ్రముల్ బర్విన"

(IV, 384)

మొల్ల రామాయణము :

శరత్తు వర్ణనము.

"నారదులైరి సన్మునులు, నాకమహీజములయ్యె భూజముల్
శారదలైరి భామినులు, శంకరశైలములయ్యె గోత్రముల్
పారదమయ్యె నీరధులు, పన్నగనాయకులయ్యె నాగముల్
వారిదవర్గమెల్ల సితవర్ణములయ్యెను బండువెన్నెలన్" (II, 15)

భా.రా. నందలి శబ్ద ప్రయోగ ప్రౌఢి మొల్ల రచనమున గన్పట్టకున్నను మొల్ల పద్యమునకు మల్లికార్జునుని పద్యమే ఒరవడి యనవచ్చును. వర్ణ్యాంశము రెండింట భిన్నమేయైనను వర్ణనరీతి మాత్రము సమమే.

భా. రా.

లంకాపురవర్ణనము.

"ప్రాకారంబు లగడ్తలట్టడులు యంత్రవ్రాతముల్ వప్రముల్
వాకిళ్లాయుధ సంపదల్ గజము లశ్వంబుల్ రథంబుల్ భటా
నీకంబుల్ బహుకేతనాదులు మదిన్ నిర్మించినట్లుండు భూ
నాకంబప్పుర మే కొలంతయును గానంబట్టఁ దేపట్టునన్ (VI, 15)

పై పద్యమునకు అనుకరణమనదగు నీ క్రింది పద్య మొక్కటి ప్ర.మ.భూ. న కనబడుచున్నది.[6]

"కోట లగడ్త లట్టడులు కొత్తడముల్ గవకుల్ కవాటముల్
హాటకగేహముల్ వివిధయంత్రము లాయుధవర్మశంఖముల్
ఘోటకముల్ రథావళులు కుంజరముల్ బహువాహినీ పతుల్
సాటువ కెక్కు వీరభటసంకులముందగు నప్పురంబునన్"

ఈ పద్యము ఏ గ్రంథమందలిదో తెలియదు.

**సూచికలు :-**

1. కావ్యమీమాంస. 11-13 అధ్యాయము.
2. ధ్వన్యాలోకము IV, 11-14.
3. భా. రా. పీఠిక (మేడేపల్లి వేంకటరమణాచార్యులు) పుట 36.
4. ఆం. క. చ. 1. భా. 313 పుట.
5. తెలుగు సాహిత్యము - రామకథ 47 పుట.
6. ప్రబంధమణిభూషణము 9 పుట.

# భాస్కరరంగనాథ రామాయణములు
# తులనాత్మక పరిశీలనము

తెలుగున వెలసిన రామాయణములలో రంగనాథ, భాస్కరరామాయణములు మిక్కిలి ప్రసిద్ధి గాంచినవి. వీనిలో నొకటి దేశిరచనలో మూర్ధన్యము కాగా మరొకటి మార్గరచనలో తలమానికమైనది. రెండును అనేక కర్తృకములే. తెలుగున తొలుత వెలసిన భారత, భాగవతరామాయణములు మూడును బహుకర్తృకములగుట యొక విశిష్టఘటనగా చెప్పవచ్చును. సుమారు ఏకకాలముననే రంగనాథ, భాస్కరరామాయణములు రచింపబడినను రం. రా. భాస్కరరామాయణమున కించుక పూర్వమే రచితమై యుండునని విమర్శకుల యభిప్రాయము. తెలుగున వెలసిన మొదటి రామాయణము రం. రా. మే యని ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు రం. రా. పీఠికలో నిరూపించి యున్నారు.[1] భా. రా. నకించుక పూర్వము రచింపబడుటచేతను, దేశీయచ్ఛందస్సులో రచితమై మిక్కిలి ప్రచారమును పొందియుండుటచేతను భా. రా. కర్తలు తమ రామాయణ రచనసందర్భమున రం.రా. ను తప్పక చూచియుందురనియు, తత్ప్రభావము వీరిపై కలదనియు నిస్సంశయముగ చెప్పవచ్చును.[2] ఆచార్య లక్ష్మీకాంతముగారు తమ రం. రా. పీఠికలో భా. రా. న రం. రా. అనుకరణలు గలవని చెప్పుటయేకాక తమ 'ఆంధ్ర సాహిత్యచరిత్ర'లో రెండుమూడుదాహరణములను గూడ చూపియున్నారు.[3]

భా. రా. కర్తలు ప్రధానములగు కథాంశములనే కాక భావములను, అలంకారములను, పదబంధములను యథాతథముగ రం. రా. నుండి యనుకరించిరనుట కనేక నిదర్శనములు కలవు. ప్రధానములగు కథాంశములను రం. రా. నుండి కాక మరే యితర గ్రంథములనుండియో అనుకరించిరని సమర్థించుటకు వీలున్నను సమానసందర్భములందు పద భావాలంకారాది ప్రయోగవిషయమున కొట్టవచ్చినట్లుగ భా. రా. న సాదృశ్యము కనబడుటచే భా. రా. కర్తలు రం. రా. ను తప్పక అనుసరించిరనియే చెప్పవచ్చును. ఈ రెండు రామాయణములకు

గల భేదసాదృశ్యములను పరిశీలించుటయే యీ ప్రకరణమందలి ప్రధానాంశము. మొదట పద, భావాలంకారములకు సంబంధించిన అనుకరణములను పరిశీలితము.

**బాలకాండము :**

i) రోమపాదుడు తన దేశమున నేర్పడిన యనావృష్టిని తొలగించుటకై యుపాయముగ ఋశ్యశృంగుని తన నగరమునకు తీసుకొనివచ్చుటకై యతని యొద్దకు వేశ్యలను పంపగా వారాతనిని రోమపాదుని నగరమునకు తీసుకొనివచ్చిన ఘట్టము.

రం. రా.

'ఒనరెడు దీమంబు లొక వింత మృగము
గొనివచ్చు తెఱఁగునఁ గొనివచ్చిరతని' (పుట. 13)

భా. రా.

తెచ్చిరి దీమముల్ మృగము దెచ్చినకైవడి ముగ్ధసంయమిన్ (I,94)

ii) దేవతలు రావణుని యౌద్ధత్యమును గూర్చి బ్రహ్మతో మొరపెట్టుకొన్న సందర్భము.

రం. రా.

'వాఁడన్న కులగిరుల్ వడవడవడకు
వేఁడిమి చూపంగ వెఱచు భాస్కరుఁడు
వీఁకతో నతఁడన్న వీట నెన్నడును
తేకువ చెడి గాలి తిరుగంగ వెఱచు
అన్నిశాచరుగన్న నాటోప మెసఁగ
మున్నీరు కడలెత్తి మ్రోయంగ వెఱచు'' (పే. 16)

భా. రా.

'కడలెత్తి మ్రోయ వెఱచును
జడనిధు లినుఁడెండఁగాయ శంకిలు వానిం
బొడఁగనునెడ వాయువు లుర
వడి వీవక యడఁగు గిరులు వడవడ వడఁకున్ (I, 137)

iii) వసిష్ఠుడు తనకు సురభి నీయనందులకు విశ్వామిత్రుడు కోపించి యాతనిపై వారుణాదివివిధాస్త్రములను ప్రయోగించును. వసిష్ఠుడతనిని బ్రహ్మదండముతో చెక్కాడగా విశ్వామిత్రుడు బ్రహ్మాస్త్రము సంధించిన ఘట్టము.

రం. రా.

సకలగీర్వాణులు సకలసంయములు
సకలగంధర్వులు సకలపన్నగములు
సకలభూతంబులు సకలదిక్పతులు
సకలతారాగ్రహ చంద్రసూర్యులును
సకలలోకంబులు చలనంబునొంది (పు. 55)

భా. రా.

సకలామరగంధర్వులు
సకలోరగసకలభూత సకలదిశాపా
లకసకలగ్రహతారక
సకలభువనసకలమునులుఁ జలనముఁ బొందన్ (I-588)

iv) జనకుడు నిర్వర్తించు యజ్ఞమును వర్ణించు ఘట్టము

రం. రా.

'కాళింగనేపాళ కర్ణాటలాట
మాళవసౌవీర మగధపాంచాల
కురుపాండ్యబర్బర కుంతలావంతి
మరుతురుష్కాభీర మనుజవల్లభుల
ఘనతరయాగోపకరణ భారముల
.... .... .... .... .... .... .... ....
భూరిదధిక్షీర పూర్ణకుంభముల
ఆదరి ఘోషించు సామాదివేదముల
నుడుగక చనుదెంచుచున్న తాపసుల

నుడువీథి నుప్పొంగు హోమధూమముల
.... ....... ....   .... .... .... .... ....
అరుదైన జనకుని యజ్ఞవాటంబు
కరమర్థిఁజొచ్చె నగ్గాధినందనుఁడు'' (పే. 51)

భా.రా.

''మాళవనేపాళమగధాంధ్రపాంచాల
భోజకాంభోజాది భూమిపతుల
కరిరథాశ్వశ్రేణి ఘనసమిత్కరముల
జీమూతసమహోమధూమతతుల
దర్భాసనంబులఁ దగినపీఠంబులఁ
బంక్తులై కూర్చున్న పరమమునుల
సరసస్వరోదార సామఘోషంబుల
సురుచిరయాగోపకరణతతుల

భూరిదధిఘృతక్షీరసంపూర్ణకుంభ
కనకమయవేదికాసముత్కరముల మఱి
పశుసమంచితయూపాళిఁ బరగు జనకు
యజ్ఞవాటము సొత్తెర నప్పుడెఱిగి'' (I, 535)

ఈ సందర్భమున వాల్మీకమున వివిధదేశాధీశుల ప్రసక్తికాని, యజ్ఞభూమివర్ణనకాని కనబడదు.

vi) విశ్వామిత్రుడు తనకు కామధేనువునిమ్మని వసిష్ఠుని ప్రార్థించు ఘట్టము.

రం. రా.

'లక్ష గుఱ్ఱంబులు లక్ష ధేనువులు
లక్ష యేనుఁగులు వేలక్షలు మణులు
నిచ్చెద నీ ధేనువిమ్ము నాకనిన'' (పు. 53)

భా. రా.

"లక్ష తురగంబులను మఱి
లక్ష మదేభముల వేయిలక్షల మణులన్
లక్షల గోవుల నిచ్చెద
దక్షత నాకిమ్ము నీవు తగ నీ గోవున్" (I, 557)

మూలమునందలి "గణం శతసహస్రేణ దీయతాం శబలా మమ" (I. 53,9) అను శ్లోకమున విశ్వామిత్రుడు తనకు కామధేనువునిచ్చినచో లక్ష గోవుల నిత్తునని మాత్రమే చెప్పినట్లుగ నున్నది. తురగములు, మదేభములు, మణులు - వీని ప్రసక్తి మూలమున కానరాదు. భా. రా. నందలి పై పద్యము నకు రం. రా. ద్విపదలే మూలము. గుఱ్ఱములను తురగములుగను, ఏనుగులను మదేభములుగను సంస్కృతీకరించుటయే భా. రా. పద్యమున కనబడు మార్పు.

vii) సూర్యాస్తమయవర్ణనఘట్టము.

రం. రా.

"కడకమై విఱిచి రాఘవుఁడేపు మెఱసి
కడుమోదమున సీతఁగైకొను నెల్లి
నని రసాతలమునకంతయుఁ జెప్పఁ
జనినచందమున భాస్కరుఁడస్తమించె" (పు. 62)

భా. రా.

"నా కులజుఁడైన రాముఁడు
శ్రీకంఠుని విల్లు విఱిచి సీతం బ్రీతిం
గైకొను రేపని చెప్పఁగ
నాకమునరుగువిధమునన్ రవి గ్రుంకెన్" (I, 683)

సూర్యాస్తమయమును ప్రకృత కథావస్తువుతో సమన్వయించి ఉత్ప్రేక్షా రూపమున ఇంత రమ్యముగ వర్ణించుట వాల్మీకమున లేదు. అందు "కర్మకాలో మునిశ్రేష్ఠ లంబతే రవిమండలమ్" (I, 65, 36) అని మాత్రమే కలదు. భా.రా. నందలి భావమునకు మూలము రం రా. మే యని భావింపవచ్చును. రామునకు

'నా కులజుఁడైన' యను విశేషణము నధికముగ చేర్చి మల్లికార్జునుడు మరింత సొగసు కూర్చినాడు.

అయోధ్యాకాండము :

i) దశరథుడు కౌసల్యతో తనకుగల శాపమును తెలుపు ఘట్టము.

రం. రా.

'నాడెల్ల నేలెడువాడు నా పిన్న
నాడొక్కనాడేను నడిరేయిఁ బోయి (పు. 107)

భా. రా.

నా పిన్ననా డొకనాడేను నడురేయి
సరయూతటంబునఁజండచాప (II, 304)

ii) యజ్ఞదత్తుడను మునిబాలకుడు దశరథుని బాణముచే మృతినొందగా నాతని తండ్రి కుమారునిగూర్చి విలపించుఘట్టము.

రం. రా.

దీర్ఘాయువని నిన్ను దీవింతుఁగాని
నిర్ఘాతపటుబాణనిహతి వల్కితినె

భా. రా.

దీర్ఘాయువనుట కర్థము
నిర్ఘాతపటిష్ఠబాణనిహతియె పుత్రా ! (II, 344)

రం. రా. నందలి భావమేకాక పదబంధములును యథాతథముగ పై భా. రా. పద్యమున అనుకరింపబడినవనుట స్పష్టము.

i) రావణుడు సీతనపహరించుకొని పోగా శూన్యమగు పర్ణశాలను వర్ణించు ఘట్టము.

రం. రా.

"రేరాజు కళలేని రేయును బోలె
శారికలేని పంజరమును బోలి

యెనయు కోయిల లేని యెలమావిఁబోలె

........ ........ ... .... ........ ....

యున్న చందముఁజూచి యుల్లంబు గలఁగి" (పు. 160)

భా. రా.

చంద్రికలేని నిశాగగనము మాడ్కి
శారిక లేని పంజరము కరణి

.... .... .... .... .... .... ....

చెలఁగు కోయిల లేని యెలమావి చాడ్పున
అవనితనయ లేని యావాసమంతయుఁ

బాడువాటియుండఁ బార్థివుండు (III, 2, 256)

పై భా. రా. పద్యము రం. రా. ద్విపదల కనుకరణమనియే చెప్ప వచ్చును. కాని భా. రా. ముద్రితప్రతులయందు అర. కాం. ద్వితీయాశ్వాసమున 148 వ పద్యమునుండి 387 వ పద్యమువరకు ప్రధానపాఠముగ చూపబడిన 239 పద్యములకు బదులుగా పెక్కు తా.ప్ర. లలో పాఠాంతరముగ అధోభాగ మున చూపబడిన ఆరువది పద్యములు మాత్రమే కనిపించుచున్నవి. ప్రధానపాఠ మందు చూపబడిన పద్యము లొకటిరెండు అర్వాచీన తాళపత్రప్రతులలో మాత్రమే కానవచ్చుచున్నవి.[4] కనుక పైన చూపబడిన పద్యము రం. రా. ద్విపదలకు అనుకరణమే యైనను నది భా.రా. అరణ్యకాండ కర్తృకమనుట సందిగ్ధమైన విషయము. రం రా. నందలి భావమును, పదములను అనుకరించుచు తరువాతి కవులెవరో యీ పద్యమును వ్రాసి తక్కినవానితోపాటు గ్రంథమున చేర్చి యుందురు భా. రా. ముద్రితప్రతులలో అర. కాం. న కానవచ్చు పాఠద్వయ మును గూర్చి పాఠభేదములను ప్రకరణమున చర్చింపబడినది.

**కిష్కింధాకాండము :**

i) తార లక్ష్మణుని కోపము నుపశమింపజేయు ఘట్టము

రం.రా.

'మీరు పెట్టిన చెట్టు మిహిరనందనుఁడు' (పుట 164)

భా.రా.

'మీ పెట్టిన చెట్టినజుఁడు (IV, 489)

ii) సముద్రలంఘనవిషయమున జాంబవంతుడు తన శక్తిని గూర్చి చెప్పుకొను సందర్భము.

రం.రా.

చిన్ననాటి బలంబు జెప్పవచ్చినను
గ్రన్నన హాస్యకారణము లిప్పటికి" (పు. 204)

భా.రా.

'పిన్ననాటి బలపరాక్రమంబులిప్పుడు జెప్పవచ్చిన మహా
హాస్యాస్పందంబై యుండును' (IV, 778)

తన చిన్ననాటి బలపరాక్రమములను చెప్పుబూనుటను జాంబవంతుడు హాస్యకారణముగ తలచుట వాల్మీకమున లేదు.[6]

సుందరకాండము :

i) హనుమంతుడు సముద్రము దాటి లంకలో ప్రవేశించినఘట్టమున కావింపబడిన సూర్యాస్తమయ, చంద్రోదయ వర్ణనములు.

సూర్యాస్తమయము :

రం.రా.

'నేనున్న ననువుగాదీలంకఁ జొరగ
వీనికి నన్నట్లు వెసఁగ్రుంకె నినుడు' (పు. 211)

భా.రా.

నాకెంతయుఁ బ్రియశిష్యుం
డీ కపివరుఁ డితనిపనికి నెడ గాకుండం
బోక యుచిత మనుకరణి వి-
భాకరుఁడపు డపరశిఖరిపై కరుగుటయున్ (V, 74)

సూర్యాస్తమయము :

రం.రా.

చుక్కలగమికాడు చూపట్టె మింట
పావని వీడెల్ల పరికింపవలసి
దేవతలెత్తిన దీపమో యనఁగ' (పు. 213

భా. రా.

''పావనికి సీత వెదకం
గా విశ్వము గానిపింప ఘనతమమడపన్
దేవతలెత్తిన దీపము
కైవడి చందురుఁడు వెలిగె గగనతలమునన్'' (V-89)

తానింకను అస్తమించనిచో హనుమంతునకు రాక్షసుల దృష్టిలో పడకుండ లంకలో ప్రవేశించుట సాధ్యముకాదని తలచి సూర్యుడస్తమించినాడట. అంత లంకయందంతట క్రమముగా తమస్సులు వ్యాపించినవి. ఆ గాఢతమస్సులలో సీతను వెదకుట కష్టమని తలచి యాతనికి దేవతలెత్తిన దీపమా అనునట్లు చంద్రుడుదయించినాడట. సూర్యాస్తమయ, చంద్రోదయవర్ణనముల నీవిధముగ ఉత్ప్రేక్షామూలమున ప్రకృతకథానిత్యముగ నిబంధించుట రం. రా. నకు అనుకరణమే. భావమే కాక 'దేవతలెత్తిన దీపమ'ను పదబంధమును యథాతథముగ గ్రహింపబడినది.

యుద్ధకాండము : (పూర్వభాగము)

వానరులందరును సముద్రము దాట సిద్ధమై మహేంద్రపర్వతమును చేరి అట నొక వేలావనమున విడిసియుండగా సూర్యాస్తమయమగుటను వర్ణించు ఘట్టము.

రం. రా.

'తుద లేదు నా మనోదుఃఖవారిధికి
నని రామవిభుఁడు శోకాంబుధిలోన
మునుగుచుండఁగ మూడు మూర్తులు గలిగి
యతివేగమున నినుఁ డపరాద్రిఁ గ్రుంకె (పుట. 248)

భా. రా.

'జానకీ వియోగసాగరమగ్నుఁడై
రామచంద్రుఁ డుండఁగా మనోజ్ఞ
భంగినింకఁ దగునె పద్మినీ భోగమ
న్నట్లు గ్రుంకె నర్కుఁడపరజలధి' (VI, 33)

రం. రా. నందలి యుత్ప్రేక్షను మూలముగ గ్రహించి భాస్కరుడు మెఱుగులు దిద్దినాడని చెప్పవచ్చును. రం.రా. కర్త సూర్యుడపరాద్రి గ్రుంకినట్లు వర్ణించుటతో విశేషము గలదు. రాముడు వియోగసాగరమగ్నుడై యుండగా సూర్యుడును అపరసాగరమగ్నుట యుచితమే కదా! అంతేకాక రాముడు వియోగముతో బాధపడుచుండగా తాను పద్మినీభోగమున సుఖముగా నుండుట యనుచితమని భా. రా. న సూర్యాస్తమయమునకు చెప్పబడిన కారణము రం.రా. నందలి భావముకంటె మనోజ్ఞముగ నున్నది.

ii) రావణ దూత యగు శుకునితో సుగ్రీవుడు రావణునకు సందేశము పంపు ఘట్టము

రం. రా.

"పటుకార్ముకంబె యూపంబుగా నిలిపి
చటులాస్త్రములు పరిస్తరణముల్సేసి
పరగఁగెంధూళ్ళను బ్రబలుగాఁజేసి
తరుచరస్రుక్స్రువతతులు జేపట్టి
సమరభూవేదికా స్థలమున నిలిచి
అమరులకెల్ల ప్రియంబెక్కుచుండఁ
గరమొప్ప వీరాంగకములు బెల్లుబ్బి
తొరగుచునున్న నెత్తురు నెయ్యివోసి
మహితగుణధ్వనుల్ మంత్రముల్గాఁగ
.... .... .... .. .... .... .... ....
విడువక సంగ్రామవిపులయజ్ఞంబు
గడునొప్పఁజేయు రాఘవసోమయాజి"

భా. రా.

"విలు యూపంబు, శరాళి దర్భతతి, మౌర్వీటంకృతుల్ మంత్రముల్
గళితాసృక్ఛటలాజ్యధారలు, నిషంగ ద్రోణికల్ స్రుక్స్రువం
బులుగా, రాముఁడు యాజకుండయి సమిద్భూవేదిఁ గోపానలా
ర్చులతో నద్దశకంఠుఁడన్ పశువు వేల్చున్ నిర్జర ప్రీతిగన్ (VI,208)

ఈ పద్యమందలి రూపకాలంకారములకు పై రం.రా. ద్విపదలే మూల మనుటలో సందేహము లేదు. ఈ సందర్భమున వాల్మీకమున ఈ భావము కానరాదు.

iii) నాగపాశబద్ధుడైన లక్ష్మణుని గురించి రాముడు బాధపడుచు విలపించు సందర్భము.

రం. రా.

'జయశాలి యగుచున్న సౌమిత్రి లేని
జయము నాకంధుని చంద్రోదయమ్ము' (పుట 317)

భా. రా.

"అంధునకైన చంద్రుదునుదయంబు తెఱంగు సుమీ" (VI, 601)

iv) రామునితో సంధి చేసుకొనుట యుక్తమని మండోదరి రావణున కుప దేశింపగా నాతడు సమాధానము చెప్పుట.

రం. రా.

''ఎఱిగి యెఱింగి మున్నెగ్గొనరించె
మఱికదా తెచ్చితి మనుజేశుదేవి
జడమతి నతనితో సంధి జేసినను
గడగి ఖరాదుల గడతేర్చినట్టి
పగయు నీ మఱదలి బన్నంబు నెట్టి
పగిది నీఁగగను జొప్పడునటుగాన" (పుట. 334)

భా. రా.

"ఎఱిగి యెఱింగి మున్నతఁడె యెగ్గొనరించెను, దానికై కదా
చెఱగొని వచ్చితింబిదప సీత వృథాకథలింక నేల పెం
పఱ బ్రదుకింత తీయనె ఖరాదుల చావునకేమి చింత నీ
మఱదలి బన్నమేపగిది మానిని యీగుదు సంధిజేసినన్'' (VI, 786)

యుద్ధకాండ శేషము :

i) వానరులు లంకను కాల్చు ఘట్టము.

రం. రా.

''లలనల మణి మేఖలారవంబులును
కలయఁ జెన్నొందు కంకణరవంబులును
పొలుపారు రత్న నూపుర రవంబులును
.... .... .... .... .... .... .... .... .... ....
ఇంపారు టెంతయు నేలతోఁ గలిసి (పుట 382)

భా. రా.

''రమణీ రమణీయమణి
క్రమ శుభకాంచీరవములు, కంగణ ఝుంకా
రములును, నూపురకనినా
దములును నొకమాత్రఁ బొలిసె దహనునిచేతన్'' (VI,1152)

వాల్మీకమున పై భావము కానరాదు. అయ్యలార్యుడు రం.రా. నందలి భావమునే కాక అందు పేర్కొనబడిన మేఖలా, కంకణ, నూపురముల క్రమమునుగూడ అనుసరించినాడనుట స్పష్టము.

ii) ఇంద్రజిత్తు కృత్యాసహితుడై యుద్ధరంగమున నదృశ్యుడగుచు కపులను నుఱుమాడు ఘట్టము.

రం. రా.

''వలియఁ దాకెడి శిలావర్షంబుచేతఁ
బలుదెసఁజెడి పాఱు పక్షులో యనఁగ
భిన్నభిన్నాంగులై చెదరిరి గొంద
ఱున్నతగతిఁదప్పి యుండిరి కొందఱు'' (పుట 389)

భా. రా.

"వడి జాలవానఁ గురిసినఁ
దడఁబడు ఖగములనఁగఁ దరుచరులును బెం
పెడలి చెడ విఱిగి నేలం
బడి కూలిరి శక్రజిత్తు పటుబాణములన్" (VI, 1263)

iii) ఇంద్రజిత్తు గావించుచున్న నికుంభిలా హోమమునకు విఘ్నము కావించి, యాతనిని చంపుటకు లక్ష్మణుని పంపుచు రాము డాతనిని దీవించు సందర్భము.

రం. రా.

అరుదైన పేర్మితో నిట్లనుచు దీవించె
అనిశము జయము శ్రీహరి యొనఁగూర్చు
ఘనతర శుభము శంకరుఁడిచ్చు, నజుఁడు
నీకాయువు ఘటించు, నిఖిలదేవతలు
గైకొని దిశలందుఁ గాతురు నిన్ను
అనిలుండు ననలుండు నభిరక్షణంబు
దనరఁ జేయుదురు" (పుట 399)

భా. రా.

"జయమొసగున్ రమావరుఁడు, శంకరుఁడున్ సుఖమిచ్చు నగ్నియున్
నియతము దేజమొప్పఁ గరుణించు, జిరాయురుపేతుఁ జేయు బ్ర
హ్మయు నని పెక్కుదీవనల నాపతి తమ్ముని గారవించి వే
డ్కయుఁగృపతోడి నెయ్యము బెడంగున ముప్పిరిగాగ నెంతయున్
(VI, 1304)

ఇట్లు బ్రహ్మదిదేవతలు కరుణించునట్లు శ్రీరాముడు దీవించుట వాల్మీకమున లేదు. అందు

"కృతస్వ స్త్యయనో భ్రాతా లక్ష్మణ స్త్వరితో యయౌ" (VI, 85, 30)

అను శ్లోకమున రాముడు స్వస్త్యయనము గావించినట్లు మాత్రమే కలదు. రం. రా. న పేర్కొనబడిన దేవతలు, ఆయా దేవత లనుగ్రహింపవలసిన శుభములును అట్లే భా. రా. న గ్రహింపబడినవి.

(iv) రావణుని శక్తిచే మూర్ఛితుడైన లక్ష్మణుని బ్రతికించుటకై సుషేణుడు హనుమంతుని సంజీవనౌషధి తెమ్మని చెప్పుచు ఆ ఔషధి స్వరూపమును వివరించు ఘట్టము.

రం. రా.

'వాని లక్షణములు వలయు నీకెఱుఁగ
హరితఫలంబులు నరుణపుష్పములు
నరుదార తెల్లని యాకులు నమరు' (పుట. 432)

భా రా.

'ఆకులు మిక్కిలి తెల్లన
ప్రాకటముగ వాని పండ్లు పచ్చన పుష్పా
నీకమ్ములరయ నెఱ్ఱన
నీకెఱిగించితిని వాని నిజమగు చిహ్నల్ (VI, 1606)

v) హనుమంతుడు రెండవమారు సంజీవని తెచ్చుటకు బోవుచున్నపుడు ఆతనిని శ్రీరాముడు పొగడుట.

రం. రా.

''అనుజులు మును ముచ్చురరయ నాకిప్పు
డనిలనందన నల్వురైరి నీతోడ'' (పుట. 432)

భా. రా.

''సోదరులు మేము నలువుర
మైదవ తోడగుదు నీవు వనయము జేతో
మోదంబు మిగుల గలుగున్
నాదెసఁగృపసేయవయ్య నగచరవర్యా ! (VI. 1608)

హనుమంతునకు సోదరస్థానమిచ్చి గౌరవించిన యీ సన్నివేశమునకు రం. రా. మే మూలమనవచ్చును. మనోజ్ఞమైన యీ భావన

ఇలలోన నల్గురము ఇపుడన్నదమ్ములము
ఇటుపైని మాతోటి హితవు మీఱంగ
ఐదవవాడగు అలరుచుందువు నీవు

అను జానపదగేయమందును కనిపించుచున్నది.[6]

vi) శ్రీరాముడు ద్రోణాద్రిప్రభను కాంచి సూర్యోదయమగుచున్నదని భ్రమించి లక్ష్మణునకై పరితపించు ఘట్టము.

రం. రా.

ఇల జీవులకునెల్ల నిదె వేగఁ బ్రొద్దు
పొలుపేది నా పాలి ప్రొద్దస్తమించె" (పుట. 442)

భా. రా.

"రూపింప నెల్లవారికి
నేపాఱగఁ బ్రొద్దుపొడుప నీ సమయమునన్
సోపాల ప్రొద్దు గ్రుంగెను
బాపపుదుఃఖాబ్ధిలోనఁ బడఁ బాలయితిన్ (VI. 1770)

vii) శ్రీరాముడెన్నిమారులు ఖండించినను తిరిగి మొలచుచున్న రావణుని శిరస్సులను, బాహువులను వర్ణించు ఘట్టము.

రం. రా.

"శిరములు గరములు సెలగి యేతెంచు
వరుసలు పంక్తులు వర్ణింపనొప్పు
శ్రీరామజయలక్ష్మీవివాహమున
నా రణదేవతలర్థి శోభిల్ల
పల్లవరత్నదర్పణతోరణములు
తెల్లమై కట్టిన తెఱఁగు దీపింప (పుట. 466)

భా. రా.

'కరములను కంబముల సొం
పరయంగా నిలిపి నిలిపి యనురాగమునన్
శిరములను సరసిజంబుల
విరచించిన తోరణముల వెలసెంజడలన్' (VI, 2164)

viii) హనుమంతుడు రెండవమారు సంజీవనిని తెచ్చుటకై పోవునపుడు శ్రీరాముడాతనిని దీవించు ఘట్టము.

రం. రా.

'అడుగుల కెఱగిన హనుమంతు నెత్తి
నడుఁగ్రుచ్చి యాలింగనము సేసి విభుఁడు
ఇంద్రుండు నీ శిరమినుఁడు నీ ముఖము
చంద్రుడు నీ మది, శక్తి నీ పిఱుదు
లనిలుండు నీ వెన్ను హరుఁడు నీ వాల
మనలుండు నీ యంఘ్రు, లజుఁడు నీ బుద్ధి
వరుణుండు నీ శక్తి, వాణి నీ వాణి
గరుడకేతనుఁడు నీ ఘనబాహుయుగము
కుంజరాననుఁడు నీ కుక్షి రక్షింతు
రంజనాసుత వేగ యరిగి రమ్మనిన'' (పుట. 432)

భా. రా.

హరి శిరమాదిత్యుఁడానన పద్మంబు
శశి మనోవృత్తియు, శైలతనయ
కటియు, వాయువు వీఁపు, కామారి వాలంబు
నగ్ని పాదంబులు, నబ్జభవుఁడు
మతిఁ బాశహస్తుఁడు మహనీయశక్తియు
పంకజనాభుండు పాణియుగము
గజముఖుఁడుదరంబు గడకతో నేప్రొద్దు
గాతురు నినుఁ బ్రీతిఁ బ్రోతురెపుడు (VI, 1613)

ఈ భావము వాల్మీకమున లేదు.

ix) అగ్నిప్రవేశము గావించిన సీతాదేవిని వర్ణించు ఘట్టము.

రం. రా.

"ఆవంతయును గంద దా పూవుబోడి
పావకసరసిలోఁ బదిలమై నిలిచి
కరచరణానన కమలంబు లొప్ప
వరకుచద్వయ చక్రవాకంబు లొప్ప
నవబాహువల్లరి మృణాలంబు లొప్ప

మహితలోలన్నేత్ర మత్స్యంబు లొప్ప
సహజ రోమావళి శైవాల మొప్ప
కమలిని తెఱగున కర మొప్పుచున్న
కమలాక్షిఁ గనుగొని'' (పుట 477)

భా. రా.

"లోలవిలాస ఖేలనవిలోచనమీనము లాననాబ్జమున్
లాలితబాహువల్లరి మృణాళములుం బృథుకేశ భారశై
వాలమునొప్ప సీత...............................
కృశానునందు సరసీగతిఁ జూడగ నొప్పెనెంతయున్ (vi, 2382)

అగ్నిని సరస్సుగను, అగ్నిస్థయగు సీతాదేవి కరచరణాద్యవయవములను కమలాదివస్తుజాతముగను రూపించిన పై ఘట్టము వాల్మీకమున కానరాదు.

భా. రా. కర్తలు ఆ యా ఘట్టములందు రం. రా. నందలి భావములను, అలంకారములను, పదబంధములను ఎట్లనుకరించిరో ఉదాహరణ పూర్వకముగ నిరూపితమైనది.

పదభావాలంకారాదులయందేకాక కథాంశముల విషయమునను భాస్కర రంగనాథరామాయణములకు సాదృశ్యముగల ఘట్టములనేకములు కలవు. వానిలో ఆయా కాండములకు చెందిన కొన్ని విషయములు మాత్రమిట పేర్కొనబడుచున్నవి.

**బాలకాండము :**

i) సంస్కృతరామాయణములలో శ్రీరామాదులు జన్మించిన తిథి నక్షత్రములే చెప్పబడినవి కాని వారములు చెప్పబడలేదు. శ్రీరాముడు బుధవారమున జన్మించినట్లు భా. రా. తెలుపుచున్నది.[7] దీనికి మూలము రం. రా. మే కావచ్చును. కాని అందు లక్ష్మణాదులు జన్మించిన వారముల ప్రసక్తి లేదు. భా. రా. న భరతుడు గురువారమునాడును, లక్ష్మణశత్రుఘ్నులు శుక్రవారమునాడును జన్మించినట్లుగ చెప్పబడినది.[8] మొల్లమ్మ మాత్రము రామాదులందరును ఆదివారమునాడే జన్మించినట్లుగ పేర్కొన్నది[9]. దీనికి కారణము వీరు ఆదిత్య వంశజులగుట కావచ్చును.

ii) రామాదుల వివాహమునకు పూర్వము దశరథుని వంశక్రమమును వసిష్ఠుడును, జనకుని వంశక్రమమును శతానందుడును తెలిపినట్లుగ రం. రా. న కలదు. భా. రా. నను ఇట్లే కలదు. కాని వా. రా. న వసిష్ఠుడు ఇక్ష్వాకువంశ వర్ణన కావింపగా జనకుడే స్వయముగ తన వంశవర్ణన కావించినట్లుగ వర్ణింప బడినది.

iii) రామాదుల వివాహమైన పిమ్మట వారినయోధ్యకు పంపునపుడు జనకుడు సీత మున్నగువారికి తగిన బుద్ధులు గఱపినట్లుగ భాస్కర, రంగనాథ రామాయణముల రెండింటను కలదు.[10] వా.రా.న నీ బుద్ధులు గరపు విషయము కానరాదు.

iv) దశరథుడు రామాదులతో మిథిలనుండి అయోధ్యకు తిరిగిపోవు సమయమున పరశురాముడు వారికెదురుపడును. ఆతనిని చూడగనే దశరథుడు, మునులును భయకంపితులై అర్ఘ్యాదులను కొనిపోవుదురు. పరశురాముడు వానిని గైకొనక దర్పముతోవచ్చి రాముని యెదుట నిలుచును. అప్పుడు దశరథరాముడు భార్గవరాముని భక్తితో పూజించినట్లుగ భా.రా.న కలదు.[11] వాల్మీకమున శ్రీరాముడు పరశురాముని భక్తితో పూజించినట్లుగ లేదు. ఈ యంశము రం.రా.న కలదు.[12]

**అయోధ్యాకాండము :**

i) మంథర కైకేయికి పాపోపదేశము చేయుచు పూర్వము ధవళాంగుడను మునివలన పొందిన మంత్రవిద్యచే కైకేయి పురందరశంబరులకు జరిగిన యుద్ధమున దశరథునకు సాహాయ్యము చేయగా దశరథుడు మెచ్చి ఆమెకు రెండు వరములను ప్రసాదించిన విషయమును జ్ఞప్తికి తెచ్చినట్లుగ భా. రా.న కలదు.[13]

వాల్మీకమున కైకేయి ధవళాంగుడను మునివలన పొందిన మంత్రవిద్యచే దశరథునకు సహాయపడినట్లుగ లేదు. భా.రా. నందలి యీ విషయమునకు క్రింది రం.రా. ద్విపదలు మూలము కావచ్చును.

'ధవళాంగుఁడను ముని దయ నీవు గన్న
నవిరళంబగు మాయ నా మాయలడచి
నీ విభు నా దైత్య నిశితాస్త్రనిహతిఁ
జావకుండగఁగాచి సంప్రీతుఁజేసి" (పుట. 79)

ii) యజ్ఞదత్తుని మరణమునకాతని తండ్రి మాత్రమే విలపించినట్లుగ వాల్మీకమున నుండగా భా.రా.నముని విలాపముతోపాటు మునిపత్ని విలాపమును వర్ణింపబడినది. అంతేగాక భా రా. కర్త మునిపత్నివిలాపమునే ప్రథమముగా వర్ణించి స్త్రీ హృదయము యొక్క సహజమార్దవమును, దుఃఖాసహిష్ణుత్వమును ప్రకటించినాడు. భా. రా. నందలి యీ వర్ణనము రం.రా. ననుసరించియే యున్నది.[15]

**కిష్కింధాకాండము :**

1. జాంబవంతుడు కపివీరులతో తనకు యౌవనమున అప్రతిమమగు బలముండెనని మాత్రమే తెలిపినట్లుగ వా.రా.న కలదు. కాని యీ బలము తన కెట్లు కలిగినదో తెలుపబడలేదు. భాస్కరరంగనాథ రామాయణములు రెండింటను జాంబవంతుని బలమునకమృత సేవనము కారణమని చెప్పబడినది.[16] వాల్మీకమున నీ యమృతసేవన ప్రసక్తి కానరాదు.

**సుందరకాండము :**

i) రాముని యభిజ్ఞానార్థము సీతాదేవి చెప్పిన కాకాసురవృత్తాంతమును హనుమంతుడు రామునితో చెప్పు సందర్భమున నీ విషయము వా.రా.న సుమారు పదునారు శ్లోకములలో చెప్పబడినది.[17] కాని యీ సందర్భమును భా.రా. కర్త "తన కుచాంతరగతకాకనఖరేఖలును, సరసత మీరు నించిన గండస్థలమనశ్శిలా పత్రరేఖలును దలపింపుమనియె" (V - 562) అను గద్యమున క్లుప్తము గావించి నాడు. రం.రా.నను ఇట్లే అతిక్లుప్తముగ నీ విషయము కలదు.

**యుద్ధకాండము (పూర్వభాగము):**

i) విభీషణుడు గావించిన నీతిబోధను సహింపక క్రుద్ధుడైన రావణుడాతనిని సభలో నురముపై తన్నుటయు, ప్రహస్తునిచే నాతనిని సభనుండి వెడలగొట్టుటయు రం.రా.న పేర్కొనబడినవి. అవాల్మీకములగు ఈ అంశములు భా.రా.నను గ్రహింపబడినవి.[18] రావణుడు విభీషణుని తన్నిన వృత్తాంతము అధ్యా.రా.లో ఉన్నది.[19] రావణునిచే పరాభూతుడైన విభీషణుడు తన తల్లియగు కైకసియొద్దకు పోయి తనకు జరిగిన యవమానమును చెప్పి తాను శ్రీరాముని సేవింపబోవు

చున్నట్లుగ తెలుపును. అప్పుడు కైకసి శ్రీమహావిష్ణువే శ్రీరాముడుగ అవతరించినాడనియు, ఆతనినే యాశ్రయింపుమనియు దీవించి పంపినట్లుగ భా.రా న వర్ణింపబడినది.[20] అధ్యా.రా.న రావణుడు విభీషణుని తన్నిన వృత్తాంతమున్నను ఆతడు కైకసిని దర్శించినట్లుగ లేదు. అందు విభీషణుడు కైకసినిగాక కుంభకర్ణుని దర్శించినట్లుగను, ఆతడే శ్రీరామునాశ్రయింపుమని విభీషణునకు బోధించినట్లుగను ఈ క్రింది అధ్యా. రా. శ్లోకములవలన తెలియుచున్నది.

'తచ్ఛ్రుత్వా కుంభకర్ణోఽపి జ్ఞాత్వా భ్రాతరమాగతమ్
సమాలింగ్య చ వత్స త్వం జీవ రామపదాశ్రయః
కులసంరక్షణార్థాయ రాక్షసానాం హితాయ చ (VI, 8, 13-14)

సేతుబంధసమయమున సముద్రుడు రామునకు ప్రత్యక్షమై తనకు దశరథునితో గల సఖ్యమును, తనను దశరథుడు సంభావించిన విధమును పేర్కొనినట్లుగ భాస్కరరంగనాథరామాయణముల రెండింటను కలదు.

ii) నాగపాశబద్ధులగు రామలక్ష్మణులయొద్దకు నారదుడు వచ్చి రాముని స్తుతించి గరుడుని స్మరింపుమని చెప్పును. ఈ స్తోత్రమున రాముని పురుషోత్తమత్వము రెండు రామాయణములందును వాచ్యముగ పేర్కొనబడినది.[22] వాల్మీకమున ఈ సందర్భమున నారదాగమనము లేదు. సముద్రుడు రామునకు ప్రత్యక్షమై దశరథసఖ్యమును తెలుపుట మరియు నాగపాశబద్ధులైన రామలక్ష్మణులయొద్దకు నారదుడు వచ్చుట యను నీ యంశములు వా.రా. పశ్చిమోత్తరశాఖీయప్రతిలో వర్ణింపబడియున్నవి.[23]

iii) ధూమ్రాక్షాది రాక్షసవీరులు కపిసైన్యముతో పోరాడి మరణింతురు. అంత రావణుడు స్వయముగా యుద్ధరంగమునకు వెడల నిశ్చయించుకొని చతురంగబలమును సిద్ధముచేయ నాజ్ఞాపించును. ఈ విషయమెఱిగిన మండోదరి రావణునొద్దకు వెడలి శ్రీరామునితో సంధిచేసుకొనుటయే మేలని నీతిబోధ కావించును. సంధిగావించినచో 'నీ మఱదలి బన్న మేపగిది యీగుదు'నని మండోదరితో పలికి రావణుడామె గావించిన నీతిబోధను తిరస్కరించి రామునితో యుద్ధమునకే తలపడును. భా.రా.న వర్ణితమగు యీ మండోదరి నీతిబోధకు[24] రం.రా.మే మూలము.[25]

**యుద్ధకాండము :** (ఉత్తరభాగము)[26]

i) ఇంద్రజిత్తు హోమము కావింపగా అగ్నిమధ్యము నుండి కృత్య యేతెంచినట్లుగను, ఇంద్రజిత్తు కృత్యాసహితుడై యుద్ధరంగమున అదృశ్యుడై కపిబలమునంతయు నుఱుమాడుచుండగా వాయుదేవుడు వచ్చి ఆగ్నేయబాణమును ప్రయోగించి కృత్యను పెడబాపుమని రామునకుపదేశించినట్లుగను రం.రా.న కలదు. అవాల్మీకమగు ఈ అంశము భా. రా. నను గ్రహింపబడినది[28] అందు ఆగ్నేయబాణమునుగాక ఆంగిరసబాణమును ప్రయోగింపుమని అనిలదేవుడుపదేశించినట్లుగ కొద్దిమార్పు చేయబడినది.[29]

ii) ఇంద్రజిత్తు మరణమును రావణున కాతనిమంత్రులు తెలియజేసినట్లుగ వా రా.న నున్నది.

"తతః పౌలస్త్యసచివాః శ్రుత్వా చేంద్రజితో వధమ్
ఆచచక్షురభిజ్ఞాయ దశగ్రీవాయ సత్వరాః" (VI, 92, 2-3)

కాని రం.రా.న ఇంద్రజిద్వధమును రావణుని మంత్రులుకాక హతశేషులైన రాక్షసులే తెలియజేయుదురు.[30] అంతేకాక మూలములోవలె నకస్మాత్తుగాకాక మొదట రావణి యుద్ధరంగమున పరాక్రమముతో శత్రువుల నెదిరించిన విధమును తెలిపి చివరకాతని మరణమును తెలియజేయుదురు. ఈవిషయముననుభా.రా. రం.రా.నే అనుకరించుచున్నది.[31]

iii) అవాల్మీకముగ తలంపబడు కాలనేమివృత్తాంతమును, తదంతర్గతమగు ధాన్యమాలినివృత్తాంతమును భాస్కర,రంగనాథరామాయణముల రెండింటను కలవు. ఈ వృత్తాంతములు వా. రా. పశ్చిమోత్తరశాఖీయ ప్రతియందును, ఇటాలియన్ ప్రతియందును, అధ్యా.రా.నను కనబడుచున్నవి.

iv) హనుమంతుడు సంజీవనౌషధిగల ద్రోణాద్రిని పెఱుకగా దానిని రక్షించుచున్న చిత్రసేనాది గంధర్వులు హనుమంతునితో యుద్ధమునకు తలపడెదరు. అప్పుడు హనుమ వారిని సమయించి ద్రోణాద్రిని గైకొని లంకకు పోవును. భా రా న వర్ణింపబడిన యీ యవాల్మీకమగు గంధర్వయుద్ధము రం.రా.నను సరించి యున్నది.[32]

చున్నట్లుగ తెలుపును. అప్పుడు కైకసి శ్రీమహావిష్ణువే శ్రీరాముడుగ అవతరించి నాడనియు, ఆతనినే యాశ్రయింపుమనియు దీవించి పంపినట్లుగ భా.రా న వర్ణింప బడినది.[20] అధ్యా.రా.న రావణుడు విభీషణుని తన్నిన వృత్తాంతమున్నను ఆతడు కైకసిని దర్శించినట్లుగ లేదు. అందు విభీషణుడు కైకసినిగాక కుంభకర్ణుని దర్శించినట్లుగను, ఆతడే శ్రీరామునాశ్రయింపుమని విభీషణునకు బోధించినట్లుగను ఈ క్రింది అధ్యా. రా. శ్లోకములవలన తెలియుచున్నది.

'తచ్ఛ్రుత్వా కుంభకర్ణోఽపి జ్ఞాత్వా భ్రాతరమాగతమ్
సమాలింగ్య చ వత్స త్వం జీవ రామపదాశ్రయః
కులసంరక్షణార్థాయ రాక్షసానాం హితాయ చ (VI, 8, 13-14)

సేతుబంధసమయమున సముద్రుడు రామునకు ప్రత్యక్షమై తనకు దశరథునితో గల సఖ్యమును, తనను దశరథుడు సంభావించిన విధమును పేర్కొనినట్లుగ భాస్కరరంగనాథరామాయణముల రెండింటను కలదు.

ii) నాగపాశబద్ధులగు రామలక్ష్మణులయొద్దకు నారదుడు వచ్చి రాముని స్తుతించి గరుడుని స్మరింపుమని చెప్పును. ఈ స్తోత్రమున రాముని పురుషోత్తమత్వము రెండు రామాయణములందును వాచ్యముగ పేర్కొనబడినది.[22] వాల్మీకమున ఈ సందర్భమున నారదాగమనము లేదు. సముద్రుడు రామునకు ప్రత్యక్షమై దశరథసఖ్యమును తెలుపుట మరియు నాగపాశబద్ధులైన రామలక్ష్మణులయొద్దకు నారదుడు వచ్చుట యను నీ యంశములు వా.రా. పశ్చిమోత్తర శాఖీయప్రతిలో వర్ణింపబడియున్నవి.[23]

iii) ధూమ్రాక్షాది రాక్షసవీరులు కపిసైన్యముతో పోరాడి మరణింతురు. అంత రావణుడు స్వయముగా యుద్ధరంగమునకు వెడల నిశ్చయించుకొని చతురంగబలమును సిద్ధముచేయ నాజ్ఞాపించును. ఈ విషయమెఱిగిన మండోదరి రావణునొద్దకు వెడలి శ్రీరామునితో సంధిచేసుకొనుటయే మేలని నీతిబోధ కావించును. సంధిగావించినచో 'నీ మఱదలి బన్నమేపగిది యీగుదు'నని మండోదరితో పలికి రావణుడామె గావించిన నీతిబోధను తిరస్కరించి రామునితో యుద్ధమునకే తలపడును. భా.రా.న వర్ణితమగు యీ మండోదరి నీతిబోధకు[24] రం.రా.మే మూలము.[25]

**యుద్ధకాండము : (ఉత్తరభాగము)[26]**

i) ఇంద్రజిత్తు హోమము కావింపగా అగ్నిమధ్యము నుండి కృత్యయేతెంచినట్లుగను, ఇంద్రజిత్తు కృత్యాసహితుడై యుద్ధరంగమున అదృశ్యుడై కపిబలమునంతయు నుఱుమాడుచుండగా వాయుదేవుడు వచ్చి ఆగ్నేయబాణమును ప్రయోగించి కృత్యను పెడబాపుమని రామునకుపదేశించినట్లుగను రం.రా.న కలదు. అవాల్మీకమగు ఈ అంశము భా. రా. నను గ్రహింపబడినది [28] అందు ఆగ్నేయబాణమునుగాక ఆంగిరసబాణమును ప్రయోగింపుమని అనిలదేవుడుపదేశించినట్లుగ కొద్దిమార్పు చేయబడినది.[29]

ii) ఇంద్రజిత్తు మరణమును రావణున కాతనిమంత్రులు తెలియజేసినట్లుగ వా రా.న నున్నది.

"తతః పౌలస్త్యసచివాః శ్రుత్వా చేంద్రజితో వధమ్
ఆచచక్షురభిజ్ఞాయ దశగ్రీవాయ సత్వరాః" (VI, 92, 2-3)

కాని రం.రా.న ఇంద్రజిద్వధమును రావణుని మంత్రులుకాక హతశేషులైన రాక్షసులే తెలియజేయుదురు.[30] అంతేకాక మూలములోవలె నకస్మాత్తుగాకాక మొదట రావణి యుద్ధరంగమున పరాక్రమముతో శత్రువుల నెదిరించిన విధమును తెలిపి చివరకాతని మరణమును తెలియజేయుదురు. ఈవిషయమునను భా.రా. రం.రా.నే అనుకరించుచున్నది.[31]

iii) అవాల్మీకముగ తలంపబడు కాలనేమివృత్తాంతమును, తదంతర్గతమగు ధాన్యమాలినివృత్తాంతమును భాస్కర,రంగనాథరామాయణముల రెండింటను కలవు. ఈ వృత్తాంతములు వా. రా. పశ్చిమోత్తరశాఖీయ ప్రతియందును, ఇటాలియన్ ప్రతియందును, అధ్యా.రా.నను కనబడుచున్నవి.

iv) హనుమంతుడు సంజీవనౌషధిగల ద్రోణాద్రిని పెఱుకగా దానిని రక్షించుచున్న చిత్రసేనాది గంధర్వులు హనుమంతునితో యుద్ధమునకు తలపడెదరు. అప్పుడు హనుమ వారిని సమయించి ద్రోణాద్రిని గైకొని లంకకు పోవును. భా రా.న వర్ణింపబడిన యీ యవాల్మీకమగు గంధర్వయుద్ధము రం.రా.నను సరించి యున్నది.[32]

v) హనుమంతుడు ద్రోణాద్రిని గైకొని నందిగ్రామముపైగా లంకకు తిరిగివచ్చు సందర్భమున భరతునకొక దుఃస్వప్నము వచ్చును. అందు రామ లక్ష్మణులు తైలనిషిక్త శిరస్కులై పంకమధ్యమున చిక్కి కృశాంగులై ఏడ్చుచున్నట్లుగ భరతునకు కనిపింతురు. అంత భరతుడు మేల్కొని అనేక దుర్నిమిత్తములను కని తచ్ఛాంతికై భూసురోత్తములకు వివిధదానము లొసంగి రామాదుల కేమి కీడు వాటిల్లినదో యని దుఃఖించుచుండును. వల్కల జటాకల్పుడగు భరతుని హనుమంతు డాకాశమునుండి చూచి యాతనిని శ్రీరాముడని తలంచును. లక్ష్మణుడు మరణింపగా నా దుఃఖభారముతో శ్రీరాముడు సీతను గూడ ఉపేక్షించి యిటకు వచ్చెనా యనియు భ్రమించును. భరతుడాకాశమున పోవుచున్న హనుమంతుని భూతమని తలంచి యాతనిని పడగొట్టుటకై బాణమును ప్రయోగింపబోగా అశరీరిణి యాతనితో ఆప్తబంధువగు నీతనికి హాని తలంపకుమని పలుకును. భరతుడు ధనువు నుపసంహరించుకొనును. హనుమంతుడు లంకకు వెడలిపోవును. ఇంతలో రావణప్రేరితుడైన మాల్యవంతుడాతని నడ్డగించి యుద్ధమునకు తలపడును. హనుమంతుడు మాల్యవంతుని చంపి ద్రోణాద్రిని తీసుకొనిపోయి లక్ష్మణుని రక్షించును. భా.రా.న వర్ణింపబడిన యీ భరతుని దుఃస్వప్నము, భరతుడు మారుతిని భూతమని భ్రమించి విల్లెక్కుపెట్టుట, మాల్యవంతుడు హనుమంతునెదుర్కొనుట మున్నగు అవాల్మీకవిషయములకు రం. రా. మే మూలమనవచ్చును.[33] ఈ సందర్భములలో ఈ రెండు రామాయణములందు వర్ణింపబడిన అంశములన్నియు నొకేరీతిలో నుండుట పై యంశమును సమర్థించుచున్నది.

వా. రా. ఇటాలియన్ ప్రతిలో కాలనేమికథాసందర్భము (82 సర్గ)న భరతుడు హనుమంతుని చూచి భూతమని భ్రమించుట యను నొక్క విషయము వర్ణింపబడియున్నను అందీవిషయము హనుమంతుడు ద్రోణగిరిని తెచ్చు సందర్భమునకాక వెళ్ళునపుడే జరిగినట్లుగ వర్ణితమైనది. అంతేకాక భా. రా. న వలె అశరీరిణి కాక యిందు హనుమంతుడే స్వయముగ తాను రామదూతనని చెప్పుకొనినట్లుగను, భరతుని కోరికపై సీతాపహరణాది వృత్తములను వివరించినట్లుగను కలదు. ఇక భరతుని దుఃస్వప్నముకాని మాల్యవంతునితో జరిగిన యుద్ధము కాని, ఇటా. ప్ర. లో కానరావు. ఈ యంశములానందరామాయణమునను మృగ్యములు.

అందు హనుమంతుడు ద్రోణాద్రిని తీసుకొని లంకకు పోవు సమయమున భరతు డాతనిని రాక్షసుడని భ్రమించి బాణముచే నాతనిచేతనున్న ద్రోణాద్రిని క్రింద పడగొట్టినట్లుగ భా.రా. కంటె భిన్నముగా నున్నది.[35] భా. రా. న వర్ణింపబడిన పై యంశములన్నియు రం.రా. విషయములతోడనే సంవదించుటచే నివి రం.రా.న కనుకరణములనియే భావింపవచ్చును.

vi) రాముడు రావణుని శిరములనెన్నిమారులు ఖండించినను అవి తిరిగి మొలచుచునేయుండెను. అందులకు రాముడు విషణ్ణుడై యుండగా విభీషణుడు రావణుని నాభియందమృతము కుండలాకారమున నున్నదనియు, పావకాస్త్రముచే దానినింకింపజేయుమనియు రామునకు తెలుపును. రాముడట్లే కావించి రావణుని హతమార్చును. అవాల్మీకమగు నీ యమృతప్రస్తావము భాస్కర, రంగనాథ రామాయణముల రెండింటను కలదు.[36] వా. రా. పశ్చి. శా. ప్ర. లో శ్రీరామునకు రావణవధోపాయమెఱిగించిన వాడు విభీషణుడు కాడు. మాతలియే అతడు రామునకు, బ్రహ్మాస్త్రమును ప్రయోగించి రావణుని వధింపుమని సలహా చెప్పును. ఇందమృతప్రస్తావము మాత్రము లేదు.[37]

భాస్కరరంగనాథరామాయణములరెండింట సమముగా వర్ణింపబడిన యవాల్మీకాంశములలో పైన పేర్కొనబడినవి కొన్ని మాత్రమే.

రం. రా. కర్తయు, భా. రా. కర్తలును అనుసరించిన వా. రా. ప్రతి యొకటియే యనియు, ఆ కారణముననే రెండింటను పరస్పరము సంవదించు భాగములనేకములు గలవనియు కనుక భా.రా. నందలి పై యంశములు రం.రా. నకనుకరణములనుటకు వీలులేదనియు నొక యాశంక రావచ్చును. కాని భా.రా. నందు పై విషయములలో రచనా విషయకములగు సామ్యములుండుటచే భా.రా. కర్తలు పై కథాంశముల విషయమునను భా.రా. కర్తలు రం రా. ననుకరించి రనుట స్పష్టము.

పైన పేర్కొనినరీతిగ భా.రా. కర్తలు పలుచోట్ల రం.రా. ననుకరించినను కొన్నిచోట్ల స్వతంత్రించి రచన కావించినారు. రం రా.న వర్ణింపబడిన కొన్ని యంశములు భా.రా.న గ్రహింపబడకపోవుటయు, రం.రా న లేని కొన్ని యంశ

ములు భా రా.న నధికముగ చోటుచేసుకొనుటయు కనిపించుచున్నది. రం రా న వర్ణింపబడి భా.రా.న గ్రహింపబడని విషయములు ఈ క్రింది రీతిగ నున్నవి.

**బాలకాండము**

i) రం.రా. ప్రారంభమున వాల్మీకి నారదసంభాషణమును, నారదుడు చెప్పిన సంగ్రహరామాయణకథయు 37 ద్విపదలలో వర్ణింపబడినవి.[38] భా.రా.న ఈ విషయములు లేవు. అందీ విషయమంతయు నీ క్రింది ఒక్క పద్యమున నతి సంక్షిప్తముగ చెప్పబడినది.

"రాముని శుభచరిత[ము లఘు]ంబును
రామాయణముగ రచించి ప్రాచేతసుకై
ప్రేమనెఱిగించి తగ నిజ
ధామమునకు నారదుడుదారతఁ జనియెన్" (భా.రా. I, 2)

వావిళ్ళవారు ప్రకటించిన భా. రా.[39] ప్రారంభమున సంగ్రహరామాయణమను శీర్షికతో 47 పద్యములు గల భాగమొకటి చేర్చబడియున్నది. ఇందు వాల్మీకి నారదసంభాషణమును, నారదుడు చెప్పిన సంగ్రహరామాయణకథయు కలవు. కాని ఈ భాగము భా.రా. కర్తచే రచింపబడినది కాదు. తరువాత నెవరి చేతనో రచింపబడి యిందు చేర్చబడినది. శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారు ఈ భాగమును భా రా. కర్త రచించినట్లుగనే భావించినారు.[40] కాని తా.ప్ర. లలో నెందును ఈ భాగము కనిపించకపోవుటచే దీనిని ప్రక్షిప్తమనియే భావింప వలసి యున్నది.

ii) రం.రా.న దాశరథుల బాల్యక్రీడలు సుమారు 18 ద్విపదలలో వర్ణితము లైనవి. శ్రీరాముడొకనాడు బంతి ఆడుచుండగా మంథర వచ్చి బంతిని తట్టుటయు, శ్రీరాముడు తన చేతి కాష్ఠముతో దాని కాలు విఱుగగొట్టుటయు ఈ సందర్భమున పేర్కొనబడినవి. భావిరామవనవాసమునకు ఈ మంథరాద్వేషమును కారణముగ స్థాపించుటకు ఈ యంశము రం.రా.న. కల్పితమై యుండును. భా.రా.న దాశరథుల బాల్యవృత్తములు లేవు. అందు శ్రీరాముడు మంథర కాలువిఱుగగొట్టిన వృత్తము బా.కాం.న కాక అయో.కాం.న. కలదు.

iii) అహల్యావృత్తాంతవర్ణనసందర్భమున ఇంద్రుడు కోడియై గౌతమాశ్రమమును ప్రవేశించినట్లుగ రం.రా.న. కలదు.[41] కాని భా.రా.న. ఇంద్రుడు గౌతమవేషమున పోయినట్లుగనే యున్నది.[42]

iv) శ్రీరాముడు రాజ్యమును పరిత్యజించి సీతాలక్ష్మణసమేతుడై శృంగిబేరపురమును చేరుకొనును. అచట గుహుని ఆతిథ్యము గ్రహించి సీతారాములు తృణశయ్యపై నిద్రించగా లక్ష్మణుడు వనవాసము ముగియువఱకు నిద్రపోకుండా ఉండునని ప్రతిజ్ఞచేసి సమీపముననేఉండివారిని కంటికిరెప్పవలె కాపాడుచుండును.[43] అప్పుడు నిద్రాదేవి వచ్చి రాత్రిసమయమున నిద్రించవలయుననెడి సమయమునే ధిక్కరించితివి కనుక నిన్ను విడుచుమార్గమును తెలుపుమని అడుగగా లక్ష్మణుడు వనవాసము ముగియువరకు తన భార్యయగు ఊర్మిళాదేవి నాశ్రయించుమనియు, ఆ తరువాత తిరిగి స్వీకరింతుననియు తెలుపును. లక్ష్మణుని భ్రాతృభక్తిని, శీలౌన్నత్యమును ప్రకటించు ఈ అంశము రం.రా.న వర్ణింపబడినది.[44] వనవాసము ముగియు వరకు నిద్రమాని సీతారాములను సేవింతునని లక్ష్మణుడు చేసిన ప్రతిజ్ఞ భా. రా. న నున్నను అందు నిద్రాదేవివృత్తాంతము మాత్రము లేదు.

ii) భరతుడు చిత్రకూటముననున్న శ్రీరామునొద్దకు వచ్చి దశరథుని మరణమును తెలిపి యాతనినయోధ్యకు తిరిగివచ్చి రాజ్యపాలనము కావింపవలసినదిగ ప్రార్థించును. అట్లు చేయనిపక్షమున తానక్కడనే ప్రాణములు విడుతుననియు విన్నవించును. అంత రాముడు భరతునితో నీ క్రిందివిధమున పలికి యాతనినను నయించినట్లుగ రం. రా. న కలదు.

"ఇదియేమి భరత నీవిట్లాడఁదగునె
మదిఁదలపోయవో మన తండ్రి యాజ్ఞ
దశరథేశునకు మీ తల్లిని మున్ను
విశదంబుగా నిచ్చువేళ మీ తాత
నా కూతునకుఁగల్గు నందను నఖిల
భూకాంతుగా నీవు పూన్పుమీ యనుచు
నమ్మికవడసి వెన్కను బెండ్లి చేసె
నమ్మాటపట్టున సమరదైతేయ

యుద్ధంబులో విభుండొసగిన వరము
బుద్ధి దప్పక కైక భూమీశునడిగె (పుట. 122, 123)

దశరథుని వివాహసమయమున కైకేయితండ్రి తన కూతునకు గలుగ బోవు కుమారునకే రాజ్యాభిషేకము చేయవలసినదిగా దశరథునితో సమయము గావించుకొనుటయు, దాని యాధారముగనే కైకేయి భరతుని పట్టాభిషిక్తుని చేయుమని దశరథుని కోరినట్లుగను పై రం. రా. ద్విపదలలో వర్ణితమైనది. ఈ విషయము భా. రా. న కానరాదు.

అరణ్యకాండము :

i) సీతాదేవి పలికిన నిష్ఠురవాక్యములను విని లక్ష్మణుడు శ్రీరామునొద్దకు పోవుచు 'పర్ణశాలకు చుట్టు బరులేదు' వ్రాసి 'ఎవ్వడే నీ బరుల్ వెస దాటివచ్చు, నవ్వీరవరు తలవియు నాక్షణమె' యని పలికినట్టుగ రం. రా. న నున్నది. భా. రా. న నీ బరులు గీయు వృత్తాంతము గ్రహింపబడలేదు.

కిష్కింధాకాండము :

i) సుగ్రీవుడు తనకు వాలితో నేర్పడిన వైరమునకుగల కారణమును శ్రీరామునకు తెలుపు సందర్భమున రం.రా. న సముద్రమథనము వర్ణింపబడినది. ప్రసిద్ధమగు సముద్రమథనకథతో నిది కొంత భేదించుచున్నది. సముద్రమును మథించునపుడు వాలిసుగ్రీవులు దేవతలకు సహాయపడుట, అందితరవస్తువులతో పాటు తార జన్మించుట, దేవత లా తారను వాలిసుగ్రీవులకొసగుట మున్నగు క్రొత్తయంశములిందు చోటుచేసుకొన్నవి.[45] ఈ యంశములు వా. రా. ప్రతులలో నెందును లేవని శ్రీ కామిల్ బుల్కేగారి యభిప్రాయము.[46] ఈ సందర్భమున భా. రా. న నీ సముద్రమథన వివరములేవియు కానరావు.

ii) సుగ్రీవుడు రామునకు సప్తతాళములను చూపి వాని నొక్క కోలతో కూల్చి వేసినచో నాతనిని వాలితో సమానునిగ నెంచెదనని పలుకును. శ్రీరాము డట్లే కావించి తన పరాక్రమమును ప్రకటించుకొనును. అంత ఆకాశ వీథిలో నొక విమానమున 'కరుణావతి' యను కన్య ప్రత్యక్షమై తాను నిరతము దుర్వాసుని నిందించుట కారణముగా నతని శాపఫలముగా తనకు సప్తతాళరూపము కలిగినట్లు

గను, శ్రీరాముని మూలమున తాను శాపవిమోచనమును పొందినట్లుగను తెలిపి అమరపురికి వెడలిపోవుమ. రం. రా. న వర్ణింపబడిన యీ సప్తతాళచ్ఛేదనము భా. రా. న నున్నను ఇందు వర్ణితమైన కరుణావతీ వృత్తాంతము.[47] మాత్రము కానరాదు.

యుద్ధకాండము :

i) కపివీరులు సేతుబంధనమునకై కొండలు, చెట్లు. మున్నగునవి తెచ్చి సముద్రమున పడవేయగా నవి తేలక మునిగిపోవుచుండెను. అందుకు శ్రీరాముడు విచారించుచుండగా సముద్రుడు ప్రత్యక్షమై విశ్వకర్మ తనయుడగు నలునకు తప్ప ఆసేతుబంధనమితరులకు సాధ్యము కాదనియు, ఆతడు సముద్రమున వేసిన తరుగిరులు మునుగక తేలుననియు తెలుపును. అట్లు తేలుటకు నలునకు గల పశుకణ్వుడను మునివరమును గూడ పేర్కొనును. రం.రా.న నీ వరవృత్తాంత మిట్లు గలదు.

వింధ్యాద్రి సమీపమున నొక యడవిలో పశుకణ్వుడను ముని తపము చేసుకొనుచుండగా నటకు నలుడు పోయి బాల్యచాపల్యముచే నాతని పూజావస్తువు లను సముద్రమున పడవేయును. మహర్షి బాలుడగు నాతనిని దండింప నిష్టపడక యాతడు సముద్రమున పడవేసిన వస్తువులన్నియు మునుగక తేలుచుండునని యాతనికి వరమును ప్రసాదించును. అంతనాతడు సముద్రమున పడవేసిన ముని వస్తువులన్నియు జలముపై తేలును. రం.రా.న వర్ణితమైన యీ పశుకణ్వుని వృత్తాంతము [48] భా.రా.న కానరాదు.

ii) శ్రీరాముడు సుగ్రీవాదివానరులతో సముద్రము దాటి సువేలాద్రి చేరును. ఈ విషయము తెలిసిన కైకసి చింతిల్లి మాల్యవంతుకడకేగి సీతాదేవిని రాముని కప్పగించుమని రావణునకు బుద్ధిచెప్పుట యుక్తమని యాతనితో విచారించి రావణుని దగ్గరకుపోయి ఆతనికి నీతిబోధ కావించుటయేకాక రాముని మహిమమును, జలప్రళయమును వివరించును. రం.రా న ఈ వృత్తాంతము చాదాపైదారు పుటలలో వర్ణింపబడినది.[49] అవాల్మీకమగు నీ కైకసీవృత్తాంతము భా.రా.న కానరాదు.

iii) ఇంద్రజిత్తు భార్యయగు సులోచన వృత్తాంతము రం.రా.న అతి విపులముగా వర్ణితమైనది.[50] అవాల్మీకమగు నీ సులోచనావృత్తాంతము భా.రా.న గ్రహింబడలేదు.

iv) సేతుబంధ సమయమున నొక ఉడుత శ్రీరామునిపైనున్న భక్తి భావముతో సముద్రజలములో తన శరీరమును తడిపి యిసుకపై పొర్లాడి తన శరీరమునకంటిన యిసుకను వానరులు నిర్మించుచున్న సేతువుశిలలమధ్య విదల్చుచుండెను. రాముడు దాని భక్తిభావమునకాశ్చర్యపడి తన కుడిచేతితో దాని శరీరమును నిమురగా నట రాముని మూడువ్రేళ్లను ముద్రితములైనవి. రం.రా.న మాత్రమే కానవచ్చు ఈ యవాల్మీకాంశము.[51] భా.రా.న కానరాదు.

v) శ్రీరాముడు పట్టాభిషేకానంతరము సకల భృత్యామాత్యసహితుడై కొలువుండగా నిద్రాదేవి యావహించుటచే లక్ష్మణుడు నిండుసభలో కలకల నవ్వును. సభలోని వారందరును తమతమ కళంకములను తలచుకొని తలలు వంచుకొందురు. నిండు సభలో అమర్యాదముగ నవ్వినందుకు శ్రీరాముడు లక్ష్మణుని మందలించును. అంత లక్ష్మణుడు నిద్రాదేవితో తాను పూర్వము చేసుకొన్న నియమమును తెలిపి తన నిర్దోషిత్వమును ప్రకటించుకొనును. రం.రా. నందలి యీ అవాల్మీకాంశమును.[52] భా.రా కర్త గ్రహించలేదు.

vi) తన మాటప్రకారము రాముడు తిరిగి రానందున దుఃఖితులగు గుహ భరతులు అగ్నిప్రవేశము చేయుటకు సిద్ధముగనుండగ హనుమంతుడు వారికి శ్రీరాముని వార్త చెప్పి వారి ప్రయత్నమును మాన్పించును. గుహభరతుల యతివేలమగు రామభక్తిని ప్రదర్శించు నీ ఘట్టము రం.రా. న వర్ణితమైనది.[53] భా.రా. న నీ విషయము గ్రహింపబడలేదు.

vii) రావణసంహారముచే తనకు కలిగిన బ్రహ్మహత్యాదోషనివారణము నకై కాశినుండి హనుమంతుడు శివలింగమును తెచ్చుటలో ఆలస్యమగుటచే రాముడు స్వయముగ నొక సికతాలింగమును సిద్ధము చేసి రామేశ్వరమున ప్రతిష్ఠ గావించినట్లుగ రం.రా. న వర్ణింపబడిన వృత్తము భా.రా. న కానరాదు.

భా. రా. కర్తలు పదభావాలంకారాదులయందు రం. రా. ననుకరించినను అవాల్మీకములగు నందలి కథాంశములను గ్రహించునపుడు మాత్రము స్వాతం త్ర్యము వహించినారనియే పై యంశములవలన తెలియుచున్నది.

## సూచికలు :

1. గౌతమవ్యాసములు. 126 పు.
2. **Ibid** 128 పే.
3. 314 & 315 పు.లు
4. 100/14; 183/14 కాకి.ప్ర.
5. 'యౌవనే చ తదాసీన్మే బలమప్రతిమం పరమ్' - వా.రా. IV-65-16.
6. తెలుగు జానపదగేయ సాహిత్యము; పు. 101.
7. భా.రా. 1-167.
8. **Ibid**.
9. మొ.రా. **I**-45.
10. భా.రా. **I**-743; రం.రా. (రాయల్&కో) పు. 76.
11. **I**-751.
12. పు. 77.
13. భా.రా. **II**-63.
14. **II**, 340-341.
15. రం.రా. (రాయల్&కో) 125-127 పు.
16. భా.రా. **IV**, 779; రం.రా. 237, 238 పు.
17. V-37 సర్గ.
18. **VI**, 148-149.
19. ధిక్త్వాం గచ్ఛేతి మాం హత్వా పదా పాపిభిరావృతః. అధ్యా.రా. VI-8-12.
20. VI-155 నుండి 162 వరకు.
21. భా రా. **VI**-233; రం.రా. 315 పు.
22. భా.రా. VI, 609-625; రం.రా. 370 పే.
23. చూ. రామ్‌కథా-ఉత్పత్తి ఔర్ వికాస్. పే. 529, 530
24. భా.రా. VI-766-782.
25. రం.రా. పే. 386-387.
26. అయ్యలార్యుని రచన
27. పే. 451-453.

28. VI, 1259-1270.
29. VI-1269.
30. పు. 473.
31. VI-1391.
32. భా.రా. VI, 1733-1737; రం.రా. పే. 508, 509.
33. భా.రా. VI, 1738-1765; రం.రా; పు. 509, 510 & 511.
34. రం.రా. పీఠిక (రాయల్ అండ్ కో) పు. 19.
35. భరతేన శరం ముక్త్వా పర్వతో భువి పాతితః I-11-62
36. భా.రా. VI, 2168-2169; రం.రా; పే. 539.
37. రం.రా. పీఠిక (రాయల్ & కో) పేజీ. 26.
38. రం.రా. పు. 5 & 6.
39. భా.రా. (వావిళ్ళ) 1923.
40. విజ్ఞాన సర్వస్వము.
41. ''కుక్కుటంబై పోయి కుటజంబు సేరి'' - రం.రా. పు. 50.
42. I-519.
43. II-266.
44. రం.రా; పే. 177.
45. 'చంద్రుడు దేవతాసతులుదయింప; నందఱిలోఁదార యను సతి మాకు; దేవతలిచ్చిన దివిరి గైకొంటిమి'-రం.రా; పే. 207.
46 రామ్‌కథా-ఉత్పత్తి ఔర్ వికాస్; పే. 225.
47. రం.రా; పే. 210 & 211.
48. రం.రా; పే. 315 & 316.
49. రం.రా. పే. 322-329.
50. రం.రా; పే 481.
51. పే 519.
52. రం.రా. పే. 574.
53. పే. 565.

# భాస్కర రామాయణము ఛందో విశేషములు

భా.రా.కర్తలు వృత్తములు, జాత్యుపజాతులను గలిపి మొత్తము పదిహేడు భేదములను మాత్రమే ప్రయోగించిరి. అందు శార్దూలము, మత్తేభము, ఉత్పలమాల, చంపకమాల, స్రగ్ధర, మహాస్రగ్ధర, లయగ్రాహి, మాలిని, లయవిభాతి, తరళ, మత్తకోకిల, పృథ్వి యను వృత్తభేదములును; కందము, ఉత్సాహమునను రెండు జాతిభేదములును; సీసము, తేటగీతి, ఆటవెలది యను నుపజాతిచ్ఛందోభేదములును కలవు. భా.రా.న ఆ యా కాండకర్తలు వాడిన ఛందోభేదముల వివరము లీ క్రిందివిధముగ నున్నవి.

**మల్లికార్జునుడు :**

| వృత్తములు | బా.కాం. | కి.కాం. | సుం.కాం. | మొత్తము |
|---|---|---|---|---|
| శార్దూలము | 14 | 22 | 13 | 49 |
| మత్తేభము | 56 | 55 | 26 | 137 |
| ఉత్పలమాల | 34 | 60 | 38 | 132 |
| చంపకమాల | 70 | 90 | 49 | 209 |
| స్రగ్ధర | — | 1 | — | 1 |
| మహాస్రగ్ధర | 2 | — | 1 | 3 |
| లయగ్రాహి | 1 | — | — | 1 |
| మాలిని | 1 | 1 | 1 | 3 |
| **జాతులు :** | | | | |
| కందము | 375 | 354 | 263 | 992 |
| **ఉప జాతులు :** | | | | |
| సీసము | 29 | 28 | 29 | 86 |
| ఆట వెలది | 3 | 6 | 7 | 16 |
| తేట గీతి | 18 | 20 | 19 | 57 |

నన్నయాదులు ప్రయోగించిన అక్కరలు, తరువోజలు మున్నగువానిని మల్లికార్జునుడు గ్రహించలేదు. ఈతడు వ్రాసిన మొత్తము 1686 పద్యములలో 1151 పద్యములు అనగా మూడువంతులు జాత్యుపజాతులే యని తెలియుచున్నది. వీనిలో 992 కందపద్యములు. దీనినిబట్టి ఛందోవిషయమున నీతని కవిత దేశీయతా ముద్రితమని చెప్పవచ్చును. సంస్కృత వృత్తములలో నీతడు విశేషముగ నాదరించిన వృత్తము చంపకమాల. స్రగ్ధరాదివిశేషవృత్తముల నీతడు పరిమితముగనే ప్రయోగించినాడు. ఆశ్వాసాంతములందు ఛందోభేదమును ప్రదర్శించుటకు మాత్రమే మాలినీవృత్తము గ్రహింపబడినది.

భాస్కరుడు :

| వృత్తములు | అర.కాం. (1 ఆ) | అర.కాం (2 ఆ) | యు కాం (పూ.భా) | మొత్తము |
|---|---|---|---|---|
| శార్దూలము | 10 | 17 | 53 | 80 |
| మత్తేభము | 14 | 25 | 46 | 85 |
| ఉత్పలమాల | 25 | 27 | 140 | 192 |
| చంపకమాల | 40 | 48 | 113 | 201 |
| స్రగ్ధర | 1 | 1 | 3 | 4 |
| మహాస్రగ్ధర | 1 | 3 | 3 | 7 |
| కవిరాజ విరాజితము | 1 | — | — | 1 |
| తరళ | 1 | — | — | 1 |
| లయగ్రాహి | — | 1 | — | 1 |
| మత్తకోకిల | — | 1 | — | 1 |
| లయవిభాతి | — | — | 2 | 2 |
| **జాతులు :** | | | | |
| కందము | 90 | 180 | 344 | 524 |
| **ఉపజాతులు :** | | | | |
| సీసము | 23 | 28 | 83 | 134 |
| ఆట వెలది | 8 | 7 | 63 | 78 |
| తేట గీతి | 18 | 20 | 72 | 110 |

పై పట్టికలో చూపబడిన వృత్తముల వివరములు వావిళ్ళవారి ప్రతి (1923) ననుసరించి చూపబడినవి. కాని వీనిలో అర.కాం న ప్రధానపాఠముతో పాటు వ్రాతప్రతి పాఠమని మరొక పాఠము గ్రంథము దిగువ భాగమున చూపబడినది. కాని తా.ప్ర.లలో పెక్కింట ము.ప్ర.లలో ప్రధానపాఠముగ చూపబడిన పాఠముకాక దిగువ చూపబడిన పాఠమే కనబడుచున్నది. కనుక ఆ పాఠమునే భాస్కరుని కవిత్వముగ భావింపవలసియున్నది. దానిననుసరించి అర.కాం.న భాస్కరుడు వాడిన వివిధచ్ఛందోభేదము లీ క్రిందివిధముగ నున్నవి.

| వృత్తములు | అర.కాం. (1 ఆ) | అర.కాం. (2 ఆ) | మొత్తము |
|---|---|---|---|
| శార్దూలము | 4 | 5 | 9 |
| మత్తేభము | 16 | 14 | 30 |
| ఉత్పలమాల | 27 | 14 | 41 |
| చంపకమాల | 33 | 22 | 55 |
| మహాస్రగ్ధర | — | 2 | 2 |
| స్రగ్ధర | 1 | 1 | 2 |
| మాలిని | 1 | 1 | 2 |
| **జాతులు** | | | |
| కందములు | 63 | 55 | 118 |
| **ఉపజాతులు** | | | |
| సీసము | 14 | 23 | 37 |
| ఆటవెలది | 1 | 1 | 2 |
| తేటగీతి | 11 | 23 | 34 |

అర.కాం.న ప్రయోగింపబడిన వివిధచ్ఛందోభేదములను తెలుపు పై రెండు పట్టికలను పరిశీలించినచో ము.ప్ర అందు ప్రధానపాఠముగ కనబడు కవిరాజవిరాజితము, తరళ, మత్తకోకిల యను విశేషవృత్తములు తా.ప్ర.ల పాఠమున కానరావు.

**అయ్యలార్యుడు**

| వృత్తములు | యు కాం. (ఉ.భా.) |
|---|---|
| శార్దూలము | 97 |
| మత్తేభము | 154 |
| ఉత్పలమాల | 144 |
| చంపకమాల | 226 |
| స్రగ్ధర | 3 |
| మహాస్రగ్ధర | 5 |
| లయగ్రాహి | 4 |
| తరళ | 1 |
| మత్తకోకిల | 1 |
| పృథ్వి | 1 |
| మాలిని | 1 |

**జాతులు**

| | |
|---|---|
| కందములు | 394 |

**ఉపజాతులు**

| | |
|---|---|
| సీసము | 166 |
| ఆటవెలది | 75 |
| తేటగీతి | 75 |

మల్లికార్జునుడు వృత్తములకంటె కందములనే అధిక సంఖ్యలో వాడగా అయ్యలార్యుడు మాత్రము వృత్తముల పైనే మొగ్గు చూపినాడు. అంతేకాక యీతడు మల్లికార్జునుడు వాడని తరళ, మత్తకోకిల, పృథ్వి యను విశేష వృత్తములను ప్రయోగించినాడు.

రుద్రదేవుడు

| వృత్తములు | అయో. కాం. |
|---|---|
| శార్దూలము | 14 |
| మత్తేభము | 10 |

| | |
|---|---|
| ఉత్పలమాల | 40 |
| చంపకమాల | 31 |
| తరళ | 1 |
| మత్తకోకిల | 1 |
| మాలిని | 1 |
| **జాతులు** | |
| కందము | 136 |
| ఉత్సాహ | 1 |
| **ఉపజాతులు** | |
| సీసము | 40 |
| ఆటవెలది | 21 |
| తేటగీతి | 37 |

ముద్రిత భా.రా. ప్రతులలో అయో. కాం. న కొన్ని ప్రక్షిప్త పద్యములు కనబడుచున్నవి. ఈ పద్యములన్నియు కుండలీకరణములో చూపబడినవి. ఇవి తా. ప్ర. లలో పెక్కింట కానరానందున వీనిని భా. రా. కర్తృకములుగ భావింప వీలులేదు. ఈ పద్యముల శైలియు అంతంతమాత్రముగనే యుండుట ఈ విషయమును సమర్థించుచున్నది. ఈ పద్యములు వావిళ్లవారి తొలి ముద్రణము (1910) లో కానరావు. తరువాతి ముద్రణములలో నీ పద్యములెట్లో చేరినవి. ఆనందాశ్రమ ప్రతి యందును ఈ పద్యములు లేవు. అట్టి ప్రక్షిప్త చ్ఛందములు ఈ క్రింది విధముగ నున్నవి.

| **వృత్తములు** | **అయో. కాం.** |
|---|---|
| శార్దూలము | 14 |
| మత్తేభము | 10 |
| ఉత్పలమాల | 39 |
| చంపకమాల | 31 |
| తరళ | 1 |
| మాలిని | 1 |

**జాతులు**

| | |
|---|---|
| కందము | 128 |
| ఉత్సాహ | 1 |

**ఉపజాతులు**

| | |
|---|---|
| సీసము | 37 |
| ఆటవెలది | 15 |
| తేటగీతి | 24 |

భా. రా. కర్త లా యా కాండములందు వాడిన వివిధచ్ఛందోభేదముల వివరములు పైన చూపబడినవి. ఇక ఆయా ఛందస్సుల ప్రయోగౌచిత్యమును పరిశీలింతము. ఛందము కావ్యరసవ్యంజకమగునా? కాదా? యను విషయమున మతభేదములు కలవు. చంపక శార్దూలాదులు లాక్షణికులు చెప్పిన రసభావాదు లందే కాక ఇతరత్ర ప్రయుక్తములగుటయు కనబడుచుండుటచే రసభావాభి వ్యక్తికిని, ఛందఃప్రయోగమునకును సంబంధమంతగా లేదని కొందరి అభిప్రాయము. కొన్ని కొన్ని వృత్తములు కొన్నికొన్ని రసభావాదుల యభివ్యక్తి యందు మాత్రమే ప్రయోగింపనర్హములని మరికొందరి మతము. ఇట్లు మత భేదములున్నను వివిధరసభావముల అవస్థాంతరములను వ్యంజించుటకు తగిన అంగప్రత్యంగముల సముచితసన్నివేశముచే ఔచితీశోభితములుగ ఛందములను నిర్మించుట కవి ఛందమున చూపు శిల్పమని చెప్పవచ్చును. భా. రా కర్తలు ప్రయోగించిన వివిధచ్ఛందములలో విశేషచ్ఛందముల ప్రయోగౌచిత్యమును మాత్రము పరిశీలింతము.

లయగ్రాహి

ఇందు ప్రతిపాదమున భ,జ,స,న,భ,జ,స,న,భ,య, అను గణము లుండును. 8, 16, 24 అక్షరములమీద ప్రాసయతులు. తాళలయాన్వితమగు గతివిశేష మిందు కనబడుటచే దీనికి లయగ్రాహి యను నామము సార్థకము. డా. మాధవశర్మగారు పై విధముగ త్రికములతో లక్షణము చెప్పుట యసమంజస మనియు; భల, భల, భల, భల, భల, భల, భల, గగ యను తీరున పాదమును విభజించుట లయానుగుణముగ నుండుననియు తెలిపినారు.[2]

భా రా.న మొత్తమారు లయగ్రాహులు వాడబడినవి. వీనిలో మల్లికార్జునుడు బా. కాం. నందొక్కమారును, హుళక్కి భాస్కరుడు రెండుమారులును, అయ్యలార్యుడు మూడుమారులును ప్రయోగించినారు.[3] అర. కాం. న గల లయగ్రాహి పద్యమొకటి (III, 2, 133) ము. ప్ర. లలో పొరపాటున లయవిభాతిగ చూపబడినది.

దేవతలు తాము రావణునివలన పొందుచున్న బాధలను బ్రహ్మకు తెలుపుదురు. బ్రహ్మ సమస్తసురలను విష్ణువే కాపాడగలడనియు, ఆతనినే శరణుజొచ్చుట యుక్తమనియు వారిని సమాశ్వాసించును. అంత విష్ణుమూర్తి అటకేతెంచును. శంఖచక్రాదులతో విలసిల్లు నా విష్ణుమూర్తి వర్ణనము లయగ్రాహిలో అతిసుందరముగ కావింపబడినది[4] దేవతావర్ణనమున నిబంధింపబడిన విస్తృతమగు నీ వృత్తము లలితమగు గతిచే శ్రోతల హృదయములందు విష్ణుమూర్తి సంపూర్ణ స్వరూపమును ప్రతిబింబింపజేయుచు చిత్తైకాగ్రతా సంపాదకమై యుచితముగా నున్నది.

అరణ్యయుద్ధకాండములందలి లయగ్రాహులు ఈ క్రింది కథాసందర్భములలో నిబద్ధములై యున్నవి.

| | |
|---|---|
| జటాయువు రావణునెదిరించి పోరుట | III, 2, 133 |
| నరాంతకుడు కపులనెదిర్చి చిందఱవందఱ జేయుట | VI-987 |
| కంపనుడు మున్నగురాక్షసులు వానరులనెదిర్చి చిక్కువడజేయుట | VI-1181 |
| ఆంజనేయుడు దానవులను చెండాడుట | VI-1366 |
| వానరవీరులు రావణుని మూలబలముల నుగ్గాడుట | VI-1436 |

నన్నయతిక్కనలు ఈ వృత్తమును శృంగారకరుణాదులగు మృదురసముల యభివ్యక్తికై వాడగా భాస్కరుడు మరియు అయ్యలార్యుడు వీరరసాభివ్యంజనమున నిబంధించినారు. ఎఱ్ఱనయు ఈ వృత్తమును కుంభకర్ణుడు రావణ ప్రబోధితుడై రామలక్ష్మణులతో యుద్ధము చేయబోవు సందర్భమున ప్రయోగించినాడు.[5] పైన పేర్కొన్న లయగ్రాహులలో అర. కాం. మందలిది తా. ప్ర. లలో కానరాదు.

స్రగ్ధర

ప్రకృతి చ్ఛందమున పుట్టిన యీ వృత్తమునకు ప్రతి పాదమున మ, ర, భ, న, య, య అను గణములుండును. ఈ వృత్తప్రయోగ విషయమున ప్రాచీనులు ఈ క్రిందివిధముగ అభిప్రాయపడినారు.

'వీరస్య భుజదండానాం వర్ణనే స్రగ్ధరా భవేత్' (కాత్యాయనుడు)
'సావేగపవనాదీనాం వర్ణనే స్రగ్ధరా మతా' (క్షేమేంద్రుడు)
'రౌద్రే స్రగ్ధరాదయః' (భోజుడు)
'గుర్వక్షరప్రాయకృతం బీభత్సే కరుణే తథా
కదాచిద్వీరరౌద్రాభ్యాం యదాధర్షణజం భవేత్' (భరతుడు)

భా.రా.న ప్రయోగింపబడిన స్రగ్ధరలు మొత్తము తొమ్మిది. ఇవియన్నియు వీరరౌద్రములను వర్ణించుపట్లనే ప్రయుక్తములైనవి. ఆ యా కాండములందు ఈ వృత్తము వాడబడిన సందర్భములు ఈ క్రిందివిధముగ నున్నవి.

అర. కాం.

1. శ్రీరాముడు విరాధుని బాహువులను తునుముట-విరాధుడు నేలపై కూలుట 1 ఆ. 32 ప.
2. జటాయువు రావణునితో పోరాడుట 2 ఆ. 123 ప.

కి. కాం. :

3. సుగ్రీవుడు లక్ష్మణునితో మాల్యవంతమునకు పోవుట 524 ప

యు. కాం. (పూ. భా.)

4. ఇంద్రజిత్తు సుగ్రీవాదికపివీరులపై బాణములు వేసి వారి బలమును నశింపజేయుట. 548 ప.
5. నీలుడు ప్రహస్తుని వింటిని త్రుంచుట 754 ప.
6. రామాదులను సంహరింపుమని రావణుడు కుంభకర్ణుని ప్రేరేపించుట 884 ప.

యు.కాం. (ఉ. భా.)

7. రాముడు యుద్ధరంగమున తనను నొప్పించిన విధమును రావణుడు మండోదరికి తెలుపుట. 1573 ప.

8. రావణుడు కపులను తునుమాడుట. 2066 ప.
9. అగస్త్యుడుపదేశించిన ఆదిత్య హృదయమును శ్రీరాముడు జపించి యుద్ధమున నిలువగా ఏర్పడిన పరిణామము 2079 ప.

మహాస్రగ్ధర

స్రగ్ధరపాదమందలి తొలి గుర్వక్షరమును రెండు లఘువులుగ మార్చిన మహాస్రగ్ధర యగును. రసభావాదివ్యంజకత్వమున నీ రెండు వృత్తములకు భేదము లేదనియే చెప్పవచ్చును. భా.రా.న మొత్తము 13 మహాస్రగ్ధరలున్నవి. భా.రా. కర్తలలో అయో.కాం. కర్త తప్ప తక్కిన కవులందరును మహాస్రగ్ధరను ప్రయోగించినవారే. వీరందరును క్షేమేంద్రాది మతానుసారము వీరరౌద్రాది వ్యంజకముగనే యీ వృత్తమును నిబంధించుట పెక్కుచోట్ల గమనింపవచ్చును.

బా. కాం

1. శ్రీరాముడు విశ్వామిత్రునితో మిథిలకు వెడలు సందర్భమున కావింపబడిన గంగానది వర్ణన. 357 ప.
2. వసిష్ఠుడు కుపితుడై విశ్వామిత్రునిపై బ్రహ్మ దండమును ప్రయోగించుట 592 ప.

అర. కాం.

3. మాయా కురంగము రామాశ్రమ సమీపమున పూరిమేయుచు నిటునటు తిరుగుట. 2 ఆ. 27 ప.
4. జటాయువు రావణునెదిరించుట. 2 ఆ. 136 ప.

సుం. కాం.

5 సముద్రవర్ణన 518 ప.

యు. కాం.

6. సముద్ర వర్ణన 29 ప.
7. కపి సైన్యము లంకమీదికి వెడలునప్పుడు లేచిన ధూళిచే రోదోంతరము కన్పట్టిన తీరు. 494 ప.
8. కుంభకర్ణుడు కపి సైన్యమును నురుమాడుట. 949 ప.
9. ద్వివిదుడు శోణితాక్షుని తెగటార్చుట 1.01 ప.

10. శ్రీరాముడు రావణుని మూలబలము నుగ్గాడుచు వింటిని ధ్వనింపజేయగా కలిగిన పరిణామము. 1448 ప.

11. సంజీవనికై వెడలుచున్న హనుమంతునకు విఘ్నము గావింపుమని రావణుడు కోరగా నిరాకరించిన కాలనేమిని ఆతడాగ్రహించుట. 1630ప.

12. మండోదరి శ్రీరాముని మాహాత్మ్యమును వివరించుచు నాతడు విరాధుని చంపిన విధమును వర్ణించుట. 1920 ప.

13. రామునితో యుద్ధము చేయుచు రావణుడు ప్రయోగించిన గంధర్వాస్త్రమును వర్ణించుట. 2037 ప.

భా. రా. ముద్రిత ప్రతులలో అర. కాం. 1 ఆ. న 267 వ పద్యమును, 2 ఆ. న 391 వ పద్యమును మహాస్రగ్ధరలై యున్నవి. వీనిలో మొదటి పద్యమున శూర్పణఖ తన పరిభవమును రావణునకు చెప్పగా నాతడు కుపితుడగుట వర్ణింపబడినది. ఇక రెండవ పద్యమున కబంధ వర్ణనము కలదు. ఈ రెండు పద్యములు తా. ప్ర. లలో మృగ్యమగుటచే వీనిని భా. రా. కర్తృకములుగ భావింప వీలు లేదు.

మత్తకోకిల

ఈ వృత్తమున ప్రతిపాదమున ర, స, జ, జ, భ, ర అను గణము లుండును. ఇందలి పదునెనిమిది యక్షరములలో పది లఘువులగుటచే దీని యక్షరగతి ఇంచుక ద్రుతమనియు, సప్తమాత్రాక ఖండావృత్తి యగుటచే తాత్మకమగు లయ విలంబితమనియు, కనుక నీ వృత్తము మధుర భావావేశమున హృదయమించుక త్వరితగతియైన స్థితిని వ్యంజించుటకు తగియున్నదనియు భావింప వచ్చును.[6] భా. రా. మొత్తమున అయ్యలార్యుని రచనమున మాత్రమే యీ వృత్తము కానగును.

"పాపచేష్టితుఁ బంక్తికంధరుఁ బాసి యీ రఘురామునిన్
భూపతిన్ శరణంబు సొచ్చెఁ బ్రభూత సద్వినయంబునన్
బ్రాపు గల్గి సమగ్రపుణ్యవిభావమొప్పగువాడు లం
కాపురీ పతియైన దైత్యనికాయవల్లభుఁ జూచితే" (VI. 2628)

రావణవధానంతరము రామాదులయోధ్యానగరము ప్రవేశింతురు అంత పౌరులుత్సాహముతో రామాదుల నొక్కొక్కరిని గూర్చి తమలో తాము చెప్పుకొనుచుందురు. పాపచేష్టితుడగు రావణుని వదలి రఘురాముని శరణుజొచ్చి లంకాపురీపతియైన విభీషణునిగూర్చి చెప్పుకొనుట పై పద్యమున వర్ణింపబడినది. మధురావేశమున హృదయత్వరితగతిస్థితిని వ్యంజింపజేయుటకు ఈ వృత్తమును ప్రయోగించుటలో ఔచిత్యము గలదు.

అర. కాం. 2 ఆ. న మత్తకోకిలా వృత్త మొకటి యున్నది.[7] సీతను తెచ్చుటకు తనకు సాహాయ్యము గావింపుమని రావణుడు మారీచుని కోరినప్పుడు ఆతడు పూర్వము తనకు రాముని వలన కలిగిన పరాభవమును తెలిపి తన నిస్సహాయస్థితిని ప్రకటించుట యీ పద్యమందలి వస్తువు. కాని యీ పద్యము పెక్కు తా. ప్ర. లలో మృగ్యము.

**తరళ**

మత్తకోకిల పాద ప్రథమాక్షరమగు దీర్ఘమును రెండు హ్రస్వములుగ మార్చినచో తరళ వృత్త మేర్పడును. న, భ, ర, స, జ, జ, గ లు ఇందలి గణములు. ఈ వృత్తమును చర్చించుచు డా॥ మాధవశర్మ గారిట్లు తెలిపినారు.

"తరళము అనగా చంచలము. తరంగితము, కంపితము నని యర్థములు. తరళ వృత్తగతియు నట్టిదే. హర్షాదులవలన హృదయగతి చంచలమైన యవస్థను వర్ణించుటకు తరళము తగియుండు నని చెప్పవచ్చును".[8]

భా.రా న అయ్యలార్యుని రచనమున మాత్రమే ఒక్క తరళము కనబడు చున్నది. రావణ వధానంతరము రామాదులయోధ్యను ప్రవేశించినపుడు పౌరులు వారిని గూర్చి పరస్పరము చెప్పుకొను సందర్భమున గల యీ క్రింది తరళమున లక్ష్మణుని ప్రశంస యున్నది.

"ఘనభుజాయుగ శక్తియైఁ ద్రిజగంబులన్ సురరాజు గై
కొనక మాయల దుర్జయుండగు క్రూరసాహసచేష్టలం
దనరు శూరుని మేఘనాథుని దర్పమంతయుఁ దూలగాఁ
దునిమి తేజము నొందు లక్ష్మణుఁ దోయజానన! జూచితే" (VI. 2627)

రామాదుల అయోధ్యా ప్రవేశముచే పౌరుల మనములలో గలిగిన హర్ష భావమును తెలుపుటకు ఈ తరళ వృత్త ప్రయోగమెంతో యుచితముగ నున్నది.

శూర్పణఖ సీతారామలక్ష్మణుల వృత్తాంతమును రావణునకు తెలియజేయు సందర్భమున నొక తరళము ము.ప్ర.లలో కనబడుచున్నది.[9] కాని యిది తా.ప్ర.లలో కానరాకపోవుటచే భా.రా. న ప్రయుక్తమైన తరళవృత్త మొక్కటి యనియే చెప్పవచ్చును.

### కవిరాజవిరాజితము

ము.ప్ర.లలోని అర.కాం. ప్రథమాశ్వాసమున ఒక్క కవిరాజవిరాజితము కనబడుచున్ననను[10] నిదికూడా తా.ప్ర.లలో పెక్కింట కానరాక పోవుటచే నిది ప్రక్షిప్తమని యూహింపవచ్చును.

### పృథ్వీవృత్తము

ఇందలి ప్రతిపాదమున జ, స, జ, స, య, ల, గ అను గణములుండును. ప్రతి చరణమునను ప్రథమ తృతీయ పాదములందు గల జగణములు ఈ వృత్తమునకు ప్రాణములని చెప్పవచ్చును. మధ్యమ గురువగు జగణము ఉత్ప్లుతగతిక మగుటచే పద్య గతియందు ఈ ఉత్ప్లుతి చమత్కార జనకముగా నుండును. ఈ వృత్తము నయ్యలార్యు డొక్కడే ప్రయోగించినాడు.

"ఇతండు హరిసూనుసోదరుఁడహీనసత్త్వోద్ధతుం
డతండరయ వాలినందనుఁ డుదారశీలుండు వా
డతుల్యబలపౌరుషుండురుభుజార్దితారాతి యూ
ర్జిత ప్రకటకీర్తికాంతుఁడు సుషేణుఁ డబ్జాననా! (VI - 2629)

పై నుదాహృతములగు తరళ, మత్తకోకిలావృత్తములు ప్రయోగింపబడిన సందర్భముననే యీ పృథ్వీవృత్తమును కలదు. అయోధ్యాపౌరులు శ్రీరామునకు తోడ్పడిన సుగ్రీవాదివానర వీరులనుగూర్చి హర్షోద్వేగముతో చెప్పుకొనుట యిందలి విషయము. అత్యుత్కటమగు నుత్సాహముచే హృదయమొక్కొక్కసారి ఎగిరి గంతులు వైచినట్లు స్పందించుట యనుభవవిషయము. ఇట్టి పౌరుల హృదయ గతిని సూచించుటకు పృథ్వీవృత్తమెంతయో తగియున్నది.

**లయవిభాతి**

సంస్కృతలాక్షణికులెవ్వరును ఈ వృత్తమును చెప్పినట్లు కానరాదు. ఇందు ప్రతిపాదమున న,స,న,స,స,న,న,స, న యను గణములుండును. ఈ వృత్తము భా.రా.న యు కాం. పూర్వభాగమున రెండు మారులును, ఉత్తర భాగమున రెండుమారులును ప్రయోగింపబడినది. ఈ వృత్తప్రయోగము గల సందర్భములు ఈ క్రిందివిధముగ నున్నవి.

యు.కాం. (పూ.భా.)

i) సుగ్రీవరావణుల మల్లయుద్ధము (477 ప.)
ii) అకంపనహనూమంతుల యుద్ధము (662 ప.)

యు.కాం. (ఉ.భా.)

i) వానరులు రావణుని మూలబలమును చిందరవందర చేయుట (1443ప.)
ii) రావణుడు పాతాళహోమము గావించు సందర్భమున వానరులు రాక్షసులను చెండాడుట (1849 ప.)

యుద్ధము గావించునప్పుడు కలుగు ఉత్సాహమును స్ఫురింపజేయుటకు ఈ వృత్తమెంతయో సమర్థముగ నున్నది.

యతిప్రాసలు

పూర్వలాక్షణికులందరును తమ లక్షణగ్రంథములలో భా.రా.ప్రయోగములను ఉదాహరించియున్నారు. పునరుక్తములగు పద్యములను వదలివేసినచో వీనియందుట్టంకింపబడిన పద్యములు మొత్తము ముప్పదియేడు. ఆయా లక్షణ గ్రంథములందు పేర్కొనబడిన పద్యముల వివరములు దిగువ చూపబడినవి.

| లక్షణగ్రంథము | ఉదాహృతపద్యములు |
| --- | --- |
| కవిసంశయవిచ్ఛేదము | 1 |
| ఆనందరంగరాట్ఛందము | 13 |
| అప్పకవీయము | 14 |
| సర్వలక్షణసారసంగ్రహము | 22 |

| | |
|---|---|
| సుకవిమనోరంజనము | 15 |
| వీరభూపాలీయము[12] | 7 |
| ఆంధ్రప్రయోగరత్నాకరము[13] | 13 |

పై గ్రంథములందుదాహరింపబడిన పద్యములు ఆరు కాండములకు చెందిన వగుటచే భా.రా.కర్తలందరును లాక్షణికులచే ప్రామాణికులుగ గ్రహింపబడిరని చెప్పవచ్చును.

**అఖండయతి**

అచ్సంధిగల శబ్దములందు స్వరప్రధానవశియే పాటింపవలసియున్నను, ఆ శబ్దద్వయమేళనమును అఖండముగ భావించి సంధిస్థలమున నిలిచియున్న వ్యంజనాక్షరమునకే యతికూర్చుట అఖండయతి యనబడును. భీమన, చిత్రకవి పెద్దన, ముద్దరాజు రామన, తాతంభట్టు, కూచిమంచి తిమ్మన, రంగకవి, కూచిమంచి వేంకటరాయకవి మున్నగు లాక్షణికులు ఈ యతిని పేర్కొనినారు. కాని వారు ఉభయయతులనుకూడ విడిగా పేర్కొనుటచే నీ యతి క్వాచిత్కమని భావింప వలసియున్నది. అప్పకవిమాత్రము ఈ యతిని అంగీకరింపలేదు.[14] పూర్వ లాక్షణికులఖండయతికి చూపిన యుదాహృతులనన్నింటిని అప్పకవి ప్రక్షిప్తములుగ భావించి వానికి నూతనపాఠములను కల్పించినాడని విమర్శకుల తలంపు.

భా.రా. నందు అఖండయతి గల యుదాహరణములు దిగువ పేర్కొనబడుచున్నవి.

**బా. కాం.**

i) కులపాలకులగు పుత్రుల
నలువురఁగనియెదవు నీవు ననువొందగ (62 ప.)

ii) మీ, దటు నొకపుణ్యుఁడైన వసుధామరవర్యునిచేత (671 ప.)

**అయో. కాం.**

రామ మీ తండ్రి ధరాధ్యక్షుఁడై యుండి (122 ప.)

**అర. కాం.**

లోలాక్షి యేమి య్యెునొ
నా లక్ష్మణుఁడనియె వగచు నవ్విభుతోడన్ (2,297)

యు. కాం. (పూ.భా.)

ఏ,మనఁగలదిప్డు నీచుఁడగు మర్కటుఁడొక్కఁడు (65 ప.)

ఏ,మన్న ను జెల్లుగాక మణిమండనముఖ్యములైన కానికల్ (141 ప.)

iii) సర్వలో,కైకశరణ్యునింగొలువగా నిటు వచ్చితి (165 ప.)

iv) రుచి,నమరెడునది పంక్తికంఠునగరు (470 ప.)

యు.కాం (ఉ.భా.)

i) దై,త్యావళి రూపుమాపి విహితస్థితినేర్పడ (1893 ప.)

అఖండయతిని సమ్మతింపని యప్పకవి యు.కాం. పూర్వభాగమందలి తొలి రెండుపాదములను తనకనుకూలముగ మార్చుకొన్నను తక్కినవానినేలొకో మార్చుకొనలేదు.

**అప్పకవి మార్చిన పాఠములు**

i) 'ఏ,మన్నఁగొఅంత లేదు మణిహారములాదిగ'

ii) 'సర్వలో, కైకశరణ్యునింగొలువ నిప్పుడు వచ్చితి'

శ్రీ రావూరి దొరసామిశర్మగారు అప్పకవి మార్చిన పాఠములకంటె అఖండయతిపాఠములే సరసములుగ నున్నవని యభిప్రాయపడినారు.[15]

**ఉ - ఋలయతి**

యు.కాం. ఉత్తరభాగరచయితయగు నయ్యలార్యుని రచనమున మాత్రమే ఈ యతికి ప్రయోగములెక్కువగా కనబడుచున్నవి, కి.కా. న నొక్క యుదాహరణము మాత్రము లభించినది. ఈ యతిభేదమును లాక్షణికులు చెప్పనందున పండితులు ఈ యతిగల పాఠములను కొన్నింటిని దిద్దివేసినారు. వ్రా.ప్ర.లలో నీ యతితోగూడిన ప్రయోగములే కనబడుచున్నవి. మొదట వ్రాతప్రతిపాఠమును, తరువాత ము.ప్ర.పాఠమును దిగువ పేర్కొనబడుచున్నవి.

i) పృథివిఁ బగిల్చి హేమమయ పుంఖశరంబుల (VI-2015)

పృథివిఁ బగిల్చి బంగరపు ఖింజల యమ్ముల

ii) పృథుతర విస్మయక్రమము పొంపిరి వోవగ (VI-2021)
పృథుతర విస్మయక్రమము పెంపొనరంగను

iii) కృతకోదంచితమత్స్యమై యతఁడతిక్రూరాత్ముఁడై (VI-1905)
కృతకోదంచితమత్స్యమై యతఁడతిక్లేశాత్ముఁడై.

పండితులు తమ దృష్టికి వచ్చిన పై యుదాహరణములను కొన్నింటిని దిద్దినారు. కాని వారి దృష్టిలో పడక దిద్దుబాటుకు గురికాని మరికొన్ని యుదాహరణములు లేకపోలేదు. అవి దిగువ పేర్కొనబడుచున్నవి.

**కిష్కింధాకాండము**

పుష్కలబలశాలి వాలి పృథుతరబాహా (152 ప.)

**యుద్ధ కాండము (ఉ.భా.)**

i) క్రూరార్ధచంద్రాస్త్రకృత్తోరుబాహులై (1456 ప.)
ii) కొని యల్లన కాలనేమి గృహమున కేగెన్ (1617 ప.)
iii) పొరి గడవంగఁ జొచ్చె సురబృందము (1324 ప.)
iv) భువనోదరమెల్ల నిండఁ బృథుసంచరమై (1361 ప.)
v) నలి నగరవరణ దుర్గం
బులు జతనము సేసి దనుజబృందమ్ములు (1836 ప.)
vi) పోరనితఁడు పిన్నవాడ పృథుబాణమునన్ (1915 ప.)
vii) సురనది వీచులందడియు శృంగములన్ (2527 ప.)
viii) భూరమణుండు నంత సురబృందము లాదట (2145 ప.)
ix) భుజగరాజభోగపృథులతరాయత (2151 ప.)

**పు - మో లయతి**

అప్పకవి మువిభక్తియతిని, ముకారయతిని పేర్కొనినాడు. పు, ఫు, బు, భులకు విభక్తిముకారముతో యతి చెల్లుట మువిభక్తికయతి, సాధారణ మువర్ణమునకు పు, ఫు, బు, భు లతో యతి చెల్లుట ముకారయతి. ఈ రెండింటికిని అప్పకవి ఉకారసహితమగు మువర్ణముతో యతి కూర్పబడిన ఉదాహరణములనే చూపియున్నాడు [16] దీనినిబట్టి ఊ, ఒ, ఓ లతో గూడిన మువర్ణమున కవే వర్ణ

ములతోఁగూడిన పఫబభలతో యతిమైత్రి కూడదని తెలియుచున్నది. ఈ విషయమున అప్పకవి స్పష్టముగ తెలియజేయలేదు భా.రా.న పు-మోలకు యతి కూర్పబడిన ఉదాహరణమొక్కటి యు.కాం.న కనబడుచున్నది.

"ఏ, పున బంధించినవన్నియున్ మఱచితేమోహంబునుంగల్గెనే"

(1349 ప.)

ఆ.రం.ఛం.న నీ పద్యము చక్కటియతికి దృష్టాంతముగ చూపబడినది.[17]

ద్రు - తి ల యతి

వరవసంతుఁడు లేని వనలక్ష్మి కైవడి

ద్రుమముతోఁ బాసిన తీఁగఁ బోలి (VI-1940 ప.)

వ్రా.ప్ర. లలో కనబడుచున్న యీ యతి ప్రయోగము లాక్షణికోక్తము కానందున పండితులు ఈ పాఠమును క్రింది రీతిగ మార్చి యుందురు.

ధృతిఁ దరువును బాయు తీఁగఁ బోలి (VI-1940)

ఈ ము. ప్ర. పాఠమున క్రొత్తగా చేర్చిన ధృతిపదముచే యతిని సవరించినను ఆపదమునకు సార్థక్యము కనబడదు. వ్రా. ప్ర. పాఠమే సముచితముగ నున్నది.

ర - ల ల యతి

అప్పకవి "రవర్ణమునకును, లకారమునకును గ్రాహ్యంబుగాదు, వానికిని లక్షణ విలాసమువారు తెలియక కొన్ని యుదాహరణంబులు వ్రాసినారు; అవియు వివరించెద" నని తెలుపుచు లక్షణవిలాసమున 'ర-లల యతికి ఉదాహరణముగ నీయబడిన "శారదాభ్రవి, లీనత నేపారు చంద్రరేఖయపోలెన్" అను భా. రా. పద్యము (VI, 2332)ను పేర్కొని యందలి యతిస్థానగతమగు శబ్దము రేఖాశబ్దము కాదనియు, లేఖాశబ్దమనియు విమర్శించెను.[18] కాని కస్తూరి రంగ కవియు, కూచిమంచి వేంకటరాయకవియు పై పద్యమును అభేదయతి కుదాహరణముగ నిచ్చుటచే నిందు ప్రయుక్తమైనది 'రేఖా' శబ్దమనియే భావింప వచ్చును.[19] ర, లల యతని సమ్మతింపని అప్పకవి రేఖాశబ్దమును లేఖాశబ్దముగ భావించియుండును.

ప్రాదియతి

ప్ర, పరా మున్నగు ఉపసర్గలకు స్వరాదియగు ధాతువుతో సంధిచేసి నప్పుడు పూర్వపదాద్యచ్చునకుగాని, సంధియందలి వ్యంజనమునకుగాని యతి చెల్లుటను ప్రాదియతి యందురు.[20] భా.రా. న నీ యతికెన్నియో యుదాహరణము లున్నవి. దిగువ నీయబడిన పద్యమును ప్రాదియతికొక విలక్షణమైన యుదాహరణ ముగ పేర్కొనవచ్చును.

ఇచటికి సార్ధయోజనసమీపమునన్ (III, 1, 36)

'సంగతా ఆపో యత్ర' అని సమీపశబ్దవ్యుత్పత్తి. అనగా సమ్ + ఆప్ అను రెండు శబ్దముల సయోజనమున నీ శబ్దమేర్పడినదన్నమాట. ఇట ప్రాది యతినియమము ప్రకారము పరపదాద్యచ్చుకు యతి చెప్పవలసియున్నది. కాని ఇవర్ణమునకు 'ఆప్'లోని ఆకారముతో యతిమైత్రి కుదురదుకదా! కనుక సంధిలో వచ్చిన 'ఈ' కారమునకే యిట యతి చెప్పవలయును. ఇట్లు యతిని కూర్చుట విలక్షణముగ భావింపవచ్చును.

త్మ-నల యతి

తకారము బిందుపూర్వకమగునపుడే దానికి నకారముతో యతి చెల్లును. కేవల తకారమునకు నకారముతో యతిమైత్రి లేదు. కాని 'త్మ' యను సంయుక్తా క్షరమునకు నకారముతో యతి కూర్చిన ప్రయోగమొక్కటి భా. రా. న కనబడు చున్నది.

"ఆత్మన్నిండారగఁజేసి మీరిచటి కానన్ వచ్చియుండంగ" (IV, 109)

ఆనందాశ్రమ ప్రతియందును, కరాలపాటివారి ప్రతియందును నీ పాఠమే కలదు.

పలుకక్కి భాస్కరుని రచనమున నొక వింత యతిప్రయోగము కానవచ్చు చున్నది. చూడుడు.

"తెంపు మే, కొని నీ కెత్తిన కాలదండమున నా యుద్దండ దోర్దండమున్" (VI-818)

ఈ పద్యపాదమున 'కొను' నందలి 'కొ' వర్ణమునకు 'ఉద్దండ' శబ్దము లోని ఉకారముతో యతి వేయబడినది. ము. ప్ర. లన్నింట నీ పాఠమే కలదు. తా. ప్ర. లలో మాత్రము 'తెంపుమై, నొనరన్నొత్తిన....యుద్దండదోర్దండమున్" అను పాఠమే కలదు. ఈ పాఠమున యతి సంగతమే.

అయ్యలార్యుని రచనమున ఉకారమునకు 'నొంచి' యను పదమునందలి 'నొ'కారముతో యతి కూర్పబడిన యుదాహరణ మొక్కటి కన్పట్టుచున్నది.

"పై, కుటికి తనూరుహాసిహతి నొంచుచు బిట్టుగ...." (VI. 1962)

'నొంచు' పదమే కాని 'ఒంచు' అను పదము లేదు. కావున నిట ఉకారము నకు ఒకారముతో యతి సవరింపబూనుట పొసగదు. 'పైకుటికి' యను పాఠము నకు బదులుగా 'పైనుటికి, యను పాఠమును గ్రహించినచో అఖండయతిని గ్రహింపవలసియుండును.

ద-డ ప్రాస

అప్రశస్తములగు ప్రాసజాలము లలం
కారవిస్మితములు గావు గానఁ
దివిరి ధూర్తులైన కవులు కల్పనఁజేసి
యొప్పిదంబులనుచుఁ జెప్పరాదు (అ. క. III. 378)

అను పద్యమున నప్పకవి లాక్షణిక సమ్మతములు కాని ప్రాసములు అప్రశస్తములనియు, ధూర్తకవులు మహాకవిప్రయుక్తములు కాని అప్రశస్త ప్రాసములను కల్పించి ప్రయోగించినంతమాత్రమున వానిని యోగ్యములని చెప్పరాదనియు వివరించి వానికి ద, డ ప్రాసముగల యీ క్రింది భా.రా. పద్యము నుదాహరించెను.

'కడుకొని వేడిబాష్పములు గ్రమ్మి పయింబయిఁబర్వ భీతిమై
నడరుచు విన్ననైన హృదయంబునఁ బొల్పగు హారయష్టి ప
య్యద దడియంగఁ గానఁబడి యంచితనిర్మలరత్నభూషలం
దదుచితదృశ్యమానమణిధామసముజ్జ్వలభాతిఁదోపగన్' (VI-2356)

భా.రా. ముద్రితప్రతులందును, లక్షణ సారసంగ్రహ, సుకవి మనో రంజనములందును సమప్రాస గల పాఠమే కలదు. 'కడుకొని' బదులు 'కదిరిన' యనియు; 'అడరుచు'కు బదులు 'అదరుచు'ననియు నందు పాఠములు గలవు. బి. రా. రా. ప్రతిలో కడుకొని, అడరుచు అను పాఠములు కనిపించుచున్నవి.[21] అప్పకవి మతమున నీ ద-డ ప్రాస యప్రశస్తప్రాసమని చెప్పవలసియుండును. ఇతరత్ర అయ్యలార్యుని ప్రామాణికునిగ గ్రహించి యిట మాత్రము ధూర్తకవిగా పేర్కొనుటకు కారణము తెలియదు.

ర-ఱ ప్రాస

అప్పకవి 'ప్రాసవైరి'మను ప్రాసభేదమున ర-ఱల ప్రాసమును నిషేధించినాడు. అంతేకాక ఏయే శబ్దములందు రేఫఱకారములున్నవో యెఱుగక కుకవులు ప్రాసవైరమును పాటింపక ర-ఱలకు ప్రాసమును కూర్తురనియు తెలిపినాడు. కాని మహాకవులే ర-ఱప్రాసమును కూర్చియున్నారు. శ్రీ రావూరి దొరసామిశర్మగారు కాశీఖండము, పాండురంగ మాహాత్మ్యము, కాళహస్తి మాహాత్మ్యము మొదలైన ప్రసిద్ధగ్రంథములందలి ర-ఱప్రాససాంకర్యము గల ప్రయోగముల నెన్నింటినో తమ అ.క.భా.ప్ర.లో చూపియున్నారు.[23] భారత కవులలో తిక్కన, ఎఱ్ఱనలు ఈ ప్రాసను పాటించినారు.[24] భా.రా.న ఈ ప్రాసగల క్రింది యుదాహరణములు రెండు కనబడుచున్నవి.

i) హరివీరావయవంబులోలి రథరథ్యాపార్శ్వభాగంబులం
దఱుచైయుండ ఘనాస్రపంకములు మేదఃఫేనముల్ (V-753)

ii) ధరణిజ నాత్మలోఁదలచి తద్దయు శోకముఁ బొంది బాష్పముల్
దొరగగ వెచ్చ నూర్చుచును దుఃఖపరంపర నిద్ర లేక తా
నొఱలుచు లేచుచున్ వనటనొందుచుఁ గన్నులు సాము మూయుచుం
బొరిఁబొరిఁదేఱి చూచుచును భూవిభుఁడుండెను దుఃఖితాత్ముఁడై (IV-377)

రెండవ పద్యమున ము.ప్ర.లలో 'ఒరలుచు' అను సాధురేఫపాఠమే యున్నది. కాని యిందు శకటరేఫమే సాధువు. శ.ర.నను, సూ.ఆం.ని.నందును శకటరేఫయుక్తరూపమే చూపబడినది.

**విసర్గపూర్వత ప్రాసాక్షరమునకు విసర్గము లేని అక్షరముతో ప్రాస కూర్చుట :**

'నీ క్షత్రాఢ్యబలంబు సర్వముఁ జనన్వీక్షింప నీ వంశమున్
నిఃక్షత్రంబుగఁజేయు నాదు బలమున్వే చూపెదన్ నేఁడు సూ
క్ష్మక్షాంతింబరికించి చూడుము విపక్షక్షత్రపక్షావళీ
శిక్షాదండము బ్రహ్మదండము నరిశ్రేణీభిదోద్దండమున్' (I, 584)

ము.ప్ర.లలో 'నిక్షత్రము' అని విసర్గరహితముగనే కలదు. కాని నిస్ + క్షత్రము అను పదములకు సంధిచేసినపుడు 'నిఃక్షత్రము' అను రూపమే యేర్పడును.

**శ-స ప్రాస :**

అప్పకవి ఉభయప్రాసలలో స,షలకు మాత్రమే ప్రాసమైత్రిని చెప్పినాడు. ఈతనికి శ,సల ప్రాసమైత్రి సమ్మతము గాదని యాతని యీ క్రింది పద్యముల వలన తెలియుచున్నది.

శ,స లెఱుగక చదువంగా
బొసగదెట్లనిన.................

"సింగంబు, సింగిణి, సెవమును, సెలగోల
వీసెడు పసిగొన జేసిరనగ
భీష్మసన్నుత యివి తృతీయోష్మలిపులు
గాని ప్రథమోష్మవర్ణముల్గావు వీనిఁ
దెలియక రచించు కృతులు ధాత్రీతలమునఁ
బ్రాసభంగంబులై నగుబాటుఁజెందు"

భా.రా.న నీ క్రింది ఒక్క పద్యమున శ-సప్రాస ప్రయుక్తమైనది.

చేసియుఁ గంతముల్ దునిమి చిందఱవందఱ గాఁగఁ ద్రోలినం
గీశులు భీతిఁబొంది తమకించుచు రాఘవుమర్వ సొచ్చినన్ (VI-1446)

శ్రీ రావూరి దొరసామిశర్మగారు తమ అ. క. భా. ప్ర లో శ - స ప్రాస గల యెఱ్ఱనాది ప్రాచీనకవుల ప్రయోగములను కొన్నింటిని చూపియున్నారు.[26] అప్పకవికి సమ్మతము కానంత మాత్రమున నీ యతి దుష్టమనుటకు వీలు లేదు. కస్తూరి రంగకవి యీ ప్రాసమును పేర్కొనినాడు.[27]

**సంయుక్త విశేషప్రాసము :**

ప్రాసాక్షరము ఒక పాదమున సంయుక్తముగ నున్నపుడు అన్ని పాదము లందును ప్రాసాక్షరమదే సంయుక్తము కలదిగ నుండవలయును. అనగా ఒక ప్రాసాక్షరమునందలి సంయుక్త వర్ణములలో ఎన్ని హల్లులు ఏ క్రమమున కూడి యుండునో అదే క్రమముతో తక్కిన ప్రాసస్థానములలో నుండవలెనని భావము. అప్పకవి దీనిని సంయుక్తాక్షర ప్రాసమని పేర్కొనినాడు. దీనికి భిన్నముగ భా. రా. న నీ క్రింది పద్యమొకటి కనబడుచున్నది.

"ఇక్ష్వాకువంశవర్ధనుఁ
డక్షయబలశాలి భోగహరిహయుఁడు లస
ద్దీక్షిత యజ్ఞధురంధరుఁ
డక్షీణసధర్మపరుడు యార్యనుతుండున్." (I-45)

కాని యీ పద్యము వావిళ్ళ ప్రతిలో కుండలీకరణమున చూపబడి యుండుటచే నిది తరువాతివారిచే ప్రక్షిప్తమై యుండునని యూహింపవచ్చును.

**ర - వ ప్రాసము :**

ర, వలకు ఏ లాక్షణికుడును ప్రాసమైత్రిని చెప్పలేదు. అయ్యలార్యుని రచనలో రవలకు ప్రాసకూర్చబడిన ఈ కింది పద్యము కనబడుచున్నది.

రవివర బింబ మూర్ధ్వగత రశ్మికమై పరిలంబమానమై
వరుణహరి ద్వధూటికర వారిధితోయము చేదు వేడుకం
గరపరిముక్తమైన కనకంపుఘటంబునఁ జక్రవాకికా
విరహకృశానుకూటమన వీక్షణదృశ్యతనొందె నెంతయున్. (VI-2636)

మొదటి పాదములోని 'రవివర బింబ'మను పాఠమును 'వరరవి బింబ 'మ'ని మార్చినపుడు ఈ ప్రాసలోని దోషము తొలగిపోయినను వ, రలకు యతి కూర్చుట అసంగతమగును. భాస్కర రామాయణ తాళపత్ర ప్రతులను సంప్ర దించి సరియైన పాఠమును గుర్తించిననే కాని ఈ ప్రాసవిషయమున నిర్దుష్టమగు నిర్ణయమును చేయుట సాధ్యము కాదు. అంతవరకు ఈ ప్రాసమును విలక్షణమైనది గానే భావింపవలసియుండును.

సంస్కృతమున అనుప్రాసమే కాని ప్రాసము లేదు. అనుప్రాసము వలె ప్రాసయు రసావహమే. ప్రాసమున సదృశవర్ణావృత్తిచే శ్రావ్యత నాపాదింప జేయవచ్చును. అంతేకాక రసప్రసంగమున్నచోట అది రసాభివ్యంజకమును కావలసి యుండును. రసప్రసంగము లేనియెడల శ్రుతిసుభగతయే ప్రయోజన మని చెప్పవచ్చును. అప్పకవి యీ క్రింది సప్తవిధ ప్రాసములను పేర్కొని నాడు.[28]

1. సుకరప్రాసము, 2. దుష్కరప్రాసము, 3. ద్వంద్వప్రాసము, 4. త్ర్యక్షరప్రాసము, 5. చతుష్ప్రాసము. 6. అంత్యప్రాసము, 7. అను ప్రాసము.

## 1. సుకరప్రాసము

'ప్రాసంబు సులభాక్షరంబైన సుకరంబు' అని అప్పకవిలక్షణము. అసం యుక్తములు, అద్విరుక్తములు, అబిందుపూర్వకములు, అల్పప్రాణములునై సుఖముగా నుచ్చరింపదగిన యక్షరములు సుకరప్రాసాక్షరములని డా॥ మాధవ శర్మగారు వివరించినారు.[29] త,ద,న,మ,య,ర,ల,వ,స మున్నగువర్ణములతోడి ప్రాస కూర్చుట సుకరమని శ్రీ రావూరి దొరసామిశర్మగారి యభిప్రాయము.[30] సుకరప్రాస అతిసాధారణమగుటచే దీనిని గూర్చి వివరించుట యనావశ్యకము.

## దుష్కరప్రాసము :

స్థానకరణప్రయత్నాదులందు విషమములగు వర్ణముల సంయోగములు, విసర్గపూర్వకములు దుష్కరప్రాసాక్షరములు. ఇవి భాషలో తరుచుగా రానట్టివి. అంతేకాక ఉచ్చారణముననను, శ్రవణముననను ఇవి క్లేశకరములు. ర్ఘ,స్ఫ,క్ష,ష్మ,

ఘ్న, ష్క, చ్ఛ్రి, ధ్వ మున్నగునవన్నియు దుష్కర ప్రాసాక్షరములే. సుకర ప్రాసాక్షరములుండగా కవి వీనిని ప్రాసాక్షరములుగ కూర్చుట రసాదివ్యంజ కతాధర్మమును పోషించుటకొఱకే. భా.రా.న ఇట్టి దుష్కర ప్రాసములెన్నియో కలవు. కొన్ని మాత్రమే దిగువ నుదాహరింపబడుచున్నవి.

| | |
|---|---|
| క్ర ప్రాస | **III**, 1, 27 |
| క్ష ,, | **I**, 566; **III**, 1,38; 165; **III**, 2, 175 |
| క్ష్మ ,, | **VI**, 2366 |
| క్త ,, | **III**, 1, 169 |
| గ్ర ,, | **III**, 2, 411; **IV**, 26 |
| ఘ్న ,, | **VI**, 246; **VI**, 1284 |
| చ్ఛ్రి ,, | **VI**, 1273 |
| ణ్ణ ,, | **VI**, 2386 |
| ధ్య ,, | **VI**, 1252 |
| ర్ణ ,, | **VI**, 290, 2066 |
| ర్జ ,, | **VI**, 672, 857 |
| ర్ఘ ,, | **VI**, 2029 |
| ష్మ ,, | **VI**, 2048 |
| ష్క ,, | **IV**, 367; **VI**, 1472, 2041 |
| స్ఫ ,, | **VI**, 1782, 552 |
| ష్య ,, | **VI**, 2043 |
| స్త్ర ,, | **V**, 406 |

**ద్విప్రాసము**

"మఱి ద్విప్రాసంబనిన రెండక్షరములు ప్రాసంబడి చెప్పునది" అని రేచన. అప్పకవి దీనిని ద్వంద్వప్రాసమని పేర్కొనెను. లాక్షణికులు చూపిన యుదాహరణములనుబట్టి యీప్రాసము పాదచతుష్టయమున నుండవలెనని తెలియు చున్నది. కాని పాదద్వయమందును, పాదత్రయమందును మాత్రమే యున్నను ద్విత్రిప్రాసములు సౌందర్య హేతువులు కావచ్చును. భా. రా. న పాదద్వయము నను, పాదత్రయమునను ద్విప్రాసలు కూర్పబడిన యుదాహరణములనేకములు

కలవు. పాదచతుష్టయమున నీ ప్రాసము కూర్చబడిన యుదాహరణములు దిగువ చూపబడుచున్నవి.

బాలకాండము I, 353, 696
అరణ్యకాండము III-1-163; III-2-112
సుందరకాండము V-10, 46, 532
యుద్ధకాండము VI-1587, 1635, 1726, 1856, 1841, 1943; 2039, 2495, 2668, 2504.

త్రిప్రాసము

భా. రా. కర్తలు ఈ ప్రాసమును పాదచతుష్టయమున అతివిరళముగ ప్రయోగించినారు. ఒక్క యుదాహరణము మాత్రము యు. కాం. న కనబడు చున్నది.

"అలగిరి సేంద్రదిక్పతు లహుంకృతి" (VI-1841)

నాలుగుపాదములందును నిర్వహింపబడిన చతుష్ప్రాసములు భా. రా. న కనబడవు.

ఛందమున ప్రాసాక్షరము ననేకపర్యాయములు నిబంధించినచో నది అనుప్రాసమను ఛందోలంకారము. మధురసుకుమారాక్షరానుప్రాసము మధురరసము లందును, కటుపరుషాక్షరానుప్రాసము దీప్తరసములందును ఉచితముగా నుండు ననియు, రసప్రసంగము లేనిపట్లను అనుప్రాసము ఛందస్సును శ్రుతిరంజకము గావించి చరితార్థమే యగుననియు డా॥ మాధవశర్మగారు వివరించినారు.[31] ఆలంకారికులు ఈ అనుప్రాసమును వృత్త్యనుప్రాసమను పేరుతో వ్యవహరించినారు. భా.రా. కర్తలందరును అనుప్రాసములపై మిక్కిలి మక్కువ చూపినవారే. కొన్ని ఉదాహరణముల నిట పరిశీలింతము,

i) "కడు బెగడు గుడిచె భువనము
లుడుగక జడనిధులు గలఁగె నుడుపథమునఁ బె
న్మిడుగులు లెడనెడఁ బొడమఁగ
వడిఁబిడుగులు వడియెఁ బుడమి వడవడ వడకెన్" (I, 667)

విశ్వామిత్రుడు ఘోరతపమాచరించుచుండగా కలిగిన ఉత్పాతములను వర్ణించెడి పద్యమిది. ఇందు ప్రాసాక్షరమగు డకారము పునఃపునరావృత్తమై యుత్పాతముల భీకరత్వమును చక్కగా వ్యక్తము చేయుచున్నది. ఈ పద్యమున పూర్వోత్తరార్ధముల యంత్యాక్షరములు తప్ప తక్కిన వర్ణము లన్నియు లఘ్వక్షరములే యగుట మరొక విశేషము.

ii) చండభుజాదండోద్ధుర
దండధరోద్దండకాలదండక్రీడో
చ్చండగతి బ్రహ్మదండ మ
ఖండత్వర నెత్తికొనుచుఁగౌశికుతోడన్" (I, 582)

విశ్వామిత్రుడు తన యాశ్రమముపై నాగ్నేయబాణములను ప్రయోగించు చుండగా క్రుద్ధుడైన వసిష్ఠుడు బ్రహ్మదండము నెత్తుకొనుటను వర్ణించు పద్యమిది. ఇందు బిందుపూర్వక డకారప్రాసాక్షరపునరుక్తి వసిష్ఠుని కోపతీవ్రతను, బ్రహ్మ దండపు చండతను చక్కగా వ్యంజింపజేయుచున్నది. రసభావవ్యంజకములగు నిట్టి యనుప్రాసములు భా.రా.న పెక్కులుగలవు.

## సూచికలు :

1. ఈ వివరములు వావిళ్లవారు 1923 లో ప్రచురించిన భా. రా ప్రతి నను సరించి వ్రాయబడినవి.
2. ఛందశ్శిల్పము 323 పు
3. బా కాం. 144; అర.కాం. 2 ఆ 133 ప; యుం.కాం. 987, 1181, 1366, 1436.
4. బా.కాం. 144.
5. ఆం మ భా. III, 7, 97.
6. ఛందశ్శిల్పము 341 పు.
7. III, 2, 8.
8. ఛందశ్శిల్పము 348 పు.
9. III, 1, 279.

10. III, 1, 239.
11. ఛందశ్శిల్పము 321 పు.
12. ఇది Bulletin of the Govt. Oriental Mss. Library, Madras, Vol. XIX, No. 1 లో ముద్రితమైనది. దీని కర్త యెవరో తెలియదు. ఇది కఋవె వీరరాజున కంకితము.
13. ఇది అముద్రితము; తంజావూర్ సరస్వతీ మహల్ గ్రంథాలయమున దీని ప్రతి గలదు.
14. అప్పకవీయము III, 202
15. అప్పకవీయ భావ ప్రకాశిక 269 పు.
16. అప్పకవీయము III, 69-75.
17. 106 పు.
18. అప్పకవీయము III, 271 - 273.
19. ఆ. రం. ఛం. III, 279; సు. మ. రం. 146 పు.
20. అప్పకవీయము III, 314.
21. 257 పు. 'బి' మూడవ లైను.
22. అప్పకవీయము III, 344.
23. 239 పు.
24. ఆం. మ. భా. ద్రోణ. I, 175; అర. iv, 199.
25. అప్పకవీయము II, 258-260.
26. 288 పు.
27. ఆ. రం. ఛం. III, 101.
28. అప్పకవీయము III, 381.
29. ఛం. శి. 155 పు.
30. అ.క.భా ప్ర. 260 పు
31. ఛం. శి. 187 పు.

# భాస్కర రామాయణము భాషా విశేషములు

భా.రా. బహుకర్తృకమైనను భాషావిషయమున సలక్షణమైనదని పండితులందరును అంగీకరించిన విషయము. అప్పకవి మున్నగు ఛందశ్శాస్త్రకర్తలును, ప్రౌఢవ్యాకర్త మున్నగు వ్యాకర్తలును, కూచిమంచి తిమ్మకవి మొదలగు లాక్షణికులును ఈ గ్రంథమునుండి యనేకములగు నుదాహరణములను గ్రహించి చూపుటయే యిందుకు ప్రమాణము. వ్యాకరణ విరుద్ధములగు కొన్ని ప్రయోగములు క్వాచిత్కముగ కనిపించినను వానిని 'నిరంకుశాః కవయః' అను సూక్తికి ఉదాహరణములుగ చెప్పవచ్చును. మొత్తముమీద నా రామాయణము ప్రాచీనాంధ్ర భాషా సంప్రదాయముల ననుసరించియే రచితమనుటలో సందేహము లేదు. ఇక నీ రామాయణమందలి భాషాప్రయోగవిశేషములను పరిశీలింతము.

ధ్వనుల మార్పులు

లోపదీర్ఘత

కైకోక III-1-29; (ఏలా చిక్కుల బెట్టెదు) III - 2-279.

తెచ్చికోవలయు III - 1-256; ఏడ IV - 380.

కోపాన IV-60; అంబునిధి గడాకమున్న VI - 52 & 136.

సాహసానకు VI-739; ఆత్మ మజాకుమింక VI - 1776.

దీర్ఘము రాక లోపము మాత్రమే వచ్చిన 'చుట్టలు' అను రూపము (VI-761) పాలకుర్కి భాస్కరుని రచనమున కానవచ్చుచున్నది.

కలను, కలరు శబ్దములలోని లకారముమీది అకారమునకు దీర్ఘము వచ్చిన రూపములు కొన్ని భా.రా.న కనబడుచున్నవి.

భస్మముఁ గాఁగలారు I, 427
భోగములు పొందగలానటె II, 358
జగములందుఁ గలారె VI, 2206

తచ్ఛబ్దము లోపించి పూర్వస్వరమునకు దీర్ఘము రాగా పై రూపము లేర్పడినవని చెప్పవచ్చును.

**దీర్ఘమునకు బదులు హ్రస్వము**

అన్నంతమగు అగు ధాతువు దీర్ఘమునకు 'చొచ్చు' ధాతువు పరమగు నపుడు హ్రస్వము వచ్చిన రూపమొక్కటి కి.కాం.న ప్రయుక్తము.

మనము నీఱుగఁ జొచ్చెన్ IV, 297
ఇట మనము నీఱుగాఁజొచ్చెనని భావము.

**ధాతువు చివరి వర్ణమునకు లోపము**

మఱచు, గెలుచు అను ధాతువుల లూఙ్మధ్యమపురుషైక వచనమునందు ధాతువు చివరివర్ణము లోపించిన రూపములు హుళక్కి భాస్కరుని రచనమున కనబడుచున్నవి.

మఱుమింకన్ VI-384; గెలుడింకన్ VI-516

**వర్ణవినిమయము (Free Variation)**

**ల బదులు డ**

'రలయోర్లడయో స్తద్వల్లళయోశ్శసయోరపి
వబయోర్నణయోశ్చాంతే స్యాదభేదేన కల్పనమ్"

అను నభియుక్తోక్తిప్రకారము లడలు అభిన్నములు కదా! కనుక లకార యుక్తమగు రూపముతోపాటు డకారయుక్తమగు రూపమును ప్రయుక్తము కావచ్చును. జలనిధి యను పదము జడనిధియను డకారయుక్తరూపముగ అనేకస్థలములందు ప్రయుక్తమైనది.

'కదలెత్తి మ్రోయవెఱచును
జడనిధులు ............ I-137

'జడనిధి దాటుచో నడుమ మైనాకంబు' V-631
'జడనిధి మునింగి లక్ష్మణుఁడు VI-393
'తడయక యా కుంభుఁడు న
జ్జడనిధిలో వెడలివచ్చె................ VI-1220
'జడనిధుల మీఁటి కపులను VI-1323
'జడములలోనికి నరిగెన్ VI-1660

'గ' బదులు 'వ'

'[అవనిజ లక్ష్మణుఁ దన ప్రియు
డవు రామవిభుం దలఁచి] III-2-214
'కావున నీ వీ రాతిరి
వేవెడు నీలోన............VI-1099
'పొవులుచు కాసారకూలభూముల నుండెన్ VI, 2661
'దివియు భువియు దెసలు బవిలిన గతి ప్రోయ VI, 1230.

పైవానిలో తొలి మూడు ఉదాహరణములందు ప్రాసస్థానమునను, చివరి యుదాహరణమున ప్రాసయతిస్థానమునను ప్రయుక్తములగుటచే నీ ప్రయోగములు నిర్ధారకములే.

**పదమధ్యాజ్లోపము**

పదమధ్యమందలి న,ల,డ యను మూడుహల్లులపై నున్న యచ్చులకు లోపము వచ్చిన యీ క్రింది ప్రయోగములు భా.రా.న కానవచ్చుచున్నవి.

i) ఇంద్రుమన్మని VI-688

ii) అడ్గునూది VI-1614; సురేశ్వరుని కడ్మిన్ గిట్టి I-494; ఎడ్దముల్లు VI-433.

iii) రెన్నెల్లనాక V-202; రెన్నెల్లలోన V-204; పొల్తుల చేష్టలు VI-2363 రోదసి వెల్తిగా VI-654;

నువర్ణాంతములపై నేర్పడు భావార్థకపదములయందును నిట్టి యజ్లోపము కానవచ్చుచున్నది. "టవర్ణః క్రియాంతే స్యాద్భావార్థే సాసమాసయోః, పూర్వస్య వికారో నోః" అను నథర్వణకారిక నాధారముగ చేసుకొని యహోపలపతి 'పూర్వస్య న వికారో నోరిత్యనేన అంట, వింట, కొంట ఇత్యాదిప్రయోగస్య భావార్థే న సాధుత్వమ్, కింతు అనుట ఇత్యాదిరేవ, ఏతేన మధుకైభారాతి మఱది రమ్మని పిల్చి పనిగొంట నీకు, బ్రాభవము గాదెః ఇత్యాదివచనస్య ప్రామాదికత్వమేవేత్యవధేయమ్" ఇత్యాదిగా అంట, వింట, కొంట. మున్నగు అజ్లోప సహితరూపము లసాధువులే యని యుద్ఘోషించెను.[2] ఇట్టి ప్రయోగములు తిక్కన భారతమునను కాననగును.

పాండునృపాలుపాలు గై కొంటయె చాలు (ఉద్యో. III-59)

భా.రా.నను ఇట్టి ప్రయోగములు అర.కాం.నను, యు.కాం. ఉత్తర - భాగమునను కానవచ్చుచున్నవి.

హా లక్ష్మణా యంటగా వింటి III-2-65

తిరుగన్ రాదంటఁ దా మిథ్యయే VI-1398

తూపులు గొంట VI-2030

ఇట్లే 'ఉండుట' యను భావార్థకరూపమునకు బదులుగా 'ఉంట' యను రూపము అయ్యలార్యుని రచనమున చోటుచేసుకొన్నది.

వనమున నుంట VI-1184; వచ్చుచుంట VI-1278

సప్రాణుడై యుంట VI-1602; కాకుంట VI-1718

రాకుంట VI-1902; తగనుంటఁజేసి VI-2170

వర్ణవ్యత్యయము

పెద్దవాడు నాక VI-89; జగత్ప్రాణుండు నారే VI-1092

పాపము నాక VI-2317; కాదు నాక VI-2416

ప్రయాసము నాక VI-2617.

## సంధి

### అకారసంధి

'అత్తునకు సంధి బహుళము' (బా. వ్యా. II-4) అని సూత్రించుచు చి. సూ. స్త్రీవాచకతత్సమ సంబోధనాంతముల అకారమునకు సంధి లేదని వివరించెను. భా. రా. న స్త్రీవాచకతత్సమముల యత్తునకు సంధి వచ్చిన రూపములు లేకున్నను సంబోధనాంతముల యత్తునకు సంధివచ్చిన రూపములు రెండు గలవు.

పోరోరి (పోర + ఓరి) I-10

కాదురోరి (కాదుర + ఓరి) vI-485

అకారాంతమగు నామమునకు 'అందు' అను విభక్తి ప్రత్యయము పరమగునపుడు సంధి రాక యడాగమమే వచ్చును. కాని అయో.కాం.న ఒక్కచోట మాత్రము సంధి చేసిన రూపము ప్రయుక్తమైనది.

(పర్ణశాలందునున్న) II-171.

కాని పై ప్రయోగము ము.ప్ర. లో బ్రాకెట్ గుర్తునందలి భాగమున నుండుటచేతను, అందున్న భాగమంతయు ప్రక్షిప్తమగుటచేతను పై ప్రయోగమును భా.రా. కర్తృకముగ భావించుట యుక్తము కాదు.

షష్ఠ్యంత బహువచన రూపమందలి అకారమునకును, భూతార్థక క్రియాజన్య విశేషమందలి అకారమునకును అచ్చు పరమగునపుడు సంధి గావింపబడిన రూపములు భా.రా. న అతివిరళముగ ప్రయుక్తములు.

గోబ్రాహ్మణులెదురను I-761;

(త్రుంగినాతడు) III-1-124.

పై వానిలో రెండవ యుదాహరణము జంబుకుమారవధఘట్టములోనిది. ఈ ఘట్టము పెక్కు తా.ప్ర. లలో కానరాదు. కావున నీ ప్రయోగము భా రా. కర్తచే ప్రయుక్తమనుట సందిగ్ధము.

### ఇకారసంధి

నామములందలి యికారమునకు సంధి వచ్చిన యీ క్రింది రూపములు భా.రా. న కనబడుచున్నవి.

సవతాలు *III*-1-143; వాకిలిప్పుడు *VI*-1064.

కాలుసేయాడక VI-1456; వేయబ్దముల్ I-166.

'క్త్వార్థేతో న భవేత్సదా' (అథ.కా. సంధి 6) అను కారికచే అథర్వణుడు క్త్వార్థకేకారమునకు సంధిని నిషేధించినాడు. చి.సూ.కూడ 'క్త్వార్థంబైన యిత్తునకు సంధి లేదు' (బా.వ్యా. II-8) అని పై యభిప్రాయమునే వివరించినాడు. భా.రా.న క్త్వార్థకేకారసంధి కానరాదని మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు భా.రా. పీఠికలో తెలియజేసినారు.[4] కాని యు.కాం.న రెండుచోట్ల క్త్వార్థకేకారసంధి కల రూపములు కానవచ్చుచున్నవి.

వీరెత్తెత్తి గ్రుద్దుచున్నారు VI - 204

దర్పించిట్లు VI - 1729

తొడిగేసె (అర. కాం.)[5]

ఆం.శ.చిం. కర్త 'నిత్యమనుత్తమపురుష క్రియాస్వితః' (సంధి 4) అను సూత్రముచే ప్రథమ మధ్యమ పురుషల యికారమునకు సంధి నిత్యమనియు, ఉత్తమపురుషేకారమునకు వైకల్పికమనియు తెలిపెను. అథర్వణుడు 'ప్రథమే చోత్తమే చైవ క్రియేతో వా భవేచ్ఛ్యుతిః' (అథ.కా. సంధి 6) అను సూత్రమున ప్రథమోత్తమ పురుషల ఇకారమునకు సంధి వైకల్పికమని వివరించెను. భా.రా.న ప్రథమ పురుషేకారమునకు సంధి చేసిన రూపములే యధికమైనను రుద్రదేవ - అయ్యలార్యుల రచనమున సంధి రాని యడాగమ సహిత రూపములు రెండు కనబడుచున్నవి.

ఉండిరి యిరువురు II - 51

పోరిరి యుదీర్ణవారక్రములై VI - 1185

అయ్యలార్యుని రచనమున నీ క్రింది మరొక విలక్షణమైన యికారసంధి ప్రయోగము చోటుచేసుకొన్నది.

కట్టలుకంబ్రచండతర కాండములొక్కొకనందు నేపునన్ VI - 1333

మధ్యమపురుషే కారమునకు సంధి నిత్యమని బా.వ్యా. నియమము.[6] భా.రా.న మధ్యమపురుష సంబంధియగు ఇకారమునకు అంతట నిత్యసంధియే యున్నను ఒక్క ప్రయోగమున మాత్రము సంధి చేయబడలేదు.

తెచ్చితివి యీ యాలంబు VI-2108.

ఉకారసంధి

'సంధిర్నాచోఽచ్యనుతః' (అం. శ చిం; సంధి।) అను సూత్రముచే ఉకారమునకు నిత్యసంధి విధింపబడినది. కాని యీ నియమమునకు విరుద్ధముగ వావిళ్ళ వారి భా.రా.ప్రతి (1923) లోని అయో.కాం.న బ్రాకెట్ గుర్తులో నున్న భాగమున మాత్రము ఉకారసంధి రాక యడాగమము వచ్చిన యీ క్రిందిప్రయోగములు కలవు.

| | |
|---|---|
| ఇట్లు యేటికి | II - 15 |
| నాకు యపశకునము | II - 20 |
| చెప్పినవాక్యములు యచటి | II - 33 |
| తాను యంతస్సదనంబునకు | II - 35 |
| మేలు యీ రాజరాముని | II - 48 |
| చెప్పితేను యేమందు | II - 57 |
| తడవరు యదియుంగాక | II - 59 |
| చెప్పినాను యెఱుఁగవె | II - 60 |
| పలుకను యిది నా నేమము | II - 66 |
| నా కొమరుడు యిట్లడుగుట | II - 80 |
| ఉండుము యిగురుబోణి | II - 99 |
| వేసరింపరు యిఁక | II - 171 |

ఈ ప్రయోగములన్నియు బ్రాకెట్లగుర్తులు గల భాగమందలివే. ఈ భాగమంతయు ప్రక్షిప్తము గాన వీనిని గూర్చి ఆలోచింపనవసరము లేదు. ఆనందాశ్రమప్రతి (1912) లో కాని, కరాలపాటి రంగయ్యగారు పరిష్కరించిన ప్రతి (1864) లో కాని ఈ బ్రాకెట్లలోని పద్యములు లేవు. కనుక పై ప్రయోగములు భా.రా. కర్తవిగా భావింప వీలులేదు. ఈ భాగమున అలాక్షణికములగు పై సంధిపదములే కాక మరికొన్ని యలాక్షణికప్రయోగములును కలవు.

(ఔదార్యుడు II - 8 (ఔదార్యముగలవాడను నర్థమున)
త్రోవబడ్డారొకళ్ళు II - 12.
తోడుక II, 17; తోడుకరమ్మన II - 95.

తోడ్కొరమ్మనంగను II - 98; కూడుక II - 95.
వస్త్రిరి II - 188; చెప్పినాను (చెప్పినను అను నర్థమున) II-60.
జాంబూనదగద్దియ II - 97.
మహామంచిది II - 12; సువర్ణసవరణలు II - 52)

## ద్విత్వనకారసంధి

అనంతామాత్యుడు, అప్పకవియు ద్రుతద్విత్వసంధిని దుస్సంధి యని పేర్కొనిరి.[7] కాని "నో వా ద్విత్వం క్వచిచ్ఛిష్టం పరప్రాణేన సంగతేః, ద్రుతాద్ధురితః క్వచిచ్చాత్ర ద్రుతశ్చ కవిభాషితే"యను నాథర్వణకారిక (అజ.28) వలనను, మహాభారతాదిప్రయోగమువలనను ద్రుతద్విత్వసంధి దుష్టము కాదనియే చెప్పవచ్చును. చి. సూ. ఈ సంధిని పేర్కొనకపోగా ప్రౌఢవ్యాకర్త దీనిని గ్రహించి భాగవతము, ఉత్తరహరివంశము, కళాపూర్ణోదయము మొ॥ గ్రంథములనుండి యుదాహరణములను చూపియున్నాడు.[8] భా. రా.న ఈ సంధి ప్రయుక్తము కాలేదు. ఈ క్రింది రెండు ప్రయోగములు మాత్రమీ సంధితో కనబడుచున్నను అవి ప్రక్షిప్తభాగమందలివి కాన ప్రామాణికములు కాజాలవు.

(వాసవసదృశున్నదితయశు) II-41.
(కట్టన్నేమియు) II-66.

## సవర్ణదీర్ఘసంధి

అక్కలకు సవర్ణములగు అచ్చులు పరమగునపుడు దీర్ఘమేకాదేశముగ వచ్చును.[9] ఇది నిత్యసంధి. భా. రా. న రుద్రదేవుడు ఈ క్రింది ప్రయోగమున సంధి చేయని రూపమునే ప్రయోగించినాడు.

పితృఋణము నీవు దీర్పగ I-388.

## తత్సములు

### శరణశబ్దము

చి. సూ. 'క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషంబులింగ తుల్యంబులగు' (బా. వ్యా. III-18) నని సూత్రించి మిత్రము, మిత్రుడు ఇత్యాది రూపములను సాధించినాడు. శరణశబ్దము మిత్రాది గణపఠితమగుటచే శరణుడు,

శరణము అను రెండు రూపములేర్పడును. భా. రా. న డుజ్రూపముతోపాటు 'శరణు' అను రూపముగూడ ప్రయోగింపబడినది. వ్యవహారమున అతిప్రచుర ముగనున్న యీ రూపమునకు చి. సూ. గతి చూపలేము.

శరణుండైన vi, 1082;
శరణని రఘురాముఁ గనుట మేలు. vi-146.

చిహ్నశబ్దము

సంస్కృతమున నిది అకారాంతనపుంసకలింగశబ్దము.[10] కనుక 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు' (బా వ్యా.III-39) అను సూత్రము ననుసరించి మువర్ణకము రాగా 'చిహ్నము' అను ఏకవచనరూపమును, మువర్ణకేతరవిభక్తులు పరమగునపుడు ముగాగముచే చిహ్నములు ఇత్యాది రూపములును ఏర్పడును, భా రా.న ఈ శబ్దము స్త్రీసమముగ ప్రయోగింపబడినది.

మంగళచిహ్నల్ v. 261; నిజమగు చిహ్నల్ vi-1606
మంగళసూచనచిహ్న లేర్పడన్ vi-2135.

పై ప్రయోగములనుబట్టి చిహ్నశబ్దమును చరిత్రాదిగణమున చేర్పవలసి యుండును.

తారకాశబ్దము

నక్షత్రవాచకమగు తారకాశబ్దము సంస్కృతమున ఆకారాంతస్త్రీలింగము. తారక, తారకలు మున్నగునవి దీని తత్సమరూపములు. భా.రా.న అదంతములగు అమహన్నపుసంకములకు రావలసిన మువర్ణకముగాగమముఁతో నీ శబ్దము ప్రయుక్తము.

తోచెఁ బొరి తారకముల్ VI-36

చామరశబ్దము

ఈ శబ్దము సంస్కృతమున పుంనపుంసకలింగముల రెండింటను గలదు. భా.రా.న దీనికి స్త్రీలింగతుల్యరూపముగను ప్రయోగములు కలవు.

ఛత్రంబు చామరల్ II-153
చామరల్పొటిగ V-428
చామరంబులన్ VI-1187.

సఖి శబ్దము

సంస్కృతమున సఖి శబ్దము ఇకారాంతము. తెనుగున దీనికి సఖి యనియే ప్రథమైక వచనరూపము. సఖి శబ్దమంతమందుగల పరమసఖి మున్నగు సమాస పదములు సమాసాంత టచ్ ప్రత్యయము[12] చేరగా పరమసఖ మున్నగు అకారాంతశబ్దములుగా మారి తెలుగున పరమసఖుడు ఇత్యాది రూపములు ఏర్పడును. కాని కేవల సఖిశబ్దము సఖయను అకారాంతశబ్దముగ మారదు. కనుక తెలుగులో అసమాసమున సఖ యను శబ్దమును ప్రాతిపదికముగ తీసుకొనుటకు వీలు లేదు. కావున అసమాసమున సఖుడను రూపముండదు. కాని యిట్టి రూపములు భా.రా. న పలుచోట్ల ప్రయుక్తములైనవి. శ.ర. కర్త సఖిశబ్దముతో పాటు సఖుడను రూపమును కూడ చూపియున్నాడు.

ఏను మీ తండ్రి సఖుఁడ III, 1,102.

అఱలేని సఖుఁడ III, 1, 105.

ధన్యు నా సఖు దశరథు III, 1, 106.

సఖుఁడవగుమని (అర. 2 ఆ; 225 పు.)

తగిన సఖుడ నగుట iv, 81.

అదోషాకరుడును నగు సఖుఁడు (iv, 83)

సఖునకు సంతతము సఖుఁడ సద్గతి కాడే iv, 113

సఖుఁడవు నాకీవగుటను iV, 113; సఖుఁడవు iV, 542.

కోట్లు

బహువచనము పరమగునపుడు ఆచ్ఛిక శబ్దముల డ, ల, ట, ర ల ఉత్వమునకు లోపము బహుళముగా వచ్చుననియు, తత్సమములలో కోటి, పిప్పలి శబ్దముల కీకార్యము చూపట్టెడు ననియు చి. సూ. తెలిపినాడు.[13] భా. రా. న కోటులను పదమే అంతట వాడబడినను కోట్లు అను శబ్దమును మూడు నాలుగు చోట్ల ప్రయుక్తమైనది.

కోట్లు V, 351; VI, 20, 1464, 1844.

శరత్తు :

చి.సూ. ఉకారాంతశబ్దములకన్ని వచనములందును వువర్ణకము విధించుచు వానికి ప్రథమా బహువచనము మొదలుకొని యే వచనము పరమైనను వువర్ణకము బహుళముగా వచ్చునని తెలిపినాడు. చి.సూ. మతమున ప్రథమైన వచనమున వుప్రత్యయము నిత్యము కాని వుప్రత్యయము చేరని రాహు, బాహు అను ప్రథమైక వచన రూపములు కానవచ్చుటచే ప్రౌఢవ్యాకర్త "రాహుబాహు శబ్దములకంతట వువర్ణకలోపంబు వైకల్పికంబు" (ప్రౌ.వ్యా. శబ్ద 26) అని సూత్రించెను. హుళక్కి భాస్కరుడు బాహు అను ప్రథమావిభక్త్యేక వచన రూపమును ప్రయోగించినాడు. 'బాహుప్పళించి (vi-479). రాహు బాహు శబ్దములకు మాత్రమే ప్రౌఢవ్యాకర్త వు లోపమును విధించినాడు. కాని వు లోపించిన 'శరత్తు' అను ప్రథమైక వచన రూపము మల్లికార్జునుని రచనమున ప్రయోగింపబడినది.

శరత్తు వాలగఁ జొచ్చెన్ iv-460.

ఇంద్రజిచ్ఛబ్దము :

'జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాషగా నగు" (బా.వ్యా. iii, 79) అను సూత్రము ప్రకారము ఇంద్రజిచ్ఛబ్దములోని తకారమునకు లోపము వికల్పముగా వచ్చి ఇంద్రజిత్తు, ఇంద్రజి యను రూపములేర్పడును. ఈ శబ్దము ఋత్విగాదిగణపరితమగుటచే ఉత్వడుజ్జులు రాగా ఇంద్రజితుడను రూపముగూడ సిద్ధించును. భా.రా. న ఇంద్రజిత్తు, ఇంద్రజితుండు అను రూపములతోపాటు ఇంద్రజిత్తుండను రూపమును కానవచ్చుచున్నది.

i) ఇంద్రజిత్తు v-412; vi-294, 536, 783, 1067

ii) ఇంద్రజితుండు v-421; vi-292, 569, 604

iii) ఇంద్రజిత్తుని తల vi, 1384

iv) ఇంద్రజిత్తునితోడన్ v, 1884.

ఇంద్రజిత్తుడను రూపము సింగన పద్మ పురాణమునను, మొల్ల రామాయణమునను, రంగనాథ రామాయణమునను ప్రయుక్తమైనది.[14] కాని వజ్ఝలవారు

తమ బాలవ్యాకరణోద్యోతమున "ప్రథమైకవచనము లోపించిన ఉగాగమాంత ములపై మరల డుజ్జు నిలుచుట కేవలము నసంభవమగుటచే 'ఇంద్రజిత్తుడు' అను రూపము సరికాదు. కాని కొందరు సామాన్య కవులద్దానిని ప్రయోగించిరి అట్లయినను అట్టి డుమంతరూపము గ్రాహ్యము గాదనుటయె లెస్స" యని ఇంద్రజిత్తుండను రూపమును అగ్రాహ్యమనియే తెలిపిరి.[15]

హనుమచ్ఛబ్దము

హనుమచ్ఛబ్దమునందలి మతు ప్రకారమునకానాదేశము వైకల్పికముగ విధించి చి.సూ. హనుమానుడు, హనుమంతుడు అను రెండు రూపములను మాత్రమే సాధించినాడు.[16] కాని భా.రా.న హనుమడు అను రూపమును కనబడు చున్నది.

హనుమని వాలము బెరుగగ V-458

సకారాంతతత్సమములు

సకారాంతములగు వక్షస్, వేధస్ శబ్దములకు సమాసములందకారాంత ములుగ ప్రయోగము లతివిరళముగ నున్నవి.

హారిద్రోల్లసిత వక్షహరిచరణ.... III - 2-1

'హరిహర వేధాదులకున్' III, 2, 33.

ఇట 'వక్ష'యనుటకు 'వత్స' యను పాఠాంతరమున్నను 'వక్ష' యను పాఠమే ఉచితముగా నున్నది. వేధాదులనుటకు ధాత్రాదులను పాఠాంతరము కల్పింపబడినది.

'మహద్వాచకంబులగు సాంతంబులకంతలోపంబేని, ద్వితీయైకవచనాంత తుల్యత్వంబేని నామంబగు' (భా.వ్యా. III - 81) నను నియమానుసారము విశ్రవసుడు, విశ్రవుడు నను రెండు రూపములేర్పడును. వీనికి అమహత్తులకు వలె ద్విత్వోత్వసులోపములు వచ్చిన మహద్రూపములు ప్రాచీనకావ్యములందు కానరావు. కాని అయ్యలార్యుడొక్కచోట 'విశ్రవస్సు' అను రూపమును ప్రయోగించినాడు.

అనయము విశ్రవస్సునకు VI-1283.

**హవిశ్శబ్దము**

హవిశ్శబ్దము సకారమునకు లోపము రాగా నేర్పడు హవి యను ప్రథమాంతరూపము అర.కాం.న కలదు.

హవి వేల్చిన చరుశేషము iii-1-95.

ఇట్లే మల్లికార్జునుడు సకారాంతసర్పిశ్శబ్దమును ఇకారాంతముగ ప్రయోగించినాడు.

సర్పిఫలాదులు 1 - 739.

'అను' అను ఉపసర్గ పూర్వమందుగల ఇణ్ ( = గతౌ) అను ధాతువుపై 'క్త' ప్రత్యయము రాగా 'అన్విత' (అను + ఇ + త) అనియే యగును. కాని భా.రా.న మల్లికార్జునుని రచనమున ఈ పదము 'అన్వీత' అని దీర్ఘయుక్తముగ అనేకపర్యాయములు ప్రయుక్తమైనది.

తురగాన్వీతుండవై I-447; ప్రియాన్వీతుండనై I-517
కర్ణాంచలాన్వీతాకృష్టి 3-753; సుఖాన్వీతాత్ముగా IV-323
బలాన్వీతుండు IV-324; కిరణాన్వీతాఖిల IV-551
అన్వీతమనుష్యరూపధరులు IV-739

ఇట్లే నకారాంతమగు బందిన్ శబ్దము సమాసమున 'బందీ' యని దీర్ఘయుక్తముగ ప్రయోగింపబడినది.

బందీవిమోక్షంబు మీ కాహా పుణ్యము గాదె III-2-109.

కొన్ని తత్సమశబ్దములు సంస్కృతమున వానికున్న యర్థమునకాక భిన్నార్థములందు ప్రయుక్తములగుట కానవచ్చుచున్నది.

సఖ్యుండు[17] (మిత్రుడని యర్థము)
శాసితుండు[18] (శాస్త్రయని యర్థము)
బలవంతంబున[19] (బలముననని యర్థము)

**మహచ్ఛబ్దమునకు ఆకారాదేశము రాకుండుట**

సమాసమున పూర్వపదమగు మహచ్ఛబ్ద తకారమునకు ఆకారాదేశము కర్మధారయమున మాత్రమే వచ్చును.[20] షష్ఠీసమాసమున రాదు. మహాజ్ఞ

మున్నగునవి కర్మధారయములు. మహదాజ్ఞ మున్నగునవి షష్ఠీసమాసములు. కాని కర్మధారయమున దీర్ఘములాని రూపములు రెండు అయ్యలార్యుని రచనలో కనబడుచున్నవి.

మహదక్షినివహంబు VI-2002
మహదహంకృతితోడన్ VI-2038

**సంబోధనమున ఆరగాగమము రాకుండుట**

'సంబోధనమునందు బహువచనంబునకార గాగమంబగు' అని చి.సూ. సూత్రము[21]. భా.రా.న నీ ఈ క్రింది ప్రయోగములలో ఆరగాగమము కానరాదు.

'సంభ్రమకారణమేమి సంయముల్' II-402
'మర్కటవీరుల్ చని జానకిన్ వెదకి వే రండు' IV-551
'మర్కటువీరుల్ ఘనసత్త్వజవములారంజనివై దేహిఁగని రండు' IV-553
'తనయుఁడు గలుగ వరమిండు తాపసవర్యుల్ IV-818
మ్రింగుడింక నరభుగ్వనితల్ V-222
వినుడు నిశాచరుల్ VI-74

'మధ్యమ పురుషయోగము నందారగాగమంబు విభాషనగు' (బా.వ్యా. III-37) నను సూత్రముచే మధ్యమపురుష క్రియా యోగమున్నపుడు ఆరగాగమము లైకల్పికమగుటచే పై యుదాహరణములలో మధ్యమ పురుష క్రియా యోగము గల యుదాహరణములందు ఆరగాగమము రాకుండుట యుక్తమేయైనను మొదటి యుదాహరణమున మధ్య పురుష క్రియాయోగము లేనందున ఆరగాగమము రాకుండుట విశేషముగ భావింపవచ్చును.

**తద్భవాలు**

పాల్కురికి భాస్కరుని రచనమునను, అయ్యలార్యుని రచనమునను ఈ క్రింది తద్భవములు గమనింపదగినవిగా కనబడుచున్నవి.

అమవసయిరులైన III-1-280
పుత్రిదెసకు (దశకు) VI-42
అంగుటము (అంగుష్ఠము) VI-60

కదలరయఁగ (కథలు) VI-172 (ప్రాసస్థానమున ద)
మచ్చెము (మత్స్యము) VI-616 (ప్రాసస్థానమున)
నిచ్చయము (నిశ్చయము) VI-739 ( ,, )
మనసిల (మనశ్శిల) VI-703
సంకలియ (శృంఖల) VI-2658

**ఔపవిభక్తికాలు**

ఔపవిభక్తికమగు విల్లుశబ్దము అనౌపవిభక్తికముగను, అనౌపవిభక్తికమగు 'పండు' శబ్దము ఔపవిభక్తికముగను ప్రయుక్తములైనవి. నోరు శబ్దమునకును అనౌపవిభక్తికముగ ప్రయోగము గలదు.

విల్లును ద్రుంచి vi-1151; ఒండొరు పంటినెత్తికొని v-540
నోరుకెట్లువచ్చె vi-128

కొరవి గోపరాజు సిం. ద్వా. యందును పండుశబ్దము ఔపవిభక్తికముగ ప్రయుక్తమైనది.

చింతపంటిసరిగా III-156.

**విభక్తులు**

కలవాడు, ఎట్టివాడు మున్నగు ప్రథమైకవచనశబ్దములలో తచ్ఛబ్దము లోపించిన కలడు మున్నగునవి భా. రా. న అక్కడక్కడ ప్రయుక్తములు.

నీయెఁదు భక్తిగలడు II-79; అతడెట్టిడైన Ii-425
[అతడునెట్టిడు] III-1-271; ఎట్టిడు నా నిజేశుడు v. ౬58.

లుప్తతచ్ఛబ్దములగు నిట్టి రూపములు 'సేసలు వెట్టిన యట్టిరైరి' (ఆది. 2-20) మున్నగు నన్నయప్రయోగములందును కానవచ్చుచున్నవి.

'ఎదురు' శబ్దము సాధారణముగ ఏకవచనాంతముగనే ప్రయోగింపబడుచుండును. కాని భా.రా.న దీనికి బహువచనాంతముగ ప్రయోగములు కలవు.

నీకెదురులు సూచుచున్ VI-587, మా రాకకు నెదుళ్ళు సూచుచు VI - 2465.

ఇట్లే 'వేడి' యను విశేషణమొకచో వేడులని బహువచనాంతరూపముగ ప్రయుక్తమైనది.

వేడులగు నిట్టూర్పులు IV-443.

నెల యను శబ్దమునకు బహువచనమున 'నెలలు' అనియే రూపము. కాని లకారము మీది అకారము లోపించినరూపము సుం.కాం.న మూడు చోట్ల కలదు.

రెన్నెల్లదాక V-202, రెన్నెల్లలోన V-204, రెన్నెల్ల మీద V-281.

గుఱిచి, గుఱించి యను ద్వితీయావిభక్తిప్రత్యయములను చి. సూ. పేర్కొనలేదు. ప్రౌఢవ్యాకర్త ఉద్దేశార్థమున ద్వితీయకు 'గుఱిచి' యనుప్రయుక్తమగునని తెలిపెను.[22] భా.రా.న ఒక్కచోట మాత్రమే గుఱిచి వాడబడినది.

అమ్మహాదేవునిగుఱించి[23] I-466.

బ్రహ్మవాక్యముఁగుఱిచి విసఃజ్ఞబొందిరి VI-1086.

ఇట్లే 'కూర్చి' యనుదానికిని 'నినునంతకుఁగూర్చి పుచ్చునే (భా. రా. VI-246)యను నొక్కచోట ప్రయోగము గలదు. దీనిని కూర్చుధాతువు క్త్వాంత రూపముగ చెప్పవచ్చును.

'చేత' విభక్త్యర్థకవర్ణములకు 'చేసి' యను క్త్వార్థకరూపమనుప్రయుక్తమగుచుండును.

చాపలమునఁజేసి IV-605; దంభోళిస్ఫారాహతిఁ జేసి VI-1163.

ఉంటఁజేసి VI-2170.

జడవాచకములపై వచ్చు 'తోడ' వర్ణకమునకు బదులుగా మెయి, మైలు వచ్చిన రూపములు భా రా. న పళశక్కి భాస్కరుని రచనమున తప్ప తక్కిన యందరి రచనమున కనబడుచున్నవి.

నిష్ఠమెయిన్ III-1-57; సంపన్నతమెయి III-1-74.

i) శక్తిమెయిన్ I-70, అలుకమెయి VI-1176, 1183.

కడిమిమెయి VI-1187; ఆర్తిమెయి III-2-144.

లీలమై III-1-258, లావుమై III-1-30; అభియుక్తిమై III-1-79.

ii) శోకార్తిమై III-2-25; కార్యముమై III-2-416; ఆదటమైV-196.

ప్రౌఢిమాసక్తిమై VI-2120.

శక్తిమై (పు. 163), దర్పంబుమై (పు 165), సమున్ధతిమై (పు.168) సద్భకిమై (పు. 222).

'తోడ' నను తృతీయా విభక్తి ప్రత్యయమునకు బదులు 'తోడుత' అను ప్రయోగము చాలచోట్ల ప్రయోగింపబడినది.

సమ్మానముతోడుత I-14; అతనితోడుత నిట్లను I-330.
(వరుస తోడుత) II-98; దశాస్యు తోడుతన్ III-2-140.
భక్తితోడుతన్ [24] పుట 226; ఎలమితోడుత మించి III-2-398.
వెడదనోళ్ళతోడుత VI-519; అహంకృతితోడుత VI-1160.
త్రిదశవర్గముతోడుత VI-1343; సౌమిత్రితోడుత VI-1391.
వలరాజు తోడుత VI-1666; పెంపుతోడుత VI-1728.
వలీముఖసేన తోడుతన్ VI-1776; అనువుతోడుత VI-1794.
క్రమముతోడుత vi - 1954

పైవానిలో రెండవ మూడవ యుదాహరణములు ప్రక్షిప్తభాగమందలివి. భా. రా. కర్తలలో "తోడుత"ను ధారాళముగ ప్రయోగించినది ఒక్క అయ్యలార్యుడే యని చెప్పవచ్చును. మల్లికార్జునుడు బా.కాం. నను, భాస్కరుడరణ్యకాండమునను దీనిని అతి విరళముగా ప్రయోగించినారు. పలుశక్కి భాస్కరుని యు.కాం. పూర్వభాగమున ఒక్క ప్రయోగము కానవచ్చుచున్నది.

'తోడుత' అనునది విభక్త్యర్థాభిధాయకమగు దేశ్యశబ్దమనియు తోడవలె నిది ప్రత్యయము కాదనియు అహోబలపతియభిప్రాయము.[25] కాని మండ లక్ష్మీనరసింహకవి తమ త్రిలింగశబ్దానుశాసనమునందు దీనిని సహార్థమున వచ్చు తృతీయావిభక్తి ప్రత్యయముగా పేర్కొనినాడు.

తో, తోడ అనునవి విభక్తిరూపములుగనే కాక స్వతంత్రపదములుగను ప్రయోగింపబడినవి.

తో నెగసి బాణవర్షము v-381
క్రవ్యాదుండు తోనేగి v-400; విరిగి తోనెగసిన v-520.
ఘలలి చనఁదోన కపుల్ vi-202.

తోన తెలివి మెయికొనునట్లు vi-641

తోన కోటీరపంక్తియు vi-850.

అద్రువన్ తోన దిగ్గాలమెల్లన్ vi-1201.

తోన గిరులు నెగసి వెంట vi-1644; సీత తోడ రాన్ iii-2-181

'ఉండి' యను క్త్వార్థక పదము పంచమ్యర్థమున ప్రయోగింపబడినది. సాధారణముగ నిది సప్తమ్యంతపదములపై చేరుచుండును.

గగనముననుండి vi-826; పాతాళముననుండి vi-2655

పాతాళములోననుండి 1840; గద్దియనుండి vi-148

'కోలెన్' అనునది కొల్, కోల్ అను ద్రావిడ ధాతువునుండి పుట్టినది. ఇది సప్తమ్యంతములగు కాలాధ్వవాచక పదములపై పంచమ్యర్థమున వాడబడుచుండును.

నిను గనినప్పటఁగోలెను iii-1-149; నాటఁగోలెను iii-2-402

తెచ్చిననాటంగోలెను vi - 1477.

వచ్చిన కోలె (భా.రా. vi - 303), విన్నగోలె (భా.రా. vi - 156) మున్నగు ప్రయోగములందు కాలవాచకపదములధ్యాహార్యములుగా భావింపవలెను. నేటికిని తెలంగాణా ప్రాంతమున పామరుల వాడుకలో ఈ 'కోలె' నను ప్రత్యయము నిలిచియుండుట గమనింపదగిన విషయము. ఇతర ప్రాంతములందు ఈ ప్రత్యయము వాడుకలో లేదు.

'కంటె' యను పంచమీ విభక్తి ప్రత్యయమునకు పూర్వము ద్వితీయాది విభక్త్యంగము సాధారణముగ నుండును. భా.రా. న 'కంటె'కు ముందు 'న' ఆగమముగా వచ్చుట కలదు.

బలమునకంటె i - 568; నిమేషమాత్రమునకంటె vi - 1644.

ప్రియమునకంటెను vi - 741.

కొన్ని చోట్ల ఈ ప్రత్యయము క్రియాజన్యవిశేషణములపైనను కాన వచ్చుచున్నది.

లోకనిందఁబడుకంటె vi-917; మదమున చనుదెంచుకంటె vi-1297.

క్షీణదశ బ్రదుకుకంటెను iii-2-231.

పై రూపములలో భావార్థక ట వర్ణము లోపించినదని ప్రౌఢ వ్యాకర్త మతము.[26]

తోడ విభక్తి పరమగునపుడు నగాగమము వచ్చిన రూపము కూడ కనబడుచున్నది.

చోద్యంబున తోడ 1 - 696

కంటెన్, అందు వర్ణకములు పరమందున్నపుడు కొన్నియెడల సమహత్తులకు నగాగమము గన్పట్టుచున్నదని ప్రౌఢవ్యాకర్త తెలిపియున్నను 'తోడ' వర్ణకము పరమగునపుడు నగాగమమును విధింపలేదు. (ప్రౌ.వ్యా.శబ్ద. 20, 21)

'కొఱకు' అను ప్రత్యయము క్రియాజన్య విశేషణముల పైననే కాక దుగాగమసహితమగు 'నా'శబ్దముపైనను చేరుట కలదు.

i) సుతులంగనియెడు కొఱకు 1-50; తమకు నబ్బెడికొఱకు 1-376 చేయు కొఱకు 1 - 475; లోకము రక్షించుకొఱకు VI - 422

ii) నాదుకొఱకు IV - 331

దిగర్థకమగు 'వలను' శబ్దమునుండి యేర్పడిన 'వలన'అనునది అపాయాద్యర్థములలో ప్రయుక్తమైనది.

సలిలమధ్యంబువలన నజ్జలధి వెడలి VI - 223

అబ్ధివలన నెగయు VI - 233

ప్లవంగమధ్యంబువలన నేగుదెంచి VI - 1550

పాతాళవివరంబువలన నరుగుదెంచి VI - 1550

"అథ లోపల, కి, కు, యొక్కాఽన్యా" అని చింతామణి కర్తయు[27], "కు, యొక్క, లోపల షష్ఠి" యని చి.సూ.యు[28]; కి, కు, యొక్క, లోపల యనువానిని షష్ఠీవిభక్తిప్రత్యయములుగా తెలుపుచు 'లోపల' నిర్ధారణార్థమున వచ్చునని పేర్కొనిరి. కాని లోపల, లో అనునవి నిర్ధారణార్థమునకాక సప్తమీ విభక్త్యర్థమున అనేక స్థలములందు వాడబడినవి.

i) అబ్ధిలోపలనున్నన్ 1-432; IV-49.

(ఆత్మలోపల III-2-253); (పర్ణశాలలోపల III-2-259)

ఆమడలోపల III-2-403; మానములోపల IV-583; 662

శిఖిలోపల నాజ్యము వోసినట్టులు VI-472
లంకలోపలన్ లేదు VI-747; జలరాశిలోపల VI-1344
చిచ్చులోపలఁబడు VI-1830

ii) ఆత్మలో iii-2-68; స్థానంబులో vi-117
'లోన్' అను ప్రత్యయముమీద 'న' అను సప్తమీవిభక్తి ప్రత్యయముగల రూపములును, 'ఉండి' యనుప్రయుక్తములైన రూపములును భా.రా.న కలవు.

i) అడవిలోన iii-1-47, iii-2-27; ఆత్మలోన iii-1-55
మగలలోన vi-56; తమలోన vi-137; గుహలలోనన్ (పు. 204)[2]

ii) పాతాళములోననుండి vi-1840

'లోపల' అనునది నిర్ధారణార్థమున విభక్తిప్రత్యయమనియు, సప్తమ్యర్థమున 'అంతః' అను నవ్యయమునకు పర్యాయపదమగు దేశ్యశబ్దమనియు అహోబలపతి యభిప్రాయపడెను.[29] 'లో' మీద 'ఉండి' శబ్దమధ్యాహార్యమగుటయు కలదు.

జలధిలో వెడలి వచ్చి vi-1220.

"నూతిలో వెలువడఁగోమలిందిగిచి" (ఆది. 3-144), "బడలన్వెల్వడి" (అరణ్య 2-179) మున్నగు భారతప్రయోగము లిట్టివే.

భా.రా.న సంబంధార్థమున 'యొక్క'కు ప్రయోగము కానరాదు. 'కున్' అను షష్ఠీప్రత్యయము భిన్నభిన్న విభక్త్యర్థములయందు వాడబడినది. ఈ విషయము కారకవిశేషములను తెలుపు సందర్భమున వివరింపబడును.

అట, ఇట, ఎట అనువానిని నన్నయ 'కు' ప్రత్యయవిరహితముగనే ప్రయోగించుచుండును భా.రా.న వీనికి 'కు' ప్రత్యయ సహితముగను ప్రయోగములు కలవు.

i) అటఁగొనిపొమ్ము vi-43; ii) ఇటకున్ vi-84
ఇట మీ వదినెన్ iii-2-39: ఎటకేగెనేని iii-1-30

"నః కౌ"అను చింతామణి సూత్రము (అజంత. 24సూ.) 'ను' వర్ణకము పరమగునపుడు నగాగమము నిత్యముగా విధించుచున్నది. చి.సూ.యు ఈ ఆగమమును నిత్యమనియే తెలిపినాడు.[30] కాని కవిత్రయే తరమహాకవి ప్రయోగములందు కొన్ని యెడల నగాగమము చూపట్టదని ప్రౌఢవ్యాకర్త నగాగమము రాని రూపములకును గతి కల్పించినాడు. భా రా.న ఇట్టి రూపములటనట చోటుచేసుకొన్నవి.

రచించి ప్రాచేతసుకున్ I-2; అనిమిషలోకము కైనను I-416[31]
కుశనాభుడు బ్రహ్మదత్తుకున్ I-334
కడుబొడవుకెగసి V-383

నేటి ముద్రితప్రతులలో ప్రాచేతసుకై; బ్రహ్మదత్తుకై అను రూపములు కనబడుచున్నవి. కాని తా.ప్ర.లలో ప్రాచేతసుకున్, బ్రహ్మదత్తుకున్ అను రూపములే కలవు. అంతేకాక కూచిమంచి తిమ్మకవి ల.సా సం.న ప్రాచేతసుకున్, బ్రహ్మదత్తుకున్ అను రూపములను నగాగమము రాకుండుట కుదాహరణములుగ చూపియున్నాడు. అహోబలపతియు "నః కౌ" అను చింతామణి సూత్రవివరణమున "రామాయణము రచించి ప్రాచేతసుకున్" ఇతి భాస్కరోక్తిరసంగతైవ" అని భా. రా. నందలి 'ప్రాచేతసుకున్' అను రూపమసాధువని తెలిపియున్నాడు. కనుక 'ప్రాచేతసుకున్, బ్రహ్మదత్తుకున్' అను పాఠములే ప్రాచీనములని తెలియుచున్నది.

ఉదంతములగు అమహత్తులకు అందువర్ణకము పరమగునపుడు నగాగమము వచ్చిన రూపములు భా. రా. న అతివిరళముగా ప్రయుక్తములైనవి.

ద్వారంబునయందు iv-446; తేజమున యందు iii-2-398
ఆ వనమధ్యంబునయందు (అర. కాం. 2 8 పు.)[32]

**కారకవిశేషాలు**

ఒక విభక్తికి బదులు మరొకవిభక్తిని వాడుట తెలుగున అతి బహుళముగా కనబడు విశేషము. ఇట్టి విభక్తి వ్యత్యయము గల యుదాహరణములు కొన్ని దిగువ ఉదాహరింపబడుచున్నవి.

ప్రథమ : (షష్ఠికి బదులు) క్రతువంతరాయమైనను క్రతుకర్త వినాశ మొందు I-641
(పంచమికి బదులు) ఊరు వెడలించి vi-1415 జలధి వెడలి vi-222
(సప్తమికి బదులు) అడవియున్ మేనుచ్చి III-2-59 గరుడుడు పుట్టని కాలము, సురలమృతము iv-737 బ్రహ్మాండము విస్ఫులింగ పంక్తులు నిగుడన్ i-589.

ద్వితీయ : (పంచమికి బదులు) రతిశ్రాంతిని నిద్రించిన v-136
(సప్తమికి బదులు) నిన్ను బట్టె చెరసాలను జొన్పిన vi-1918

తృతీయ : (పంచమికి బదులు) విరించిచే వరముగాంచిన v-439.
(పైనను నర్థమున) అన్న తోడ నలిగి వచ్చినాడొ vi-168.
రక్కసులరాజు నీతో మిక్కిలి కోపించినాడు vi-152.
నేలతోడ నొడలు గుల్లలతిత్తిగా నుదికి చంపె vi-681.
నేలతోడ మోది వధించెన్ vi-702.
నేలతో వ్రేయువారు vi-979.
నేలతో బిట్టుగ వ్రేసి vi-1229.
నేలతో విఱుగంగ నురవడి వ్రేయువారు 1845.
నేలతో జఱచువారు 1845.
(సప్తమికి బదులు) జీవముతోడి వాంఛ లేకుండిరి iv-644.

షష్ఠి : (ద్వితీయకు బదులు) భూరితపము హరునకుఁ జనచేయగ వచ్చి i-576.
రాక్షసులకెదిరి i-199.
ఏమందు దైవగతికి v-156.
కైకకు నే మందు దైవగతికేమందున్ v-162.
(తృతీయకు బదులు) మిల్లు ముష్టికిఁ ద్రుంచెన్ iii-1-234.
(పంచమికి బదులు) మము నీ యాపదకుఁ బాపి vi-631.
వచ్చుటకు సంభ్రమించెదరు vi-400.
(సప్తమికి బదులు) నీక యతిమోహితుడై v-216.
మా తల్లి కనురక్తుండు iv-76.

(కర్తృప్రథమకు బదులు) రావణు పంచినవారలు i-204.
నీవలసిన వానినిత్తు iii-1-98.
మన వచ్చిన వృత్తాంతము iv-28.
తనపెట్టిన చెట్టు vi-876.
రాముని చెప్పిన కందువలు vi-497.
(పై నను నర్థమున) నాకు నింతయు నలుగండు v-214.

సప్తమి : (తృతీయకు బదులు) మువ్వురము గూడ నీ శిలీముఖమునందుఁ దెగితిమి ii-309.

**విశేషణములు**

"నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదులకగు" నను సూత్రము (బా.వ్యా. తద్ధిత. 6) చే నల్ల మున్నగు విశేషణములపై భావార్థమున నవర్ణకము విధింపబడినది. ఉదా:- నల్లన, తెల్లన, పుల్లన మొ॥ కాని భా. రా. న 'ఎఱ్ఱన' యని కాక 'ఎఱ్ఱ'యను పదమే భావార్థకముగ వాడబడినది.

ఎఱ్ఱ కన్నులకుఁ దెచ్చి vi-1425

**సమాసములు**

కేవలసంస్కృతపదము దేశ్యపదముతో సమసించినచో అది వైరి సమాసమగును. కవిజనాశ్రయకర్త వీనిని వైరిపదములనియు, అనంతుడు వైరి వర్గమనియు పేర్కొనినారు. అంబుజపది (అంబుజముల్ పది యనుటకు), పుష్పవిల్లు మున్నగునవి వీరిచ్చిన యుదాహరణములు. భా.రా.న నిట్టి పదములు రెండు కానవచ్చుచున్నవి.

పటురాణ చెలంగన్ iii - 2 133; విస్ఫురద్రాణము vi-1726

మహీజాత, మహీకాంతుడు, సుమిత్రాభవ యనుసిద్ధ సమాసములందలి పూర్వపదములగు మహీ, సుమిత్రా యను పదములు ఈ కారాకారాంతస్త్రీలింగ శబ్దములగుటచే నవి సమాసపదమున దీర్ఘాంతములుగనే యుండవలెను. కాని భా.రా.కర్తలు మహిజాత (iii-1-150), రామమహికాంతుడు (iv-402), జనక సుతాసుమిత్రభవసంయుతుడై (vi-2562) ఇత్యాదిగా ప్రయోగించియున్నారు. ఇట్లే సంస్కృతవ్యాకరణనియమమునకు విరుద్ధమగు 'కృపాజనితుడు "రిపుక్షోణి

శ్వరస్థాపితారణ్యుడు" (iii-1-292) అను సమాసములు అరణ్యకాండకర్తచే ప్రయుక్తములైనవి.[33] జాతకృపుడనుట సంస్కృత వ్యాకరణ మర్యాద.

కపి, నృపశబ్దములకు ద్వంద్వము చేసిన 'కపినృపులు' అని యగును. 'కపినృపులచే' ననుటకు బదులుగా కపులనృపులచే నను విలక్షణప్రయోగము హుళక్కి భాస్కరుని రచనమున (vi-421) కనబడుచున్నది. ఇట కపులచేతను, నృపులచేతను అనియే అర్థము. కపులయొక్క నృపులచే అని కాదు. ఇట్లే వినఁగానబడియె నను వింత ప్రయోగము మల్లికార్జునునిచే ప్రయోగింపబడినది.

ఖగముల భయదస్వరములు
మృగతతుల ప్రదక్షిణములు మేదురగతులన్
జగతి వినఁగానబడియెను (1-746)

వినఁగానబడియె నను ప్రయోగము క్రియాపదముల ద్వంద్వమువలె భాసిల్లుచున్నది.

'ముష్టిభిః ముష్టిభిః ప్రహృత్య ఇదం యుద్ధం ప్రవృత్తమ్' అను నర్థమున 'ముష్టీముష్టి' యను వ్యతిహారలక్షణ బహువ్రీహి యేర్పడును.[34] కాని యీ క్రింది భా. రా పద్యమున 'ముష్టాముష్టి' యను రూపము ప్రయుక్తమైనది.

సరిఁబోరాడియుఁ గైదువుల్ సమయ ముష్టాముష్టికిం జొచ్చియున్
Vi-525

ఇట 'ష్టా' యతిస్థానమున నుండుటచే ఈ ప్రయోగము నిర్ధారకమే యగును.

త్రిక, క్రియాజన్యవిశేషణోభయ పదఘటితములును, కేవల క్రియాజన్యవిశేషణ ఘటితంబులును నగు కొన్ని విశేషణోభయ పదకర్మధారయ సమాసములలో విశేషణములు అవ్యవహితములుగా కాక సందర్భయోగ్యములగు పదములతో వ్యవహితములుగ నుండవచ్చునని ప్రౌఢవ్యాకర్త తెలిపినాడు.[35] అనగా విశేషణములు రెండింటికి నడుమ ఇతర పదము లుండవచ్చునన్నమాట. ఇట్టి ప్రయోగము అర.కాం.న కానవగును

ఒలిమి గుబేరునిఁ గెలిచి
బాగుగఁగొన్న రవిప్రకాశమై
యలరుచున్న పుష్పకము
నందు రమింపుము (అర. 2-198)

కొన్న, అలరుచున్న యను రెండు విశేషణములకు నడుమ రవి ప్రకాశమై యను పదముతో వ్యవధానమేర్పడినది. ఇట్టి ప్రయోగములు కవిత్రయమువారి గ్రంథములయందు దొరికినవి కావని ప్రౌఢవ్యాకర్త తెలిపియున్నాడు.

గుణవాచకములును, ధాతుజ విశేషణములును[36] అగు శబ్దములు పూర్వమందవయవ వాచక నామవాచకములు గలవియై యవియవి వాచకముతో సమసించునని ప్రౌ.వ్యా. స తెలుపబడినది. అనగా నీ సమాసము

అవయవ విశేషవాచకము + గుణవాచకము
ధాతుజ విశేషణము + అవయవివాచకము

అను క్రమమున నుండునని భావము. ప్రౌఢవ్యాకర్తచే దీనికి "ఒడలు తెల్లని తురగోత్తము వాలము" అను భారత ప్రయోగము ఉదాహరణముగా నీయబడినది ఇట్టి సమాసమే యీ క్రింది భా.రా. పద్యమున కానవచ్చుచున్నది.

'వాలము ద్రొక్కఁబడ్డ ఫణివల్లభుకైవడి'

త్రొక్కబడిన వాలము గల ఫణివల్లభునివలెనని భావము. భారతమందలి పై యుదాహరణమున గుణవాచకపదము అవయవివాచకముతో సమసింపగా భా.రా. పద్యమున ధాతుజవిశేషణము సమసించినది.

సప్తమీ తత్పురుషమున విభక్తి ప్రత్యయమునకు లోపము రాని 'నాక లోకమునవారు' అను అలుక్సమాసరూపము పాలిక్కి భాస్కరుని రచనలో మాత్రము కలదు[38]

**తద్ధితాంతములు**

"దఘ్నార్థమున బంటి కొలదులగు" నని బా.వ్యా. సూత్రము. (తద్ధిత. 27) బొమ్మబంటి మొదలగునవి దీని కుదాహరణములు. భా.రా.న ముక్కన బంటి వజ్రికిన్ (vi-747) యను నొక ప్రయోగము కలదు. ఇందు 'బంటి'కి

పూర్వము 'న'వర్ణకము చేరుట విశేషము. 'ముక్కున బంటి' యను నీ ప్రయోగము నన్నెచోడుని కు.సం.న గూడ కలదు.

ముక్కున బంటిగఁబోరు 12-197

క్రియలు

భా.రా.న కొన్ని విలక్షణములగు తత్సమ క్రియలును, దేశ్యక్రియలును ప్రయుక్తములైనవి. వానిలో కొన్ని క్రింద చూపబడుచున్నవి.

1. **గమించు :** శీతనగంబు గమించి i-371.

త్రిపథంబుల నిట్లు గమించె i-474.

ఎందుంగమియించినన్ iii-56

2. **దృష్టించు :** లంక దృష్టించి యోడులు దీడికొనుచు vl-326

3. **ప్రాపించు :** ఈ పుణ్యాశ్రమ వనమును ప్రాపించి i-518.

రామునంద ప్రాపించెద ii-4.

4. **మధురించు :** మదసౌరభంబులు మధురింపనెడఁజేయు Vl-975.

5. **పూరగించు :** రజని పూరగింప vi-276.

6. **ఎలుగించు :** అంత ఖగంబులు మేల్కని, యెంతయు నెలుగింప దొడంగె v-136.

7. **గంతుకొను :** ఒక్కశాఖకు గంతుకొని v-176.

8. **పదిలించు :** (హృదయము పదిలింపలేక) iii-2-241.

నీవు తాల్మి పదిలించి vi-159.

9 **పొగర్చు :** అతండు పొగర్చుచునున్నఁ జూచి vi-862.

10. **పొగరించు :** పొగరించు రవమున vi-859.

11. **బ్రదుకుండు :** సంధి చేసికొని యాదటమై బ్రదుకుండు నీవు v-196.

12. **వేగించు :** ఇట్లు వేగించి vi-732.

13. ఎదిరె : (ఎదిరించె, ఎదుర్కొనె నను నర్థము)
రాక్షసులకెదిరి i - 199.

ఇదె రఘుపుంగవుండెదిరె vi - 1461.

14. కానంబట్టదు : (కానబడదను నర్థమున)
ఏకొఱంతయును కానంబట్టదెప్పట్టునన్ vi - 15.

వెళ్ళు

'వెడలు' ధాతువు నందలి డకారము మీది అకారము లోపించి వర్ణ సమీకరణము (assimilation) కలుగగా ఏర్పడు 'వెళ్ళు' అను వ్యావహారిక క్రియారూపము ప్రాచీన కావ్య భాషయందు కానరాదు. కాని భా.రా.న ఒక్కచోట మాత్రమే ఈ క్రియ వాడబడినది.

గవకుల వెళ్ళు రక్కసుల vi - 1166.

17. 19 శతాబ్దుల నడిమికాలమున కవులచే ఈ క్రియాపదమధికముగా వాడబడినది.[39]

'తాడుగు' అను ధాతువునకు 'తొడి' యను క్త్వార్థకరూపమును, 'తొడిన' యను క్రియాజన్య విశేషణరూపమును పెఱశక్కి భాస్కరుని రచనమున ప్రయుక్తములైనవి.

i. రాజులు తొడి పూసికట్టి vi-286
వింటఁదొడి నిండుదెగన్ వడినేయ vi-1060

ii. తొడిన మణి కంకణాదుల vi-538
తొడిన కంకటముల vi-651

ఇట్లే వెఱవకుమనుటకు బదులు వెఱకుమనియు ప్రయోగములు కలవు.
[వెఱకు] iii-2-151; వెఱకు iv-806

ప్రేరణార్థక క్రియలు

అచ్చికములగు కొన్ని ధాతువులపై ప్రేరణార్థమున కొట్టు, చేయు మున్నగునవి అనుప్రయుక్తములగును. ఉదా :- పగులు - పగులగొట్టు, వెడలు - వెడలగొట్టు మున్నగునవి. ఇట్టివానిపై నేటి వ్యవహారమున ప్రేరణార్థమున ఇంచుగా

గమము వచ్చిన రూపములు లేవు. కాని, భా. రా. న ఇట్టి ప్రేరణార్థక క్రియలు కొన్ని కానవచ్చుచున్నవి.

1. ఈ సురనది వెడలింపుము 1-469
2. జిహ్వలు వెడలించి, విపులసర్పంబులు విషములుమియ v-621
3. ఊరు వెడలించి వనంబుల పాలుజేసి vi-1415
4. బొమిడికంబులు పగిలించియు VI-1460
5. అర్కస్ఫూర్తి మాయింపన్ Vi-1524
6. వేగులరయింపకున్న నీ వెతలు వచ్చె III-1-269.
7. అస్మద్వంశజుల నాకమరిగింపు తగన్ 1-459.
8. ముదమున నేలింపు లోకములు మీ యన్నన్ 1-287.

కొన్నిచోట్ల స్వార్థక్రియయే ప్రేరణార్థమునను వాడబడుచుండును.

వింధ్యంబవ, ంధ్యరయంబారగ మింటికించెరిగి

యయ్యాదిత్యు తే రాగినన్ III-1-83.

(వానినాగి కడంకన్) III-2-353.

ఇట్లే 'కురియు' ధాతువు అనేకపర్యాయములు ప్రేరణార్థమున ప్రయోగింపబడినది.

**అసమాపకక్రియలు**

పట్టుకొని, చేసికొని మున్నగు క్త్వార్థకరూపములకు బదులు పట్టుక, చేసుక మున్నగు వ్యావహారికరూపములు అయోధ్యారణ్యకాండములందు మాత్రమే కలవు.

(తోడుకరమ్మన II-95; కూడుక II-95.

తోడ్కరమ్మనంగ II-98; కాచుకయుండి II-171).

ఎత్తుకపోవగా iii-1-30.

గరళంబెత్తుకఁగ్రోలగా iii-2-102.

ఇట్టి రూపములు కవిత్రయమువారి గ్రంథములలో లేవు కాని సుప్రసిద్ధ కవులు వీనిని తమ కావ్యములలో ప్రయోగించియే యున్నారు. గుప్తార్థప్రకాశికా కారులు వీనికి 28 కావ్యప్రయోగములను చూపియున్నారు.[40]

**వాక్యనిర్మాణము**

సంస్కృతమున యత్తదర్థక శబ్దములతో గూడిన వాక్యములధికముగా నుండును. కాని యిట్టి ప్రయోగము ద్రావిడ భాషలకు సహజము కాదు. తెలుగు భాషలోగల యిట్టి ప్రయోగములకు సంస్కృత ప్రభావమే కారణము. యత్తదర్థక శబ్ద నిర్మాణము గల యీ క్రింది కొన్ని ప్రయోగములు భా. రా. న కనబడుచున్నవి.

ఎప్పుడు మిము నేఁ దలచెద నప్పుడ యేతెంచి ii-274.
ఎత్తెరువేగె నత్తెరువ యిష్టము పో iii-1-30.
ఎచట దైత్యులు మెలఁగెదర చటఁ గదిసి iii-1-51.
మీరెన్నెలవాసతి యిచ్చెదరన్నెలవున నిలుతు iii-1-99.
క్షితిసుత నేలావున దెచ్చితి ఈ వా లావునvi-314.

యత్తదర్థక ప్రయోగమువలెనే సంస్కృత ప్రభావమున తెలుగున ప్రవేశించిన మఱొక ప్రయోగము కర్మణ్యర్థక ప్రయోగము. ఇదియు తెనుగు భాషకు సహజము కాదు. పలుకిక్కి భాస్కరుని రచనలో ఈ క్రింది కర్మణ్యర్థక ప్రయోగములు చోటు చేసుకొన్నవి.

ఇమ్మాయకుఁ బ్రతివిధాన మెఱుఁగబడదు. vi-558.
వాలము ద్రొక్కబడ్డ ఫణివల్లభు vi-515.
రామజలదంబుచేత నార్పబడుట సిద్ధమయ్యె vi-2214.

క్త్వార్థకమగు క్రియారూపముపై 'కాక' యను పదము చేర్చుటచే వ్యతిరేక క్త్వార్థమేర్పడిన యుదాహరణము భా. రా. న ఒక్కచోట కలదు.

అతనిఁ బంపికాకేనయోధ్యకుఁ జనితేని vi-188.

అన్నంతక్రియలకు, వానికి చేర్చబడు సహాయక క్రియలకు నడుమ నితరపదములతోడి వ్యవధానముండుటయు కలదు.

లెక్కింపఁబితామహుండు లేడనదగుచున్ vi, 436.

ఐతిన్ అను క్రియారూపము అధీనమగు, పాలగుననునర్థములందు వాడుట కనబడును.

నిందకునైతినేమన్ vi-970 (నిందకు పాలైతినని యర్థము)

**ఏకదేశాన్వయము**

సమాసగతమగు పూర్వపదముతో నా సమాసమున లేని పదమన్వయించుటను 'ఏక' దేశాన్వయమందురు. 'దేవదత్తస్య గురుకులమ్' మున్నగు సంస్కృతవాక్యములు ఇందుకుదాహరణములు. ఇట దేవదత్త శబ్దము కుల శబ్దముతోగాక సమాసైకదేశమగు గురుశబ్దముతో నన్వయించుచున్నది. ఇట్టి యేకదేశాన్వయము గల కొన్ని ప్రయోగములు భా.రా.న కనబడుచున్నవి.

ఆ ఘనవిద్యాకలితుఁడగుచు i - 228
రామునస్త్రహతుఁడై iv - 268
సుగ్రీవమాతులుండగు దధిముఖపాలితంబైన v - 537

**పలుకుబడులు - సామెతలు**

భా.రా.కవులందరును తమ కాలమున ప్రచారముననున్న పలుకుబడులను, సామెతలను తమ రచనములందు వాడి కవితకు సొబగు గూర్చినవారే. యు.కాం. పూర్వభాగకర్తయగు హుళక్కి భాస్కరుడును, ఉత్తరభాగ రచయితయగు నయ్యలార్యుడును వీనినధికముగ వాడినారు. ఆయాకవులు భా.రా.న ప్రయోగించిన పలుకుబళ్ళు, సామెతలు కొన్ని దిగువ ఉదాహరింపబడుచున్నవి.

**పలుకుబళ్ళు**

**మల్లికార్జునుడు**

అగ్నిలోన ఘృత మాహుతివోసినమాడ్కి i-211.
రూఢికెక్కు i-37; తెరువువోవు i-667.
నింగియు నేలయుంబగుల iv-180.
తృణావృతకూపసన్నిభున్ iv-237; అడితప్పు iv-420.
కోపమెత్తినాడు iv-454; మండూకస్వనఫణి iv-479.
ఒక కుత్తుకయగు iv-273; మీ పెట్టిన చెట్టు iv-487.
నీ పని చేసెద v-83; కలగుండిడు v-115.
ఏమని పోవుదు v-122; ఆకలము v-186.
కాయగసరు v-178; నోరికొలదులు v-201.
వంటిల్లు సొచ్చిన కుందేలు v-234.
కాడుపఱచు v-259; మనసాడె v-292.

**రుద్రదేవుడు**

కర్ణరంధ్రముల్ సూడినభంగి ii-73.
తేనె పూసిన భీకరఖడ్గము ii-80.
మిన్ను వచ్చి పయింబడ్డ తెఱంగున ii-85.
వేల్పెక్కిన భంగి ii-147; నోరు దడుపుచు ii-278.
పెదవులు దడుపుచు ii-332.

**భాస్కరుడు**

ఇసుము చల్లిన రాలని iii-1-13.
(నింగి మ్రింగుదునె) iii-1-104.
(విస్ఫులింగములు గన్నుల రాలగ) iii-1-129.
అఱకాలఁదన్ను iii-1-158; నుగ్గునూచముగ iii-1-205.
(కన్నులన్ నిప్పులు రాల) iii-1-220.
కన్నులన్ నిప్పు లుప్పతిల iii-1, 248.
నూఱి మ్రింగెదన్ iii-1-158; కన్నులపండువు iii-2-35.
(అచ్చున వచ్చినవిధము) iii-2-24; ఎల్లనాడు iii-2-35.
(నిప్పుఁ జెదలంట నేర్చునే) iii-2-71.
నిలువునీఱయి కూలు iii-2-76; ఆసాసఁదిఱుగు iii-2-51.
(శివ శివ యనుచున్) iii-2-77.
తప్తలోహంబు చెవులంబోసినట్లయిన[41]
చాపకట్టువడగా iii-2-392; vi-22-1321.
(తృణావృతకూపసన్నిభున్) iii-2-87.
పెదవులు దడుపుచు iii-1-29; iii-2-275.
చిత్రముసేయడు vi-4; అల్లలనాడ vi-21.
మన్నుమిన్ను నిట్టట్టు తిరుగవైచు vi-22.
పుడమి యీనిన కైవడి vi-16 & 307.
ఉడుకెత్తిన డెందము v-38, నింగి మ్రింగుదునె vi-60.
జగంబు లఱచేతికిఁ దెచ్చు vi-60.
హస్తిమశకాంతరము vi-63; తొల్కుద్ద vi-69.

గుల్లలతి త్తిగా నుదుకు vi-63.
బూడ్దనిడిన పటుతములకరణి vi-100; గజస్నానము vi-138.
కోతి బ్రహ్మరాక్షసుజేయు vi-119; చెవిక్రిందఁజేరు vi-144.
పడుచుబుద్ధి vi-146; అడుగులకుఁ దప్పినాడ vi-188
పెటికి పేటాడిపై చు vi-207; సందుసందుల vi-249.
కోటాన కోటులు vi-263, 465, కాయగసరు vi-265.
జాయి అప్ప vi-265, సేదలం ధృణము సేయుచు vi-271.
నేల యీనినట్లు vi-284, 306, తొడిపూసికట్టి vi-286.
కర్ణాకర్ణికగ vi-289, నుగ్గునూచముగ vi-294.
డెందము ముల్లు vi-312, తోడిబ్రముచ్చు vi-312.
గిరుల తాత లనంగన్ vi-319, బీతు కుడిచి vi-323.
నోరికొలదులు vi-323; జొడులు దీడికొనుచు vi-326.
వలచేయనగా దగియున్నవాడు vi-362.
మిను పై విఱిగిపడినట్లు vi-388.
కడుపునఁబుట్టు చిచ్చు vi-393.
నిప్పుద్రొక్కినటులు vi-396; ఎడ్డముల్లు vi-433, 1495.
కఱకెక్కినారు vi-434; చేతుల తీట vi-455.
మైతీట vi-455; తిలతండులగతి vi-461.
విస్ఫులింగముల నుమియు vi-471.
శిఖిలోపల నాజ్యము వోసినట్టులు vi-472.
ఔడుకఱచు vi-522; ఆసాసలు vi-523.
కసిమసంగు vi-482: కేశాకేశి vi-538.
కాంతారచంద్రిక vi-574; పించమడచు vi-559.
కన్నాగు vi-585; జాతిడెందము vi-583.
హృదయదుకూలవహ్ని vi-587;పీనుగు పెంటలు vi-666, 749, 960.
వ్రేలిడ నెడ లేకుండగ vi-669.
గాజుల పేర్లు రోకలి దాకినట్లు vi-678.
కొఱవి జూడినట్లు vi-705; వింజమాక పెట్టిన భంగి vi-729.
మిన్నుపై నొఱగిన యట్టి చందము vi-728.

ఇట్టట్టనువాడు కాడు vi-780; ఆకలంబు vi-834;836.
ముంగొంగున చిచ్చు ముడిచికొనగ vi-889.
ఏ మొగముతో పొడసూపుదు vi-937.
విటతాటనము vi-987; ముక్కాకలు దేఱినారు vi-819.
కొండ యెంత పిడుగెంత vi-1042.
చిత్తజల్లుగతిగా vi-1056; మందునకు లేడు vi-1083.
కాయొ పండొ vi-1113.

అయ్యలార్యుడు

కాయగసరు vi-1184; గుల్లల తిత్తిగా నుదుకు vi-1203.
కన్నగతులబాలు vi-1204; ఆవంత vi-1227.
కసిబిసిగా vi-1239; మారి మసగిన కైవడి vi-1239.
నువ్వుగింజలకునైన తెలపి లేకుండ vi-1276.
మది మది vi-1297; కాటుక కొండలు vi-1319.
తాకులాడించు vi-1347; పెద్దసేపు vi-1379.
పేటాడు vi-1410; నిందకు నొడిగట్టు vi-1341.
పుడమి యీనిన చాడ్పున vi-1430; చిందఱవందఱ 1446.
ఎల్లనాడు vi-1459;తీటవోవగా vi-1503.
కాలుసేయాడక vi-1456; పడుగుపేక పగిది vi-1458.
ఒక్కకడి చేసికొని మ్రింగు vi-1473; ఎడ్డముల్లు vi-1495.
నుగ్గు నూచమయి vi-1516; వఱితి పాలుగజేయు vi-1625.
చర్మమయ పుత్రికలు vi-1701; కన్నుల నిప్పులు రాల vi-1759.
మిడుకలేక vi-1830; చిచ్చొడి గట్టితెచ్చు క్రియ vi-1879.
గతజలసేతుబంధనము vi-1880; ఏమని సుఖవృత్తిగోరెద vi-1930
పుడమి మింటికి వలసపోవు చందంబున vi-2032
చిత్తరువున నున్నభంగి vi-2133
అరవాయి గొనక vi-1494, 1949, 1956
కీలు దప్పించిన క్రియ vi-2151

గుండె తల్లడము; డెందములోని
కొట్టు మెడజుట్టిన పాము vi - 2429
కొంగున నున్న చిచ్చు }
కంటిలో నలుసు } vi - 2429
పాపము నాక vi - 2317; చల్లులాడు vi - 2481
నింగియున్ భువియు తాళముజేసి వాయించు vi - 1347
హృచ్ఛూలము vi - 1362; తలమునిగిన వగలు vi - 1403

**లోకోక్తులు**

**మల్లికార్జునుడు**

కులశీలము దాటవచ్చునే iv-131
వచ్చునె నమ్మగ నెందు రాజులన్ iv - 12
సఖునకు సంతతము సఖుడ సద్గతి కాడే iv - 113
అందని మ్రానిపండులకు నఱ్ఱులు సాతురె v - 192
ఆకులకొఱకున్ వరఫలయుతమూతతరువు నఱుకగనగునే iv - 302
పరికింపగ వంచన కీర్తిహేతువే v - 16

**రుద్రదేవుడు**

నింబభూజంబునకు క్షీరంబు గట్టి పోషించిన మాధుర్యంబు వచ్చునే ii-186

**భాస్కరుడు**

(నిప్పు చెదలంటనేర్చునే) iii-2-71.
(సతు లతులచపలమతులు దలంపన్) iii-2-41.
(కాలము నెవ్వండు గడిమి గడవగనోపున్) iii-2-372.
పులిమీసల నుయ్యెల లూగఁజూచిరే vi-869
కాల మెవ్వరు-దిరుగగఁబెట్టలేరు vi-1570.
న్యాయము దప్పినఁ గీడు పుట్టదే vi-1421.
నిందాలయమైన దుర్యశము నందుదురే vi-1422.
చర్మమయపుత్రికలయందొకయింత సౌఖ్యమున్ దొరకునె vi-1701.
ఇల నభాగ్యుల కెందును గలదె పెంపు 1773.
మిన్నక పోవు కృతాపరాధముల్ 1879

దైవాయత్తము లెన్ని చూడఁదరమే తప్పింపగా 1898.
కర్మఫలంబులు దప్పిపోవునే 1928.
విధిచేతఁదప్పదిరుగన్ రాదంట దా మిథ్యయే 1398.
పరాంగనాజనములమీది మక్కువ లసంశయముల్ నిధనైక
మూలముల్ 2253.
తన పతితోఁ బాయు బ్రదుకు తరుణికి నేలా 2254.
పాపకృత్యములయందుల వేడ్కలు గల్గనేర్చునే 2359.
ఏవకాడగువానికంటె మేలు సూవె కాలయముఁడు 2262.
నయగర్హితచేష్టుఁడు మాననీయుఁడే 2275.
విధికృతంబునఁజెడనున్న వేళలందు
బుద్ధి పరికింపకూరక పొలియుఁగాదె 1478.
చెడువేళ నిహతమతికి, దవిలి సద్బుద్ధులెవ్వియుఁ జెవుల సొరవు 1479.

## సూచికలు :

1. అథ. కా. అహో. పుట 499.
2. అహో. క్రియా. 48 సూత్ర వ్యాఖ్య.
3. పు. 36-41.
4. భా. రా. (వావిళ్ళ 1923) పీఠిక; పు. 42.
5. "శరములు మూడొక ముష్టిం, దిరముగ తొడిగేసె వారుఁదైళ్ళిరి.
వెస నే సురిగి యిట వచ్చి ఘనభయ, పరవశమున నున్నవాడ
పటుశౌర్యనిధీ!" - ఈ పద్యం తా.ప్ర. ల్లో అర.కాం. 2 ఆ. 6-18
పద్యములకు మారుగా కలదు.
6. సంధి. 7.
7. ఛం. ద. iv-20: అప్ప. క. 1 ఆ.
8. ప్రౌ. వ్యా. ii-3.
9. అష్టా. 6-1-101.
10. సంస్కృతశబ్దార్థకౌస్తుభ్.
11. బా. వ్యా. iii-58.
12. 'రాజాహస్సఖిభ్యష్టచ్' అష్టా. 5-4-91.

13. బా.వ్యా. iv-12.
14. ప. పు. ఉత్తరఖండము. 8-210; మొ.రా. vi, i, iii రం. రా. పు. 270.
15. బా. వ్యా. ఉద్యోతము. పు. 138.
16. బా. వ్యా. 3-74.
17. ప్లవగవీరుని సఖ్యం గావించికొనుము. (ఫుట్‌నోట్స్‌లోని పాఠము) - పు. 222.
18. ధారుణికిఁ గర్తవు, భర్తవు, శాసితుండవు. vi-2601.
19. భా. రా. 1-33.
20. ఆన్మహతః సమానాధికరణజాతీయయోః. అష్టా. 6-3-46.
21. బా. వ్యా. iii-36.
22. ప్రౌ. వ్యా. iv-2.
23. 'గొలిచి' యని పాఠాంతరము. రాజానగరం ప్రతి-D 143/మద. ప్రతి.
24. ఫుట్‌నోట్స్‌లోని పద్యం; పు. 226.
25. అహో. అజంత 28.
26. ప్రౌ. వ్యా. 7-14.
27. ఆం.శ. చిం; అజంత 6.
28. బా. వ్యా. iii-6.
29. అహో - అజంత 32 సూత్ర వ్యాఖ్య.
30. బా. వ్యా iii-28.
31. బి. రా. రా. ప్రతిలో ఈ పాఠమే కలదు.
32. ఫుట్‌నోట్స్‌లోని పాఠమందలిది.
33. తత్ర తేనేదమితి సరూపే. అష్టా. 2-2-27.
34. ప్రౌ. వ్యా. సమాస. 18.
35. ప్రౌ. వ్యా. సమాస. 15.
36. భా. రా. vi, 247.
37. తె. భా. చ. 'కావ్య భాషా పరిణామము' బి. రా. రా. పు. 251.
38. క్రియాపరిచ్ఛేదము. 53 సూత్ర వ్యాఖ్య.
39. భా.రా. 184 పు.

అనుబంధము

# వివిధ గ్రంథాలయములలో నున్న భాస్కరరామాయణ తాళపత్ర గ్రంథముల వివరములు

i) **A.P. Govt, Oriental manuscript Library & Research Institute, Hyderabad.**

1. **T** 19-3, 2. **T** 19-6, 3. **T** 19-7, 4. 19-8,
5. **T**19-9. 6. **T** 19-10, 7. **T** 19-11, 8. 19-13,
9. **T** 19-14, 10. **T** 19-15, 11. **T** 19-47. 12. 19-50,
13. **T** 19-51, 14. **T** 19-57, 15. **T** 19-58, 16. 19-59,
17. **T** 19-60, 18. **T** 19-61, 19. **T** 19-62, 20. 19-65,
21. **T** 19-67, 22. **T** 19-72, 23. **T** 19-77, 24. 19-78,

ii) **Govt. Oriental Manuscripts Library, Madras.**

1. **R** 1563, 2. **R** 1776, 3. **R** 1777, 4. **R** 1798,
5. **R** 1801, 6 **R** 1828, 7. **R** 1833, 8. **R** 1844,
9. **R** 1861, 10. **R** 1873, 11. **R** 1897, 12. **R** 1947,
13. **R** 2019, 14. **R** 2024, 15 **R** 2034, 16 **R** 2041,
17. **R** 2060, 18. **R** 2072, 19. **R** 2079, 20. **R** 2097,
21. **R** 2106, 22. **R** 2140, 23. **R** 2157, 24. **R** 2175,
25. **R** 2178, 26. **R** 2180, 27. **R** 2195, 28. **R** 2198,
29. **R** 2199, 30. **R** 2201, 31. **R** 2204, 32. **R** 2223,
33. **R** 2252, 34. **R** 2251, 35. **R** 2274, 36. **D** 141,
37. **D** 154

iii) Sri Venkateswara University Oriental Research Institute, Tirupati.

| | | | |
|---|---|---|---|
| 1. **R** 23, | 2. **R** 92, | 3. **R** 93, | 4. **R** 163, |
| 5. **R** 261, | 6. **R** 262, | 7. **R** 263, | 8. **R** 371, |
| 9. **R** 1411, | 10. **R** 1478, | 11. **R** 920, | 12. **D** 138, |
| 13. **D** 139, | 14. **D** 140, | 15. **D** 142, | 16. **D** 144, |
| 17. **D** 145, | 18. **D** 146, | 19. **D** 147, | 20. **D** 148, |
| 21. **D** 149, | 22. **D** 150, | 23. **D** 151, | 24. **D** 153, |
| 25. **D** 155, | 26. **D** 156, | 27. **D** 157, | 28. **D** 158, |
| 29. **D** 159, | 30. **D** 2940, | 31. **D** 3029, | 32. **D** 3030. |

**Stock No :**

| | | | |
|---|---|---|---|
| 33. 1264, | 34. 4212, | 35. 1264 c | 36. 1264 b, |
| 37. 1264 d, | 38. 7692, | 39. 7693. | |

iv) **Saraswati Mahal Library, Tanjavur**

| | | | |
|---|---|---|---|
| 1. **T** 1, | 2. **T** 3, | 3. **T** 4, | 4. **T** 5 |

v) **Osmania University Library, Hyderabad.**

| | | | |
|---|---|---|---|
| 1. 169, | 2. 507, | 3. 528, | 4. 531 (a) |
| 5. 547. | 6. 812, | 7. 834, | 8. 887, |
| 9. 933, | 10. 1093, | 11. 1151, | 12. 658, |
| 13. 527, | 14. 171, | 15. 432. | |

vi) **A.S.P. Govt. Museum and Research Institute, Kakinada.**

| | | | |
|---|---|---|---|
| 1. 94/ 2, | 2. 23/ 2, | 3. 110/ 8, | 4. 140/ 8, |
| 5. 34/14, | 6. 124/14; | 7. 88/14; | 8. 100/14; |
| 9. 101/14; | 10. 102/14, | 11. 103/14, | 12. 104/14, |
| 13. 105/14, | 14. 106/14, | 15. 107/14, | 16. 108/14, |
| 17. 109/14, | 18. 110/14, | 19. 114/14, | 20. 115/14, |
| 21. 116/14, | 22. 112/14, | 23. 122/14, | 24. 125/14, |

| | | | |
|---|---|---|---|
| 25. 126/14, | 26. 127/14, | 27. 129/14, | 28. 130/14, |
| 29. 148/14, | 30. 150/14, | 31. 151/14, | 32. 163/14, |
| 33. 167/14, | 34. 174/14, | 35. 176/14, | 36. 177/14, |
| 37. 179/14, | 38. 181/14, | 39. 184/14, | 40. 185/14, |
| 41. 180/14, | 42. 182/14, | 43. 183/14, | 44. 186/14, |
| 45. 187/14, | 46. 188/14, | 47. 200/14, | 48. 201/14, |
| 49. 205/14, | 50. 206/14, | 51. 207/14, | 52. 209/14, |
| 53. 211/14, | 54. 217/14, | 55. 234/14, | 56. 121/17, |

పైన పేర్కొన్న తా.ప్ర లలో కొన్ని సంపూర్ణములు. కొన్ని ఏకదేశములు.

పై గ్రంథాలయములందేకాక అడయార్ లైబ్రరీ (మదరాసు), ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయము మున్నగుచోట్లను భా.రా. తాళపత్ర ప్రతులు కలవు.

**లిఖితప్రతులు (కాగితము)**

**D. 143.** ఇది బ్రౌన్ వ్రాయించిన వ్రాతప్రతి. ఇందు బాల, అయోధ్యా, అరణ్య, కిష్కింధా, సుందరకాండములు గలవు. ఇది **Madras Govt. Oriental Manuscripts Library** లో నున్నది.

# ఉపయుక్త గ్రంథ సూచిక


సంస్కృత గ్రంథములు

1. అగ్నిపురాణమ్, ఆనందాశ్రమ గ్రంథమాల.
2. అధ్యాత్మరామాయణమ్, వావిళ్ళవారిది, 1926.
3. అమరకోశః, ఇందిరాప్రకాశన్, పాట్నా 1972.
4. ఆనంద రామాయణమ్, పండిత పుస్తకాలయ్, కాశీ, 1966.
5. కాదంబరీ, బాణుడు.
6. కావ్యమీమాంసా, రాజశేఖరుడు.
7. ధ్వన్యాలోకః, ఆనందవర్ధనుడు.
8. నైషధమ్, హర్షుడు, (వావిళ్ళవారిది).
9. పద్మ పురాణమ్, ఆనందాశ్రమగ్రంథమాల.
10. ప్రసన్నరాఘవనాటకమ్, జయదేవుడు (నిర్ణయ సాగర్ ప్రెస్) 1922.
11. శిశుపాలవధ కావ్యమ్, మాఘుడు (వావిళ్ళవారిది).
12. సాహిత్యదర్పణమ్, విశ్వనాథుడు.
13. వాల్మీకి రామాయణమ్ - గీతా ప్రెస్.
14. వాల్మీకిరామాయణమ్, పశ్చిమోత్తరశాఖీయప్రతి, డి.ఏ.వి. సాంస్క్రిట్ సీరీస్, లాహోర్.
15. వాల్మీకిరామాయణమ్, పరిష్కృతముద్రణము.

తెనుగు గ్రంథములు

కవుల చరిత్రలు

1. ఆంధ్రకవితరంగిణి, చాగంటి శేషయ్య.
2. ఆంధ్రకవులచరిత్ర, వీరేశలింగం పంతులు.
3. ఆంధ్రవాఙ్మయ చరిత్రము, వంగూరి సుబ్బారావు పంతులు 1957.
4. ఆంధ్రవాఙ్మయ చరిత్ర సర్వస్వము, శిష్టా రామకృష్ణశాస్త్రి (మదరాసు విశ్వకళాపరిషత్తు) 1976.

5. ఆంధ్ర సాహిత్య చరిత్ర, పింగళి లక్ష్మీకాంతం.
6. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము-ఖండవల్లి లక్ష్మీరంజనం.
7. కవి జీవితములు, గురుజాడ శ్రీరామమూర్తి 1955.
8. తెనుగు కవుల చరిత్ర, నిడదవోలు వేంకటరావు, 1956.
9. సమగ్ర ఆంధ్ర సాహిత్యం, ఆరుద్ర.

విమర్శగ్రంథములు

1. ఆంధ్రకవుల ఔచిత్య విచారణ, కాశీభొట్ల సత్యనారాయణ 1973
2. ఆంధ్ర మహాభారతము-ఛందఃశిల్పము; పాటిబండ మాధవశర్మ 1966.
3. ఆంధ్రవచనవాఙ్మయము-ఉత్పత్తి వికాసములు, ఎమ్. కులశేఖరరావు 1971.
4. ఆంధ్రుల చరిత్రము (5వ సంపుటము) చిలుకూరి వీరభద్రరావు, (ఇతిహాస తరంగిణీ గ్రంథమాల) 1936.
5. కుమార రుద్రదేవకవి, అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రి (సాహిత్య సంసత్, జనగామ) 1959.
6. గౌతమవ్యాసములు, పింగళి లక్ష్మీకాంతం, 1961.
7. తెలుగు కావ్యావతారికలు, జి. నాగయ్య, 1968.
8. తెలుగు కావ్యాలలో అవతారికలు-చరిత్ర; తేరాల సత్యనారాయణశర్మ, 1971.
9. తెలుగు జానపదగేయ సాహిత్యము, బి. రామరాజు, 1979.
10. తెలుగు సాహిత్యము-రామకథ; రావూరి దొరసామిశర్మ 1972.
11. తెలుగు సాహిత్యములో రామకథ, పండా శమంతకమణి, 1972.
12. దాక్షిణాత్యసాహిత్య సమీక్ష, జి. నాగయ్య, 1976.
13. నన్నయ భారతము, దివాకర్ల వేంకటావధాని, 1960.
14. భాస్కరోదంతము, కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి 1898.
15. రామనాటక విమర్శనము. పి. బాలకృష్ణమూర్తి 1959.
16. రామాయణ సుధాలహరి, (యువభారతి) 1976.
17. వాఙ్మయవ్యాసమంజరి, నేలటూరి వేంకటరమణయ్య 1967.
18. బాలకవి శరణ్యము, గిడుగు వేంకటరామమూర్తి పంతులు 1958.

## ఛందోవ్యాకరణాలంకార కోశగ్రంథములు


1. అథర్వణకారికావళి.
2. అప్పకవీయ భావప్రకాశిక, రావూరి దొరసామిశర్మ, 1967.
3. అప్పకవీయము (వావిళ్ళవారిది) 1924.
4. అహోబలపండితీయము (ఆంధ్రరచయితల సంఘము) 1965.
5. ఆంధ్రధ్వన్యాలోకము - వేదాల తిరువేంగళాచార్యులు 1968.
6. ఆంధ్రభాషాభూషణము - కేతన.
7. ఆంధ్రశబ్దచింతామణి (వావిళ్ళ వారిది).
8. ఆనందరంగరాట్ఛందము, కస్తూరి రంగయ (వావిళ్ళ) 1922.
9. కావ్యాలంకార సంగ్రహము.
10. ప్రౌఢవ్యాకరణము (వావిళ్ళ వారిది).
11. బాలవ్యాకరణము (వావిళ్ళ వారిది).
12. లక్షణ సారసంగ్రహము, కూచిమంచి తిమ్మకవి, 1971.
13. శబ్దరత్నాకరము, బహుజనవల్లి సీతారామాచార్యులు.


## పురాణేతిహాస కావ్య ప్రబంధములు


1. ఆంధ్ర మహాభాగవతము, పోతన.
2. ఆంధ్ర మహాభారతము, కవిత్రయము.
3. కుమారసంభవము, నన్నెచోడుడు.
4. క్రీడాభిరామము, వినుకొండ వల్లభరాయడు.
5. దశకుమార చరిత్రము, కేతన.
6. నిర్వచనోత్తర రామాయణము, తిక్కన.
7. పంచతంత్రి, భానుకవి.
8. భోజరాజీయము, అనంతామాత్యుడు.
9. మనుచరిత్ర, పెద్దన.
10. మొల్ల రామాయణము, మొల్ల
11. రంగనాథరామాయణము (రాయల్ & కో) 1957.
12. రామాభ్యుదయము, అయ్యలరాజు రామభద్రుడు.
13. సింహాసన ద్వాత్రింశతి, కొరవి గోపరాజు.

వివిధములు

1. తెలంగాణా శాసనములు, ఆదిరాజు వీరభద్రరావు.
2. భారతి, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక మున్నగు పత్రికలు.
3. భాస్కర రామాయణ పీఠిక - మేడేపల్లి వేంకటరమణాచార్యులు.
4. భాస్కర రామాయణ పీఠిక - తం. తేవప్పెరుమాళ్ళయ్యగారు.
5. **The Ramayana in Telugu & Tamil, A comparative Study; C. R. Sarma 1973.**
6. రామ్‌కథా ఉత్పత్తి ఔర్ వికాస్; ఫాదర్ కామిల్ బుల్కే 1971.


